





# జీవిత చరిత్ర

గాంధీజీ

# మానవజీవితము గాంధీ మహాత్ముడు





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# మానవ జీవితము
# గాంధి మహాత్ముడు

విద్వాన్ రావెల్ల రామయ్య

ప్రతులకు:

అన్నపూర్ణా పబ్లిషర్సు
ఏలూరురోడ్డు : విజయవాడ 2

# విషయసూచిక

## మానవ జీవితము

## గాంధి మహాత్ముఁడు

# తొలి పలుకు

మహాశయులారా !

తమిళభాషయందు శ్రీ తిరు. వి. కళ్యాణసుందర మొదలి యారుగారు రచించిన "మనిదవాళ్కైయుమ్-గాంధి యడి గళుమ్" అను గ్రంథమునుం జదువుకొని అట్టి గంథము తెలుఁగున నుండుట యావశ్యకమని తలఁచి పరివర్తించితిని. అందందు వారి యభిప్రాయములతోఁ బాటు తెలుఁగు నేలకు సంబంధించిన మహత్తర వ్యక్తులవిషయములగూడ నిందు పొందుపఱచితిని. తమిళదేశమునకు సంబంధించిన మూలగ్రంథ విషయములను వదలివైచితిని. పరివర్తించుటలో యథామాతృకముగాఁ గాక తెలుఁగుతనమును ప్రధానముగా మనస్సున నుద్దేశించి, భావ పరివర్తనము మాత్రము కావించితిని. మాతృకయందలి సొబగు ఈ నా తెలుఁగున తీసికొని రాఁగలిగితినేని ధన్యుఁడను. నా పరి శ్రమ ఫలవంతమైనదని తలంపఁ గలను.

ఈ గ్రంథరచనమునకు ప్రోత్సాహపఱచిన సుప్రసిద్ధ న్యాయవాదులు శ్రీ ఆవుల గోపాలకృష్ణమూర్తి M A L. L. B. (తెనాలి) గారికి, సుప్రసిద్ధ వైద్యులు డాక్టరు శ్రీ చదలవాడ కృష్ణయ్యచౌదరి M. S. (తెనాలి) గారికి నా ధన్యవాదములు. ఈ గ్రంథ ముద్రణకు వలయు ద్రవ్యమునిచ్చి దీనిని వెలుఁగు లోనికిఁ దీసికొనివచ్చిన వదాన్యశేఖరులు, (శ్రీ) రామోన్నత పాఠశాలా సంస్థాపకులు, ఉదార మానసులు (శ్రీ) బండ్లమూడి సుబ్బయ్యగారికి నా కృతజ్ఞతాపూర్వక సహస్ర వందనములు. ఈ కార్యమున వారిని ప్రోత్సహించి, గ్రంథ గౌరవమును

వివరించి, యీ పవిత్ర కార్యమును ఆచరింపఁజేసిన మధుర హృదయులు మా ప్రధానోపాధ్యాయులు శ్రీ రావులపల్లి రాధా కృష్ణమూర్తి M A B Ed. గారికి నా ధన్యవాదములు.

నేను గ్రంథమును పూర్తి కావించినది మొదలు నన్ను పిలిపించి, అందలి భాగముల చదివించి తనిసి, నాకన్నివిధముల సహాయమొనరించిన సరసమానసులు, ఉదార రైతువంశ సముద్భూతులు, ప్రజాసేవకులు శ్రీ జాగర్లమూడి చంద్రమౌళి చౌదరి B. A. B. L (గుంటూరు) గారికి నా హృదయ పూర్వక ధన్యవాదములు. అట్లే, నన్ను తమ మిత్రునిగా భావించి ఆదరించి ప్రోత్సహించిన గుంటూరు పురపాలక సంఘాధ్యక్షులు, ప్రజాసేవాతత్పరులు శ్రీ చేబ్రోలు హనుమయ్య చౌదరి M. L. A. గారికి, గుడివాడ పురపాలక సంఘాధ్యక్షులు సరసహృదయులు శ్రీ కోగంటి రాజబాపయ్యచౌదరి గారికి నా ప్రేమపురస్సర నమస్కారములు. మిత్రులు, మంత్రులు గౌ॥ శ్రీ కొత్త రఘురామయ్యగారు కోరినంతనే యీ కృతిని అంకితముగా స్వీకరించుటకు అనుగ్రహించినందులకు నా ప్రత్యేకాభివందనము లర్పించుచున్నాఁడను.

ఈ గ్రంథమును సాంతముగాఁ బరిశీలించి యావశ్యకమైన దిద్దుబాటును కావించి దీనికీ రూపమును గల్పించుటయే గాక, సరసముగా సమీక్షించిన మహా పండితులు, గురుతుల్యులు, శ్రీ నాగలింగం వేంకటేశ్వరశాస్త్రి గారికి నా భక్తి పూర్వక నమోవాకములు తెలుపుకొనుచున్నాను. గ్రంథ రచనలో నాకు అనేక విధముల సాయపడిన నా శిష్యులు శ్రీ ముత్తినేని వీరయ్య (B. SC విద్యార్థి, మర్లపాడు, ఒంగోలు తాలూకా) కోగంటి శ్రీకృష్ణయ్య (S. S. L. C. విద్యార్థి, వేమూరు) మొదలగు విద్యార్థులకు నా ఆశీస్సులు.

మనోహరమగు రూపమును ఈ గ్రంథమునకు కల్పించి, అవసర సమయముల పర్యాప్త ధనసహాయమునుగూడ నొసంగి నా శ్రేయస్సును ఎల్లప్పుడును కోరుచున్న మిత్రవరేణ్యులు, సజ్జనశేఖరులు శ్రీ కొసరాజు సుబ్బారావు (ప్రొప్రయిటరు అన్నపూర్ణా పబ్లిషర్సు) గారిని ఇతోధిక భాగ్యభోగ్యారోగ్య వ్యాపారములనిచ్చి పరమేశ్వరుఁడు ప్రోచుగాకయని ఆశీర్వ దింతును. ఇట్లు సాయము చేయుటచే, ఈ గ్రంథము ఉన్నంత వఱకు అచ్ఛాచ్ఛమగు వారికీర్తి యీ తెలుఁగు గడ్డయందు నెలకొని యుండఁగలదని వాకొందును. సకాలములో నచ్చువేసి యిచ్చిన శ్రీ సోమేశ్వర ప్రింటింగు ప్రెస్సువారికి నా అభి నందనలు,

ఈ నా పరిశ్రమను ఆంధ్రలోక మాదరింపఁగలదని విశ్వ సింతును.

ఇట్లు,
విధేయుఁడు
రావెళ్ళ రామయ్య.
ప్రధానాంధ్ర పండితుఁడు

శ్రీ రామోన్నత పాఠశాల
మోతడక
గుంటూరు జిల్లా.

# సమీక్ష

ప్రపంచమందు పూర్ణ పురుషత్వమును సాధించి, దైవీ శక్తుల చేరువఁజేరి తమ జీవితయాత్రను లోకకళ్యాణయాత్రగా సాధించుకొన్న మహాత్ములు లెక్కకు మిక్కిలి గాఁకలరు. అయితే వారు ఎప్పుడో—ఏ సమయముననో-తప్ప తమఃయునికి మనుకులచే ఈ భూఖండమును చరితార్థ మొనరింపరు. వారికి స్వార్థసంపాదన మన్నదిలేదు. పరోపయోగ సఃసాధనము వారు వెన్నతోడ నేర్చినవిద్య. వారే దివ్యద్రష్టలు-వారే ప్రజాభాగ్య నిర్ణేతలు-వారే స్వర్గ సామ్రాజ్య సంస్థాపనా ప్రయత్న సంకలన ధీరులు-అందలి సంపూర్ణ ఫలితమును సాధింపఁజాలిన వీరులు. అట్టివారినే మహర్షులన్నారు. అట్టి మహర్షుల జన్మయే సార్థక మైనది-యుగ యుగాలవఱకు మాపు చెందక, రూపు నిల్పుకొనఁ గల్గినది. వారి నుద్దేశించియే గీతలు 'సంభవామియుగే యుగే' అని వాకొన్నవి.

అట్టి మహాత్ముల దివ్యజీవితపు వెలుఁగులలో ధర్మ రహస్యములను నేర్చుకొని, మన సందేహముల నరిచూచు కొనఁగలము. మన జీవితపు బాటలను సరిదిద్దుకొని వారు చూపిన ఘంటాపథమును అధిగమింపఁగలము. వారి దివ్య జీవనము మనకు మార్గజ్యోతియేకాదు; సంపూర్ణముగు నా దర్శము. ఇంతయేల? వారు మెట్టినచోటే పవిత్రాశ్రమో పాంతము; వారు పలికిన పలుకులే సత్యములు, ఋతములు, వేదవాణీ తుల్యములు. వారి మోము ఆనందమును చిందుచు,

శాంతము నొలికించుచు, సమీపవర్తులకును శాంత్యానందముల ప్రసవింప గలుగును. వారి సమీపమున విరోధభావములకు తావులేదు. భిన్న ప్రకృతులన్నియు అక్కడ చేరుకొని తమ వేఱుపాటును మఱచి కలసిమెలసి, కూడిమాడి యుండ గలుగును.

అట్టి మహాత్ములలో నెన్నదగినవాఁడు మన జాతిపిత, భారతవర్ష స్వరాజ్యనిర్ణేత, గాంధి మహాత్ముఁ డొక్కఁడు. ఆయన జీవితము పరమపవిత్రము; మహాగంభీరము; విచిత్ర సంఘటనా పరిపూర్ణము. సత్యము ఆతని యుపాస్యదైవము. అహింస ఆతఁడు చేపట్టిన దివ్యసాధనము. తన జీవితమును రాజకీయమునకు ధారవోసిన మహాత్యాగి. 'త్యాగేనైకే అమృతత్వ మానశుః' అను నుపనిషద్వాక్యమునకు లక్ష్యము కాఁదగినవాఁడు. సామాన్య సంసారియై యుండియు, ఉదాత్త మార్గముల నెమకి తన యారోగ్యమునకు, తన నైతికజీవితము నకు, తన రాజకీయ ప్రవృత్తికి, తన యాధ్యాత్మిక సాధనకు అర్హమైన—యుక్తమైన బాటలు వేసికొన్నవాఁడు. ఆరోగ్య మునకు ప్రకృతిచికిత్సా విధానమే ప్రధాన సమవలంబ నీయ మని తలపోసినాఁడు. నైతిక ప్రవృత్తికి బ్రహ్మచర్యమే ప్రధాన నిదానమని గుఱుతెఱింగినాఁడు. ఆధ్యాత్మిక సాధనకు ప్రవత్తియే చక్కని రాచబాటయని యేర్పఱచుకొన్నాఁడు. రాజకీయమున కైనను అహింసయే ప్రధాన సాధనమని వాకొన్నాఁడు. ఆయన జీవితమున భిన్న భిన్నమగు అఱలులేవు. వేఱువేఱు సాధనములు కానము. నైతికమునకైనను, రాజకీయమున కైనను, సాంఘిక మునకైనను, ఒక్కటే సాధనము. ఆయన స్థితప్రజ్ఞుఁడు. నిష్కామ కర్మాచరణశీలి 'కర్మణ్యేవాధి కారస్తే మా ఫలేషు కదాచన' అను గీతానూక్తి ఆయన హృదయపు లోఁతుల

లోని రహస్యము. యథార్థముగ విచారించినచో-ప్రపంచమున ఏ రాజకీయనాయకుఁడును చేపట్టని అహింసా దివ్యాస్త్రమును బూని ఒక రక్తపు బొట్టయినను—చిందకుండగ నఖండ భారత స్వాతంత్ర్యమును సాధించిన మహాయోధ. ఆరోగ్యము కఱవై, జీవితము నికృష్టమై భాగ్య భోగ్యములు దూరమై పలుబాముల పాలై, చిట్టచివఱకు ముట్టుకొనుటకైనను వీలులేని దుఃస్థితిలో నున్న హరిజనులను ఆలించి పాలించి అస్పృశ్యతను తొలగించి మానవ మాత్రులనుగా తయారుచేయగలిగి- సంకల్పసిద్ధుఁడు సాధనామార్గములనరసి, వివిధ మతరీతుల తఱచి, "ఉండేది రాముఁడొకఁడు" అని నిశ్చయించుకొని అన్నిబాటలను ఆతని చేరగలిగినవే అని నిర్ణయించుకొని పరిపూర్ణ విశ్వాసము, వినిశ్చలమగు భక్తి గమ్యస్థలమును చేర్చుటకు సమర్థములని సిద్ధాంతీకరించుకొన్న వ్యక్తి. తన త్రోవను సరిచూచు కొన గలఁడు. తన తప్పుల నొప్పుకొనగలఁడు. విచారణతో, వివేక ముతో సరిదిద్దుకొనుటకు ప్రయత్నించగలడు. ఆధ్యాత్మిక రాజకీయములకు, నైతిక సాంఘికములకు భేదము నేర్పఱచక, ఐక్యభావమును, ఏక సాధకమును చేకూర్చుకొన్న మహావ్యక్తి. ఇట్టి మహాత్ములు-ఇట్టి ధీరప్రకృతులు-ఇట్టి భక్తశిరోమణులు- లోకమున ఎందఱుందురో చెప్పజాలము. ప్రపంచమున రాజకీయ నాయకులున్నారు. ఆధ్యాత్మిక సాధకులున్నారు. నైతిక ప్రచా రకులున్నారు. సాంఘిక సమస్యా నిర్వహణ సమర్పిత జీవను లున్నారు. కాని ఈ విధముగా తన జీవితము ననేకవిధ సమస్యా శబలిత మొనర్చి సమగ్రరూపము నొసగి, సంపూర్ణ ఫలితమును సాధించినవారు లెక్కకు ఒక్కరైనను లేరు. సందేహాపదమగు లాగు విషయములలో దైవ మాతనికి మార్గజ్యోతియై యుండెడిది అంతరాత్మ ఆతనికి నిర్ణేతయై నడిపించెడిది. పార

పాటు వెనుబాటులను లెక్క చేసెడివాడు కాదు. చిఱునవ్వులు చిందువాందుమోముతో, శాంతికిరణముల కురియుకన్దోయితో, ఆయనమూర్తి విశిష్టస్ఫూర్తియైయుండెడిది. మోకాలుదిగనిఅంగ వస్త్రము, తలపై కప్పుకొను చిన్నారిపిలక, నవ్వుపువ్వుల నొలక బోయుబోసినోరు మహాత్ముని లీలావిగ్రహమునకు అంటిపుట్టిన పెట్టని తొడవులు. శీతాతపములకు ఆత డతీతుడు. ఇంగ్లండు నందలి ప్రబల శైత్యము అంగవస్త్రమును ఆటంకపఱుప లేదు.

ఆయన జీవితము పరమ పవిత్రమైనది; మానవ లోకము నకు పఠనీయమైనది; ప్రశంసనీయమైనది; శిరోధార్యమైనది. పూర్వశాస్త్రములకు ఆయన జీవితము నూత్న భాష్యములు రచించినది. ధర్మ రహస్యములను సరిదిద్దినది. దరిద్ర నారాయ ణుల నాదుకొన్నది. రామనామ మాధుర్యమును కడుపార గ్రోలినది. రామరాజ్య సంస్థాపనా కాంక్షితములను వ్యక్తీకరిం చిన సత్యవాక్య పరిపాలనా ప్రవృత్తిని మాధుర్యముల సంత రించినది. కావుననే, పరమ పవిత్రమైన ఆ జీవితమును పఠించుట, అందలి రహస్యములను పరిశీలించుట, అందలి ఉదాత్తతను గమ నించుట, అందలి ఆదర్శభావముల స్వీకరించుట మన జీవిత మార్గముల నసిచేసికొనుట, ఇంతకన్న మానవులకు వేఱు భాగ్యమున్నదా?

తమిళగ్రంథ రచయిత శ్రీ తిరు. వి. కళ్యాణసుందర మొదలియారు ఎన్నికగన్న దేశభక్తుడు. కారాగారముల నవసిన ధీరస్వాంతుడు. మహాత్ముని జీవితపులోతుల నరయ జాలినభావుకుడు. ఆయన మహాత్ముని జీవితమును ఆనుపూర్విగా చిత్రింపదలచలేదు, అందలి విశేష ఘట్టముల దీసికొని తన సహజ భావములతో, తన ఉద్రిక్తరచనతో చిత్రించ గలిగినాడు.

దాసెని మిత్రులు శ్రీ రావెళ్ళ రామయ్యగారు తెలుఁగున వెలయించినారు. ఇందలి శైలి తేటయై, సూటిగా, అర్థమును తెలియఁజేయుచు, తెలుఁగు తళుకుల ముళిపించుచు, పరివర్తన మనిపింపక, పాఠకజన హృదయావర్జన చణమై యొప్పారుచున్నది. ఉదాత్త రచనా విన్యాసమగు నీ యుద్గ్రంథము విషయోదాత్తతను బట్టియు, రచనా కమనీయతను బట్టియు, ఆంధ్రపాఠక జనానీకమునకు ఉపాదేయ మాత్రమే కాదు—శిరోధార్యమును, కాగలదని తలంతును.

ఈ రచయిత ఇట్టివే యగు నుదార గంభీర రచనలతో ఆంధ్రవాణీ చరణ వరివస్యా పరిపూత జీవితుడు కాగలడని విశ్వసింతును.

అమృతలూరు
గుంటూరు జిల్లా

విద్వాన్ నా. వేంకటేశ్వరశాస్త్రి
విద్యాలంకార
25—2—64.

## మానవుఁడు

ఈశ్వర లీలా విలాసమైన యీ విశ్వమందు మానవుఁ డెవఁడు? మానవరూపధారు లెల్లరు మానవు లగుదురా? లేనిచో మఱి యెవఁడు మానవుఁడు?

లోకమందు ప్రాణులెత్తు జన్మము లనంతములు. వీని యందు సర్వోత్తమ మైనది మానవజన్మము. మానవజన్మము సర్వశక్తిమంత మైనదని చాటని జ్ఞానవేత్తలేఁడు. ఆర్యావర్తము నందలి ఋష్యాది జ్ఞానవేత్త లెల్లఱు "మానవజన్మము సర్వోత్కృష్ట మైనద"ని వేనోళ్ళఁ బ్రశంసించి యుండిరి.

శరీరమందు మమకారము వీడక, సుఖములు వచ్చినప్పు డుబ్బి తబ్బిబ్బై, భగవంతుని మాటయే మఱచి, కష్టములు

వచ్చినప్పుడు మాత్రము కంటివెంట నీరు కార్చుచు, "ఓ భగవానుఁడా! మాకీ జన్మము నేల యిచ్చితివయ్యా? ఈ పాడు జన్మ మెత్తుటకు మేమేమి పాప మొనరించితిమయ్యా?" యని యాత్మ ప్రత్యయ రహిత బుద్ధిని గొందఱు భగవంతుని గూర్చి ప్రార్థింతురు. ఈ కారణమున శరీరమును జన్మమును నిరసించుట యేటిధర్మమో తెలియకున్నది.

## మానవజన్మమందలి లక్ష్యము

మోక్ష సాధనమునకు శరీర మాటంకమని కాఁబోలు మందబుద్ధులు కొందఱు శరీరమును జన్మమును దెగడుచుందురు. ఈ కారణముచే లోకమునకు మానవశరీరమును — మానవ జన్మమును నిరసించుట పరిపాటి యగుచున్నది. శాస్త్రసాధనమునకు నాత్మ ముఖ్యముకాని శరీరము ముఖ్యమా? కావున శరీరముపై సేవగింపు కలుగుటయు జన్మముపై రోఁతపుట్టుటయు నవివేకము.

ఈ శరీరము తనది కాదనియుఁ, దన యాలుబిడ్డలే తనవారు కారనియు నెంచి లోకము సంతను ప్రేమించి భగవద్దత్త శరీరము ననాసక్తబుద్ధితో లోకకళ్యాణమునకు వినియోగించిన యెడల జన్మముపైఁగల నిరసనబుద్ధి తొలఁగఁగలదు. అట్టిదేదియు లేక జన్మమును సార్థకము చేసికొనలేక పుట్టుకపై రోఁతగొనుటయా?

మోక్షప్రాప్తికి సులభసాధనము మానవజన్మము. ఏ ప్రాణియైనను మోక్షము పొందవలయుననిన, మానవజన్మ మెత్తవలయును. అగుచో గజేంద్రుఁడు మోక్షము పొందలేదా యని ప్రశ్నింతురేమో? అది మన ప్రస్తుతవిషయము కాదు.

"మానవజన్మము సర్వోత్తమమైనది"ని ఋష్యాదులెల్లరు ప్రశంసించియుండిరి. వారి వాక్యములే మానవజన్మోత్కృష్టత్వ మును నిశ్చయపఱచుచున్నవి.

అనంత జీవరాసులయందు మానవుం డొక్కరుండే సర్వ శ్రేష్ఠుఁడని చెప్పుటకుఁగల కారణమేమో కొంత పరామ ర్శింతము.

## మానవజన్మ శ్రేష్ఠత

సృష్ట్యారంభమందు జీవులలో నెట్టి భేదములునులేవు. జీవులు స్వస్వానురూపశరీములఁ దాల్చిన పిమ్మట వివిధ భేద ములు వెలసినవి. ఆ భేదము కేవల శరీరగతమైనదియు, కేవల ప్రాణగతమైనదియుఁగాదు. ప్రాణమునకు శరీరమునకుఁ గలయిక కలిగిన పిమ్మటనే భేద మనునది కల్గును.

ప్రాణము శరీరాకృతి దాల్చినప్పుడు పూర్వజన్మ సంస్కారముచే జ్ఞానమను నొక పదార్థ మేర్పడును. ఆ జ్ఞానము శరీరమునకుఁ దగినదియు, పంచేంద్రియములకుఁ దగినదియునై జీవుల నాశ్రయించుచుండును. ఆ జ్ఞానము పంచేంద్రియవశమై వృద్ధిగాంచుచుండును. వృద్ధియు నుపాధిభేదము ననుసరించి యుండును. ఈ కారణమున స్థావరము మొదలు మానవుని వఱకుఁ గల సమస్త జీవకోటియందు జ్ఞాన మనుసరించి తరతమ భేద మేర్పడెను. ఈ జీవుల జ్ఞానేంద్రియము ఉపాధిభేదము ననుసరించి మాఱుదల పొందుచుండును.

మానవేతర జీవకోటిలో మృగజాతి పెద్దది. ఆ మృగ జాతికి పంచేంద్రియములుకలవు మానవజాతికి మాత్రము

షడింద్రియములు కలవు. ఆ యాఱవ యింద్రియమే జ్ఞానేంద్రియము. ఈ జ్ఞానేంద్రియము పశుపక్ష్యాదులందు మానవుని యందువలెఁగాక తేజోవిహీనమై యుండును. మానవునియందు మాత్రమే మది తేజస్వంతమై విశాల మగుచుండును. అప్పుడు పరిపూర్ణ జ్ఞానముఁ కలుగును. అదియే పరిపూర్ణజ్ఞాన మనఁబడును.

శబ్దస్పర్శరూప రసగంధములను నీ యైదును మానవునకు వలెనే జంతుకోటికిని గలవు. పరిపూర్ణమైన ఆత్మజ్ఞానము మాత్రము మానవునియందే ప్రతిబింబించుచుండును. ఈ పరిణామ మూలముననే మానవుఁడు సర్వశ్రేష్ఠుఁ డగుచున్నాఁడు. ఈ యాత్మజ్ఞానముననే సమస్త జీవరాసులకంటె మానవుం డధికుండు. ఈ పరిపూర్ణ జ్ఞానముననే మానవజన్మము సర్వశక్తిమంత మగుచున్నది.

## మానవుఁడు—మానవమాత్రుఁడు

మానవాకృతి దాల్చినవా రెల్లరు నీ యాత్మజ్ఞానము కలిగియున్నారా ? కలిగియుండియుఁ దదనురూపమునఁ బ్రవర్తించుచున్నారా ? యనిన లేదని చెప్పవచ్చును. ఈ యాత్మజ్ఞానము లేనివారు కొందఱు. ఉండి వ్యర్థులగువారు కొందఱు. ఈ యిరుతెగలవారు నించుమించుగా నొక తెగవారని యెంచవచ్చును. ఈ యిద్దఱికంటె నన్యుఁ డెవఁడో వాఁడే మానవుఁడు.

ఈ కారణము ననుసరించియే మానవ రూపధారులెల్లరు 'మానవుఁడు – మానవమాత్రుఁడు' అను నీ రెండు విధముల విభజింపఁబడిరి. ప్రథముఁడు ఆత్మజ్ఞాన పరిపూర్ణుఁడు. ద్వితీయుఁడు కరచరణాద్యవయవములుగల పశుప్రాయుఁడు. ఆతఁడు

యథార్థమానవుఁడు. ఈతఁడు ఆభాసమానవుఁడు......... చరిత్ర యుగమునకు ముందే ద్రావిడులు ప్రాణుల శక్తి సామర్థ్యములఁ బరిశోధించి, ప్రాణి సమూహమును, వాని జ్ఞాన సంపత్తికిఁ దగినట్లు నిర్ణయించిరి. అట్టి ద్రావిడుల సూక్ష్మబుద్ధినేఁ డడుగంటుట కరము విచారకరము. మానవ ప్రకృతియందు ప్రకాశించు నాఱవ యింద్రియమగు జ్ఞానేంద్రియము కలవాఁడే మానవుఁడు. తక్కినవారు పశుప్రాయులు.

జ్ఞానేంద్రియము కలిగి జ్ఞాన మార్గము ననుసరించునట్టి మానవుఁడు సర్వభూతములను నాత్మవలెఁ జూచును. ఆతని హృదయమందెప్పుడు ప్రేమరసము చిప్పిల్లు చుండును. ఆతఁడు స్వశ్రేయస్సు నభిలషింపఁడు. పెఱవారల మంచికిఁ దన ప్రాణ ధనములను వినియోగించును. ఆతఁడు జారత్వ చోరత్వాది దుష్కృత్యములను, కామక్రోధాది దుర్గుణములను దఱిఁజేర నీయఁడు. ఆతని బుద్ధి యెల్లప్పుడు లోక కల్యాణమునకుఁ బాటు పడుచుండును. దుష్టక్రూర స్వభావము లాతనికి దవ్వు. ఇతర ప్రాణుల రక్షణయే యాతని కర్తవ్యము. ఇతరుల కష్టసుఖములను దనవిగా భావించు కొనుటయే యాతని పరాయణము. ఏతాదృశ గుణగరిష్ఠుని మానవుఁడని చెప్పనగును.

లోకమునందు పలువురు స్వశరీరమును సర్వతోభద్రముగాఁ గాపాడుకొనుచు, నితరుల మాటయే తలపెట్టక స్వార్థపరులై స్వీయ సౌఖ్యమునకుఁ బ్రాకులాడు చుందురు. వీరలు మృగతుల్యులు; మానవమాత్రులు. ఈ పశుప్రాయ సంతతి యున్నంతవట్టు, ప్రపంచమందు జారత్వ చోరత్వ హత్యాది దోషములు, పరవంచనాది పాపములు ప్రబలుచుండునే కాని

శాంతి భద్రతలు సమకూడఁ జాలవు. లోకమందిప్పుడు మాన వత్వమును గోల్పోయి తిరుగు నసంఖ్యాక వ్యక్తులు మానవులు కాఁజాలరు. ఈ వ్యక్తులు మానవత్వమును నిలఁబెట్టుకొని దేశ కల్యాణమును బెంపొందించు దినమెన్నఁడో?

ఆ దినము దగ్గఱలో దవ్వోయని మనము సందేహింపఁ జనదు. ఆ దినము సమీపించుచున్నదనియే చెప్పవచ్చును. అది యంతయు మానవ ప్రయత్నముమీఁద నాధార పడియున్నది. మానవ ప్రయత్నమనినచో "నిఁక భగవంతుఁ డెందులక"ని ప్రశ్నింతురేమో? కాదు; కాదు. భగవత్సహాయమావశ్యకం బె మానవ ప్రయత్న మావశ్యకమని చెప్పుటయే మా యుద్దే శ్యము. మానవ ప్రయత్నము లేక భగవత్సహాయమని యాకా శమువంకఁ జూచిన నేమిఫలము? భగవద్విషయమున మనము తలంచు తప్పు తలంపులలో నిది యొకటి. మానవ ప్రయత్న మావశ్యకము. ఆ మీఁదట దైవ సహాయము ముఖ్యము. ఆత్మజ్ఞాన సంపన్నుఁడగు మానవునకు దైవ సహాయము కడుం గడు సులభము.

"ఇందుఁగల డందులేఁడని,
సందేహము వలదు; చక్రి సర్వోపగతుం
డెం; దెందు వెదకి, చూచిన,
నందందే కలఁడు; దానవాగ్రణి! వింటే!"

(భాగవతము.)

దేవుఁ డచ్చోటు నిచ్చోటంగాక యెచ్చోట నైనఁగల సర్వవ్యాపి. ఆ దేవుని సత్య స్వరూపమును ప్రకృతి ముఖమున జూడనగును.

మనశ్శరీరములు వలెనే దైవ ప్రకృతులును గలవు. ఈ సంబంధమును బట్టియే దేవునిఁ దండ్రియనియు; ప్రకృతినిఁ దల్లి యనియు మన ఋషులు సంబోధించి యుండిరి.

సృష్టి నిర్మాణ కర్తయగు నాజగత్పిత ప్రకృతి యనెడు మాతృ ముఖమునఁ బ్రాణుల బ్రదుకు తెరువునకు వలయు సమస్తవస్తు సముదాయమును బ్రసాదించి యుండెను. ఆ ప్రకృతి మార్గమును మానవుఁడనుసరించనేని యా దేవుని దివ్య పాదారవింద సన్నిధికిఁ జేరఁగలఁడు. అట్లనుసరింపఁడేని దైవదూరుఁడు కాఁగలఁడు. కాఁబట్టి భగవంతుఁడు మనకుఁ గావలసిన పరికరము లన్నియు నిచ్చియుండ నింకనతని యాచింపనేల?

సర్వేశ్వరుండిచ్చిన తెక్కలతో నాత్మ విశ్వాసపరుఁడై స్వార్థత్యాగియై, లోక కళ్యాణమునకుఁ గష్టించుట మానవుని విధి. తత్ఫలాఫల విచారణ యాతని కేందులకు? ఆతనికిఁ గావలసినది కర్తవ్యము. "యత్నే కృతే యది న సిద్ధ్యతి, కోఽత్ర దోషః".

మన భారతమాత యస్వాతంత్ర్య మనెడు బోనునుండి విడివడి స్వాతంత్ర్య డోలికల నూగులాడుచుఁ దన బిడ్డల భారతీయులఁగాంచి యానందించి మేను పులకరింపఁ గులుకు పలుకులు పలుకు దినమే దినము. నాఁటి యానందమే బ్రహ్మానందము. అట్టి దినము రావలయుననిన మహాత్ముఁ డొక్కఁడు కావలయును. మహాత్ముఁడన నాతని జీవిత మెల్లరకు నాదర్శమై యుండవలయును. అట్టి యాదర్శ ప్రాయమగు జీవిత మెద్ది?

## జీవితము

ఇంక మానవు లెల్లరు మానవత్వమును సార్థక పఱచుకొను జీవిత మెట్టిదియో కొంచెదిగ విచారింతము. మానవజన్మ మెత్తినంత మాత్రముననే యాతనిజీవితము చరితార్థము కాంజాలదు. ఎవని జీవితము ప్రజోపయోగమునకు, లోక కళ్యాణమునకు నుపయోగపడునో యాతని జీవితమే చరితార్థము కాఁగలదు.

మానవుఁడై పుట్టనేల?
  ముక్తిని, బడయు కొఱకు.
ముక్తిని, బడయనేల?
  దేవుని దఱిఁ జేరుకొఱకు.
దేవుని దఱిఁ జేరనేల?
  జన్మ రాహిత్యము కొఱకు.
జన్మ రాహిత్యమేల?
  పరమానందము పడయు కొఱకు.

మంచిది. అగుచో, ముక్తినిఁ బడయు మార్గమేది? విశ్వమునందు నజ్ఞానాంధకారమునఁబడి తెన్నుగానక త్రొక్కు-

లాడుచు దరపిల్లు ప్రాణుల సంరక్షించి, యనాసక్త బుద్ధితో లోకోపకార మొనరించిన యెడల ముక్తినిఁ బడయవచ్చును. ఇదియే మోక్షప్రాప్తికి సులభ మార్గము.

జీ వి తా శ య ము

ఈ మార్గము సమస్త జీవకోటికి (ఆత్మలకు) లభించుటకు సర్వేశ్వరుఁడు ప్రకృతి మూలమునఁ దరులతా గుల్మాదుల యొక్కయుఁ బశు పక్ష్యాదుల యొక్కయు శరీరములను బ్రసాదించి ఆయా జీవకోటి యాత్మల యజ్ఞానమును పారంపర్యమునఁ బోఁద్రోలు చుండును. తుదకా యజ్ఞానము నశించిన పిమ్మట పరిపూర్ణ జ్ఞానభాండారమును మానవ శరీరమునకుఁ బ్రసాదించు చుండును. మానవుఁ డా పరిపూర్ణ జ్ఞానముచేఁ దనను నిట్టి యున్నతికిఁ గొనివచ్చిన యా పరమేశ్వరుని మఱువక, సదా యాతని దివ్యసంకల్పమున కచ్చెరువందుచు నాతని దివ్యనామస్మరణ చేయుచుండ వలయును. ప్రకృతిమాత యే మానవునకు సర్వవిధములఁ దోడగుచుండును. ప్రాణుల యజ్ఞానమును బోఁగొట్టి పరిపూర్ణ జ్ఞానస్వరూపుఁడగు పరమేశ్వరుని పాదారవింద సన్నిధికిఁ జేర్చుటయే ప్రకృతి స్వభావము. ఆ స్వభావానురూపవిధులను ఆమెయే ప్రసాదింపఁగలదు. మానవుఁడు తన జీవితమును లోకోపకారమునకుపయోగించు నప్పుడు ఆ విధులను బ్రసాదించును. ఈ విషయమును మఱువక, మెలఁగువాఁడే లోకజీవన తారకమంత్ర మెఱిఁగిన మహనీయుఁడు.

ఎవఁడు ప్రకృతిలబ్ధ పరిపూర్ణజ్ఞానమును బెడదారుల నుపయోగించునో యాతఁడు ప్రకృతిమాత కోపపాత్రుఁడగుటయే గాక; దైవదూరుఁడును గాఁగలఁడు. మీఁదుమిక్కిలి యాతఁడు జననమరణములతో—సుఖ దుఃఖములతో నిండియుండు నీ లోక

జీవనమందే చిక్కుకొని యవస్థలఁ బొలగుచుండును. అతఁడు తన జీవిత లక్ష్యమును నెఱవేర్చుకొనలేని పాపియగు చుండును. కావున మానవుఁడు తన లక్ష్యమును నెఱవేర్పఁగల జీవితము నలవఱచు కొనవలయును.

అట్లు, తన కర్తవ్యమును గుఱుతెఱింగి మెలఁగినచో భగవత్కృపాపాత్రుఁడు కాగలఁడు. భగవంతుఁడు లోకరక్షణ కొఱకు నెట్టి యిక్కట్టులఁ బడుచుండునో యట్లే యా దేవుని బిడ్డయగు మానవుఁడును దన సౌఖ్యమునకే ప్రాఁకులాడక, యిత రుల సౌఖ్యమునకే తన జీవితమును ధారవోయ వలయును. అట్టి వాని జీవితమే చరితార్థమైన జీవితము.

ఇట్టి జీవితమును గడపి చరితార్థులైన మన పూర్వుల జీవిత చరిత్రగ్రంథము లనేకములను జదువుకొనుచుంటిమి. మానవునకుఁ దగిన జీవిత మిదియని తేటతెల్లముగా బోధించు గ్రంథములనేకములు గలవు. పుణ్య పురుషుల జీవితములు శ్రీగాంధి మహాత్ముఁడును స్మృతిపథమునకువచ్చునప్పుడెల్ల నద్వి తీయ గ్రంథ మొండు స్మృతి పథమునకు వచ్చుచుండును. అది భగవద్గీత.

ఈ గ్రంథ పవిత్రత యెంతని పొగడఁగలము? అందలి రహస్యము దెలుప నేరికిఁదరము? ప్రకృతమున కావశ్యకమగుటం జేసి కొంతవఱకా గ్రంథమందలి పరమార్థము చూపెట్ట సాహసించుచున్నందులకు పాఠక మహాశయులు మన్నింతురుగాక!!!

# గీతా రహస్యము

## ఆశయ భేదము

భగవద్గీతా రహస్యమును గొలఁది మాటలతోఁ జెప్పు కొందము. పలువురు పలువిధముల గీతా రహస్యామృతమును గ్రోలుచుండిరి. వారిలో గీతనే ప్రమాణముగాఁ గైకొని సర్వమును సన్యసించి గీతాపారాయణము సేయుచుఁ గాలము గడుపువారలు గొందఱు. గీతార్థము నంతను హృద్గతము చేసి కొని లోక శ్రేయముకొఱకుఁ గృషి సలుపవలయునను నభి ప్రాయము గలవారు కొందఱు. యుద్ధము పురిగొల్పునట్టిది గీతయని తలఁచువారు కొందఱు. 1907 వ సంవత్సరమందు బంగాళా దేశమునఁ జెలరేఁగిన వందేమాతరోద్యమమందుఁ బాల్గొనిన నాయకులు పలువురు ఆత్మశక్తి ప్రబోధకమగు గ్రంథము భగవద్గీతయేయని నిశ్చయించి గీతను బఠింపసాగిరి. ఎందఱెన్ని యభిప్రాయములు గలిగియున్నను, ఆత్మశక్తి సంప న్నులు మాత్రము పరతత్త్వమును బోధించునది గీతయేయని చాఁటి చెప్పినమాట సత్యము. కర్తవ్య ధర్మమును బోధించునది గీతయేయని చెప్పవచ్చును.

నాఁడు శంకర రామానుజ ప్రభృతి మతాచార్యులు గీతకు వ్యాఖ్యానములు వ్రాసిరి. నేఁడు లోకమాన్య బాల

గంగాధర తిలకు మహాశయుఁడు, అరవిందఘోషు మహాయోగి పుంగవుఁడు, గాంధిమహాత్ముఁడు మొదలగు పండిత ప్రవరులు గీతారహస్యమును ప్రవచించిరి. పండిత ప్రవర రచిత వ్యాఖ్యాన సహాయమున భగవద్గీతను బఠించి యందలి రహస్యార్థము నెఱుంగుట ప్రపంచ మానవుని విధి.

భగవద్గీత యుద్ధము జరుగు సమయమున శ్రీకృష్ణభగవానునిచే నర్జునున కుపదేశింపఁబడెను. యుద్ధరంగమునఁ దన బంధుమిత్రాదులం గాంచి వారియందలి ప్రీతి పెంపున వారలఁ జంపనొల్లక నిశ్చేష్టుఁడై యున్న యర్జునునకుఁ గర్తవ్య ధర్మమును గూర్చి గీత యుపదేశింపఁబడెను. ఆలుబిడ్డలను, చుట్టపక్కాలను, ఊరువల్లెలను వదలి యడవులకుఁ బఱుగిడక, యుద్ధరంగమున నైనను స్వకర్తవ్యమును నెఱవేర్చుకొనుటనే గీత ప్రబోధించెను.

శ్లో॥ యే యథా మాం ప్రపద్యన్తే తాం, స్తథైవభజామ్యహమ్,
మమవర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ! సర్వశః.

'భగవద్గీత – 4 అ – శ్లో॥ 11'

అని భగవంతుఁడు చెప్పినట్లు గీతయు నట్లే యెవరెవరే యేవిధముగాఁ బఠింతురో వారల కాయా విధముగా ఫలము నిచ్చును. గీతారహస్యార్థామృతమును గ్రోలి యద్దాని నాచరణమునందుంచ బ్రయత్నింపవలయును.

ఏ మహనీయుని – ఏ లోకైకపూజ్యుని – జీవితమును లక్ష్యముగాఁ గైకొని మే మీ గ్రంథమును వ్రాయఁదొడంగితిమో యా మహనీయుని – ఆ లోకైకపూజ్యుని జీవితమును పరమపావన మొనరించునది గీతాగ్రంథమగుటంజేసి యన్ని

గ్రంథము లందుకంటె నీ గీతాగ్రంథమందు మా కెక్కువ మక్కువ గలదు.

సర్వభాషా ప్రపంచమున నిట్టి యుత్తమ గ్రంథము వేఱొండు లేదని యెల్ల రెఱింగిన విషయమేగదా! మానవుఁ డితరులకొఱకే తన జీవితమును సాగింపవలయునను పరమార్థమే గీతయందలి పరమార్థము. ఆ పరమార్థమును క్లుప్తీకరించి యిట పొందుపఱచుచున్నాఁడను.

ప్రప్రథమమున నర్జునుఁడు రథస్థుఁడై కురుక్షేత్రసంగ్రామ రంగమున నిలువఁబడి శత్రుసేనలఁ గలయఁజూచి "అయ్యో! సృష్టిస్థితి సంహారాత్మకమగు నీ మిథ్యాలోకమున బ్రదుకు తెరువునకై గురువును, పితామహుని సోదరులను జంపి, సంపాదించు నెత్తుటికూటి కాసించుటకంటె నరణ్యభూములఁ జొచ్చి యాకలములఁ దిని బ్రదికిన నెంతయో ముక్తి ప్రదము కదా! ఈ మహాపురుషులేఁడ? నేనేఁడ? తుచ్ఛ శరీరపోషణార్థము తుచ్ఛ రాజ్యమునకాశించి గురువును, ఆప్తబంధువులను జంపి చెండాడుటయా? ఇట్టి హింసాత్మకమగు యుద్ధముచేయ నొల్లను. నాకు రాజ్యమువలదు; గీజ్యమువలదు. వారలనే యా రాజ్యము నేలుకొని బ్రదుకనిమ్ము. నాకుమాత్రము వలదు. ఏ సన్యాసమో పుచ్చుకొని; యడవికిఁబోయి జీవించెదస"ని మనమున దిట మొనరించుకొనెను. అట్లు నిశ్చయించుకొనిన యర్జునుని హృదయము నిశ్చేష్టమైపోయెను. చేతియందలి గాండీవము జాఱి క్రిందఁబడెను. ఆతని మనశ్శక్తి కూలనారంభించెను. రథమున నశ్లేకర్తవ్యజ్ఞానశూన్యుఁడై చతికిలఁబడెను. అంత రథసారథి శ్రీకృష్ణభగవానుఁ డిద యంతయు నెఱింగి యప్పాండవమధ్యముని గాంచి "బావా! ఏమిది?

ఆశ్చర్యముగాఁ గాన్పించుచున్న దే! రథము బయలు దేరునప్పుడు గల యుద్ధవీరుని ఠీవి యిప్పుడు కన్పట్టుటలే దేమి ? నిరుత్సాహి వైతి వేమి ? మనః క్లేశము కలిగినవానివలెఁ గన్పట్టుంటివి. కారణమేమి?" యని చిఱునగవుసఁ బ్రశ్నించెను. అందుల కా యర్జునుండు "స్వామీ ! అస్థిరమగు నీ యైహిక సుఖముల కాసించి బంధుమిత్రులఁ జంప నామనస్సు సాహసింపఁజాలక యున్నద"నెను. అంత, భగవానుఁడు మందహాసము మోముసఁ దోఁప "నోయీ! అర్జునా! నీస్థితికి నేను మిక్కిలి వగచుచున్నాఁడను. బంధువులఁ బరిమార్చి నేను రాజ్యమేలవలయుననుతప్పు తలంపుగల యర్జునుని నిరసించుచుంటిని. ఆ యర్జునుఁడు నశించుగాక ! పాపముల నొనరించుచు ప్రాణుల హింసించు దుర్యోధనాదులఁ జంపినచో లోకమందు శాంతిభద్రత లేర్పడఁ గలవ"ను సత్సంకల్పముగల యర్జునుని బ్రశంసించుచుంటిని. ఈ యర్జునుఁడు చిరకాలము వర్థిల్లుగాక" యనెను. ఈ మధుర గంభీరవాక్కులు చెవినిబడినంతనే యా యర్జునునికిఁ కర్తవ్య జ్ఞానము పొడకట్టెను. ఆతని హృదయము ముప్పొంగెను. లోకమునఁ దనకొఱకు - తన సౌఖ్యము కొఱకు - కర్మరతుఁడగుట యజ్ఞానమని యాతని హృదయమునకుఁ దట్టెను. లోక కళ్యాణము కొఱకనాసక్తబుద్ధితో కర్మరతుఁడై యితరులకు సేవ చేయుటయే ధర్మము, కర్తవ్యమునని యాతనికి హృద్గోచర మయ్యెను.

ఇట్టి జ్ఞానము పొందుటయే రెండవ జన్మమనఁబడును. ఇట్టివారలే ద్విజులనఁబడుదురు. శ్రీకృష్ణ భగవానుని యమృత వాక్కులు చెవిని బడినంతనే స్వార్థపరుఁడగు నర్జునుఁడు నశిం

చెను. ఇతరులసేవ సేయుకొఱకు జీవింపవలయునను నర్జునుఁడు జన్మించెను.

## ద్విజన్మము

అర్జునుఁడు వెనుకటి యట్లే రథమున నుండెను. తొంటి యట్లే వింటిని దాల్చెను. అమ్ముల పొదియుఁ దక్కిన పరికరము నెప్పటియట్లే యుండెను. ఆతని ముఖకాంతి మాఱలేదు, శరీరము మాఱలేదు. రథము మాఱలేదు, రథసారథియు మాఱలేదు. అగుచోఁ గ మాఱినదేది? హృదయ మొక్కటియే. దుష్టశిక్షణ కొఱకు – శిష్టరక్షణ కొఱకుఁ దన జీవిత మర్పింప సంకల్పించెనను నర్జునుఁడు రెండవ జన్మమెత్తిన వాఁడనుటకిదియే కారణము.

## ప్రపంచ లక్ష్యము

మానవుఁ డే జాతివాఁడైన నేమి? ఏ వృత్తి వాఁడైన నేమి? రాజు కానిమ్ము, పాకీవాఁడు కానిమ్ము, న్యాయాధిపతి కానిమ్ము, గొఱ్ఱెలకాపరి కానిమ్ము. ఎవఁడైన నేమి? యథార్థ జ్ఞానము సంపాదింప నరణ్యములకుఁ బర్వెత్త నవసరము లేదు. మన మితరులసేవ సేయుటకొఱకే పుట్టితిమను జ్ఞానము కలుగుచో నట్టింటఁ గూర్చుండి దార పుత్రాదులతో, బంధు మిత్రాదులతోఁ గాఁపురము గడుపుకొనుచు జ్ఞాని కాఁగలఁడు. జ్ఞాని యగుటకు జాతిభేదము లేదు, స్థలభేదమును లేదు. 'గుణాః పూజా స్థానమ్ గుణిషు నచలింగమ్ నచవయః.'

## గార్హస్థ్య లక్ష్యము

మానవుఁడు తాఁజేయు ప్రతికర్మయు నితరుల శ్రేయస్సున కుపయోగించునదియునై యుండవలయును. భార్యను బెండ్లా

డుటయు, బిడ్డలను గనుటయుఁ దనకొఱకని తలంపక లోకసేవకని తలంపవలయును. కామాంధతచే వివాహమాడుటయు, స్వీయసౌఖ్యార్థము సంతానాపేక్షచే వివాహమాడుటయు ద్రోహము. మోహవిభ్రాంతతచేఁ బాంచభౌతిక శరీరము పంచత్వ మొందుననుమాట మఱచి తత్పోషణకై పలుబాములఁ బడుట యాత్మద్రోహమని ఋషిప్రోక్త గ్రంథములనేకములు దెలుపుచున్నవి. ప్రతిఫలాపేక్ష రహితబుద్ధితో శరీరమును బోషించుకొనుచు, దారపుత్రాదులతోఁ గాఁపురము సేయుచు గృహస్థాశ్రమ ధర్మనిర్వహణ పరుఁడై లోకసేవ యొనర్పవలయును. ఐహిక సుఖముల కాశించి, ప్రయత్నపూర్వకముగఁ బొంది, యనుభవించి, పిమ్మట దురవస్థలఁ బొలగుటకంటె నాముష్మిక సుఖములఁ బడయుట మేలుగాదె! మఱియు శరీరము నశ్వరమగునదేకదాయని తలంచి యుపవాసాదులంజిక్కి యెమ్ముల ప్రోవగుటయు నవివేకము. మానవుఁడు లోకోపకారమున కుపయోగింపవలయుననిన శరీరమేకదా ముఖ్యము! "శరీరమాద్యమ్ ఖలుధర్మ సాధనమ్." అట్టి శరీరము నుపవాసాదులచే నెండఁబెట్టుటయు, ఐహిక సుఖములచేఁ దనుపుటయుఁ దగదు. ఈ శరీరము స్వసౌఖ్య సంధాయకమని తలంచుటకంటెఁ బరసౌఖ్య సంధాయకమని తలంచి పరుల కూడిగము సేయుట శ్రేష్ఠము. తన తల్లిదండ్రులు లోకోపయోగమున కుపయోగింప నెట్లు తనను గనిపెంచి పెద్దచేసిరో, యట్లే యితఁడును లోకసేవా పరాయణమగు సంతానమును గనవలయును. లోకసేవా పరాయణుఁడు కాని గృహస్థుఁడు గృహస్థుఁడు కాఁజాలఁడు. లోకసేవా పరాయణతాబుద్ధి శూన్యుఁడై కేవల స్వశరీర సౌఖ్యమార్గముల నెమకుచు జీవించు గృహస్థుఁడు నిరర్థకుఁ డగును. గృహస్థుఁ డేకార్యము చేయఁదొడంగినను దత్ఫలా ఫలముల

నభిలషింప వలదు: నిష్కామ పరబుది తప్ప నాలనికి వేఱొండు కూడదు. ఇదియే యార్యమతి సంప్రదాయము.

తల్లిదండ్రు లేయే గుణములు గలిగియుందురో; బిడ్డలు నాయా గుణములు గలిగియుందురు. కావున గృహస్థుఁ డెప్పుడు సజ్జన సాంగత్యము కలిగి భగవద్భక్తుఁడై లోకసేవా పరతంత్ర బుద్ధి కలవాఁడు కావలయును. అగుచో నాతని కుటుంబము, దేశము.సద్గుణగణశోభితమై విరాజిల్లఁ గలదు.

గృహస్థాశ్రమ ధర్మ నిర్వహణమునఁ బ్రసిద్ధి కెక్కిన భారత భూమిని నేఁడు స్వార్థపరులు, కపటచిత్తులు నిండియుం డుట కరము సంతాపకరము. వెనుకటి భరతభూమి తిరిగి తల యెత్తుగాక! లోకసేవ కొఱకుఁ దన జీవితము నర్పించువాఁడే మానవుఁడు. వాని జీవితమే చరితార్థమైన జీవితము. ఇదియే భగవద్గీత యందలి రహస్యము.

ఆత్మరక్షణము కొఱకుఁగాక, లోకరక్షణము కొఱకు భగ వంతుఁడెట్టి యౌదార్యము చూపుచుండునో; అట్లే మానవుఁడు తన సౌఖ్యము కొఱకుఁ గాక యితరుల సౌఖ్యమునకే తన జీవి తము నుపయోగింపవలయును.

ఫలాసక్త రహితబుద్ధిని కర్మపరుఁడగు వాఁడు గొప్ప స్థానము పొందఁగలఁడని గీత బోధించు చున్నది.

శ్లో॥ కర్మజమ్ బుద్ధియుక్తాహి ఫలమ్ త్యక్త్వామనీషిణః,
జన్మ బన్ధవినిర్ముక్తాః పదమ్గచ్ఛన్త్యనామయమ్.॥
(2అ-51 శ్లో. భగవద్గీత)

# కొన్ని మార్గములు

పరార్థ జీవన మలవఱచుకొను మార్గము లనేకములు కలవు. వానినెల్ల నాయా గ్రంథములంజూచి తెలిసికొనుఁడు. అందుఁ గొన్నింటిని మాత్రమిట నుదహరించు చుంటిని. పరహితైక జీవన మలవఱచుకొనుట సులభమా? దుర్లభమా? మానవజన్మ రహస్యార్థమును గుఱుతెఱింగి మెలంగు వారలకు సులభము. ఇతరులకు దుర్లభము. ఒకనికిసులభము మఱియొకనికి దుర్లభమగుటకుఁ గల కారణమెద్ది? ఇద్దరు దారపుత్రాదులతోఁ గాఁపురము సేయువారలు. కుటుంబ పోషణమునకు సంపాదించు వారలు. ఇంచుమించుగా నన్నింట నిద్దరు సమానులేగదా! అగుచో నొకఁడు పరహితైక జీవనుఁడగుటకు, రెండవవాఁడు కాకపోవుటకుఁగల కారణమేమి? ప్రథముఁడు ప్రపంచ కళ్యాణమును గోరువాఁడు; ద్వితీయుడుఁ తన పాడు పొట్టను బోషించుకొన నవస్థలఁబొలగువాఁడు. ఈ యిద్దఱికిఁగల తారతమ్యము మనఃపరిణామమున భేదమే! అది సుకరమా? పరహితైక జీవనమే చరితార్థ జీవనము. మానవుఁడు పరహితైక జీవన మలవఱచుకొనవలయుననిన బాల్యమే యందులకుఁ దగినది.

బాల్యమే మన సుగుణ దుర్గుణముల కాయువుపట్టు. జీవిత వృక్షమునకు బాల్యము మూలము. బాల్యమునందు సద్గుణములు గలిగిన సత్పురుషుఁడును, దుర్గుణములు గలిగిన దుష్టుఁడునగును.

బాలునకు బాల్యముననే విద్యాబుద్ధులను గఱపింపవలయును. బాలుని భావ్యభివృద్ధి యంతయుఁ దల్లిదండ్రుల కరగతమై యున్నది. బిడ్డల మంచి చెడ్డలకుఁ దల్లిదండ్రులే కారణభూతులు. మాతాపితరులు బిడ్డలకు బాల్యముననే విద్యాబుద్ధులను గఱపింపవలయును. అట్లుగాక, బిడ్డల బాగోగు విషయమునఁ దల్లిదండ్రులు ఉపేక్షగలవారై యుందురేని యా బిడ్డలెందుకుఁ గొఱగాని చెనఁటులు కాఁగలరు. కావున బిడ్డలకు విద్యాబుద్ధులు నేర్పుట తల్లిదండ్రుల విధి. బిడ్డల విషయమున నౌదాసీన్యము వహించు మాతాపితరులు మూర్ఖులగుదురు.

## పిల్లలను పెంచుట

పుత్రహీనులకు సద్గతులు కలుగనేరవని యార్య ధర్మములు బోధించుచున్నవిగదా! సద్గతులను బొందుటకేగదా బిడ్డలఁబడయుట. అట్టిసద్గతులనుఁ గలుగఁజేయుబిడ్డలను జేతులారఁ బాడుచేయుటకంటెఁ బాపము వేఱొండులేదు. మూఢులై, అజ్ఞానవశులై విద్యాబుద్ధులను గఱపక, కఱపింపక, బిడ్డలను బాడుచేయు తల్లిదండ్రులు లోకభార మగుదురు.

## మార్కండేయుఁడు

పూర్వ మన పత్యుండగు మృకండుఁడను మహర్షి పుత్రసంతానాపేక్షచేఁ బెద్దకాలము భగవంతునిగుఱించి తప మొన

రించెను. తపమునకు మెచ్చి పరమేశ్వరుఁ డవతరించి "ఋషి చంద్రమా! నీతపమునకు మెచ్చితి. నీకు వలయు వరమేమియో తెల్పుమ"న నా ఋషిసత్తముఁడు పరమేశ్వరుని పాదారవిందములకుఁ బ్రణమిల్లి కృతాంజలియై భక్తి వినయములు పిరిగొన "నో దేవా! చింతాభరంబు జీర్ణింపఁ బుత్రుని నొకనిఁ బ్రసాదింపుమ"ని ప్రార్థించె. అంత నా సచ్చిదానందమూర్తి "ఓయి ఋషివర్యా! పరిపూర్ణాయువు కలిగి దుష్టుఁడై ప్రవర్తిల్లు పుత్రుఁడు కావలయునా? పదునారేండ్లు నిండీ నిండని యాయువుకలిగి సకల సుగుణ శోభితుఁడై విరాజిల్లు పుత్త్రుఁడు కావలయునా?" యని ప్రశ్నింప నప్పుడా మహర్షి యెట్టి వానిని గోరెనో తిలకింపుఁడు! ఋషిసత్తముఁడగు నా మృకండ మహర్షి "పదునారేండ్లు ప్రాయముకలవాఁడైన నేమి? బుద్ధిమంతుఁడగు బిడ్డఁడే కావలయు"ని మనమున దిట మొనరించుకొని భగవంతుని వేఁడికొనియె. మృకండునివలెఁగాక నేఁటి తల్లిదండ్రు లెందఱో "బిడ్డఁ డెట్టివాఁడైన నేమి? నాలుగు కాలములఁబాటు బ్రదికిన నంతియే చాలున"ని తలంచుటచేతనే గదా భరతభూమి పలుబాములఁ బడవలసివచ్చె! కొంత కాలము చన్నంత నా మహర్షికి తనయుడుఁ గలిగెను. ఆ బిడ్డఁడు దిన దిన ప్రవర్థమానుఁ డగుచు, సుగుణగణశోభితుఁడై తల్లిదండ్రులను సంతోషాబ్ధినిఁ దేల్చుచుండ నిర్ణీతాంత్య దినంబు దఱికొనినంతఁ గాలునిఁ గాసించి మృత్యుదేవతాగహ్వరమున మన్నువోసి భక్తి పెంపున భగవంతుని మెప్పించి పరిపూర్ణాయువును బొందెనుగదా! అట్టి బిడ్డలను గని పెంచు తల్లిదండ్రుల జన్మమే జన్మము. ఆత్మ గౌరవమును దేశ సౌభాగ్యమును బెంపొందించు బిడ్డలను బడయుటయే తల్లిదండ్రులకు

ముక్తిమార్గము. బాల్యముననే విద్యాలయం దభిరుచియు, సత్ప్రవర్తనాదికములయం దభిలాషయు బాలునకుఁ గలుగునట్లు తల్లిదండ్రులు నేర్పు పెంపున నేర్పవలయును. "మాతృదేవోభవ! పితృదేవోభవ!" యను సూక్తులను గ్రహించి తమయందు దైవభావము కలిగి తమ యదుపాజ్ఞలలో మెలఁగునట్లు తల్లిదండ్రులు బాలకుని శిక్షింపవలయును.

## తల్లిదండ్రుల యాదర్శము

బిడ్డలకు సద్విద్యాబుద్ధులఁ గఱపుట తల్లిదండ్రుల విధి. మఱియు, జననీ జన్మదేశ భక్తిప్రపూర్ణ నీరములం గ్రోలుటం గాకేమి ఛత్రపతి శివాజి మ్లేచ్ఛ ప్రభుత్వమును బాఱఁద్రోలి లోక విశ్రుత యశోవిశాలుఁడై సుస్థిర హైందవ రాజ్యము నెలకొల్పఁ గలిగెను! కావునఁ దల్లిదండ్రులే బిడ్డల బాగోగుల విషయమున నతి జాగరూకత వహింపవలయును.

## సద్బాలుఁడు

బాలుఁడును దనను నవమాసములు మోసి కని పెంచిన తల్లిని, విద్యాబుద్ధులఁ గఱపి పెద్దఁజేసిన తండ్రిని దైవభావమునఁ బూజించుచు సేవించుచుండు నెడ నాతనిని లోకులెల్లరు ప్రేమింపఁగలరు. ఆ బాలునకు లోకమంతయుఁ బ్రేమమయమై పొడకట్టఁగలదు. ఆతఁడు ప్రతి జీవిని నాత్మవలెఁ జూడఁగలఁడు. కావునఁ; "దల్లిదండ్రులు దైవముల"ను పాఠమే బాలుఁడు ప్రప్రథమమున నేర్వఁదగిన పాఠము. తల్లిదండ్రులను దైవ స్వరూపులుగా నెంచి భక్తి పెంపునఁ గొలుచు బాలుని జీవితమే చరితార్థమగును.

## విద్యాబుద్ధులు

ఈ చరితార్థ జీవిత మలవరచుకొను నడిమి వయస్సున యుక్తాయుక్త వివేచన లేమింగాని, సహవాస దోషమునం గాని యాతఁడు కొన్ని దురభ్యాసములఁ దగులుట సంభవించు. వాని నన్నిటి నా తెలుసుఁడు సజ్జన సంగతిని, సద్గ్రంథ పఠనమున దఱిఁ జేరనీయక కాపాడుకొనవలయును. బుద్ధిని ప్రకాశింపఁ జేయునది విద్య. కావున నాతఁడెప్పుడును విద్యాభ్యాసము సేయు చుండవలయును. పొట్టకు - బిరుదములకు - పదవులకు నభ్య సించు విద్య విద్య కానేరదు. జ్ఞానమిచ్చునదియే విద్య. "విద్య లేనివాఁడు వింతపశువు" విద్యావిహీనుఁడు గౌరవానర్హుఁడు. ఎంత సంపత్తున్నను విద్యాసంపత్తు లేనివాఁడు గౌరవస్థానము గడింపలేఁడు. అట్టి గౌరవ ప్రదమగు విద్య బాల్యముననే గడింప వలయును. విద్యాభ్యాసమునకే భగవంతుఁడు బాల్యము నిచ్చి నాఁడు. ఆ బాల్యమును విద్యాభ్యాసమున సార్థక పఱుపక, పెడ దారుల వ్యర్థపఱచునేని యాతఁడు భగవదాజ్ఞను మీఱినవాఁడగును.

బాల్యమున నభ్యసింపవలసిన విద్య నంతయు నభ్యసించి విద్యకుఁ దగిన వినయము కలిగి ప్రవర్తింపఁ బ్రయత్నింప వల యును. మానవునకుఁ బెట్టని భూషణము విద్య. విద్యా సత్ప్ర వర్తనములు శబ్దార్థములవలె పొందిక కలవి. బాల్యంబున గడించిన విద్యారత్నమును సత్ప్రవర్తనాశాణమునఁ దీర్ప వలయును.

ఆతఁడు యౌవనము వచ్చినంతనే దుర్వ్యృత్తులందగు లొలకక, బ్రహ్మచర్యవ్రత నిష్ఠాగరిష్ఠుఁడగుచు సజ్జన సంగతిని

జేసుచు వారల సమపదేశములఁ గ్రోలుచు దేశసేవాపరతంత్రుఁడు కావలయును.

## వివాహము

విద్యాబుద్ధులను గడించి యౌవనము వచ్చినంతనే విద్యావతి నొకతెను వివాహమాడి గృహస్థాశ్రమ ధర్మ నిర్వహణ పరుఁడగుచు లోకసేవ యొనర్ప వలయును. తన కాంతను కేవలము వంటపనులందే వినియోగింపక దేశ మత సాంఘిక సారస్వతాదిక విషయములందుఁ దానెట్లు భాగస్వామియో యట్లే యామెయు నని తలంపవలయును. కేవల కామాంధతచే వివాహమాడుట యాత్మద్రోహమని ముందే చదివి యున్నారముగదా! కావునఁ బురుషుఁడట్టి తుచ్ఛేచ్ఛను మనస్సునందుఁ గొనక, తాను లోకసేవ కుపయోగించుటకు వివాహమాడ వలయును. ఆ దంపతులు బంధుమిత్రాదులం గౌరవించుచు, నతిథి సత్కారాదుల నిర్వర్తించుచు లోకసేవాపరాయణులు కావలయును. తమ బిడ్డలు లోకసేవాపరాణులగుటకు ముందు దల్లిదండ్రులు లోకసేవాపరాయణులు కావలయునుగదా!

## ప్రేమ గల్గియుండుట

గృహస్థుఁ డితరుల కలిమికి పొక్కక, తన లేమికి చిక్కక, సర్వమున సమదృష్టిని గలిగి యుండవలయును. కర్షకుఁ డెట్లు తన యాలుబిడ్డలతో రాత్రింబవళ్ళు ఎండయనక వాన యనక పలు కష్టములకోర్చి ధన ధాన్యముల గడించి ప్రజోపయోగమునకై రాజ్యమునకు వెచ్చించి తుదకుఁ దాను.చాలీచాలని పిడికెఁడన్నమునని యెట్లు సంతృప్తి చేతస్కుఁడగుచుండునో; అట్లే గృహస్థుఁడు తన గేస్తురాలితో బిడ్డలతో

తాను గడించిన సంపదను అతిథి పూజాదికములకు, దేశసేవకు వినియోగింపవలయును. అంతియకాని యొకరికిం బెట్టక, తన బిడ్డలం దిననీయక, దాను దినక కష్టించి కూడంబెట్టిన సొమ్మును నష్టముసేసిన నేమిఫలము? రాజ్యసౌఖ్యమునకుం గర్త యెట్లు ముఖ్యుండో; యట్లే మానవ సంఘసౌఖ్యమునకు గృహస్థుండు ముఖ్యుండు.

కట్టుగుడ్డలేక తినందిండిలేక మలమల మాడు బీదసాదుల మాటయే మఱచి వలయునంత ధనము కలదుగదాయని తాను మాత్రము సుఖజీవనముసేయు గృహస్థుండు గృహస్థుండు కాండా లండు. తాను భుజించు నన్నము పరుల నోటికడదని యెఱింగి బీద సాదులయందు దయాధర్మములు కలవాండై వారల కష్టసుఖ ములను గమనించుచుండ వలయును. ఎల్లరు తినవలసిన యన్న మును-ఎల్లరు కట్టవలసిన గుడ్డను, తానొక్కండే తినుచు- తా నొక్కండే కట్టుచుం దన సౌఖ్యమునకే వేలకొలంది ధనమును వెచ్చించుచు నితరులమాట తలపెట్టని మానవుండు పాపికాక మఱియెవండు? ఇంతకంటెం బాపము వేఱొండు కలదా? మానవులెల్లరు సోదరులై యుండ నందొక్కండు కలిమికలిగి యున్నంత మాత్రానం గన్నుమిన్ను గానక యాంకలికల్లాడు సోదరుల కష్టసుఖములను గమనింపక తానుమాత్రము హంస తూలికా తల్పములం బరుండి హాయిగాం గాలము పుచ్చుట యాత్మద్రోహము కాదా? మన పూర్వ ఋషులెల్లరు భోగ ముల ననుభవింపలేకయా, యడవుల వసించి పిడికెడన్నముతిని మూరెడు గుడ్డకట్టి మితవ్యయ మొనరించుచుం దమ దారపుత్రా దులం బోషించుకొనుట! ప్రాణరక్షణకై పిడికెడు మెతుకులకు వాపోవుచు- మాన రక్షణకై మూరెడు గుడ్డకు దేవురించుచు

దిఱుగాడు బీదల రక్షించుటకుఁగాదా మన ఋషులెల్లరు మిత వ్యయ మొనరించుట! ప్రపంచమందు శాంతి నెలకొన వలయు ననిన నొక్కని కష్టసుఖములందెల్లరు పాల్గొన వలయును. అట్టి యాత్మత్యాగబుద్ధి, సర్వమానవ సౌభ్రాత్రము పట్టువడినఁగాని దేశమున శాంతి సమకూడఁ జాలదు.

రారాజు బిడ్డఁడు శ్రీరామచంద్రుఁ డాలుతమ్ములతోఁ గష్టసుఖములను లెక్కింపక యడవులకేగి చెట్టుపుట్టలఁ జేరి పరుండుటకు ప్రక్కలేక తినుటకుఁ దిండిలేక, ఎండకెండుచు, వానకుఁ దడియుచుఁ బదునాలుగు వర్షములు పలుబాములు ననుభవించుట దేశశాంతికే కదా! అట్టి రారాజు బిడ్డఁడు, సుకుమారగాత్రుఁడు, రఘుకుల సోముఁడు అసూర్యంపశ్య యగు సీతను వెంటనిడుకొని తమ్ముఁడు లక్ష్మణునితోఁ గాఱడవులకేగి చతుర్దశవర్షము లెనలేని కష్టములనుభవించి దేశమున శాంతి నెలకొల్పఁగా, నేదియో కొలఁది ధనమున్నంత మాత్రముననే మిట్టిపడుచు, దేశసేవ మఱచి బీదసాదులఁ జూచినంతనే చీదరించుకొనుచుఁ దన కుటుంబమే ప్రజలు, తన గృహమే దేశము తన వాకిలియే దేశపు టెల్లయని యెంచు కూపస్థమండూకమగు గృహస్థుని జీవితము వ్యర్థము.

## భాగ్య జీవితము

ఓయీ! భారతదేశ గృహస్థుఁడా! నీ దేశీయులు— నీ సోదర భారతీయులు ఏఁడు కోట్లమంది పేదలు పొట్టకూటికి వాపోవుచు, కట్టుగుడ్డ కఱవగుచు నల్లాడుచుండ నీ వొక్కరుఁడవు సుఖజీవనము సేయ మనసెట్లొప్పెనోయి! ధర్మము వలదా?

భగవంతుఁడు నీకీ యైశ్వర్యమిచ్చినది నీ సుఖజీవనమాత్రమున కని తలంచి మురియుచుంటివి కాఁబోలు! అయ్యో! ఇంతకంటె వెఱ్ఱి వేఱుకలదా? పరికించి పాఱఁజూచిన నీయాలుబిడ్డలే నీవారు కారని తోఁచుచుండఁగా, నీ ధనము నీదియని యెట్లుచెప్పఁగలవు? 'నాయది' 'నీయది' యను భేదము చేతులారఁ దెచ్చి పెట్టుకొని వ్యర్థమున మోక్షదూరుఁడవు కానేల? ఇదియంతయు నాయది కాదు; నీయదియుఁగాదు. 'నాయది, నీయది' యను భేదబుద్ధి కలుగుటయే మాయ. ఈ మాయ యున్నంతవఱకు మోక్షాలయమునకు మార్గము కానరాదోయి! ఓయి! గృహస్థుఁడా! సృష్టియను గ్రంథముయొక్క ముందువెనుకలనెడు పుటలఁ దిఱుగవైచి చూడుము. స్థిరమైన దేదైన కలదేమో గుఱుతింపుము. కీర్తియొక్కటి తక్క స్థిరమైన దేదియుఁగానరాదు. అంతయు నస్థిరమయియుండ సుఖాభాసములనే సుఖములుగా నగచి నీవీ మాయకు లోనుగానేల? భగవంతుఁడు నీకీయైశ్వర్యమిచ్చినది నీ సుఖ జీవన మాత్రమునకని తలంపక బీదసాదుల సుఖజీవనమునకని యెఱుంగుము. అంతియకాని, చేతియందుఁ గలదుకదాయని స్వార్థమున నుపయోగించుకొనకుము. వ్యయ మొనర్చి యాటోప జీవనము గడుపుటకంటె మిత వ్యయ మొనర్చి యాత్మగౌరవ జీవనము గడుపుట ముక్తిప్రదము. కావున నీవు వెఱ్ఱి వ్యామోహమునఁబడి నీకై ధనమును వెచ్చింపక, పరులకు వెచ్చించి మోక్షగామివి కమ్ము. ఎంత పాఱఁజూచినను మోక్షమున కింతకంటె మార్గము వేఱొండు కానరాదు.

## ప్రేమ జీవితము

కావున, నీవు మితాహారమును గైకొనుచు సాధారణ మగు దుస్తులను ధరించుచుండవలయును. మితాహారమనిన నుపవాసాదులచే నెండుటయుఁగాదు. బ్రదుకు తెరువునకు వలయు నాహారమని యర్థము. నీ మాతృదేశమునఁ బలువురు గంజిలోనికి నుప్పుఁగల్లులేక యల్లాడుచుండ నీవొక్కఁడవు పాలలోని 'పంచదార'కై ప్రాఁకులాడుట యెంతటి దేశద్రోహమో యెఱుంగుము. బీదసాదులెట్లు స్వల్పాహారమును భుజించుచు సంతృప్తచేతస్కులగుచున్నారో; యట్లే నీవునుస్వల్పాహారమును భుజించుచు సంతృప్తచేతస్కుఁడవు కమ్ము. ఎల్లరెట్లో; నీవు నట్లేయని తలంచి యెల్లరివలె నాదర్శ జీవనము గడుపుచుండుము. అంతియకాని కలదుగదాయని కడుపునిండుగ మెక్కి పిమ్మట రోగముల పాలయి మంచముపట్టి తుదకకాల మృత్యువువాతఁ బడిన నేమి ఫలము? ఎంతటి యవివేకమో తిలకింపుము. లోకమున కుపయోగింప జన్మమెత్తిన నీ విట్టి యకార్యములఁ జేయరాదు. తనను దాఁదెలియని వాఁడు మానవుఁడా? తన పొట్టకుఁ దాఁజూచుకొని యితరుల పొట్టమాటయే తలపెట్టని గృహస్థుఁడు గృహస్థుఁడగునా?

## ఆహారము

కావున, మానవుఁడు లోకోపయోగమునకుఁ దగు నాహారము గైకొనుచు నెల్లప్రాణుల నాత్మవలెఁ జూచుకొనవలయును. ఎల్లయెడల నెల్ల ప్రాణులను దనవలెఁ జూచుకొను వాఁడె ధన్యుఁడు, పసపడి మాంసభక్షణము సేయుట కడుంగడు పాపము. తన ప్రాణమువంటి ప్రాణమేకదా యితర ప్రాణుల ప్రాణము! అట్టియెడ నోరులేని పశుపక్ష్యాది ప్రాణులఁ జంపి తన

పాడుపొట్టను నింపించుకొను మానవుఁడు రౌరవాది నరకముల ననుభవింపఁ గలఁడు. మాంసభక్షణముకంటె వేఱొండు పాపములేదు.

అంతశ్శుద్ధి కాహారము ముఖ్యము. కామక్రోధాదులను పెంచు నాహారము, అమానుషత్వమును పెంచు మాంసాహారమును వర్జనీయములు. అంతశ్శుద్ధి ప్రదాయక సాత్వికాహారము భుజించుచు అహింసా వ్రతావలంబనుఁడై జీవకారుణ్యము కలిగి మెలఁగుచుండ వలయును.

## దు స్తు లు

వస్త్రములలోనెల్ల సాధారణమగు వస్త్రములను ధరించుచుండవలయును. జాతీయతను గాపాడు వేషము గౌరవప్రదము. అంతియకాని దంభమునకై తన జాతీయతావేషమును మార్చుకొనుట నాగరకత కాఁజాలదు. కావున మానవుఁడు తన జాతీయతా సంపాదకములగు వస్త్రములను దాల్చుచుండవలయును.

తనకుఁ గావలసిన గుడ్డను దానే నేసికొని ధరించుట యెంతయో గౌరవ ప్రదము. అట్లుచేయ వీలుకాదేని తన దేశీయ వస్త్రములఁ దాల్చుట భారతదేశ గృహస్థుని విధ్యుక్త ధర్మము.

పూర్వమొకప్పుడు మన భారతదేశము నేఁత పరిశ్రమ యందలి ప్రావీణ్యము చూపినది. పూర్వ మొకప్పుడు శ్రీ విక్టోరియా మహారాణి భారతదేశ వస్త్రము గాంచి యానందించి యప్పటికా యాంగ్లదేశమున నట్టి వస్త్రమే కానరాకుండుటచే నప్పుడప్పుడు నుల్లాసమునఁ దాల్చుచుండెడిదట. ఇట్టి నిదర్శన

ములు పెక్కులు కలవు. అట్టి భారతదేశమందలి నేత పరిశ్రమ యడుగంటుటచే నేఁడు మన భారతమాత గుడ్డకు కఱవై విదేశములమీఁద నాధార పడవలసి వచ్చె. కాలవశమున మన భారత దేశము పరాధీనమగుటచే మన నేత నైపుణ్యము కూలినది. విదేశ యంత్రమహిమ హెచ్చినది. మన మీ యంత్ర మహిమకు లోనై యుండుట వలన మన దేశమునుండి కోట్లకొలఁది ధనము ప్రవాహరూపమున విదేశములకుఁ బోవుచున్నది. భారతదేశము బీదదేశ మగుటకిదియొక ప్రబల కారణము.

ఇది యంతయు నెఱింగి గాంధీమహాత్ముఁడు ప్రభృతి దేశ నాయకులు పలువురు మనదేశమందు నేయఁబడు గుడ్డను మనము ధరించునెడల నేఁటేట నింతటి ధనము విదేశములకుఁ బోవఁజాలదని నొక్కి చెప్పిరి. అప్పటినుండి మన భారత దేశీయులు కన్ను తెఱచిరి. ఇందువలన భారత దేశమునకెంతయో లాభము కలుగుచున్నది.

అక్కో, నీవును నీ దేశీయ వస్త్రములను ధరించుచున్న యెడలఁ బనిలేని వారలకుఁ బని కల్పించిన పుణ్యపురుషుఁడ వగుదువు. కూటికి మటమటలాడు వారలకుఁ గూడుపెట్టిన నెఱదాతవు కాఁగలవు. కావున నీ జాతీయతను బెంపొందించు నీ దేశీయ వస్త్రములందాల్చి యాత్మగౌరవమును— మాతృదేశ గౌరవమును నినుమడింపఁ జేయుచుఁ జరితార్థుఁడవు కమ్ము.

## పరహితము

నీ విట్టి పరహితైక జీవనమును గడుపుచో నీదేశమందు బీదసాదుల మాటయే యూయము కాఁగలదు. కావున సర్వ

ప్రాణులఁ బ్రేమించి నీవీ పరహితైక జీవన మలవఱచుకొనిన యెడల నీ జీవితము చరితార్థము కాఁగలదు.

శ రీ ర పో ష ణ

ఈ శరీరము నీయది కాదని తలంచి పరోపకారమున కుపయోగింపుము. అట్లుగాక స్వసౌఖ్యమునకే యీ శరీరము నుపయోగించుకొందువేని ధర్మదూరుఁడవు కాఁగలవు. లోకమే నీవు- నీవే లోకము. అంతయు నీవయైయుండ నశ్వరమగు నీ శరీరమును నీకై యుపయోగించుకొనుట యవివేకము. ఈ తనువీ భూమిమీఁదనుండునది యత్యల్ప కాలమేయని యెఱింగి, కర్తవ్య ధర్మమును వెనువెంటనే పూర్తిచేసికొని పుణ్యమునకుఁ బొమ్ము. అట్లుగాక ఈ శరీరమును నీ క్షేమమున కుపయోగించుకొని లోకము మాట మఱచి పిమ్మట నవస్థల పాలుగాకుము. "పరోపకారార్థమిదమ్ శరీరమ్" అను సూక్తిని గ్రహించి యీ తనువు పరోపకారమునకని యెఱింగి పరులచే సేవసేయఁ గడంగకుము. నీ శరీరమును పరోపకారమున నుపయోగపఱచుటలో నీ వెన్నఁడును వెనుకంజ వేయకుము. పావురమునకు శరణిచ్చి యాఁకలి కల్గాడు డేగకుఁ దన తనువును గోసియిచ్చిన శిబిచక్రవర్తి పుణ్యచరిత్రమును మనమునమననము గావించుకొమ్ము.

# శరీర పోషణ

మోక్షప్రాప్తికి భగవంతుఁడు నీకీ శరీరము ప్రసాదించెను. కావున నీవీ శరీరమునెంతయో పదిలముగాఁ గాపాడుకొనుచుఁ బారమార్థికమున కుపయోగించినఁగాని ముక్తినిఁ బడయుట కవకాశము కలుగనేరదు. అట్లుగాక లోకముపై నేవగింపు కలిగి సర్వముఁ సన్యసించునట్లు శరీరముపై నేవగింపు కలిగి యుపేక్షించుట పాపములను గూడఁ బెట్టుకొనుట యగును.

## జ్ఞానుల లక్ష్యము

ఈ శరీరమొక యాలయమనియు, నందుండు జీవుఁడొక దేవుఁడనియు నెఱుంగుము. మనము భగవంతుని రాతియందో; అప్పయందో ప్రతిష్ఠించి యాకృత్రిమ దైవప్రతిమకు గోపురప్రాకారాలయాదులు నిర్మించి యా యాలయము నెంత జాగ్రత్తగాఁ జూచుకొనుచుందుమో యట్లే యీ శరీరాలయమును జాకరూకతతోఁ బోషించుకొనవలయును. సర్వము సన్యసించిన సన్యాసియే శరీర రక్షణయందెంతయో జాగరూకత గలిగి యుండునప్పుడు నీ వీ శరీర రక్షణ విషయమున నుపేక్ష చేయుట యెట్లు పొసఁగును? భగవత్కైంకర్యమునకు శరీరము సాధనము;

మోక్షమునకు శరీరము సాధనము. వేయేల ? శరీరములేని జీవుఁడు మోక్షము పొందెనేమో వేలుమడిచి యొక్కనిఁ జూపుఁడు. శరీరమేలేనిచో జీవుఁడుండుటయే పొసఁగదుగదా ! జీవుఁడుండుటయే లేనిచో శరీరము నిలువనేరదుగదా? శరీరము లేనిచో మోక్షప్రాప్తి కలుఁగనేరదుగదా? అగుచో నెట్లు ?

కావున, భగవత్కైంకర్యమునకు-మోక్షమునకు శరీరము ముఖ్యము. అట్టి శరీరమునవరతముపవాసాది వ్రతములచే శుష్కింపఁజేయుట యయుక్తము. శరీరారోగ్యముండినఁగాని తలపెట్టిన కార్యము సాధింపలేము. తలపెట్టిన సత్కార్యమును సాధించినఁగాని ముక్తినిఁ బడయఁజాలము. కావున శరీరారోగ్య విషయమున జాగ్రత్త వహింపవలయును.

వీలగునంతలోఁ ప్రపంచపు గొడవ వదలి యాలుబిడ్డలను విడిచివచ్చి యొంటరియై యడవులకేగి యట నాశ్రమముల నెలకొల్పుకొని నిష్కామ జీవనము గడుపుకొను ఋష్యాదులు కందమూల ఫలాదులను దినుట శరీరపోషణమునకేగదా! అట్టి మహానీయులే శరీర పోషణమున నేమఱకయుండ నీ వింక నశ్రద్ధ చూపనేల ?

## శ రీ ర ప్రా ధా న్య త

పెక్కు పలుకులేల? 'శరీర మాద్యమ్ ఖలు ధర్మసాధనమ్!' ధర్మసాధనమునకు శరీరము మూలము. నీవు నీ శరీరారోగ్యమును గాపాడుకొనుచు ధర్మాచరణమునకుఁ గడంగుము. మోక్షప్రాప్తి నీకుఁ జేకూరఁగలదు.

ప్రాతఃకాలముననే మేల్కాంచి నిత్యకృత్యముల నిర్వర్తించుకొని శరీర వ్యాయామమునకుఁ గడంగవలయు.

స్నానాదికములచే శరీరమును శుభ్రపఱుపవలయును. నిర్మలవాయువును గ్రోలుట శరీరారోగ్యమునకు ముఖ్యము. మితాహారము భుజించుచు సాధారణమగు జాతీయములగు వస్త్రులను ధరించుచుండవలయును. వ్యర్థముగ దిఱుగక విజ్ఞాన సముపార్జనాసక్త దృష్టియై, జీవిక కొఱకై యే దేనినొక సద్వృత్తి నవలంబించి గృహస్థాశ్రమ ధర్మనిర్వాహణ పరుఁడై బీదసాదులఁ గనికరించుచు లోకసేవ యొనరించుచుండ వలయును.

శరీరారోగ్యపాలనో పద్ధతు లనేకములు కలవు. అందు స్థూలములు కొన్ని, సూక్ష్మములు కొన్ని. ఆ సూక్ష్మములందు ముఖ్యమైన దేదియో ముందు ప్రకరణమునఁ జదువుకొందము.

# స త్య ము

శరీర శక్తినిచ్చుటకు దేహపరిశ్రమ యెట్లో, అట్లే మానసిక శక్తినిచ్చుటకు సత్యము ముఖ్యము. సత్యము లేనిచో హృదయమునకు శాంతి లేదు. శాంతియే లేనిచో బుద్ధిబలము శూన్యము. బుద్ధిబలము లేనిచో నెంత శరీరబలమున్నను వ్యర్థము. కావున దేహబలముతోఁబాటు బుద్ధిబల మావశ్యకము. బుద్ధిబలమునకు – శాంతి, శాంతికి – సత్యము ఆవశ్యకము. అందుచే మానవునకు సర్వథా సత్య మావశ్యకము.

మఱియు సమస్త ధర్మములందును సత్యము మేలైనది. సత్యము లేనిచో నెంతటి మానవుని జీవితమైనను వ్యర్థము కాఁగలదు. సత్యమొకటి కలుగుచోఁ గామక్రోధ మదమాత్సర్య ద్వేషాసూయలు రూపఱుటయు కాక, యితర ధర్మములు తనంతటఁదాఁ బట్టువడఁగలవు. మానవునకు సత్యము ప్రాణము.

### స త్య మ హి మ

'సత్యము సర్వశ్రేయము. అది లేనిచో సర్వ ధర్మములు వ్యర్థములు'ని ఋషిపుంగవుల మతము. ఆర్యావర్త మందుఁ బేరుగాంచిన పెద్దలెల్లరు సత్యము వచించుటచేతనే

పెద్దలైరి. నిత్యసత్యవ్రతులౌటచేతనే మహాపురుషులైరి. సత్యము కంటె ధర్మము వేఱొండు కలదా !

చ. సుతజలపూరితంబులగు నూతులు నూఱింటికంటె సూనృత
వ్రత ! యొకబావిమేలు మఱి బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతు వదిమేలు తత్క్రతుశతంబునకంటె సుతుండుమేలు, త
త్సుతశతకంబుకంటె నొక సూనృత వాక్యంబుమేలు చూడఁగన్.

కం. వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దులనిడి తూఁపఁగ సత్యము
వలనన ములు సూపు, గౌరవంబున పేర్మిన్.

తే. సర్వతీర్థాభి గమనంబు, సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁగావ
యెఱుఁగు మెల్ల ధర్మంబుల కెందుఁబెద్ద
యండ్రు సత్యంబు, ధర్మజ్ఞులైన మునులు.

## జ్ఞానుల యాశయములు

పరమ పవిత్ర ధర్మములందెల్ల శ్రేష్ఠమైన సత్యమును వచింప మానవుఁడు ప్రయత్నింపవలయును. వేదములు "సత్యం వద" యని తొలుదొల్తగా మానవుని కుపదేశించినవి.

మ. నిరయంబైన నిబంధమైన ధరణీ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైన కులాంతమైన నిజమున్ రానిమ్ము, కానిమ్ము పో!
హరియైనన్ హరుడైన, నీరజభవుం డభ్యాగతుండైన, నౌ
తిరుగన్ నేరదు నాదుజిహ్వ, వినుమా, ధీవర్య! వేయేటికిన్.

ఆడిబొంకుట పాడిగాదని కదా పూర్వము బలిచక్రవర్తి యాత్మ నాశనమునకైన వెఱవక, వామనమూర్తి కిచ్చిన బాస చొప్పున మూడడుగుల నేలకు భూమ్యాకాశములను, స్వశిరస్సును నర్పించుట !

ఆతని సత్య సంధత నిరుపమానము.

సత్యమునకు రాజ్యములొక లెక్కయా?

మఱియు నోటిమాటకే కదా నిత్య సత్యవ్రతుండగు హరిశ్చంద్ర చక్రవర్తి రాజ్యమును బోనాడుటయు, నాలుబిడ్డలను విక్రయించుటయుఁ దుదకుఁ దా నొక్కనికి నమ్ముడువోవుటయు సత్యము కొఱకుఁగదా !

వీరలకీ యవస్థ యెందులకు ? ఒక్కమాటకు సర్వ రాజ్యము పోనాడుట యే మంత గొప్ప ? ఒక్కమాటను జవదాటినఁ జతుస్సముద్ర ముద్రితభూమండలమంతనునీటుగా నేల వచ్చునుగదా ! అట్టిచో వీరలిట్లు యీ యిడుమలనుగుడవ వలసి వచ్చె" నని యందురేమో? కాదు; కాదు, వారలకు రాజ్యమేల? సత్యము ముందు రాజ్యములొక లెక్కయా ?

శా॥ కారేరాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతింబొందరే?
వారేరీ? సిరిమూటగట్టు కొనిపోవంజాలిరే? యువ్విపైఁ
బేరైనంగలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరేకోర్కులు, వారలన్ మఱచిరే యెక్కాలమున్ భార్గవా!

అహూ, వారే! సత్యమునకింతటి పట్టుదలయా! ఇట్టి గట్టి పట్టుదల వహించి యాడితప్పక పోవుటచేతనేకదా వీరల నిర్మల కీర్తిచంద్రిక నేఁటి వఱకు భూమిమీఁద వెలుఁగు వెల్లువల బ్రసారించు చున్నది.

ఓయి! భారతీయుఁడా! నీవిట్టి సత్యసంధత కలవాఁడవై భారత భూమిని ఆచంద్రతారార్కము వెలయుదువుగావుత!

# యథార్థజ్ఞానము

ప్రతి మానవునియందు యథార్థజ్ఞానము సహజముగా నిండి నిబిడమై యున్నది. మానవుఁ డజ్ఞానయుతుఁడై యుండుటచేఁ గామక్రోధములకు మదమాత్సర్యములకు ద్వేషాసూయలకు ఆశా పాశములకు లోనై తనయందుఁ బ్రకాశించునట్టియు-అనన్యము - అసదృశము - అపారము నైనట్టియు యథార్థజ్ఞానము గాంచలేక తికమకలుపడుచు సుఖదుఃఖాది ద్వంద్వములం దగుల్కొని భగవత్కటాక్ష వీక్షణామాత్ర లభ్య మానవత్వమును గోల్పోవుచున్నాఁడు. మానవత్వమును సంరక్షించుకొను నుపాయంబు సత్య మొక్కటియె కాని మఱియొండు లేదు. సత్య మొండుండిన కామక్రోధ మద మాత్సర్య ద్వేషాసూయ లను దుర్గుణములు తన దఱికి రా వెఱచిదవ్వు దవ్వుననే వెఱచి, నిలిచియుండును. మఱియుఁ దనయందుఁ బ్రకాశించు యథార్థజ్ఞానము వే వెలుఁగుకాంతికి సరితూఁగఁగలదు. జీవిత వృక్షము ఫలవంత మగుటకు జ్ఞానోదక మవసరము. కావున, మానవుఁడు స్వీయమానవత్వమును బోషించుకొన జ్ఞానమెంతేని యావశ్యకము. సత్యసంధత పట్టువడినఁగాని, యథార్థజ్ఞానము

వెల్లివిరియఁ జాలదు. యథార్థజ్ఞానము వెల్లివిరిసినఁగాని మానవత్వము సార్థకము కానేరదు.

ఈయథార్థజ్ఞానమే యాఱవ యింద్రియమనియు జ్ఞానేంద్రియ మనియు, ఆత్మజ్ఞాన మనియుఁ జెప్పఁబడుచున్నది. ఈ యాఱవ యింద్రియమగు జ్ఞానేంద్రియము లేనివాఁ డాభాస మానవుఁ డగునే కాని మానవుఁడు కానేరఁడు.

ఈ యాభాసమానవునకుఁ బశువునకు భేద మిసుమంతేనియు నున్న. ఈతఁ డెట్లో పశువు నట్లే; పశువెట్లో యీతఁడు నట్లే. పశువు నీరు మేఁతల కై కొనుచుండును. దూడలగని పాలిచ్చియో, కృష్యాది కర్మల కుపయోగించియో యుపయుక్త మగుచున్నది. సుఖములు వచ్చిన గంతులు వేయును. కష్టములు వచ్చిన కంటివెంట నీరు కార్చును. ఈ యాభాస మానవుఁడు నట్లే యన్నపానీయములను గై కొనుచు, బిడ్డలఁగని పోషించుచు, సుఖదుఃఖముల ననుభవించుచుండును. ఆభాసమానవుని కించుమించుగా నన్నింట పశువు సరిసమాన మగుచున్నది. వేయేల? పశువునకు — ఆభాసమానవునకు భేద మెచ్చోటను లేదు. పవిత్ర మానవశరీరము దాల్చి పశురూపమునఁ బ్రవర్తించుట యెంత యజ్ఞానమో యెఱుంగుదు. నిర్మల జలపూరిత తటాక తటమున నిలువఁబడి 'దాహము, దాహమో' యని పలువరించువాని పగిది; తనయందుఁ బ్రకాశించు యథార్థజ్ఞానము గాంచలేక, మూఢుఁడై ప్రవర్తించు మానవుఁడు పశుప్రాయుఁడుకాక మఱి యెవఁడు? ఇట్టి పశుప్రాయులు లెక్కకు మిక్కుటముగా నుండుట బట్టియే ప్రపంచమున నెన్నెన్నియో యుద్ధములు జరుగుటకుఁ గారణ మగుచున్నది. ఒక్కనిఁ గాచిన మఱియొక్కనికిఁ గంటగింపు; ఒక

దేశీయునిఁ జూచిన మఱియొక దేశీయునకుఁ జీదరింపు. తనవంటి వాఁడే కదా యితరుఁడు! తన దేశీయు లట్టివారే కదా యితర దేశీయులు! ఆఁకలి దప్పులు తన కెట్లో; యితరుల కట్లేయను తలంపు వీరల కేల కలుగదు? ఇట్టి తలంపే వీరలకుఁ గలిగిన ప్రపంచ మంతయుఁ జీకు చింతలు తక్కి పచ్చతోరణములతో-నిత్యకళ్యాణముతో వర్థిల్లుచుండునుగదా!

ఒకనిని మఱియొకఁడు బాధించుటయు, నొక దేశీయుని మఱియొక దేశీయుఁడు హింసించుటయు స్వార్థము, అజ్ఞానము నని చెప్పవచ్చును. ఇట్టి స్వార్థపరత్వబుద్ధి అజ్ఞానబుద్ధి నశించినఁ గాని ప్రపంచము బాగుపడనేరదు. స్వార్థపరత్వబుద్ధి, అజ్ఞానబుద్ధి నశించు నుపాయ మన్వేషింప నందఱు ప్రయత్నింపవలయును. లోకమునఁ బ్రసిద్ధికెక్కిన మహాపురుషుల చరిత్రలు నీ కెట్టి హితమును దెల్పుచున్నవి? యథార్థజ్ఞానము సంపాదింప నా మహాపురుషు లేయే విధములఁ బ్రయత్నించిరి?. ఎట్లు కృతార్థులైరి? పరిశీలించి తెలిసికొనుఁడు.

## ఆ త్మ సా క్షి

జ్ఞానమువలన లభించు లాభములను లెక్కింపఁదరమా? జ్ఞాన సంపన్నుఁడైన మానవుఁడు దైవస్వరూపుఁడు. దైవము నకు నీతనికి భేదమావంతయు లేదు. దైవము సర్వ ప్రాణులను ప్రేమించి, కనికరించి యెట్లురక్షించుచుండునో; యట్లే యీతఁడు నెల్ల ప్రాణులఁ దనవలె జూచుచు రక్షించును. ఈతని హృద యము దయా దాక్షిణ్యాది సద్గుణములకు నిలయము. సర్వ ప్రాణులను దనవలెఁ జూచి రక్షించుటయే యీతని యాశ యము. బాధల ననుభవించు ప్రాణులను జూచినంతనే యీతని

హృదయము నీరై పోవును 'నీయట్టిదేకదా యీ ప్రాణి' అట్టిచో బాధల ననుభవించుచున్న ప్రాణిని బాధనుండి నివారించి రక్షింపుమని యాతని హృదయ మాతనికిఁ గర్తవ్య ధర్మము నుపదేశించును. కర్తవ్య ధర్మమును నెఱవేర్చుటయే యాతని విధి. జ్ఞానికి సర్వము నొక్కటియే. 'నా' 'నీ' యను భేద మేమియు లేదు. అందఱు నొక్కటే యను నుదార బుద్ధి సంపన్నుఁడు జ్ఞాని. ఆతఁ డెల్లప్పుడు తన మనోవాక్కాయము లను నితరుల శ్రేయస్సున కుపయోగించును స్వార్థమను మాటయైనా యాతని చెవిని బడఁగూడదు. లోకశ్రేయమే తన శ్రేయము. తన శ్రేయస్సే లోకశ్రేయస్సు.

## ప్రతీకారము

ఇట్టి జ్ఞానసంపన్నులుగల, దేశమునకు రాజులతో - సేనలతో - శాసనములతో - పర ప్రభుత్వముతో నిమిత్తమేమి? అంతయుఁ దానే; తానే యంతయు. జ్ఞానసంపన్నుఁడు పలికి బొంకఁడు. ధర్మమునకు వెఱవఁడు. నిత్యము అంతరాత్మ ప్రేరితుఁడై లోకసేవ యొనర్పఁ గడంగును. ఇతరు లెప్పుడైన నాతనికిఁ గీడుచేసినను దిరిగి వారలకుఁ గీడుచేయఁ గడంగఁడు. మీఁదు మిక్కిలి వారలకు మేలుచేసి పొమ్మనును. ఆతనికి నన్నింట జ్ఞానము తోడునీడయై మెలఁగుచుండును.

యథార్థ జ్ఞానము మలవఱచుకొొన నరణ్యములకుఁ బర్వెత్త నవసరము లేదు. సత్యసంధత కలవాఁడై 'లోకసేవకుఁ బుట్టితి న'ను బుద్ధి యొక్కటి యుండినఁ జాలును. ఉపవాసము లుండ నవసరము లేదు. నట్టింట నైనను యథార్థజ్ఞానమును బడయవచ్చును.

# శాంతము

సత్యజ్ఞానములు కలిగినంతమాత్రముననే మానవునకు సకల సద్గుణములు పట్టుబడునని తలపోయవలదు. సద్గుణము లెన్ని యున్నను శాంతగుణ మొక్కటి లేనియెడల సర్వ ధర్మములు వ్యర్థములు కాఁగలవు. శాంతము లేనిచో నెంతటి మానవుఁడైనను నిరుపయోగుం డగుట నిక్కము. కిరీటములేని రాజు శాంతములేని మానవుఁడని తలపోయుఁడు. జ్ఞానము కలిగినంతమాత్రముననే శాంతగుణ మెట్లు కలిగియుండును? నీవు సంపూర్ణ జ్ఞాన సంపూర్ణుఁడవు కమ్ము. నీకు శాంతగుణ మేమైన కలుగఁగలదేమో చూతము! సత్యమువలన యథార్థ జ్ఞానము కలుగునన్నమాట సత్యమైనను, జ్ఞానమువలన శాంతము కలుగునన్నమాటకల్ల. కేవల జ్ఞానముచేఁగాక సత్య, జ్ఞానముల సంతత సంయోగమున శాంతగుణము కలుగఁగలదనుట నిర్వివాదము. అంతియకాని జ్ఞానియైనను, సత్యవంతుఁడైనను శాంతమూర్తి కాఁజాలఁడు.

అన్నపానీయములమాని కేవల పవనభక్షణము సేయుచు వేలకొలఁది సంవత్సరములు తలక్రిందుగాఁ దప మొనరించినను శాంతము కలుగుట దుస్తరము. తపోమహిమచే సృష్టికిఁ బ్రతి సృష్టిని కావించిన తపస్సంపన్నుండగు విశ్వామిత్రమహామునియే

శాంతబుద్ధిని గోల్పోవ నిఁక సామాన్యులమాట చెప్పనేల? శాంతము సమస్త సద్గుణములకు శిరోభూషణము.

శాంతమువలనఁ గలిగెడి పరమప్రయోజనము లెన్నెన్నియో కలవు. వానినెల్ల వివరింప నేరితరమగును? దిఙ్మాత్రముగాఁ జూపెట్టఁ దలపెట్టితిని. కానఁ బాఠకమహాశయులు నన్ను క్షమింపఁ బ్రార్థించెదను.

చతుర్గుణములు

శాంతమలవఱచుకొనుటకే గదా మన మహర్షులు ఊరు వల్లెలు వదలి యడవులకుఁబోయి యాకుటెండ్ల వసించి జీవయాత్రనుగడపినది. అట్టిమహనీయులకే శాంత మెంతయో ముఖ్యమై యుండ నింక మనకెంత ముఖ్యమో యాలోచింపుఁడు. శాంత మొక్కటి యలవడిన సకల సద్గుణములు కలిగినవనియను కొనవచ్చును. భగవంతునకు - శాంత స్వరూపునకు భేద మావంతయు లేదు. వేదములు "ఓమ్ శాంతి శ్శాంతిశ్శాంతిః" యని ప్రబోధించుచున్నవి. శాంతగుణ మలవరచుకొనుటకై జీవితమును ధారవోయవలయు. శాంతము లేనిచో మోక్షము శూన్యము. నీ మనోవాక్కాయములను శాంతోదకముచేఁ బవిత్రీకరింపవలెను. సద్గుణములలో వినయము, తృప్తి, న్యాయము ప్రేమ యనుగుణములు నాలుగు సర్వశ్రేష్ఠములయినవి. ఈ గుణ చతుష్టయమును నైష్ఠికబుద్ధితో ననుష్ఠించువాఁడే మానవుఁడు.

వినయము

మానవుని యజ్ఞానమును బాఱఁద్రోలి పశుప్రాయతను నశింపఁజేయునది వినయము. గౌరవస్థానమును గడించుటకు

వినయము ప్రధానము. తానెంత పూజ్యుఁడైనను మిడిసిపడక వినయవిధేయతలు కలవాఁడై యుండిన లోకులెల్లరు నాతనిని ప్రేమింపఁగలరు. కావున మానవునకు వినయము ముఖ్యము.

## తృప్తి

వినయముఁ కలిగి వివేకముతో దురాశలం దగుల్కొనక కలిగిన కలిమికి సంతృప్త చేతస్కుఁడవగుచు లోకసేవ కుపయోగింపుము. ఆశాపాశములం జిక్కి చిక్కులంబడకుము. కష్టసుఖములను లెక్కసేయక సంతృప్తిని విడనాడక సత్కార్యాచరణమునకుఁ గడంగుము. తృప్తియే లేనిచో నీవెంతటి ప్రజ్ఞకలవాఁడవైనను వ్యర్థుఁడవగుట నిక్కము. కాలానుకూలముగఁ గష్టము లెదుర్కొనుట మానవునకు సహజము. అట్టియెడఁ దృప్తిని విడనాడితివేని నవ్వులపాలు కాఁగలవు. మఱియు మీఁదు మిక్కిలి కర్తవ్య ధర్మము నెఱవేర్చుకొనలేని యశక్తతమెల్లఁగా నిన్నుఁ జేరఁగలదు. అందుచేత గలనైనఁ దృప్తిని విడనాడకుము. సుఖములు రానిమ్ము; దుఃఖములు రానిమ్ము. అన్నిటిని సమబుద్ధిని ననుభవించి తృప్తిపడుచు లోకసేవచేయ నుంకించుము. నీ భావ్యభివృద్ధి జీవిత వృక్షమునకుఁ దృప్తియే పట్టుఁగొమ్మ యని నమ్ముము.

కడుపునిండుగ మెక్కి కంటినిండుగ నిద్రవోవుటయే తృప్తియని తృప్తిపడకుము. ఈ శరీరము పశుపక్ష్యాదులకెట్లో, నీకు నట్లే యని తలంపుము. ఈ శరీరము కలకాలముండునది కాదని యెఱుంగుము. కలకాలము మనఁజాలని యీ శరీరమందు

మమకార మేలనీకు ? ఈ శరీరము నేఁడుగాక పోయినను మఱి యొకనాఁడైనను నశించునన్న మాట నిక్కమని గుఱుతింపుము. గుఱుతించి యీ శరీరమును నీ సౌఖ్యమునకే యుపయోగించు కొనక పరోపకారమున కుపయోగించి సంతృప్తుఁడవుకమ్మా.

## న్యాయము

తృప్తికి న్యాయము ప్రాణము. న్యాయముండినఁగాని తృప్తి కలుగఁజాలదు. న్యాయము సర్వసద్గుణములకు శిరో భూషణము. వినయము వలనఁ దృప్తి, తృప్తి వలన న్యాయము కలుగును. న్యాయైకదృష్టి లేని జీవితము గృహిణి లేని కాఁపురము వంటిది ఎన్ని సద్గుణములున్నను న్యాయ మొక్కటి లేనియెడల జీవితము నిష్ఫలమగును. న్యాయము ధైర్యమును గలిగించును. శాంతమునకు ప్రాణమువంటిది ధైర్యము. ధైర్యము లేనిచో మానవుఁడు లోకమందే కార్యము చేయఁ జాలఁడు. ధైర్యమునకు న్యాయము మూలము. న్యాయబుద్ధి లేని హృదయము భయమున కాస్పదమగును. భయము వలన మానవుఁడు కర్తవ్యధర్మమును నెఱవేర్పఁజాలఁడు. భయముచే కర్తవ్య ధర్మమును వ్యర్థపఱచును. ధైర్యము కర్తవ్య ధర్మ మును నిర్వహింపఁజేయును. ధైర్యమునకు న్యాయము ప్రాణా ధారము. తన వినయము (అనుభవము) వలన న్యాయము గోచరించును. కావున సర్వసద్గుణములకు మూలాధార మగు న్యాయము మానవ జీవితమును మేల్పడఁ జేయును. కావున సత్యము వలన సర్వ శుభములు కలుగును. కావునఁ బ్రతి మానవుఁడు సత్య గుణము కలవాఁడై యుండుట యవసరము. న్యాయము సత్యమునకుఁ బర్యాయమని యెఱుంగుఁడు.

## ప్రేమ

సత్యమువలనఁ బ్రేమ కలుగును. సమస్త సద్గుణములతోఁబాటు ప్రేమయు నత్యంతావశ్యకము. ప్రేమయే లేనిచో మోక్షము శూన్యము. భగవంతుని బ్రేమించినగదా మోక్షము లభించుట. భగవంతుఁడనలోకమేగదా! అందుచే లోకమును బ్రేమించిన భగవంతునిఁ బ్రేమించుటయగును. అందువలన సర్వ ప్రాణులఁ బ్రేమించి లోకసేవకుఁ గడంగుదువేని నీకు మోక్షము కరతలామలకము కాఁగలదు. కావున, మానవుఁడు తరించుటకుఁ బ్రేమయే ముఖ్యము.

## శాంతుని శీలము

పూర్వోక్త సమస్తసద్గుణము లెవ్వనియందు నిండియుండునో యాతఁడే మహాత్ముఁడు. ఆ మహాత్ముఁడే యవతారపురుషుఁడు. ధర్మము నశించు సమయమున నిట్టి మహాత్ములు లోకరక్షణముకొఱకు అప్పుడప్పుడీ భూమియందుఁ బుట్టుచుందురు. వారల వాక్సుధాధారలంగ్రోలి లోకరక్షణకొఱకుఁ దోడ్పడుట మానవునివిధి. ప్రస్తుత కాలమున నవతార పురుషుని యమృతవాక్కులఁ గ్రోల నేఁటి ప్రభుత్వ మాటంక పఱచుచున్నది. ప్రభుత్వము పనికిరాదనికాదు మా అభిప్రాయము. ప్రభుత్వమావశ్యకమనియే యెల్లరి యభిప్రాయము. ప్రభుత్వ మనఁ బ్రజల హక్కులను గాపాడునట్టిదికదా! ప్రజలను బశుప్రాయులనుగాఁజూచు ప్రభుత్వ ముండుటకంటె లేకుండుటయే మేలు. ప్రజల స్వాతంత్ర్యమును గాపాడుకొఱకే ప్రభుత్వ మేర్పడుట! కాలవశమున నట్టి ప్రభుత్వము నామమాత్రమై ప్రజలను

బహుప్రాయులుగాఁజేయు సాధనముగాఁ బరిణమించుట లోకము నకు సిగ్గుచేటు!

## భారతదేశౌన్నత్యము

ప్రపంచమందుఁగల దేశము లన్నింటికంటె మన భారత దేశ మెంతయో పవిత్రముగలది! విదేశీయులెల్లరు భారత దేశ మహిమాతిశయములంగూర్చి నేఁటివఱకు గొప్ప చెప్పుకొందురు. ఈ దేశమునఁగల యాధ్యాత్మికశక్తి మఱి యే దేశము నను గానరాదు. దయాధర్మములందుఁ బేరెన్నికగన్న దేశము మన భారతదేశ మొక్కటియే! మన దేశముకంటె దొడ్డదేశమీ జగత్తునందు వేఱొండులేదు. "సకలదేశములకు రాణి నాదు జన్మభూమి."

జగన్మంగళాభిలాషులగు మనపూర్వులు మానవసంఘ శ్రేయమభిలషించి మానవులెల్లరు తరించుటకై వర్ణాశ్రమము లను రెండుపద్ధతులను గనుగొనిరి. మానవుఁడా వర్ణాశ్రమముల నవలంబించి శమదమాదిసద్గుణగరిష్ఠుఁడై ప్రవర్తించునేని తరింపఁ గలుగుట తథ్యము. వర్ణము లోకప్రవృత్తికి; ఆశ్రమము జీవిత ప్రవృత్తికి సంగములు. ఈ వర్ణాశ్రమ ధర్మముల రెంటికి నంత ర్భాగములు నాలుగేసికలవు. వర్ణాశ్రమములు రెండును పర స్పర సహకారముకలవియై మానవుని ధన్యునిగా నొనరించు స్వభావము కలవి. దైవకృపచేఁ, బ్రాణుల బ్రదుకు తెరువునకు వలయు సమస్త వస్తులచేతను నిండి ప్రకృతి యలరారుచున్నది. మానవుఁడు ప్రకృతిమూలముననే తన బ్రదుకుతెరువునకువలయు పరికరము లను సంపాదించి తన జీవితమును పోషించుకొన వలయును. అందుచే మానవులు నాలుగు విధములుగా విభ

జింపఁబడిరి. భూములుదున్ని, విత్తులనాటి పైరుపంటలను బండిం చుటకొక సంఘము; పండిన పంటలను వివిధదేశముల కెగుమతి చేసి ధనము కూడఁబెట్టుటకొక సంఘము; పైరు పంటలను బండించు ప్రజలను, ఎగుమతి దిగుమతిచేయు ప్రజలను, సత్వతో భద్రముగాఁ గాపాడుటకొక సంఘము, వీరల కెల్లరకు భక్తి ప్రబోధము గావించుటకు మఱియొక సంఘమును నియమించిరి. ఈ సంఘములందు వారివారి కోరికల చొప్పున నా యా సంఘ ముల నాశ్రయించుచుందురు. అంతియకాని నిజమునకు నేఁటి కులపిశాచము నాఁడులేదు. అందుచేఁ బూర్వము మనదేశము పైరుపంటలతో, ధనధాన్యములతో, దేశమతాభిమానములతో, దైవభక్తులతో సత్యమునిండి యలరారుచుండెడిది.

## ఆ శ్ర మ ము లు

బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ సన్యాసములని యాశ్ర మములు నాలుగు విధములు. అందు విద్యాభ్యాసమునకు బ్రహ్మ చర్యము, లోకసేవాకరణ యోగ్యసంతానము గనుటకు గార్హ స్థ్యము, భగవత్సేవకు వానప్రస్థము, కేవలము ఆలుబిడ్డలనేగాక తానుజేయు ప్రతి కర్మఫలాపేక్షను సన్యసించి లోకసేవ యొనర్చ సన్యాసమునని యెఱుంగునది. వర్ణములవలె నీయాశ్ర మము లొండొంటికి నొండుతీసి పోవునవికావు. ఈ వర్ణాశ్రమ ములు నాలుగును ప్రపంచోద్ధరణకు సాధనములై మోక్షమున కంగము లగుచున్నవి.

## రా జు

ఈ వర్ణాశ్రమ ధర్మములను మానవుఁడు మనోవాక్కాయ ములచే నిర్దుష్టముగఁ బరిపాలింపకపోవుటచే నేఁడు మన భరత

భూమి ధర్మభ్రష్ట మగుచున్నది. వర్ణాశ్రమ ధర్మముల నెఱపు మానవుల కెట్టి యీతిబాధలు లేకుండఁ గాపాడుటకు ధర్మ భ్రష్టులై తిరుగు మానవులను శిక్షించి ధర్మమార్గమున ప్రవేశ పెట్టుటకు రాజు ముఖ్యుఁడు. ప్రజల మంచి చెడుగులను విచా రింపక స్వీయ సౌఖ్యమునకై స్వీయ కోశాగారములను నింపించు కొనుటకు రాజ్యమేలు రాజు రాజు కానేరఁడు. ప్రజలు ధర్మ భ్రష్టులు కాకుండఁ బరిపాలించునట్టివాఁడు రాజు. అట్టి రాజును దైవసమునిగా నెంచి ప్రీతి పెంపున సతతము కొలుచుచుండ వలయు. "నా విష్ణుః పృథ్వీపతిః". భగవంతుఁడు సకల సృష్టి ప్రపంచమును దయాధర్మములతో నెట్లు పరిపాలించునో; అట్లే యాతని ప్రతినిధియగు రాజు ప్రజలస్వాతంత్ర్యమును గాపాడుచు దేశ గౌరవమును బెంపొందించుచు న్యాయ మార్గానుసారియై దయా ధర్మములతో దేశము పరిపాలించుచుండవలయును. భారతభూమి యట్టి రాజుల పరిపాలనలోఁ జక్కఁగా బరిపాలింపఁ బడినట్లు చరిత్రలు తెలుపుచున్నవి. భారతభూమి ధర్మపాలనా బద్ధమై తనరారినది. అట్టి పరిపాలన మంతరించి మన దేశము నకు విదేశ పరిపాలనము దాపురించినది.

## నేఁటి ప్రభుత్వము

కాలవశమున విదేశ ప్రభుత్వ పరిపాలనము మన దుర దృష్ట వశమున మనకు దాపురించెను. ఇప్పటి పరిపాలనము ప్రజా స్వాతంత్ర్య శూన్యమై, మెండుగా నెండలుకాయు మండు వేసవి యందలి యెడారులవలె నున్నది. సత్యము శూన్యమగుచున్నది. ధర్మము భ్రష్టమగుచున్నది. దయ దూరమగుచున్నది. కట్టా!

ఇట్టి పరిపాలన మెట్టి సౌఖ్యమో యోచింపుఁడు. ప్రజలు అనదలై దీనులై పొట్టకూటికి వాపోవుచుండఁ బ్రభుత్వము మానము దాల్చుట పాడి కాఁజాలదు.

## శాంత హృదయము

ఇట్టి ప్రజాసౌఖ్య దూరమగు ప్రభుత్వమును బాఱఁద్రోలి స్వారాజ్యము సంపాదించుటకుఁ బూజ్యులు దేశ నాయకులు కొందఱు బద్ధకంకణులైరి. వారి మాటలను ఆజ్ఞలనుగా శిరసావహించి ప్రజలు దేశసేవకుఁ బాటుపడుదురేని అత్యంత శీఘ్రముగ స్వారాజ్యము మనము పడయఁగల్గుట నిక్కము. అప్పుడు ప్రజలెల్లరు సుఖజీవనము చేయఁగలరు. శాంత గుణము కలవారై ప్రజలు తమ దేశమునకు సేవ యొనర్పవలయు. శాంతమే మనల నన్నివిధములఁ గాపాడునది. తాల్మిని వీడి తన బాగోగులను వెదకువాఁ డెన్నఁటికిని బాగుపడఁ జాలఁడు. కావున మానవుఁడు తన జీవితమందు శాంతగుణ మలవఱచు కొనినఁగాని చరితార్థుఁడు కాఁజాలడు.

## సహనము — అసహనము

శాంత స్వభావునకు – కోపస్వభావునకు భేదమెంతయో గలదు. శాంత స్వభావుఁడు ఆత్మ శక్తిసంపన్నుఁడు. కోప స్వభావుఁడు దేహశక్తి సంపన్నుఁడు. దయాధర్మ సాహసము లాతని కాయుధములు. కత్తి కటారులు తుపాకి ఫిరంగులు నీతని కాయుధములు. ఆతని హృదయమం దెప్పుడు ప్రేమ రసము ఉబుకుచుండును. ఈతని హృదయమం దెప్పుడు రాక్షసత్వము ప్రబలుచుండును. శాంత స్వభావుని మనో

వాక్కాయము లెప్పుడు పరశ్రేయస్సున కుపయోగింప నువ్విళ్లూరును. కోపస్వభావుని మనోవాక్కాయము లెప్పుడును పరాపకారమునకుఁ బఱుగు లెత్తును. దుండగీండ్రు కొందఱు శాంతస్వభావుని హింసించినను శాంతబుద్ధితో నా బాధల నన్నిటిని ననుభవించుచుఁ దిరిగి యా దుండగీండ్రకుఁ బ్రత్యుపకారము చేయ నిశ్చయించును. రెండవవాఁడో, అట్లుగాక పారిపోవుటయో లేక కత్తి కటారులతోఁ దిఱుగబడుటయో చేయును. ఇంతకంటె రాక్షసత్వము వేఱొండు లేదు. ఈ యిద్దఱికిఁ గల భేదము సముద్రముకంటెఁ బెద్దది. అతనిది యొక ప్రపంచము; ఇతనిది యొక ప్రపంచము.

# ఆత్మశక్తి

శాంతచిత్తున కాత్మశక్తి మెండుగా నుండును. ఆత్మశక్తి యుండినయెడల మానవుఁ డెంతటి ఘనకార్యములైనను ననాయాసముగా సాధింపఁగలఁడు సర్వశక్తులకంటె నాత్మశక్తి కడుంగడు దొడ్డది. మానవున కాత్మశక్తియే పట్టువడుచో నాతఁడు సాధింపలేని కార్య మీ జగత్తున లేదనుట నిర్వివాదము. మానవుఁడు అజ్ఞానవశుఁడై యాశాపాశములం దగుల్కొని యుండుటచేఁ దనయందలి యాత్మశక్తిని గాంచలేక తికమకలం బడును. మానవుఁడు విద్యచే, (బ్రహ్మచర్యముచే) గార్హస్థ్యముచే, సత్యముచే, యథార్థజ్ఞానముచే, దనయందుఁ బ్రకాశించు నాత్మశక్తిని గుఱుతెఱింగి మెలంగినచో సర్వశక్తియుక్తుఁడు కాఁగలఁడు.

ఆత్మశక్తి సంపన్నుఁడు ఈ శరీరము – ఈ ధనము – ఈ యిల్లు వాకిళులు తనవని యెంచక లోకమున కని యెంచి లోకసేవకు వాని నుపయోగించును. తన సర్వస్వము పరోపకారము కొఱకు అర్పణము సేయునాఁ డిది యంతయు భగవల్లీలగా నెంచి యథార్థజ్ఞాని యగును. ఆతఁడు కష్టము వచ్చిన కన్నీరు విడువఁడు; సుఖము వచ్చిన నుప్పొంగఁడు. అంతయు భగవంతుని విలాసమని భావించును.

ఆత్మశక్తి సంపన్నునకు భగవంతుఁడే తల్లియుఁ దండ్రియునై సాఁకుచుండును. నిరాశయే యాతని యర్ధాంగి. సర్వప్రాణు లాతని బిడ్డలు. తనవంటివా రెల్లరు నాతని యాప్తబంధువులు. వేయేల? ఈ జగత్తంతయుఁ దనది. భగవంతుఁడే తనవాఁడై యుండ నింక నీ జగత్తు తనది కాకపోవునా? ఆతఁడు కారాగృహమందుండినను - వెలుపల నుండినను - ఒక్కటే. ఆతఁ డెచ్చోట నుండిన నేమి? భగవంతుఁ డెచ్చటనో కంటి కగపడక యుండినంతమాత్రాన నాతఁడు లేఁడందుమా? ఆతఁడే లేనిచో నీ జగత్తు మనఁగలదా? కనఁగలదా? కనఁబడనంత మాత్రమున నా దేవదేవుని మహిమాతిశయములు లేవందుమా? ఆతని మహిమయే లేనిచో మన మీ గ్రంథము వ్రాయఁ గలుగుదుమా? చదువఁ గలుగుదుమా? అట్లే; ఆత్మశక్తి సంపన్నుఁడు కారాగృహమం దుండిన నేమి? మఱి యెచ్చోట నుండిన నేమి? ఆతనిమాట జవదాటక యనుసరించుటయే మన కర్తవ్యము. ఆత్మశక్తి సంపన్నుఁడు గతమునకు వగవక, భవిష్యత్తునకు బెంగ గొనక సర్వము సర్వేశ్వరాధీనమని తలపోయును. ఆతఁడు మనయట్లే సృష్టింపఁబడినను మనవలె నింద్రియ వశుఁడు కాక సర్వసద్గుణకలితుఁడై, స్వకర్తవ్య ధర్మమును నెరవేర్చుకొను పావనమూర్తి. ఆతఁడు భగవంతునిమాటకు మాఱాడఁ జాలఁడు.

## మూఁడు విధములు

ఈ యాత్మశక్తి సంపన్నుల నెల్లరను మూఁడు విధముల విభజింపవచ్చును. భగవంతుఁడు మానవులకు త్రివిధ శరీరములను బ్రసాదించెను.. అవి స్థూల సూక్ష్మ కారణ శరీరములని

చెప్పఁబడుచున్నవి. స్థూలముకంటె సూక్ష్మము, సూక్ష్మము కంటెఁ గారణము శ్రేయమని యెఱుంగునది. ప్రాణులీ మూఁడు శరీరములను దాల్చి కర్మములను జేయుచుందురు.

ప్రప్రథమమున మానవుఁడు స్థూలదేహ జ్ఞానముచేఁ గర్మలను జేయును. పిమ్మట విద్యచే జ్ఞానసముపార్జనముచే సూక్ష్మదేహము తనయందు దున్నమాట నెఱింగి, యా దేహజ్ఞానము పొందును. ఈ సూక్ష్మ దేహజ్ఞానము నానాఁట వృద్ధిపొంది తుదకుఁ గారణ దేహజ్ఞానమును పొందును. ఆత్మశక్తి శరీరోపాధి ననుసరించి వృద్ధిక్షయములను బొందుచుండును. ప్రతి దేహికి నాత్మశక్తి సహజముగా నుండినప్పటికి నన్నిటికంటెఁ గారణదేహికి నాత్మశక్తి యపారము. ఈ యపారము నగు నాత్మశక్తిని సంతరించుకొన్న కారణజన్ములు మహాత్ములు - లోకోత్తర పురుషులు నగుచుందురు. వీరలే శాంతస్వభావులై సర్వశక్తిమంతము నగు నాత్మశక్తి గలవా రగుచుందురు. ఇట్టి మహోత్కృష్ట స్థాన మొక్కటి శాంత్యతీత స్థానమని యెఱుంగునది. తన్మహిమాతిశయములను గూర్చి తలఁపఁ దరముగాదు.

## ఆత్మశక్తి - భౌతికశక్తి

ఈ సంపూర్ణాత్మశక్తి సంపన్నుఁడు తలఁచినంతనే లోకము తలయొగ్గఁ గలదు. అట్టివానిని పంచభూతము లేమి చేయఁగలవు? చట్టము లేమిచేయఁగలవు? సేన లేమి చేయఁగలవు? పంచభూతము లాతనిని జూచినంతనే పాఱఁజూచును. చట్టము లాతనిచెంతఁ జప్పుడుచేయవు. ఆతనిని జూచినంతనే సేనలన్నియుఁ జిందఱ వందఱ లగును. పెక్కేల? వ్యాఘ్రాది క్రూరసత్వములు సర్పాది విషజంతువులు నాతని కాళ్ళకు

ద్రొక్కఁబడఁగలవు. సర్వేశ్వరుఁ డాతని కన్నింట బాసటయై యుండఁగలఁడు. భగవంతుఁ డాతని హృదయకమలమం దెల్ల ప్పుడు జలిబిలి నాట్యమాడుచుండును. ఆతని హృదయ మొక దేవాలయము. మన మాతనిని భగవంతుఁడని తలఁపవచ్చును; పూజింపవచ్చును. ఆతఁడే కర్మయోగి, ఆతఁడే మహాయోగి. తన మాహాత్మ్య మెఱుఁగని మహాత్ముఁ డతఁడు. ఆతని మహిమయే లోకరక్షణము. ధర్మమునకు వెఱవని ధైర్యశాలి యాతఁడు. సత్యము పలుకు సర్వోత్తముఁ డాతఁడు. అతఁడే జగదేకవంద్యుఁడు. ఇది యంతయు నాతని మహిమ. ఆ మహాత్ముని కతీతమయినది యీ జగత్తునందు లేదు.

ఆత్మశక్తి సంపన్నుఁడు సర్వశక్తిమంత మైనది యాత్మశక్తియనితలంచి యాత్మశక్తిని పెడదారులవ్యర్థపఱుపఁడు. దేహశక్తిసంపన్నుఁ డట్లుగాక పాప పుణ్యముల మాట తలపెట్టక పెడదారుల వ్యర్థపఱచును. ఆత్మశక్తి సంపన్నునకు – దేహశక్తి సంపన్నునకు నిదియే భేదము! మానవుఁడు పాంచభౌతిక శరీరము దాల్చి పంచభూతాత్మక శక్తి నలవఱచుకొని స్వార్థపరుఁడై లోకుల మాట తలపెట్టనివాఁడై స్వీయోన్నతికిఁ దన శక్తిని ధారవోయుట మనము కన్నులారఁ జూచుచున్నారము గదా! నేఁడు పాశ్చాత్యులు భౌతిక పరిశోధనా ఫలితములచే ఫిరంగులను, బాంబులను గనిపెట్టి పాపభీతిని వీడి ఘోరకృత్యములు గావించుచుండిరి. కేవల భౌతికశక్తి సముపార్జనమువలనే యిట్టి కీడు సంభవించుచున్నది. ఆత్మశక్తి సముపార్జనమునఁ గలుగు శుభము లనంతములు. ఆత్మశక్తి కపటాన్యాయములను, అసత్యాది దుర్గుణములను దూరముచేసి ధర్మాది సద్గుణము లను బోషించును. అంతియకాని దేహశక్తివలె నాత్మశక్తి

పశుప్రాయమును బెంపొందింపదు. భౌతికశక్తి సంపన్నులగు దేహాత్మవాదులు ఆత్మశక్తి సంపన్నుల కపకార మొనరించిన యెడలఁ బ్రత్యపకారము సేయనొల్లరు. ఆ యుపకారము వారల నేమియుఁ జేయఁజాలదు. అపకారము చేసినంత మాత్రమునఁ దిరిగి యా పాపుల కపకారము చేయనొల్లరు. మీఁదుమిక్కిలి యుపకారముచేయ నిచ్ఛగింతురు. ఆత్మశక్తి సంపన్నుని సహనస్వభావ మయ్యది.

ఈ యాత్మశక్తి సంపన్నులే కదా మానవులు! ఆత్మశక్తి నలవఱచుకొనుటకు బదులు కేవల దేహశక్తినిమాత్రమే మలవఱచు కొనువారు మానవు లెట్లగుదురు? దేహైకవాదులచే లోకము ఉక్కిరిబిక్కిరి కాఁగలదు. కావున, మానవులు లోకరక్షణకొఱకుఁ గృషిసలుపవలయును. అట్లగుచో లోకము సర్వదా జ్ఞానవిలసితము కాఁగలదు. మన పూర్వులు మనకు ఆత్మశక్తి యను నొక దివ్యసాధన మనుగ్రహించిరి. ఆ సాధనోపయోగమున కిప్పుడదను దొరకెను. శాంతిబుద్ధితో నాత్మశక్తి ప్రేరితుఁడై యహింసాధర్మము నెలకొల్పుటయే మానవుని విధి.

# మౌనము

మౌనమనఁగా మాటాడకుండుట. అనఁగా మాటాడ వలసినంతవఱకు మాత్రము మాటాడుట మౌనమగును. కొందఱు మాటాడుట నారంభింతురేని వినువారల చెవులు చిల్లులు పడుచున్నను మాటాడుచునేయుందురు. అది వాచాలత యగునుగాని వాఙ్మ్రఖము కాఁజాలదు. చెప్పవలసిన విషయమును బూసగ్రుచ్చినట్లుగా సూటిగా శ్రోత కవగాహన మగు రీతిని నావశ్యక విషయమును జెప్పవలయును. అంతియగాని మాట యున్నవిగదా యని గంటల కొలఁది ప్రసంగించుట యధిక ప్రసంగమగును. అధిక ప్రసంగమువలన శ్రోతలకు విసుగు జనించును. మీఁదుమిక్కిలి వక్త, వాచాలతకు శ్రోత విసిగి కొనును. అంతియగాదు; తాఁజెప్పఁదగిన మాటలను స్పష్టముగా సూటిగా జెప్పక యతిమాత్ర ప్రసంగమునకు లోనగుటచే నాతని మనశ్శక్తియు నశింపఁగలదు. మనశ్శక్తి నశించుటచే బుద్ధి పాటవము తఱుగును. బుద్ధిపాటవము తఱుగుటచే నారోగ్యము కుంటువడును. ఆరోగ్యము కుంటువడుటచే నాయువు క్షీణించుట కవకాశము కల్పించుట యగును.

అట్టి వాచాలుని పంచేంద్రియములు వాగెలులేని వాజులగును. ఆలోచనలు వట్టిపోయినపుడు వాచాలత గజ్జెలగుఱ్ఱమై

నాలుకపై నాట్యమాడును. కావునఁ బనికిమాలిన వాచాలత వాజ్యమై నిష్ఫలమగునని స్పష్టమగుచున్నది. మితవాగ్మియగుట మిగుల శ్రేయము. చెప్పవలసినట్టిదియుఁ జెప్పఁదగినట్టియు విషయమును స్పష్టముగాఁ గొలఁది మాటలతోఁ జెప్పుటవలన నారోగ్యము పెంపొందును. ఆరోగ్యముచే శక్తి బుద్ధులు తీక్ష ణము కలవి యగును. తన్మూలమున నాత్మశక్తి కలుగును. ఆత్మశక్తి సంపదచే మానవశక్తి యభివృద్ధి యగును. మానవ శక్తిచే లోకశ్రేయము కలుగును.

కావున, లోకశ్రేయస్సునకై పాటుపడవలసిన మానవుఁడు ఆత్మశక్తి సంపన్నుఁ డగుటకు మౌనము ముఖ్యావశ్యకమని స్పష్టమగుచున్నది. కావుననే మహర్షి పుంగవులు మౌనము దాల్చి తపస్సు చేయఁగలిగిరి.

మౌనము ను వ్రతముగా నాచరించుట మఱింత మేలు. వారమునకో పది దినములకో మౌనవ్రత మాచరించుచు, నాఁ డెట్టి మాటయు మాటాడకుండ నుండవలయును.

మౌనవ్రతాచరణముచే మానసికశక్తి వృద్ధియగునని యింతకుముందు చదువుకొంటిమిగదా! మౌనికి మనోకాలుసములు పరిశుద్ధమగును. పంచేంద్రియములు స్వాయత్తము లగును. కావున, ఎల్లరకు మౌనవ్రత మావశ్యకమగును.

# సత్యాగ్రహము

సత్యాగ్రహమన సత్యమునందు గట్టి పట్టుదల గలిగి యుండుటయని యర్థము. ఇట్టి సత్యాగ్రహమందాసక్తి మన భారతదేశమునకుఁ బూర్వమునుండియుఁ గలదు. ప్రతిమానవునకు సత్యాగ్రహ మావశ్యకమని వేఱుగాఁ జెప్ప నావశ్యకత లేదు. సత్యాగ్రహము నిరసించువా రెవరును లేరు. కాని యాచరణ యందుపయోగించువారు మిక్కిలి తక్కువ. లోకము సత్యాగ్రహ మతము (Religion) గలదియగుచో నంతకంటె వేఱేమి కావలెను?

## సత్యమును సాధించుట

సత్యాగ్రహము చేయువారు దౌర్జన్య మెచ్చటఁ దల సూపునో యచ్చటకరిగి దురాగ్రహ మెచ్చటోని యద్దానిని మొదలంట నిర్మూలింపఁ బ్రయత్నింతురు. వారలు దురాగ్రహమును (దౌర్జన్యమును) దలయెత్త నీయరు. కుటుంబమందో— ఊరియందో— దేశమందో మఱియెందైనను దౌర్జన్యము చెల రేగిన యెడల సత్యాగ్రహముచే నద్దానిని మొదలంట నశింపఁ జేయ నగును. దౌర్జన్యముచే దౌర్జన్యము నశింపదు. మీఁదు మిక్కిలి యిమవాఁకలవారు నొండొరుల కుత్తుకల నొండొరు

లుత్తరింపఁ బ్రయత్నించు కొందురు. ఇట్టివిధమున దౌర్జన్యము పెరుఁగఁగలదే కాని నశింపనేరదు. కావున దౌర్జన్యము నిర్మూలింప దౌర్జన్యమెన్నఁటికి సాధనము కానేరదు. అందుచే సత్యాగ్రహముచే దౌర్జన్యము నిర్మూలించుట యెంతేని మేలు. అన్నిటి కంటె సత్యాగ్రహము సర్వోత్తమము. సత్యాగ్రహికి నాత్మ విశ్వాసము మెండు.

దుష్టుఁడొకఁడు, తన భార్యను హింసించుచున్నాఁడను కొందము. ఆమె, కటువు మాటలచేతనో- క్రూర కార్యముల చేతనో యాతనిని దిద్దఁజూచుట నీరాడఁబోయి నీట మునుగు చందము కాఁగలదు. అగుచో నిఁక నామె యేమిచేయవలెను? బ్రతికినంత కాలము భర్త పెట్టు దుర్బాధల ననుభవింప వలసిన దేనా? యని యందురేమో! కాదు, కాదు. ఆమె తన భర్తను దూలనాడక యాతని పాదారవిందములనెల్లప్పుడును బూజింప వలయును. అంతియకాని మగఁడు మూర్ఖుఁడైనంత మాత్రమున నాతనిఁ దూలనాడిన నేమి ఫలము? తూలనాడినంత మాత్రమున నాతఁడు తిన్ననిదారికి రాఁగలఁడా? తన కాంత పలికిన కటువు మాటలచే మఱింత క్రౌర్యము కలవాఁడగును. కావున 'దెబ్బకు దెబ్బ' యని ప్రతీకారము తలపోయుట యవివేకము. ఆమె, తన భర్తవలెఁగాక యాతఁడు పెట్టు బాధలనన్నిటిని శాంత బుద్ధిని ననుభవించుచు మునుపటికంటె నధిక ప్రేమానురాగములతో నాతనిని దరియుచున్న యెడల నాతఁడు నేఁడు కాకపోయినను, మఱియొక నాఁటికైనను దన వశమునకు రాకమానఁడు. నాఁటి కిని మంచి మాటలచేఁ దన వశము కాఁడేని, సత్యాగ్రహమవ లంబించి నిరశనవ్రతమూని భర్త గుణముల మార్పఁ బ్రయత్నింప వలయును సత్యాగ్రహమవలంబించి, నిరశనవ్రత మవ

లంబించు సమయమున నాదుష్టుఁ డామెను నిర్దయుఁడై యోర్వ రాని బాధలను బెట్టినను బెట్టవచ్చును. అప్పటికి నామె చలింపక- తాల్మిని వీడక ప్రేమ పెంపున భక్త్యతిశయముతో రాగిలు చుండవలయును. ఎన్ని కష్టములు పెట్టినను పల్లెత్తి పలుచని పలుకులు పలుకరాదు.

## సత్యాగ్రహి స్వభావము

కష్టము లనుభవించుట యెన్నఁటికి వృథకానేరదు. మనము తలపెట్టు కార్య మీడేర వలయుననినఁ గష్టము లనుభ వింపవలసినదే! కష్టములు కలకాలము కాఁపురము చేయవు. కష్టసుఖములు కావటి కుండలు. కావునఁ దాల్మిని వీడుట యవి వేకము. భార్య యెన్ని కష్టములనైనను ననుభవించుచు భర్తను ప్రేమింపుచు నుండునెడ నాతఁడు మంచి నడవడికను నలవఱచు కొనఁగలఁడు. • ఆతఁడు దినక్రమమునఁ దనభార్య సాధు శీలము నకు మెచ్చి యచ్చెరువొంది వెనుకటి దుర్గుణములను నశింపఁ జేసికొని బుద్ధిమంతుఁడు కాఁగలడు. కావున నొక దుర్మార్గుని సన్మార్గునిగాఁ జేయఁదలంతు వేని యందులకు సత్యాగ్రహమే సాధనము.

## దౌర్జన్యము

స్వార్థమపేక్షించి, కార్యము సాధింప సత్యాగ్రహము పూనుట యవివేకము. ధర్మమునకు- కర్తవ్యమునకు సత్యా గ్రహము సాధనమగును గాని స్వార్థమునకుఁ గాదని యెఱుంగు నది. స్వార్థమునకు- మూర్ఖపు పట్టుదల చూపుట దౌర్జన్యమని యెఱుంగుఁడు. సత్యాగ్రహులు ధర్మమునకై తమ జీవితము

ధారవోయ సత్యాగ్రహ మవలంబింతురే కాని యధర్మమునకుఁ గాదని యెఱుంగుఁడు.

ఏకుటుంబము - ఏ గ్రామము - ఏ దేశము- ఏ రాజ్యము సత్యాగ్రహ మవలంబించునో, యా కుటుంబము- ఆ గ్రామము- ఆ దేశము- ఆ రాజ్యము ధర్మబద్ధమై తనరారఁ గలదు. రాజు క్రూరుఁడై తన రాజ్యమందుఁ గ్రూర శాసనములను ప్రవేశపెట్టు నేని ఆ రాజ్యమందలి ప్రజలు సత్యాగ్రహ మవలంబించి యా శాసనములను 'త్రోసిరాజ' నుట ధర్మము.

## భయపెట్టుట

అట్లుగాక, యొకఁడు హింసామార్గమవలంబించి తనక్రూర స్వభావముచే మఱియొకనిని భయపెట్టి యాతని యంతరాత్మ సాక్షికి విరోధముగా నాతనిని 'నడుచుకొనుమ'ని శాసించుట సత్యాగ్రహము కానేరదు. తాను అహింసాధర్మ పరాయణుఁడై కష్టముల నెన్నిటినైనను సుఖములుగా భావించి యనుభవించుచు నొక దుష్టుని సజ్జనునిగా నొనరించుట సత్యాగ్రహ మగును. సత్యాగ్రహి కష్టములమాట తలపెట్టక తాల్మిని వీడక తాను సత్యమునకై సత్యాగ్రహ మొనరింపవలయును. సత్యము నన్నగిల్లి, ధర్మము భ్రష్టమై దేశము బీభత్సమగు సమయమున సత్యాగ్రహ వ్రతమాచరించి సత్యము నెలకొల్పి ధర్మమును గునరుపఱచి, దేశమును సంరక్షింప వలయును. అహింసా ధర్మమును త్రికరణశుద్ధిని గాపాడుటకు, ధర్మసంరక్షణము కొఱకు సత్యాగ్రహి సర్వస్వము నర్పించును. అదియే యాతని ప్రతిజ్ఞా పాలనము.

## త్యాగము

సత్యాగ్రహికిఁ ద్యాగమెంతేని యవసరము. త్యాగము లేని సత్యాగ్రహము సత్యాగ్రహము కానేరదు. త్యాగ మొక్కటి యుండినఁగాని సత్యాగ్రహము సఫలము కానేరదు. త్యాగమువలన నాత్మశక్తి వర్ధిల్లును. నాత్మశక్తివలన సత్యాగ్రహము వన్నెకెక్కును. కావున సత్యాగ్రహమునకుఁ ద్యాగమావశ్యకము.

సత్యాగ్రహ మాచరించు పద్ధతులు కాలానుకూలముగ మాఱుచుండును. సత్యాగ్రహుల జీవిత చరిత్రలను దిలకించుతుమేని సత్యాగ్రహ పద్ధతులు వివిధములని బోధపడఁగలవు. సత్యాగ్రహుల జీవితము చరిత్రలనేక విధములుగా నున్నవి. ఎన్ని విధముల నెన్ని భేదములు గలవైనను అన్నింటికి సత్యము- అహింస- శాంతము- త్యాగము- తపస్సు మొదలగు ధర్మములు సత్యాగ్రహమునకు మూలములని ప్రాచీన సత్యాగ్రహుల జీవిత చరిత్రలను దిలకించుదుమేని తేటతెల్లముగా బోధపడఁగలవు.

# సత్యాగ్రహులు

ప్రపంచమందన్ని కాలములందును సత్యాగ్రహులు పుట్టుచుందురు. సత్యాగ్రహు లుండుటవలననే ప్రపంచము సత్య శౌచదయాధర్మశమ దమాది గుణములతో మనఁగలుగుచున్నది. సత్యాగ్రహులు లేనిచో శాంతిభద్రతలు లేక ప్రపంచము నాశము కాఁగలదు. మిక్కిలి యేనాఁటికైన నీ సర్వ ప్రపంచమునాశనమగుననికదా మన పెద్దలయభిప్రాయము. సత్యాగ్రహాఽఽద్ధమైదయాధర్మప్రేమానురాగములుగలిగియుండుటవలనఁ బ్రపంచము నిలువఁగలుగుచున్నది. ప్రపంచమందుఁగల దేశము లన్నింటికంటె మన భారతభూమి పుట్టిననాఁటనుండి సత్యాగ్రహమందుఁ బలుకుబడి చెల్లుబడిగల పేరెన్నికగన్న పవిత్రభూమియై విరాజిల్లుచున్నది. మన భరతఖండము ఖండఖండాంతరములందును నఖండ కీర్తిగలదియై వర్ధిల్లుటకు సత్యాగ్రహులకు జన్మభూమి యగుటయే కారణమగుచున్నది. అట్టి యీ భరతఖండమనాది నుండియు సత్యాగ్రహుల పుట్టినిల్లై యలరారుచున్నది. మన ప్రాచీనకాలమందలి మహర్షులెల్లరు సత్యాగ్రహు లనుమాట మఱువరాదు.

మన భారతదేశ ఋషిపుంగవు లెల్లరు సత్యాగ్రహమందెంతయో పేరుప్రతిష్ఠలను సంపాదించి యుండిరి. ప్రతిఫలా

పేక్షి నభిలషింప నిష్కామబుద్ధికలిగి యుండునతఁడే ఋషి. సత్యాగ్రహికూడ నిట్టివాఁడే అందుచే ఋషియే సత్యాగ్రహి; సత్యాగ్రహియేఋషి. ఋషులు సత్యాగ్రహు లగుటవలననే కాఱడవులందుశరభశార్దూలాది క్రూరజంతు సంతానాక్రాంతా రణ్య భూము లందు భయమావంతయు లేక యాకుటిండ్ల వసించి, యాకలములుదిని హాయిగా భగవత్కైంకర్యమునఁ బ్రొద్దుపుచ్చుచు నిత్యసంతుష్టచేతస్కులై, దేశకళ్యాణమునకు నెంతయో పాటుపడిరి! రాజులందు-రాణులందు-ప్రజలందు నిట్టి ప్రపంచ.కళ్యానమునకై సత్యాగ్రహు లెందఱో కలరు. ఇట్లెందరో సత్యాగ్రహులు కలిగి యుండుటచేతనే దేశము ఆధ్యాత్మికశక్తి సంపన్నమై యలరారుటకుఁ గారణమయ్యెను. సత్యాగ్రహులే లేనిచో నింతటి యాధ్యాత్మిక శక్తికలిగి దేశము లన్నింటికంటె దివ్యగుణకలితమై మన భారతదేశ మలరారఁ గలదా? పాఠకమహాశయులారా! మన ప్రాచీన సత్యాగ్రహుల చరిత్రము గొంతవఱకుఁ జదువుకొని ముందునకుఁ బోవుదము.

## మార్కండేయుఁడు

మార్కండేయమహాముని సత్యాగ్రహులలో నొకఁడు. తన మాతాపితరులకీతఁడు దైవవరప్రసాదలబ్ధుఁడు. కాని పదు నాఱేండ్లు ప్రాయము కలవాఁడు. మాతాపితరులు దైవాను గ్రహమునఁ బుట్టినబిడ్డకు సంతసించిరి. ఆ బాలుఁడు సంతత శివ పూజాధురంధరుఁడై తల్లిదండ్రుల హృదయ ముప్పొంగఁ బ్రవర్తిల్లుచుండెను. తల్లిదండ్రులు పుత్రునిభక్తిగరిమ కక్కజం పడుచు, ఝురియుచు నా బాలుని యాయువుం దలపోసి లోలోన నెంతయో కుములుచుండిరి. ఇదియంతయు మార్కండేయుఁడు

దినములు మీఁదట నెఱింగి తల్లిదండ్రుల దుఃఖమును బోఁగొట్టు వాఁడే పుత్రుఁడని యెంచి నిశ్చయించి తన తల్లి దండ్రుల దుఃఖములను నివారింపఁ దన యుల్లమున గట్టిప్రతినగై కొనెను. నాఁటినుండి శివపూజయందు వెనుకటికంటె నినుమిక్కిలి గాఢ భక్తికలిగి శివుఁబూజించుచుండెను. బాలుఁడు పెరుఁగుచున్న కొలఁది తల్లిదండ్రుల యారాటము పెల్లుబుకుచుండెను. బాలుఁడు తన తల్లి దండ్రులను నుచితముల నూఱడించుచు స్థిర చిత్తుఁడై చిత్తము శివునిమీఁదనిల్పి సేవించుచుండెను.

కాలక్రమమున, బాలునకుఁ బదియాఱవ వత్సరము ప్రవేశించెను. రానున్న తన నిర్ణీతాంత్య దినమెఱింగి శివసాన్నిధ్యముజేరి తన ప్రాణముల రక్షింప సత్యాగ్రహ మవలంబించి భక్తితాత్పర్యములు పెనఁగొన నా దేవదేవుని-ఆ పరమేశ్వరుని-ఆ వరదుని పాదారవిందములను బూజించుచుఁ దదేకధ్యాన నిమగ్నుఁడై దినములు గడుపుచుండెను. అంత గొంతకాలము చన్నంత, నిర్ణీతాంత్యదినము సమీపింప యమపురాధీశుండు పట్టపగలు ప్రయాణముచేసిన లోకులు తన్నుగాంతురేమో యను భయమునఁగాఁబోలుఁ; కారుమబ్బులచే గ్రమ్మికొని యాకసమందొక్క చుక్కయుఁ గానఁబడని యొక్క నడిరేయి మార్కండేయుని జీవములఁ గొంపోవ వాని పూజా మందిరమున కేతెంచి, ముక్కుపచ్చలారని యా ముని బాలకునిఁజూచి నిర్దయుఁడై 'ఓయీ! మార్కండేయా! నేఁటితో నీ జీవితమిఁట సమాప్తినొందె. కావున వెంటనే బయలుదేఱి నా వెంటరమ్మ'ని గద్దించి పలికెను. మార్కండేయుఁ డా మాటలఁ జెవినిబెట్టక యెప్పటియట్లే భగవంతుని నెంతయో భక్తిని గొలుచుచుండె. ఎంతపిలిచినను మార్కండేయుఁడు

మాటాడక పోవుటచేఁ గాలాతీతమగుచున్నదని తలంచి నరక సామ్రాజ్య సార్వభౌముండు తన యధికారమత్తతతోఁ గొంతెత్తి 'ఓయీ! మునిబాలకా! నీవిట్టి పట్టుదల చూపిన నేమి ఫలము? ఆలస్యమేల? మరణమాసన్నమగు సమయమున నీ పూజాపునస్కారము లెందుకు? లెమ్ము, బయలుదేఱిరమ్మ"ని హుంకరించి పలికెను.

అప్పటికిని, ఆ మునిబాలకుఁడు మైమఱచి యా సాంబుని నాలింగన మొనర్చుకొని పూజా తత్పరుఁడై యుండె. కాలుఁడు కాలయాపనమున కోర్వలేక కోపమునఁ దన కరమందలి కాల పాశముల నా మునిబాలకుని మెడకుఁ దగిలించి పట్టి యీడ్వ సాగె. ఆ యమునిపాశములం జిక్కినను జొక్కక మునిబాలుఁడు సత్యాగ్రహ వ్రత నిష్ఠాగరిష్ఠుఁడై యా పరమేశ్వరుని యాలిం గనము వీడనివాఁడై యెంతయో తమకమునఁ గాలకంఠుని పాదారవిందముల మనస్సున నిల్పి యన్యమెఱుఁగ కుండె. యముండు తన పాశములంబట్టి యీడ్వగా నాబాలునితోఁ బాటు శివలింగమును నొక్కింత జరిగెను. అంతఁ గాలరుద్రుఁడై 'యెవఁడు వాఁడు?' అని గొంతెత్తియఱచెను. పలికినంత నేయాల కించి 'ఓహో! ఈ కంఠధ్వని కాలకంఠునిది' మనమిఁక జాగు చేసితిమేని విషము మ్రింగిన చందమున నన్నును మ్రింగఁగలఁడ'ని యును మార్కండేయుని బదులు నేనై చావవలసి వచ్చును. వ్యర్థముగ నాశనము కానేల యనియును చింతించి, 'బ్రదుకు జీవుఁడా' యని వచ్చినదారిబట్టె. పిమ్మట పార్వతీప్రియుఁడు భక్తచింతామణి తన భక్తుండగు మునిబాలకుని మార్కండే యుని సత్యాగ్రహమునకు మెచ్చి, సాక్షాత్కారమిచ్చి యాలింగనమిచ్చి 'బిడ్డా! నీ సత్యాగ్రహమునకు సంతసించితి,

అంతములేని యాయువు నిచ్చితి. పోయి భక్తి పెంపున తల్లిదండ్రులను సేవించుకొమ్మని దీవించి, బుజ్జగించి, ప్రేమించి యాముని బాలుని నింటికి సాగనంపె.

చూచితిరా! సత్యాగ్రహామువలని ప్రయోజనము! ఎంతెంత కాల మెన్నెన్ని జన్మములు పూజించినను సాక్షాత్కరింపని యా పరమేశ్వరుఁడు త్రికరణశుద్ధిని సత్యాగ్రహామవలంబించినంతనే మెచ్చి, దర్శనమిచ్చి, యాలింగనమిచ్చి, కోరిన కోరికలనిచ్చి యా మునిబాలకుని బరిపూర్ణాయువు కలవానిని జేసెను.

## ప్రహ్లాదుఁడు

సత్యాగ్రహ శిరోమణియై ప్రసిద్ధికెక్కిన భక్త ప్రహ్లాదునిఁ గూర్చి నేఁడు క్రొత్తగాఁజెప్ప నావశ్యకము లేదు. ప్రహ్లాదుఁడు జననంబందినదాది హరినామ సంకీర్తనామయ జీవనుఁడు. తండ్రియందులకుఁ బ్రత్యర్థి. కావుటఁజేసి తన తనయుని, బ్రహ్లాదుని నెంతయో మందలించుచుండెను. మందలించినకొలఁది తండ్రిమాటను వినక, సత్యాగ్రహ వ్రతము మానక, హరినామ సంకీర్తనము వీడక, సదా శేషాహిశయనునిఁ బ్రార్థించుచుండె. తనయుని చేష్టలకుఁ దండ్రి సహింపఁజాలక బిడ్డను జేరఁజీరి ముద్దుబయ్యా! బాలుఁడవగుటచేఁ దెలియక, లేనివాని నొకనిని గల్పించి 'హరి హరి' యని యందువు, పూజింతువు. ఇంతకంటెఁ దెలివితక్కువ మఱెద్దియు లేదు. హరియఁట నిన్నుఁ గాపాడునఁట. ఆయ్యో! ఎంత పిచ్చివాఁడవు నాయనా! బాల్యముచే యుక్తా యుక్తముల నెఱుంగ నేరక యిట్లు ప్రలపించుచున్నాఁడవేకాని నిజమద్దికాదు. లోకు

లందఱు దేవుని 'లేఁడు లేఁడు' అని యెలుఁగెత్తి చాటుచుండ నీ వొక్కఁడవు 'కలఁడ'ని కలవరించుట తగునా? దేవుఁడెవఁడు? నాకంటె దేవుఁడు మఱియొకఁడు లేఁడు. నేనే దేవుఁడను. నేనే యీ జగత్తంతటికి నధిపతిని. కావున 'హరి' యనుట మానుము. నామాట వినుము. విననైతివేని కష్టములనుభవింతువు. కావున నాలోచించుకొమ్ము. పోయిరమ్మ"ని మందలించిపంపె. సత్యాగ్రహునికిట్టిమాటలు నమ్మకముపుట్టించునా? పిడుగులు మీఁదఁబడుచున్నను సత్యాగ్రహితన ధర్మము నాచరింప వెఱవఁడు. పూర్వమట్లు 'కమలాక్షు నర్చించుకరములు కరములు'ని పాడుచు, పాడుచుఁ దనలోఁ దానవ్వుకొనుచు శ్రీ మహావిష్ణువునిఁగూర్చి భక్తి పెంపునఁ బ్రార్థింపఁ దొడఁగె. ప్రహ్లాదుని సత్యాగ్రహ దీక్షకుఁ దండ్రి యాగ్రహోయత్త పరీతమానసుండై యొక్కనాఁటి ప్రాతఃకాలమునఁ బుత్రునిఁ బిలచి 'బిడ్డా! నీ విట్టి కంటగింపు పనులు చేసిన నే నోర్వఁజాలను సుమా! హరియందువు; భగవంతుఁడందువు, దేవుఁడందువు, నారాయణుఁ డందువు. ఈ వ్యక్తు లెవరో యేరికిఁ దెలియదు. నే నీతనినిబట్టి బంధించుటకై పడరాని పాట్లన్నియుఁ బడితి. ఆతఁ డెచ్చోటం గాన్పింపఁడు. నిజమున కాతఁడే యుండినచోఁ బట్టువడక పోవునా? ఆ దేవుని — ఆ ధూర్తుని — పట్టి బంధింప భూమిని జల్లించితిని, వెలుఁగును విరఁజిమ్మితిని, గాలిని గాలించితి, ఆకాశ మన్వేషించితిని. బిడ్డా! ఈయనంతమగు సృష్టినంతను గాలదాచితిని. బ్రహ్మాండభాండముఁ బగులగొట్టితిని. ఆ దుష్టుఁ డెందును గానరాఁడు. నిజమున కాతఁడే యుండిన వెలికి రాక మానునా? వచ్చి నా చేతులంబడి చావక మానునా? బిడ్డా! నీవా దుష్టుని నమ్మి చెడకు. ఆతఁడు లేఁడు. నా రాజ్యమందలి

ప్రజ లెల్లరు లేఁడని తలంచుచుండ నీ వొక్కఁడవు కలఁడని పలికిన నేమి ఫలము? నా మాట విని నేఁ జెప్పినట్లు నడుచు కొని మంచివాఁడవు కము! బిడ్డా! ఇక నీవా దేవుని ఆ ధూర్తుని జపింపకుము; పూజింపకుము. నన్నే దేవునిగాఁ దలంచి భక్తి పెంపునఁ గొలువుము. 'పోయి రమ్మ'ని యాజ్ఞ నిడి పంపెను.

ఈ మాటలు చెవిని బడినంతనే తండ్రి దుష్టబుద్ధికి లోలోనఁ జింతించుచు భక్తి వినయములతో, "తండ్రీ! నీ పలుకులు ములుకులవలె నున్నవి. ముల్లోకములనేలు మూల పురుషుండగు నా పురుషోత్తముని లేఁడందువే! పెద్దవయ్యు నిట్లనఁ జెల్లునా? అయ్యో! ఆ పురుషోత్తముఁడు – ఆ జగ ద్రక్షకుఁడు లేనిచో నీ జగతు త్రుటిలో నశింపదా? ఆ దేవ దేవుఁడు ఈ యనంత జీవరాసులను సృష్టించి రక్షించుచుండ నీ చర్మచక్షువులచేఁ గాంచలేక యాతనిని లేఁడనుట పాడియా? భగవంతుఁ డీ చర్మచక్షువులకుఁ గానంబడునా? ఈ చర్మ చక్షువులతో స్థూలప్రపంచమును జూడఁగలుగుదుమేకాని సూక్ష్మ ప్రపంచమును జూడఁగలమా? భగవద్దర్శనమున కీ కన్నులు పనికిరావు. ఈ కన్నులు భగవంతునిఁ జూచుట కేర్పడినవికావు. ఆ దివ్యసుందర విగ్రహుని – ఆ దేవదేవుని దర్శించుటకు వేఱొక నేత్రము మన హృదయకమలమునందుఁగలదు అది విప్పారునేని భగవంతుని యాపాదమస్తక స్వరూపము దిద్దితీర్చినట్లు కానం బడఁగలదు. ఈ నేత్ర మెల్లరిహృదయకమలమునం దున్నను నెల్ల రికి నిట్టి యద్భుతానంద జనకదృష్టి నీయఁజాలదు జ్ఞానియైన వాని కొక్కనికే యీ నేత్రమువలని ఫలము. ఈ నేత్ర మజ్ఞాన మను పొరచేఁ గప్పుకొనియుండును అజ్ఞానము నశించినఁ

ప్రకాశించును. జ్ఞానము కలిగినకొలఁది యజ్ఞానము నశించును. అప్పుడు ఆ నేత్రము దివ్యకాంతితో వే వెలుఁగు భాతి ప్రకాశించును. దీనినే జ్ఞాననేత్రమని పెద్ద లందురు. కావున భగవద్దర్శనమునకు జ్ఞాన మావశ్యకము. అందుచే భగవద్దిదృక్షు జ్ఞాననేత్రమును గాంక్షించును. చర్మచక్షువులకుఁ గాన్పింపనంత మాత్రమున నాతనిని లేఁడని తలంచుట యజ్ఞానము. ఆ సచ్చిదానంద స్వరూపుని భక్తి పెంపునఁ బ్రార్థించి, ధ్యానించి మోక్షము చేపట్టుము. దుష్ట క్రూర కార్యముల నెఱపుచు భగవన్నామ సంస్మరణయే మఱచి యజ్ఞానబుద్ధితో భగవంతుఁడు లేఁడనుచు జననమరణ సంకులంబైన యీ సంసార సాగరమందు స్థిరకాపురము సేయఁదలంపకు. మానవుఁ డిలపై జన్మించి యంతరించుపనుక భక్తి తత్పరబుద్ధిని భగవంతుని సేవించునేని జననమరణరహితమైన భగవత్సాయుజ్యమును జేరఁగలఁడు. మానవుడు తరించుట కిదియే సులభము. కావున నీవీ మార్గ మనుసరింపుము. నాయందు దయగలవాఁడవై సర్వ భూతములను నాత్మవలెఁ జూచుచు భగవంతుని సేవింపుము. ఇఁక నీ వెనుకటి గుణములు మానుము. భగవత్సేవ సేయఁ గడఁగుము. తండ్రీ! ఇదియే నా ప్రార్థన' యని తేట మాటలతోఁ బ్రహ్లాదుఁడు పలికెను.

ఈ వడుగు మాటలా వెడఁగునకు వివేకము గలిగించునా? మీఁదుమిక్కిలి కోపము కలిగించెను. అది సహజమే కదా! నిక్కము చెప్పిన లోకమునకు నిక్కు కదా! దుష్టునకు సదుపదేశము సేయఁబూనుట పామునకుఁ బాలువోయుటయే గదా! ఈ యుపదేశమునకు ఆరక్కసిఱేఁడు హిరణ్యకశిపుఁడు ఆకాశమంటిన కోపముతో "ఓయి ప్రహ్లాదా! నా కుపదేశము

చేయునంతటివాఁడవా? బిడ్డవని బుజ్జగించి చెప్పుచుండ నీకింత కండకావరమా? తుచ్ఛా! నీవు నాకడుపునఁ జెడఁబుట్టితివి. నిన్ను ముక్క ముక్కలు చేసెదను. నీవంటి తుచ్ఛునిఁ బెంచుట మహాపాపము. కావున నిన్నిప్పుడే శిక్షించెదను. చెప్పుము. హరినామసంకీర్తనము మానుదువా? లేదా?" యని కన్ను లెఱ్ఱఁజేసి గద్దింప, ప్రహ్లాదుఁడు వినయవినమితగాత్రుఁడై "తండ్రీ! నీ వెట్టి యిక్కట్టులు పెట్టినను నాకు భయములేదు. ధర్మమును ఆచరించి యితరులకు ధర్మవిశిష్టతను జెప్పుటయే సత్యాగ్రహికి ధర్మమ"ని బదులిడెను.

అందుల కాతఁడు పట్టరాని కోపమున భటులను బిలిపించి వారిచేఁ గొండలనుండి ప్రహ్లాదునిఁ బడఁద్రోయునట్లు ఆజ్ఞాపించెను. ఆ సత్యాగ్రహి కొండలనుండి క్రిందికిఁ ద్రోయఁబడినను జెక్కుచెదరక చక్కఁగా శ్రీహరిని ధ్యానించుచుండెను. ఈ వార్త భటులవలనవిని హిరణ్యకశిపుఁడు కోపోద్రేకముతో నేనుఁగులచేఁ ద్రొక్కించెను, కాల సర్పములచేఁ గఱపించెను, తుదకు విషము మ్రింగించెను. ఎన్నివిధములఁ జంపఁజూచినను ప్రహ్లాదుఁడు పరమానందముతో నన్నిబాధల ననుభవించుచుఁ బ్రదుకుచుండుటకు హిరణ్యకశిపుఁడు విసుగెత్తి ప్రహ్లాదునిజీరి "ఓరి దుష్టుఁడా! కులపాంసనుఁడా! దేవుఁడు దేవుఁడని పలువరించుచుంటివిగదా!" ఆతఁడెందుఁ గలఁడో చూపుమని ఆకసము బ్రద్దలగునట్లు గద్దించి పలికెను. అంత ప్రహ్లాదుఁడు చేతులు జోడించి భక్తి వినయములతో "తండ్రీ! శ్రీమన్నారాయణుఁ డెల్లెడలఁగలఁడు. ఆతఁడు లేనిచోటు లేదు."

మ. కలఁడంభోధి కలండు గాలి, కలఁడాకాశంబునన్, కుంభినిం
గలఁడగ్నిం, దిశలన్ బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాదులం
గలఁడోంకారమునన్ త్రిమూర్తుల, త్రిలింగంబులందంతటన్
గలఁడీశుండు కలండు తండ్రి: వెదకంగానేల యీయాయెడన్.

అని చెప్పెను. అంతట నా రాత్రించరవరేణ్యుఁడు పరిహాసించి "ఓయి పిచ్చివాఁడా! ఎందైనగలఁడందువా? అట్లైన యిందుఁగలఁడేమో చూపుమని దగ్గఱనున్న స్తంభము నొక్క దానిని కాలితోఁదన్నెను. అంత భగవంతుఁడు తన భక్తుని ప్రహ్లాదుని పెట్టుచున్న బాధలకుఁ దానోర్వఁజాలక యందుండి నృసింహ స్వరూపమున వెలువడివచ్చి యా రాక్షసరాజును సంహారించి తనభక్తుని సత్యాగ్రహ శ్రేష్ఠుని ప్రహ్లాదుని సంరక్షించెను.

ప్రహ్లాదుని సత్యాగ్రహము అపూర్వము. సత్యాగ్రహముచే సమస్త కష్టము లనుభవించియుఁ దుదకు శాశ్వత సుఖమును ప్రహ్లాదుఁడు పొందఁగలిగెను.

## హరిశ్చంద్రుఁడు

హరిశ్చంద్రుండను మహారాజు ఆడినమాట జవదాట నేరక సత్యాగ్రహ వ్రత నిష్ఠాగరిష్ఠుఁడై చతుస్సముద్ర ముద్రిత మహారాజ్యమును మాట పట్టింపున కొక్క తపోనిధి కర్పించి తన యాలుబిడ్డలనుగూడ విక్రయించుకొని తాను నొక్కని కమ్ముడువోయి కాటికాఁపరి యయ్యెఁగదా!_ అప్పటికి నాతఁడు చలింపక తన యేకైక కుమారుఁడు చనిపోయినను ధర్మము

మీ ఒక యాబిడ్డని దహనసంస్కారమున కీయఁదగిన స్మశాన శుల్కము నీయవలసినదిగాఁ దన భార్యను నిర్బంధించెఁ గదా !

ఎట్టి కడగండ్లువచ్చి మీఁదఁబడినను ఆ కడగండ్లను సంతోషపూర్వకముగా ననుభవించి సత్యమును ధర్మమును గాపాడుట సత్యాగ్రహి లక్షణముగదా !

## వ శి ష్ఠుఁ డు

విశ్వామిత్రుఁడు రాజ్యపాలనముచేయునప్పుడు కామ ధేనువును దనకీయవలసినదిగా వశిష్ఠమహర్షి ని గోరెను. అందులకా మహర్షి పుంగవుఁడు వశిష్ఠుఁడా కామధేనువు నీయ నిరాకరిం చుటచేఁ గోపస్వభావుఁడగు విశ్వామిత్రుఁడాతనితోఁ గయ్యము నకుఁగాలుదువ్వెను. ఆవిశ్వామిత్రుఁడు తన యమ్ముల పొదినుండి బాణములనుదీసి వశిష్ఠ మహర్షిపై బాణవర్షమును గురిపించెను. ఆ బాణములను దప్పించుకొనుటకు మహర్షి యెట్టి ప్రయత్న మును జేయలేదు. ఆ వశిష్ఠ మహర్షి యాత్మశక్తిముందు విశ్వా మిత్రుని మూర్ఖ దేహశక్తి యేమిచేయఁగలదు ? రాజగు విశ్వామిత్రుఁడు, వశిష్ఠ మహర్షి యాత్మశక్తిముందుఁ దన దేహశక్తి అగ్ని తప్తమగు నినుమునఁబడిన నీటిబొట్టువలె నగుటకు సిగ్గుపడి, తానును అట్టి యాత్మశక్తిని సంపాదింప సంకల్పించి సర్వము సన్యసించి తుదకు మహర్షి యాయెను. విశ్వామిత్రుఁడు ఆత్మశక్తి సంపన్నతగల మహర్షి యయిన పిమ్మట, రాజులు మహారాజులు విశ్వామిత్ర మహర్షికి దండ ప్రణామంబు లాచరింప మొదలిడిరి. దశదిశలుం దన యాజ్ఞకుఁ లోఁబడియుండునట్లు రాజ్యమేలిన దశరథుఁడు సహితము విశ్వామిత్ర మహర్షినిఁ జూచినంతనే తన సింహాసనమునుండ

దిగి, చేతులు జోడించి, యా మహర్షిని సింహాసనముసఁ గూర్చుండఁబెట్టి తాను జేతులు కట్టుకొని, నోరుకట్టుకొని యా మహర్షి యాజ్ఞలను శిరసావహించి పాలించినట్లు రామాయణము వాకొనుచున్నది.

## సీతాదేవి

లంకాధిపతియగు రాక్షసేంద్రుఁడు రావణుఁడు సకల లోకములను గాసిపెట్టుచు గర్వాంధుఁడై మాయావేషమున దండకారణ్యమునఁ బర్ణకుటీరమందొంటిదైయున్న సీత నపహరించుకొని లంకకుఁ గొంపోయి యచట నశోకవనమున నామెను గాసిపెట్టుచుఁ దన వలపునుదెలుప నప్పరమ పతివ్రతా శిరోమణి సత్యాగ్రహిణీ శిరోమణి సీతాదేవి "తులువా! కాఱుకూఁతలు కూయుట తగునా" యని మందలించి సత్యాగ్రహవ్రతమవలంబించి యష్టకష్టముల ననుభవించిన సంగతి యాబాలగోపాల మెఱుఁగునుగదా! సీతాదేవి సత్యాగ్రహవ్రత పాలనముచేఁ దన చెఱలఁ బాపుకొని భర్తయగు శ్రీరామచంద్రునిగూడి సర్వ సుఖము లనుభవించెనుగదా!

## సావిత్రీదేవి

సావిత్రీదేవి వరప్రసాదమున జన్మించిన సావిత్రీదేవి తన భర్త సత్యవంతుని మరణదిన మెఱిఁగి కట్టెలనుగొట్టుట కడవి కేగుచున్న భర్త ననుగమించి యచట పతిప్రాణములను గొని పోవుచున్న యతిలోకశక్తియుక్తుని యమధర్మరాజును దన పాతివ్రత్యమహిమచేఁగాంచి, సత్యాగ్రహముచేసి భర్త ప్రాణములను

గాపాడుకొనిన చరిత్ర భారతీయులు మఱువని పరమపవిత్ర కథయేగదా!

ఇఙ్లాండులో ప్రాచీన భారతవర్షమున స్త్రీ, పురుషులు సత్యాగ్రహ మహిమచే నేఁటికి మనకుఁ బూజ్యులై తనరారు చుండిరిగదా!

కేవలము భారతవర్షమున నేగాక ప్రపంచమందును ప్రసిద్ధికెక్కిన మహాపురుషులు సత్యాగ్రహులై యారాధింపఁ బడుట గర్వింపఁదగిన విషయము.

## బు ద్ధుఁ డు

అజ్ఞానాంధకారమునఁ దెన్నుగానక దురపిల్లు ప్రపంచము నుద్ధరించుటకై మన భారతదేశమందుఁ బుట్టిన రాకుమారుఁడు బుద్ధభగవానుని జీవితము సత్యాగ్రహమున కొటపట్టుగదా! బుద్ధభగవానుఁడు, సత్యమును దెలిసికొనవలయునను దీక్షతో రాజ్యమును త్యజించుటను సర్వప్రపంచము హర్షించుచున్నది గదా! బుద్ధుఁడు అడవికివెళ్ళి తపస్సుచేసి, ప్రాణిహింస విచ్చల విడిగాఁ జేయుచు నది ధర్మమనియును, వేదసమ్మతమనియును వాదులాడు నా కాలమున-భగవంతుని పేరిట జీవహింసచేయు చున్న యా కాలమున 'అహింసా పరమోధర్మః' యను ధర్మ ప్రబోధమును గావించి ప్రపంచమునుద్ధరించి తన మాహాత్మ్య మును, ఆత్మశక్తి సంపన్నతను విస్పష్టముగా వెల్వఱిచెను గదా! 'యజ్ఞసమయమున మేఁకను బలియీయవలదు. వలయు ననిన నాతలను బలినీయుఁడ'ని నిలువఁబడి ధర్మప్రబోధము కావిం చిన సత్యాగ్రహదేవుఁడు బ్రాహ్మణుఁడుకాఁడా? ఆ బుద్ధభగ

వానుఁడు "శక్తిచేతఁబట్టి నిన్ను ముక్కలుచేయుచున్నను, నీవు మాత్రము తాల్మిఁవీడక శాంతబుద్ధితోనుండి నిన్ను హింసించిన యాతనికెట్టి హానిని దలఁపవలద"ని ప్రపంచమునకు ధర్మము నుపదేశించెను. ఈ ధర్మోపదేశము చేయుట సత్యాగ్రహ ధర్మముకాదా! ఈ అహింసాబుద్ధిగల బుద్ధుఁడు సత్యాగ్రహియేకదా!

## సోక్రటీసు

క్రీస్తు పుట్టుకకుఁ బూర్వము ఐరోపాఖండమందు గ్రీసు దేశములో 'సోక్రటీసు' అను నొక గొప్ప మహాజ్ఞాని జన్మించెను. ఆ మహాజ్ఞాని "తన యజ్ఞాన మెఱిఁగినవాఁడే మహాజ్ఞాని" యని తన సిద్ధాంతమును బ్రజల కుద్బోధించి దేశము నభివృద్ధికిఁ దీసికొనిరాఁ బ్రయత్నించుచుండెను. ఆ మహాపురుషుని సిద్ధాంతము తమ దేశమందు వ్యాపించిన యెడలఁ దమ పలుకుబడి పోవునని సనాతన మార్గానువర్తులగు పండితులు, కవులు, రచయితలు మొదలగువారు భయపడ సాగిరి. యువకులు సోక్రటీసు సిద్ధాంతమును నమ్మి యాతని యడుగుజాడల ననుసరింప నిశ్చయించుకొనిరి. అందుచే; పండితులు, కవులు మొదలగు వారికిఁ బుండుపైఁ గారము జల్లినట్లయ్యెను. ఈతని సిద్ధాంతము దేశమునఁ బ్రాఁకినచో యువకులతోఁబాటు, బడులందుఁ జదువుకొను బాలబాలికలు సహితము చెడిపోఁగలరనియు, తన్మూలమున దేశభవిష్యత్తే పాడుగుననియుఁ దలపోసి, యొక క్రొత్త మోసమును సృష్టించి న్యాయస్థానమందాతనిపై వ్యవహారము నడపిరి. న్యాయస్థానమందు సోక్రటీసు మహాశయుఁడు సత్యమును వెలువరించెను; కాని 'కోర్టు' వారి తీర్పు సోక్రటీసుకుఁ బ్రతికూలమయ్యెను. అందులకాతఁడు క్షమా

పణ చెప్పుకొనఁ దలఁచలేదు; దేశమువిడిచి యితరదేశములకుఁ దలదాఁచుకొనుటకై పారిపోవఁ దలఁచలేదు; ఆ తీర్పునకు భయపడి యాతఁడెట్టి ప్రయత్నమును జేయలేదు; తన యనుచరులను నూడఁగట్టుకొని యెదుర్కొనఁ దలఁచలేదు. ఆతఁడు తాను గ్రహించిన సత్యమందే మనస్సు నిలుపుకొని న్యాయస్థానము వారి తీర్పు ప్రకారము విషము త్రాగి మరణించుటకే సంతుష్టస్వాంతముతో నుండెను. సత్యాగ్రహులు తమ ప్రాణమును సత్యమునకై ధారవోయుటకు వెనుదీయరుగదా! దేహమునుండి ప్రాణము వేఱగుటను సోక్రటీసు మహాశయుఁడు కష్టముగా భావింపలేదు. సోక్రటీసు, కోర్టువారి తీర్పు ప్రకారము విషము త్రాగి సత్యాగ్రహమహిమను బ్రపంచమునకుఁజాటి కీర్తి మూర్తి యయ్యెను.

## ఏసుక్రీస్తు

ఈ మహనీయుని యనంతరము సత్యాగ్రహ దైవముగా ఏసుక్రీస్తు ప్రభువు లోకమందు ఆత్మశక్తి మాహాత్మ్యమును బోధింపఁ గలిగెను. ఏసుక్రీస్తు జీవితమంతయు సత్యాగ్రహ జీవితమే యగును. ఏసు ప్రభువునకు సత్యాగ్రహ లక్షణములన్నియు సంపూర్ణముగా నున్నవని యీ మహనీయుని జీవితము వలన స్పష్టము కాఁగలదు. "తన ప్రాణమువలె నితర ప్రాణములను భావింపుఁడ"ను మహాధర్మమును ఏసు ప్రభువు తెలుపుటయే గాక, ఆ మహా ధర్మము నాచరణ పూర్వముగా లోకమునకుఁ జూపిన మహామహిమాన్వితుఁడు. క్రీస్తు ప్రభువు. "పరలోక రాజ్య" సత్యములను ఇహలోక ప్రమాణములతో సమర్థించెను. ఏసు ప్రభువు, రాజద్రోహకర ప్రసంగములు చేయుచు, కలహములు పేరేపించుచున్నాఁడని కపట బుద్ధితో దొంగ గురువులు,

ధూర్త రాజులును ఏసుమీఁద నేరములు మోపుచు తప్పుడు ప్రచారము చేయ మొదలిడిరి. తుదకు ఏసు ప్రభువును జంపుటకు నిశ్చయించి, ఏసు ప్రభువు ఒకనాఁడు కన్నులపండువుగా నున్న పూఁదోటలో తదేకాయత్త చిత్తముతో సమయము మఱచి భగవంతుని ధ్యానమందు నిమగ్నమైయుండఁగా, గొంపెలు దుష్టులు కఱ్ఱలు కత్తులతో నచటికిఁబోయి ప్రభువును బట్టుకొనిరి. అప్పుడా మహనీయుని చెంతనున్న 'పేతురు' అను శిష్యుఁడు క్రౌర్యముతో కత్తిని దూసి యా ధూర్తుల నాయకుని యనుయాయియైన 'మల్కాసు' అను వానిని చావమోద దలఁచి కుడి చెవిని గోసివేసెను. శాంతమూర్తి ఏసు ప్రభువు పేతురునిఁ జూచి "నీ కత్తిని పాఱవేయుము. కత్తినెత్తినవాఁడు కత్తితో మరణించు" నని యహింసా ధర్మమహిమను జెప్పి 'మల్కాసు' చెవిని నయము చేసెను. "కత్తినెత్తినవాఁడు కత్తితో మరణించు"ను మహాధర్మ సూక్ష్మముగల సత్యాగ్రహ లక్ష్యమునకుఁ దగిన మాట. "మనుష్యుఁడు దేనిని నమ్ముచున్నాఁడో అదియే చంపును" ని యేసుప్రభువు వేఱొక తావునఁ జెప్పినదియు నిచటను సరిపోవును. హింసచే హింస పెరుఁగును తప్ప మఱేమియుఁ గాఁజాలదు. లోకమందు హింసా పద్ధతి నానాఁటికిఁ బెరిఁగి తుదకు రాజులవశమైలోకమును బాధించుచున్నది. హింస పెరిఁగి పెరిఁగి యుద్ధములుగా మాఱి లోకము యుద్ధమయమగుచున్నది. ఆ యుద్ధములు జరుగకుండ నణచుటకు సత్యాగ్రహ మావశ్యకము. ఏసుప్రభువు సత్యాగ్రహ ధర్మమును దన జీవితాంతవఱకుఁ గాపాడుకొనెను. ఏసుప్రభువు తనను బట్టుకొనుటకు వచ్చిన వారినిఁ జూచి "పెద్దలారా! హత్యా నేరస్థుని బంధించుటకు కఱ్ఱలు, కత్తులు మొదలగు నాయుధములతో వచ్చినట్లు నా కడకు వచ్చితిరి. నేను ప్రతి దినము చర్చి

యందు మీ యందఱియొద్ద మాటాడుచునే యుంటిని. అట్టి సమయములలో నన్ను బట్టుకొనలేదు. ఇది మీ కాలము, రాజ్యము" నెను. పిమ్మట, నా ప్రభువును బట్టుకొని యీడ్చుకొని వెళ్ళి హింసించి హింసించి వదలిపెట్టిరి. ఆ మూర్ఖులు ఆ యేసుప్రభువుమీఁద నుమిసిరి, కన్నులు పొడిచిరి, నెత్తిని మోదిరి. తలనుండి నెత్తురు కారుటను జూచి యా మూర్ఖు లానందించిరి. ఎంత ఘోరకృత్యము? ప్రేమమూర్తి యయిన యా యేసుప్రభువు కొంచెమైనను కోపము చెందెనా? లేదు. "కుడి చెంపను గొట్టిన యెడమ చెంపను జూపుఁడ"ని బోధించిన మహాపురుషుఁడు కోపము వహించునా? శాంతమూర్తియగు ఏసుప్రభువుకొంచెమైనను మనస్సున బాధపడలేదు. కొంచెమైనను కోపము వహింపలేదు. దేహసౌఖ్య సంసక్తులును మూర్ఖబుద్ధులును కోపముతో క్రూరకృత్యములు చేయఁదలఁతురు. సత్యాగ్రహియాపనులు చేయఁగలఁడా? మూర్ఖులు ఏసుప్రభువును సిలువమీఁద నెక్కించి చేతులందు కాళ్ళయందు మేకులుకొట్టిరి. అయ్యయ్యో! ఎంత పాపము? ఎట్టి దృశ్యము? సిలువమీఁదఁ గొట్టినప్పుడును నా ప్రభువు హృదయమునఁ గోపమే కానరాదయ్యెను; ప్రత్యపకారము చేయు తలంపుగూడ నా మహానీయునికిఁ గలుగలేదు. అట్టి సమయమున 'ఓ తండ్రీ! (భగవంతుఁడా!) వీర లేమి చేయుచున్నదియు, వీ రెఱుఁగక యున్నారు. వీరిని మన్నింపుఁడ'ని దయార్ద్ర హృదయముతో దేవునిఁ బ్రార్థించిన యొక సత్యాగ్రహిని ఈలోకము చూచియు నింకను ఆసత్యాగ్రహమును పెంపొందింపకుండుట గొప్పవింతయే!

## మహమ్మదు

అరేబియా దేశమందవతరించిన మహమ్మదు ప్రవక్తయుఁ, దన జీవితమందుఁ బెక్కు కష్టములకు గుఱియయ్యెను. ఆ మహనీయుఁడును దనను గష్టపెట్టినవారికిఁ గీడు తలఁపక వారిని ధర్మ నిరతులనుగాఁ జేయుటకుఁ బ్రయత్నించెను. మహమ్మదు జీవితమును సత్యాగ్రహమున కాదర్శమై పవిత్రమై యొప్పుచున్నది.

ఇట్లు, ఆదినుండియు స్త్రీ పురుషులును సత్యాగ్రహమాచరించి పావనులై ప్రపంచమునఁ బూజ్యతకెక్కిరి.

## తెలుఁగు సత్యాగ్రహులు

మన తెలుఁగుభూమియందును సత్యాగ్రహులు కొందఱు గలరు. వారినిగూర్చి చదువుకొనుట మన కావశ్యకముగదా!

## పోతన

పోతన మహాకవి; మహా భక్తుఁడు. ఆతఁడు వ్యాస భాగవతము నాంధ్రీకరించెను. ఈతని కవితయందు భక్తిభావము వెల్లి విరియుచుండును. అందుచేతనే యీతని పద్యములు తెలుఁగువారు నోటఁ బట్టకుండ నుండలేదు. ఈతని భాగవతము తెలుఁగువారియింటింట నేఁటికిఁ బూజింపఁబడుచు నిత్యపారాయణ మందుచుఁ బ్రణామముల నందుకొని యత్యంత భక్తిభావమునఁ బూజింపఁబడుచున్నది.

అట్టి మహనీయ భక్తిభావముతోఁ వ్రాయఁబడిన గ్రంథము మాంధ్రలోకమున మఱియొందు కానరాదు. ఈతని భాగవత గ్రంథ ప్రాశస్త్యమును కవిసార్వభౌమ శ్రీనాథుని

ముఖమున సర్వజ్ఞసింగమహీపాలుఁ డెఱింగెను. ఎఱిఁగి తనకా గ్రంథ మంకితమిచ్చునట్లు శ్రీనాథుని ముఖమున పోతన మహా కవికి ఆజ్ఞల నందించెను. అందుకు సర్వజ్ఞసింగ మహీకాంతుఁ డష్టైశ్వర్యముల నిచ్చెదనని యాసఁగొల్పినాఁడు. అంత మాత్ర ముననే సత్యాగ్రహి తన ధర్మమును గోల్పోవునా ? తన కంకిత మీయకపోయినచో శిక్షించెదననియుఁ బోతనను బెదిరించెను. బెదరింపులకు సత్యాగ్రహి లొంగునా ? ఎన్నివిధముల రాజు కోరినను దన కావ్యకన్యను నరకర్త్రగహణము గావింప నీయక భక్తిభావముసఁ దన యిష్టదైవమగు శ్రీరామచంద్రున కంకితమిచ్చెను.

ఉ. బాలరసాలసాల నవ పల్లవ కోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁ గూడు భుజించుట కంటె సత్కవుల్
హాలికులైననేమి? గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైననేమి? నిజదార సుతోదర పోషణార్థమై.

(భాగవతము)

అని శపథముతో శ్రీరామచంద్రుని కంకితమీయ సంకల్పించి తాను భౌతిక కష్టముల ననుభవించుటకు నిశ్చయించుకొనెను. నిశ్చయించుకొని మోఁకరించి శ్రీరాముని బ్రార్థించెను. ఇంత నేమి ? ఆతఁడు భక్తుని కభయమిచ్చెను. సత్యాగ్రహుని, సచ్చిదానందమూర్తి కాఁచుకొని యుండుసుగదా !

తన ధర్మము నెఱవేర్చలేఁడేమోయను సందేహముతో నాఁటి రేయి సరస్వతీదేవి పోతనకుఁ గలలోఁ గాన్పించి

దుఃఖించెను. అందులకా సత్యాగ్రహి తన శపథమును త్రికరణ శుద్ధిగా నిట్లు వ్రాక్రుచ్చెను.

ఉ. "కాటుక కంటినీరు చను కట్టుపయింబడ నేలయేడ్చెదో
కైటభ దైత్యమర్దనుని గాదిలికోడల! 'యో మదంబ!' యో
హాటక గర్భురాణి! నిను నాఁకటికిం గొనిపోయి యల్ల
కర్ణాట కిరాటకీచకుల కమ్మఁ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!"

ఇట్లు, తన ధర్మమును నిర్వహించి ఆంధ్ర కవితాప్రపంచమున నజరామరకీర్తి నార్జించి జీవన్ముక్తుఁ డయ్యెను. సత్యాగ్రహ ధర్మావలంబి పొందని దేమికలదు?

## గోపన్న

తెలుఁగు దేశమునంతను దన భక్తి మహిమతో నోలలాడించి, తాను ప్రతిష్ఠచేసిన భద్రాద్రి రామునకు నెలవేర్పఱచి దానిని భారత దేశమందెల్ల పవిత్ర పుణ్యక్షేత్రముగాఁ బ్రశంసల నందుకొనఁజేసిన మహనీయుఁడు కంచర్ల గోపన్నను నెఱుఁగనివా రుండరనుట యత్యుక్తి కానేరదు.

గోపన్న 'తహశ్శీలుదారు'గా నైజాము ప్రభుత్వమున నుండుచు, భద్రాద్రి యను గ్రామ సమీపమున పావనగోదావరీ తీరమందుఁదాను శ్రీరామ దేవాలయమును గట్టించెను. ఆదేవాలయ నిర్మాణములో తన ద్రవ్యమునంతను వినియోగించి, తుదకుఁ బ్రభుత్వ ధనమునుగూడ వినియోగించెను. అందులకు నైజాము ప్రభుత్వమువారు రామభక్తుఁడగు గోపన్నను దమకీయవలసిన ధనము నీయవలసినదని యొత్తిడి పెట్టిరి. పాపమా

తఁడేమి చేయఁగలఁడు? తుదకుఁ బ్రభుత్వము, గోపన్న మీఁద నేరము మోపి యేఁడుదినములలో ధనమీయవలయుననియు, లేనిచోఁ, దలదీయఁబడుననియు శిక్ష చెప్పి చెఱయందుంచిరి.

సత్యాగ్రహియగు గోపన్న చెఱునగవునఁ గారాగృహము ప్రవేశించి యచట శ్రీరాముని గూర్చి ధ్యానించుచుండెను. ఇట్లు ఒకటి - రెండు - మూఁడు దినములు జరుగుచు వచ్చుచుండెను. పాప మా సత్యాగ్రహికిఁ 'జిల్లిగవ్వ' చేతఁబడునను నాశ లేకపోవుచుండెను. మీఁదుమిక్కిలి తనకు ఉరిదీయు దినము దగ్గఱపడుచుండెను. ఆ సత్యాగ్రహి యేమి చేయఁగలఁడు? "రామా! ఇంత యన్యాయమా? నీ కొఱకై గదా! యింత ద్రవ్యము వ్యయపఱచితిని. సీతాపతీ! ఇదినీకుఁ దగునటయ్యా! దీనులబాధల నివారించుదువని తలఁచి, భక్తుల కోరిక లీడేర్తువని తలఁచి, భక్తి పెంపున నీకు దేవాలయమును గట్టించితినిగదా! స్వామీ! నీవిఁక నా ద్రవ్యమీయక పోయిన నా తలఁ దీయఁబడుట నిక్కముగదా! రామా! రఘుకుల సోమా! ఇది నీవు చేయఁదగిన పనియా? భక్తమందార! ఆశ్రిత రక్షకా! భక్తులను గాపాడుదువందురే! ఏదీ నీ భక్తజన రక్షణ! నిన్ను నమ్మి నీవేమో నన్నుద్ధరింతువని గంపెడాసతో గుడి కట్టించితినిగదా! రామా! నన్ను గనికరింపవా? దేవా! ఎందుకు స్వామీ! ఎన్ని పర్యాయములు మొఱలిడుచున్నను మాటాడవు? రామా! నీ వింతవాఁడ వనుకొనలేదు.

తల్లీ! సీతమ్మా! నీవైన నను జెప్పి వినిపింపఁజేయుమమ్మా! తల్లీ! ముల్లోకములనేలు తల్లి విగదమ్మా! మాతల్లీ! మీయిదఱి మీఁదఁగల భక్తి పెంపున మీ యిద్దఱికి గుడి

కట్టించితిని గదమ్మా! నీకు రత్నాల హారము చేయిస్తిని. చింతాకు పతకంబు చేయిస్తిని. ఇన్ని నగలు చేయించినందుల కైనను మా రామయ్య తండ్రికిఁ జెప్పవచ్చును గదమ్మా! మా తల్లీ! చెప్పుము, చెప్పుమనుచు నాతఁడు సత్యాగ్రహ దీక్షతో సీతారాములను ధ్యానించుచుండెను. పాప మెంత వేఁడి నను ఆ భక్తమందారుని – ఆశ్రిత పోషకుని హృదయము కరుగదాయెను.

పాపము, రామదాసగు గోపన్నకు గడువు దినము సమీపించుచుండెను. అప్పటికి నాతని చేతియందు 'ఎఱ్ఱనికాసు' కానరాదయ్యె.

రామా! ఇది తగునటయ్యా! శ్రీరామచంద్రా! నన్ను బరీక్షింపఁ దలఁచితివా? ఏమి పలుకరావు రామా! సీతారామా! ఏమి? ఇంత కఠిన హృదయుఁడవు? ఎంత పొరఁబడితి నయ్యా! నీవు భక్తమందారుఁడవని నమ్మి మోసపోయితిని. తెలియక మోసపోతిని. నిన్ను నమ్మినవారెవరు దరిఁజేరిరయ్యా! స్వామీ!

నిన్ను నమ్మిన కరిరాజు పెక్కువేలేండ్లు మకరికిఁ జిక్కి చిక్కి "లావొక్కింతయులేక, ధైర్యము విలోలంబై ప్రాణంబులున్ ఠావుల్ దప్పి తనువున్ డస్సి" యలమటించలేదా?

నీ యడుగులకుమడుగులొత్తు పాండవులడవులఁబడి యగచాట్లు అనుభవింపలేదా? 'అన్నా' యనినోరారఁ బలుకరించు ద్రౌపదీదేవి నిండు పేరోలగములో మానభంగమునకు గురి కాలేదా? నిన్ను నమ్మి బాగుపడినదెవరు? స్వామీ! రామా! రఘుకులసోమా! నామీఁదఁ గోపమా? ఇంతకు; కరినిగాచిన కారుణ్య

మూర్తీ! పాండవులఁ బాలించిన పావనమూర్తీ! నన్నుఁ గాపాడ రావా? నా మొఱలాలకింపవా? యనుచు. 'నీలమేఘశ్యామా! రామా! నిన్నే నమ్మితిరామా!, యని యాలాపించుచు నట్లే నిద్రావశుఁడయ్యెను.

ఇఁటునిట్లుండ; నా యర్ధరాత్రి నైజాము ప్రభువునకు స్వప్నమున సాక్షాత్కరించి శ్రీరామలక్ష్మణులు రామదాసుతీయ వలసిన పైకము మొత్తమునిచ్చియదృశ్యులైరి. అందులకుమహా మ్మదీయ ప్రభువరేణ్యుఁడు పరమానందముతోఁ దనకు రామ లక్ష్మణులు గన్పించినందులకు ధన్యుఁడనైతినని గర్వించుచు రామదాసును చెఱనుండి విడిపించెను.

ఆహా! రామదాసు సత్యాగ్రహమెంత దొడ్డదియో గమ నింపుఁడు. దేవదేవుని శ్రీరామచంద్రుని ప్రేమతో - భక్తితో ధ్యానించి, ధ్యానించి ఫలసిద్ధిని బొందఁగలిగెను.. చూచితిరా! సత్యాగ్రహఫల మమోఘమనుట కింతకంటె నిదర్శనమేమి కావలెను ?

ఇట్లే కన్నఁడు-తిన్నఁడు మొదలగు తెలుఁగు సత్యాగ్రహు లెందఱో కలరు. వారినందఱి నిఁట వివరించుటకు గ్రంథవిస్తర భీతిచే విరమించు చున్నాఁడను.

## నేఁటి సత్యాగ్రహులు

ప్రస్తుత కాలమందును సత్యాగ్రహులు పెక్క- దేశ ములందుఁ గలరు. టాలుస్టాయ్, టోరీ, మాక్స్వీను మొదలగు మిత్రులపేర్లు జ్ఞాపకమునకు వచ్చును. కాని, వీరందఱు మగొప్పగా జ్ఞానమార్గమున నాత్మశక్తిని సంపాదించిన సత్యాగ్రహులు

కారని నా యభిప్రాయము. వీరు పాండిత్య ప్రకర్షమున గ్రంథ రచన గావించుచు, సత్యాగ్రహ ధర్మమును బోధించుచు వచ్చిరని మా యభిప్రాయము.

సత్యాగ్రహము మానవజీవితౌన్నత్యమునకు మూలము. ప్రపంచమందలి మతముల నన్నిటిని బరామర్శించి చూచిన యెడల, ఆ మతముల సారాంశము సత్యాగ్రహ ధర్మాచరణ మని బోధపడఁగలదు. మానవ జీవితమును సద్ధర్మమార్గమున నడుపుటకు మూలకందము ప్రకృతి సిద్ధమైన సత్యాగ్రహ మని స్పష్టము కాఁగలదు. సత్యాగ్రహము ప్రేమ, త్యాగము, శాంతము, ఉపకారము మొదలగు ధర్మములు గలది యగుటచే, నది మానవ జీవిత చరితార్థతకు ముఖ్యమైనది.

# సన్న్యాసము

సత్యాగ్రహము మానవుని సద్ధర్మపథమున నడిపించి, తుదకు నాతనిని సన్న్యాసినిగాఁ జేయును. సన్న్యసించినవాఁడు మానవ జీవితపు టెల్లలను గాంచిన వాఁడగును. మానవ జీవిత చరమ లక్ష్యమే సన్న్యాసము. సన్న్యాసికానివాఁడు మానవ జీవిత లక్ష్యమును సాధింపని వాఁడగును. "సన్న్యాసి లోకమున నుపయోగించువాఁడు; మాటాడువాఁడు; ఉన్న తాశయములు కలవాఁడు కాఁడ"ని కొందఱు తలఁచుచుందురు. వంచకులు కొందరు, సన్న్యాస వేషధారులై సన్న్యాసులవలె నటించుచు శీలము లేనివారై లోకమును మోసగించుచున్నందువలన సన్న్యాసము మీఁద లోకమున కేవగింపు కలుగుటకుఁ గారణమగు చున్నది. నేఁటి కాలమున దాసీ దేవదాసీ పదములు నామమాత్రా వశిష్ట ములై అర్థరహితములై యున్నట్లు సన్న్యాస పదముగూడ నర్థ రహితమై నిరర్థక మగుచున్నది.

సన్న్యాసము లోకాతీతమైనది గాదు; లోకమున నుపయో గింపనిదియు గాదు. ఆ తురీయాశ్రమము లోకమునకు మిక్కిలి యుపయోగ పడుననుటలో నెట్టి సందేహము లేదు. కామ క్రోధాది దుర్గుణములచేఁ బీడింపఁబడుచు నితరులను బాధించు

వానికంటె, సద్గుణ నిలయుఁడై ధర్మనిరతుఁడై, లోకమునకు సద్బోధలు సేయుచు సేవచేయువాఁడు ప్రపంచమునకెంత మార్గదర్శియగునో వేఱే చెప్పవలయునా? చెడ్డవానికి లోకము సంగతి పట్టునా? ఆతఁడు, తనలోక జీవితమునకుఁ గట్టుఁబడియుండి నశించును. సన్యాసి, తన జీవితమును లోకసేవయందుపయోగించి ఫలింపజేయును. ఆతఁడు "లోకవాసనకులోనై మరిపిల్లు ప్రాణులఁజూచి యొకనిమేషమేనియు, మనోవాక్కాయములతో సహింపజాలఁడు. తెలిసియో తెలియకయో పూర్వజన్మ పరిపాకము వలననో బాధపడు లోకమును రక్షించుటయే ధర్మము"ని యాతఁడు పరమాశయముతో నుండును.

ఎవఁడు సన్యాసి?

ఇది యిట్లుండ, ప్రపంచమును విడిచి యడవులకేగినవాఁడే సన్యాసియని యెట్లు చెప్పఁగలవు? అయితే, సన్యాసి యెవఁడు? లోకజీవితము నడుపుకొనుచు, తనయందలి దుర్గుణములను త్యజించినవాఁడే సన్యాసి. మానవత్వము నశింపఁజేయు దుర్గుణములను సర్వసంగ పరిత్యాగము చేసినవాఁడే సన్యాసి; సద్గుణములకాటపట్టైన వాఁడే సన్యాసియని స్థూలముగఁ జెప్పవచ్చును. సన్యాసి యేమతమువాఁడైన నేమి? ఏ దేశము వాఁడైన నేమి? లోకోద్ధరణకుఁ బూనుకొనువానికి జాతి మత దేశ భేదములతో నిమిత్తమేమి? జనకుఁడు మహాయోగి కాలేదా? మానవుఁడు పుట్టి పెరిఁగి మాటాడుట, ఆలోచించుట జీవించుటయు నెందులకు? సన్యాసికాని వానిజీవితము రాణకెక్కదు. మానవ జీవిత చరమ లక్ష్యమే సన్యాస యోగము.

సన్న్యాస మనఁగాఁ దనకనికాక యితరులను సరిదిద్దుచు లోక సేవ చేయుటయని భావము.

ఈ మహాయోగ సాధనమగు సత్యాగ్రహము మానవ జీవితమున కెంతవఱ కుపయోగించునదియో తెలిసికొన వల యును. మానవ జీవిత సాఫల్యమునకు సాధనమగు సత్యా గ్రహ ధర్మమాచరించువారు నేఁటి కాలమందును గొందఱు ఆకుచాటున నెండవలె నచ్చటచ్చటఁ గలరు. వారిలో నొకరిని లోక మెఱిఁగి యున్నది.

# గాంధి మహాత్ముఁడు

సంయమినమ్ మహాత్మానమ్, సత్యాఽహింసైకజీవనమ్,

కస్తూరీబా మనోనాథమ్, గాంధిదేవ ముపాస్మహే॥

# ఆ శం స

భవ్యంబై తనరారెడు
దివ్యంబగు గాంధిదేవు తేజోమహిమన్,
నవ్యంబుగ వెలయించెడి
శవ్యంబిది నూరిలోక సంస్తుత మగుతన్॥

# గాంధి మహాత్ముఁడు

లోకమెఱిఁగిన యీ మహాపురుషుఁ డొక్కఁ డెవఁడు? ఆతఁడే ఉత్తమ పురుషుఁడు; పురుషోత్తముఁడునగు శ్రీమోహన్‌దాసు కరమ్‌చందుగాంధి. ప్రపంచ మాతనిని 'మహాత్మాగాంధి' 'బాపూజీ' "ఉపవాసగాంధి" 'దరిద్రనారాయణుఁడ'ని వేనోళ్ళఁ బ్రశంసించుచున్నది. అందు ఆంధ్రులు 'గాంధి మహాత్ముఁడ'ని భక్తి తాత్పర్యములతోఁ బిలుచుచుందురు.

## కొన్ని మహాత్ముని మార్గములు

ప్రాచీన మహాపురుషులతో మన గాంధిమహాత్ముని బోల్చి చూచెదమేని, వారియందందఱికంటె మన మహాత్ముఁడు నిజముగా మహాత్ముఁడగుటనిక్కము. గుణమందు, వర్తనమందు, సచ్ఛీలమందు, ఔదార్యమందు, సకల సద్గుణములందు మహాత్ముఁడు అసమానుఁడు. ఆతనికి అహింస వ్రతము; శాంతము భూషణము; త్యాగము సంపత్తు; సేవాధర్మము వృత్తి. తన సుగుణ సంపత్తికి గర్వపడక యుండుట యాతని మహత్త్వము. ఆతని శరీరము సామాన్య మానవుని శరీరమును బోలియున్నను, ఆతని హృదయము సదా భగవల్లగ్నమై యుండును. ఆతని యాకారమును దిలకింతుమేని మేను పులకరించును. ఆతని

యడుగు జాడల నడుచుకొందుమేని అనరాని వినరాని తలఁప రాని యానందమున మన హృదయముప్పొంగు చుండును. ఆ దివ్యమంగళ విగ్రహుని గన్నులారఁ గాంచుట, మహా భాగ్యము. ఆతని దివ్యనామామృతమును గ్రోలుదుమేని జన్మ రాహిత్యము నిక్కము. మనలను మన మహాత్ముఁడు తరింపఁ జేయుట కవతరించినాఁడనుట తథ్యము.

"కోమటై పుట్టితేనేమి మా గాంధి
కొల్లాయి గట్టితేనేమి మా గాంధి"

నిజమునకు మహాత్ముని దివ్య చరిత్రమును వ్రాయ నుంకించుట, యెంతేని కష్టసాధ్యము. అయినను మహాత్ముని యందలి భక్తిభావ శబలతచే నేనీ గ్రంథము వ్రాయఁ బూనుట నా శక్తి సామర్థ్యముల నెఱుంగనేరక నే నిట్లు రచింపఁ బూనుకొనుచున్న నా పూనికను ఆంధ్రమహాశయులు మన్నింతురు గాత!!!

మన యదృష్ట ఫలము పండి ఫలించుటచే నేఁటికి దాదాపు రెండువేల సంవత్సరములనుండి యుద్భవింపని గాంధి మహాత్ముని ముఖమున నొక్క దివ్యజ్యోతి మన భారతదేశమం దుద్భవించెను. ఆ దివ్యజ్యోతి సకల ప్రపంచ వ్యాప్తమై, అస దృశాసవద్య తేజోరాశియై, తూర్పుకొండమీఁద నుదయభానుని వలెఁ బ్రకాశించు చున్నది. దర్శనమాత్రమున నానందకరమైన యాదివ్య జ్యోతిని గన్నులారఁ గాంచిన ముహూర్తమునకే మోక్షము పడయఁ గలమనుట తథ్యము. ఆ చిన్న శరీరమందలి సొబగు నేమని చెప్పఁగలము? ఆ మాహాత్మ్యమేమో కాని యెన్నఁడో

యొకనాఁడు మహాత్ముని జూచినంత మాత్రమున నేఁటికి నా శరీరము తలఁచుకొని నప్పుడెల్లఁ బులకితమగు చుండును. మహాత్ముని మహిమాతిశయమును విప్పిచెప్పఁగల సామర్థ్య మీ ప్రపంచమున నేరికిఁ గలదు? తేజో విశాలుఁడైన శ్రీ గాంధి మహాత్ముని జీవితము మానవజీవిత మార్గమున దివ్యజ్యోతి. అట్టి మహాత్ముఁడు మానవుఁడగుటకుఁగల కారణములను గొంత వఱకుఁ జవిచూచుటకుఁ బ్రయత్నింతము.

# జననము

లోకమునఁ బుట్టుట సుఖమా? దుఃఖమా? సుఖమని కొందఱు; దుఃఖమని కొందఱు భావింతురు. జన్మమెత్తుట సుఖమనియే నా తలంపు. నన్ను నే నెఱుఁగని నేను ఈ యపూర్వ దేహము ధరించిన పిమ్మటనేగదా యిది మంచి యిది చెడుగు నని తెలిసికొను జీవితము ననుభవించుచుంటిని. అట్టి యీ జన్మమెత్తుట నెట్లు దుఃఖమని చెప్పఁగలము? "నేనే సర్వము"ని గదా!

లోకమందు జన్మమెత్తి తనకొఱకై తాను జీవించువాఁడు దుఃఖభాజనుఁడు కాఁగలఁడు. ఆతనికి జన్మము దుఃఖముగానే తోఁచును. ఇతరుల మేలు కొఱకు జీవించువాఁడు జన్మమెత్తుట సుఖముగానే భావించును.

## మాతృగౌరవము

లోకమందు జన్మ మెత్తని దెవరు? లోకమునఁబుట్టి, లోకసేవ యొనర్చి దైవసములైనవారు, సర్వసమర్థులయిన తపోవంతులు, ప్రకృతి సౌందర్యము నుపాసించి, ప్రకృతి దేవత నారాధించి, సర్వము గ్రహించిన పండితులు, ఒమబాధ్యత నెఱిఁగి

పాలించిన రాజులు, మహారాజులుయుద్ధవీరులు మొదలగువారు తల్లి గర్భమునుండి పుట్టిన మానవ సంఘీయులే. తల్లి గర్భము నుండి పుట్టని వాఁడెవఁడు? అట్టి మాతృప్రేమ కాధార భూత మగు స్త్రీలోకము వర్థిల్లుఁ గాక వర్థిల్లుఁగాక!

మహోన్నత ప్రమును బోలియున్న మన భారతదేశమందు మహాజ్యోతియై యలరారుచున్న మన మహాత్మాగాంధియును దల్లికడుపునఁ బుట్టినవాఁడే! తేజోవిశాలుఁడై సర్వంసహా చక్ర మును దన దివ్య జ్యోతిచేఁ బ్రకాశింపఁజేయు మహాత్ముని గనిన తల్లి చేసిన తపమెట్టిదో! జగత్తు నంతలి యంధకారమును రూపు మాప సూర్యుఁడుదయించు పగిది, నేఁటి మానవాళి యజ్ఞాన మును బ్రోద్రోల నుదయమంది జ్ఞాన భాస్కరుఁడు మన గాంధి మహాత్ముఁడు.

ధర్మము నశించి యధర్మ మభివృద్ధి యగునప్పుడు మానవరూపమునఁ బుట్టి ధర్మ రక్షణము గావించుట భగవద్ధ ర్మము. ఆమాటనే శ్రీకృష్ణ భగవానుఁడు,

"యదాయదాహి ధర్మస్యగ్లాని ర్భవతి భారత!

అభ్యుత్థాన మధర్మస్య, తదాత్మానం సృజామ్యహమ్."

గీతయందు నుడివియుండెను. అట్లే అనాదినుండియు రాముఁడు, కృష్ణుఁడు, బుద్ధుఁడు మొదలగువారెల్లరు ధర్మరక్షణార్థ మవత రించిరి. అట్లే అస్వాతంత్ర్యాంధకారమునఁ జిక్కి తెన్నుగానక డురపిల్లుచున్న భారతమాత నుద్ధరించుటకు కామక్రోధాద్యరి షడ్వర్గమునకు వశులై మానవత్వమును గోల్పోవు మానవ లోకమూ నుద్ధరించుటకు గాంధిదేవుఁడు భారతభూమియం దవతరించెను.

## పుట్టిన దినము

సత్పురుషుల కాలవాలమై పరమపావనమయిన భారతావని యందలి సుప్రసిద్ధమగు ఘూర్జర దేశమందు వాసిగాంచిన వైశ్య కులమందు వన్నెకెక్కిన గాంధి కుటుంబమందు కరమ్ చంద్ గాంధి - పుత్తలీబాయి అను పూజ్య దంపతుల నోముల పంటయై స్వాతంత్ర్య భాస్కరుఁడు (శ్రీ) గాంధిమహాత్ముఁడు శుక్లనామ సంవత్సర భాద్రపద బహుళ ద్వాదశీ శనివారమున (1869 వ సం॥రం అక్టోబరు 2 వ తేదీయందు) జననమందెను. మహాత్ముని జననామము మోహనదాసు, తండ్రిపేరు - కరమ్ చందు, కుటుంబముపేరు గాంధి కాఁగా; మొత్తము కలిసి మోహనదాస్ కరమ్‌చంద్ గాంధి యయ్యెను. మహాత్ముని తాతయగు ఉత్తమచంద్ గాంధియు, తండ్రియగు కరమ్‌చంద్ గాంధియు పోరుబందరు, రాజకోటయను ముఖ్యసంస్థానములందు మంత్రిపదవుల నలంకరించియుండిరి.

మహాత్ముఁ డిప్పు డింతవాఁ డగుటకు మొదట బాల్యమునఁ దల్లిదండ్రుల గొప్పతనము, వారు బిడ్డకు నిచ్చు క్రమశిక్షణ గారణమై యుండవచ్చునని చెప్పవచ్చును. దొడ్డవారి కడుపునఁ జెడ్డవాఁడు పుట్టుటయుఁ, జెడ్డవారి కడుపున దొడ్డవాఁడు పుట్టుటయు లోకమున సర్వసాధారణము. కాఁగా, పుత్తలీబాయి కరమచందుగాంధి దంపతుల పూర్వజన్మ పుణ్యమెట్టిదియోగాని, వారి తపఃఫల మదియెట్టిదియోగాని యింతటి లోకోన్నత పురుషుఁడు పుట్టుట యపూర్వ భాగ్యవిశేషము. బిడ్డలను గని పెంచుట తల్లిదండ్రుల సాధారణ ధర్మమయినను, ఆ పెంపకమందు బిడ్డల నభివృద్ధి కాంక్షించుచు జాగ్రత్త గలిగి

యుండు తల్లిదండ్రులు లోకమున నరుదు. బిడ్డల బాగోగు, నడ తలను బట్టి లోకశ్రేయస్సు ఆధారపడి యుండునను సంగతి తల్లిదండ్రులు గమనింపవలెను. అంతియేకాని బాధ్యతా రహితముగా బిడ్డల విషయమునఁ దల్లిదండ్రు లౌదాసీన్యము వహింతురేని లోకశ్రేయస్సు కుంటువడుట నిక్కము. కావున, బిడ్డలను బోషించుటయందు, శిక్షణ గఱపుటయందును దల్లి దండ్రులు మిక్కిలి యెక్కువ శ్రద్ధచూపినఁగాని భావిపౌరులుగాఁ బరిఢవిల్లి దేశమును సర్వతోముఖాభివృద్ధికిఁ దీసికొని రాఁజా లరు. అందుచే బిడ్డల విషయమునఁ దల్లిదండ్రులు కడు జాగ్రత్త గలిగి, కనుగలిగి పెంచుచు విద్యాబుద్ధుల నలవఱచి దేశ వికాస మునకుఁ దగినట్లు మంచి నడవడులు గలుగునట్లు చేయుట తల్లి దండ్రుల విధి. ఈవిషయమును గ్రంథారంభమున వివరించితిమి.

మహాత్ముని తల్లిదండ్రుల జీవితమును గూర్చి కొంత తెలిసికొనుట యావశ్యకముగదా !

మోహన్‌దాస్ కరమ్‌చంద్‌గాంధి, మహాత్ముఁడగుటకుఁ గొంతవఱకు మాతాపితరుల శిక్షణయే కారణమని పైనఁ జదువుకొంటిమిగదా ! మాతాపితరు లెట్టి నడవడి గలిగి యుందురో, బిడ్డలు నట్టి నడవడి గలవారై యుందురనుట సత్య దూరము కాఁజాలదు. కావున సంతానముయొక్క యున్నతికి మాతా పితరులు ముఖ్య మనుటలో నబ్బురమేమి కలదు ?

## తండ్రి యోగ్యత

మహాత్ముని తండ్రి కరమ్‌చందు గాంధి, రాజకోట సంస్థానమందు మంత్రిగానుండుచుఁ దన విధ్యుక్త ధర్మమును జాగ్రత్తగా నిర్వహించుకొనుచు, నాతఁడు సహజౌదార్యముతోఁ

జేయుచున్న సత్కార్యకలాపములకు సంస్థానాధిపతి సంతృప్త చేతస్కుఁడై కొంత భూమిని నాతనికి బహూకరించెను. అందులకా మంత్రిపుంగవుఁడీయకొనఁడయ్యెను. ఎట్టకేలకు సంస్థానాధిపతి పట్టుదలతో నాలుగు వందల గజముల స్థలమును మాత్రము స్వీకరించునట్లు చేసెను. పచారుదినుసు లమ్ముకొనుచు భూరి భాగ్యము సంపాదింపఁగోరు కోమటి కులమునఁబుట్టిన కరమ్ చందు గాంధి యప్రయత్నపూర్వకముగా లభించు బహుమానమును స్వీకరించు నాశావశుఁడు కాఁడాయెను. తండ్రి యాశా విముఖతయే తనయుని నిష్కామయోగమునకుఁ గారణమయ్యెను గాఁబోలు !

ఒక పర్యాయము అసిస్టెంటు పొలిటికల్ ఏజంటు ఆంగ్లేయుఁడు తన సంస్థానాధిపతిని నవమానింపగా, మంత్రిశేఖరుఁడు కరమ్‌చందు గాంధియా 'యేజెంటు'ను నెదుర్కొనెను. అందులకా యహంకారి యేజెంటు కోపించి "తప్పుచేసితినని యొప్పుకొని శరణువేఁడుకొందువేని క్షమించెదన" నెను. అప్పుడా గాంధి అధికారమునకుఁ లొంగుటయా? అంతరాత్మకుఁ దలయొగ్గుటయా? ఆత్మగౌరవముగల వ్యక్తి దొరికినదిగదాయని యధికారాసనమునఁ గూర్చొనినంత మాత్రమున నుబ్బి తబ్బిబై స్వీయ గౌరవాతిశయమును జంపుకొనునా? ఎన్నఁటికి నట్టి పనికి లొంగడు. కరమ్‌చందు గాంధి యాత్మగౌరవాభ్యుదయమును గోరి యేజెంటు మాటను నిరాకరించెను. అందులకా దురహంకార చిత్తుఁడు తన యధికారబలిమిని కరమ్‌చందు గాంధికి కొన్నిగంటల కాలము నిర్బంధశిక్ష విధించెను. తండ్రి సత్యాగ్రహము తనయున కబ్బెను గాఁబోలు!

## మాతృస్వభావము

ఇఁక, తల్లిని జూచెదమేని పరమసాధ్వీమణియని మన చిత్తమునకు హత్తుకొనకపోదు. పేదలయందు ప్రేమఁజూపెడి కరుణామయి. బీదలకుఁ దన చేతనైన సహాయము సేయుటకు సదా సంసిద్ధురాలు. ఆమె పూజసేయక పచ్చి మంచినీటిని గూడ మ్రింగియెఱుఁగని భక్తురాలు. భగవంతునిఁ బూజించుట యందెన్నఁడు నేమఱుపాటు నెఱుఁగని భక్తురాలు. వ్రతము లాచరించుటయందు నామెదే ముందంజ. సుగుణ సంపత్తి యందు సీతాదేవి సాటివచ్చు సాధ్వీమతల్లి. తల్లికి మంచి లోక జ్ఞానముగలదు. ఇట్టి మాతృగర్భమున జన్మించుటచేతనే మోహనదాసు కరమ్‌చందు గాంధి, లోకవ్యాప్త కీర్తిని లోఁగొనఁగలిగిన మహాత్ముఁడు కాఁగల్గెను.

## బ్రాహ్మణుఁడు

మహాత్ముఁడు, పుట్టుకచే వైశ్యుఁడయినను గుణకర్మలచే బ్రాహ్మణుఁడు. కాని యాతఁ డెప్పుడును బ్రాహ్మణుఁడనని చెప్పుకొనఁడు. అవును, అది మహాత్ముల లక్షణమేగదా!

## ప్రాచీనకాల వర్ణాశ్రమములు

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను వర్ణభేద ములు గుణకర్మలనుబట్టి పుట్టినవికాని పుట్టుకనుబట్టి మాత్ర మేర్పడ లేదు. లోకప్రవృత్తికి వర్ణచతుష్టయము, మోక్ష ప్రాప్తికి ఆశ్రమ చతుష్టయము నేర్పడినవి. ఈ వర్ణాశ్రమము లనుగూర్చి యింతకుమున్న కొంతవఱకుఁ దెల్పియున్నారము. "ప్రతి మానవుఁడు పుట్టుకచే శూద్రుఁడగుచున్నాఁడు" అగు

ననియు, గుణకర్మలచే మానవుఁడు బ్రాహ్మణుఁడగు చున్నాఁడనియు" నెవఁడు సంపూర్ణ జ్ఞానముచే, దనయందున్నట్టి బ్రాహ్మణత్వమును గైవసమొనర్చుకొనునో; అతఁడు కడజాతి వాఁడైనను ఉత్తమ బ్రాహ్మణుఁడు కాఁగలఁడ"నియు, "నెవఁడు ఉత్తమ కులమందుఁబుట్టి జ్ఞానదూరుఁడగునో అతఁడు కడజాతి వాఁడగుననియు "ఉన్నదానితోఁ దృప్తిపడుట, ఇతరుల తప్పులను మన్నించు నౌదార్యము గలిగియుండుట. మనోనిగ్రహము కలిగియుండుట, దుర్నీతికి దూరముగానుండుట, పవిత్రత గలిగి యుండుట, ఇంద్రియములను జయించుట, సత్ప్రవృత్తి గలిగి యుండుట, విద్యల నార్జించుట, సత్యము పలుకుట, కోపము లేకుండుట" యను నీపది గుణములు జ్ఞానకారణములగుననియు, "ఈ గుణదశక మెవఁడు త్రికరణశుద్ధిగా నాచరించునో యాతఁడేజాతివాఁడైనను ఉత్తమ బ్రాహ్మణుఁడగున"నియు మన యార్ష గ్రంథములు తెలుపుచున్నవి. మనువు, బ్రాహ్మణ ధర్మములను దెలుపుచు "సదాచార సంపన్నుఁడై భోగభాగ్యవిలాసముల నుద్యజించు నతఁడే బ్రాహ్మణుఁడ"నియుఁ జెప్పియుండెను. మఱియు శ్రీమన్మహాభారతము "బ్రాహ్మణుఁడగుటకు జన్మము, సంస్కారము; వేదపఠనము; సంప్రదాయము కారణము కావనియు; సత్ప్రవర్తనమే కారణమ"ని ఘోషించుచున్నది. మన యార్షగ్రంథములు బ్రాహ్మణునకు విధించు సమస్త సద్గుణములు మన గాంధి మహాత్మునియందు మూర్తీభవించి యున్నవి.

## ప్రస్తుతకాల వర్ణాశ్రమము

ఈ విధమున సత్ప్రవృత్తికి మూలభూతములగు వర్ణాశ్రమ ధర్మములు ప్రస్తుత కాలమున జన్మమునకు ముడిపెట్టబడుఁ

చున్నవి. కావున నేఁటి వర్ణాశ్రమ ధర్మములు నామమాత్రావశిష్టములయియున్నవి. ఆయాచారలాయా వృత్తులవలంబించినంతనే "ఆయాచారలకా యావృత్తులు విధిపూర్వకములు"ని వ్రాయుట సాహసము. ఈ కారణముచే భారతావనియందు నెన్ని వృత్తులు కలవో; యన్ని జాతులు వెలసినవి. ఈ జాతులను శాస్త్రసిద్ధములని స్వార్థపరులు కొందరు తమ తమ పొత్తముల నెక్కించి పాపమున కొడిగట్టుకొనిరి. అవకాశము లభించునప్పుడెల్లను స్వార్థపరులు తమ యసమర్థములగు వ్రాఁతలు వ్రాసి, గ్రంథములందుఁ జొప్పించిరి. ఆ కపటమెఱుఁగని వైదిక మతమునకా దొంగ వ్రాఁతలు పరమ ప్రమాణములయ్యెను. తన్మూలమున జన్మముచే జాతిని నిర్ణయింపఁబూనుటకు మనము తలలూపుచుంటిమి. కాని కాలక్రమమున నీగుట్టంతయు బట్టబయలగుచుండుటచే నాయసమర్థమగు వ్రాఁతలను ద్రోసివేయుచు నిగ్గుదేరిన వేదసమ్మతమగు గుణకర్మవిభాగములచే చతుర్వర్ణములను హిందూమతము మహాత్ముని ముఖమున గ్రహించుచున్నది.

## మహాత్ముని వర్ణాశ్రమములు

గాంధి మహాత్ముఁడు వర్ణాశ్రమ ధర్మములను భక్తిశ్రద్ధలతో నాచరించుచుండును. మహాత్ముఁడు తనను 'సనాతన హిందువుఁడన'ని పలుచోట్లఁ బ్రసంగవశమునఁ జెప్పుటయు వ్రాయుటయుఁగలదు. జన్మముచే జాతిని నిర్ణయించుటకు మహాత్ముఁ డెన్నఁడు నొప్పుకొనువాఁడుకాఁడు. "వేదసమ్మతములగు వర్ణాశ్రమ ధర్మములను నమ్ముచు వానిని త్రికరణశుద్ధిగా నాచరింపఁ బ్రయత్నించువాఁడను. కాని నన్ను నేను 'సనాతన

హిందువుఁడన'ని చెప్పుకొనుట యతిశయోక్తి కానేరదు." "వర్ణాశ్రమ ధర్మములు మానవసంఘ సౌష్ఠవమునకును, ప్రభుత్వ సౌష్ఠవమునకు నియమింపఁబడిన" వనియు, "వర్ణము హిందూ మతమునకు బలహీనతను గలిగించు నసహ్యమైనదనియుఁ బెక్కు తడవలు వ్రాసియుండెను. "వర్ణచతుష్టయమే చాలియుండ నీలెక్కలేనన్ని వర్ణములు గల్పింపఁబడనేల?" యని మహాత్ముఁడు ప్రశ్నించుట కలదు. ఈ పైమాటలనుబట్టి వర్ణవిభాగ విషయమున మహాత్ముని నిశ్చయము మనకు సుబోధకమగుచున్నది.

ఈ వర్ణాశ్రమ ధర్మములనుగూర్చి మహాత్ముఁడు వెల్లడించిన యభిప్రాయమును హిందువులు పెక్కురు తమ తమ యిష్టము వచ్చినట్లు అర్థముఁ జెప్పుకొనుచుండిరి. వర్ణాశ్రమ ధర్మ విషయములనుగూర్చి మహాత్ముఁడు స్పష్టముగు నిశ్చయమును దెలుపలేదని పలువురు చెప్పుకొనుటను నే నెఱుఁగుదును. అందుచే వర్ణాశ్రమ ధర్మములనుగూర్చి మహాత్ముని నిశ్చితాభిప్రాయము దెలిసికొనుట యావశ్యకము.

మహాత్ముఁడు వర్ణాశ్రమధర్మములందు నిశ్చయబుద్ధికలిగి యున్నాఁడనుటలో నెట్టి సందేహములేదు. "వర్ణాశ్రమములు మానవున కనుగుణ్యమైనవి. హిందూమతము వర్ణాశ్రమ ధర్మమును గాపాడుకొనుచువచ్చుచున్నదనియు" 'వర్ణాశ్రమ ధర్మము మానవలక్ష్యమును గ్రమక్రమముగా సాధించుటకు వలయు సద్గుణములను బోధించును'నియుఁ జెప్పియున్న మహాత్ముని హృదయము మనకు తేటతెల్లమగుచున్నది.

మానవజీవిత లక్ష్యమునకు సత్సాధనములగు వర్ణాశ్రమ ధర్మములు నేఁటి కాలమున నుపేక్షింపఁబడు చుండుటకును,

నాచరింపఁబడకుండుటకును గారణమేమి ? మానవుని విధిని లేక జ్ఞానమును మఱచి పుట్టుకచే హెచ్చు లొచ్చులు గల్పింపఁబడుటయే. ఈ యెచ్చు లొచ్చులు గల్పింపఁబడిన నాఁటనుండి వర్ణాశ్రమ ధర్మమునకు, ఆ ధర్మముల కాశ్రయభూతమైన వేద మతమునకు క్షీణదశ రాసాగినది.

## ఎక్కువ తక్కువలు

కులమను పేరుపెట్టి యెక్కువ తక్కువలు లెక్కించుట మహాత్మునకుఁ గంటగింపు. "చతుర్వర్ణములు మానవునికర్తవ్య ధర్మమును నిర్ణయించుచున్నవి. అంతియకాని యా ధర్మములు హెచ్చు తగ్గులను దెలుపునట్టివి కావు. ఒకఁడు తనను గొప్ప యనుకొనుటయు, నితరుని దక్కువయని తలఁచుటయు నవివేకము. జన్మమాత్రముచే మానవునకు నెక్కువ తక్కువలు లెక్కించుట వేద మతమునకు విరుద్ధమని నా తలంపు. భగవత్సృష్టికి (ప్రాణులకు) సేవచేయుటకే యెల్లరు సృజింపఁబడుచున్నార'నియుఁ, 'దనకుఁగల జ్ఞానజ్యోతిచేఁ దనను గొప్పయని భావించుకొను బ్రాహ్మణుఁడా జ్ఞానజ్యోతిని గాంచలేనివాఁడగుచున్నాఁడు. తమ తమ గుణములనుబట్టి బ్రాహ్మణుఁడు ఇతరులను దక్కువగాఁ దలఁచువాఁడు మూర్ఖుఁడే యగున" నియు, "శూద్రుఁడు తన కర్తవ్య విధిని నేఱవేర్చు చున్నాఁడు; బ్రాహ్మణుఁడు కర్తవ్యవిధిని నెరవేర్చుచున్నాఁడు; ఇంతకంటె హెచ్చు లొచ్చులు భావింపనేల ?" ఇతరులకు సేవచేయుటయే గొప్ప" యనియు మహాత్ముఁడు వెలువరించిన యమోఘ వాక్కులు పెక్కులు గలవు.

"పాకీపని చేయుట యన నాకెంతయో యుల్లాసము. పదునెనిమిది వత్సరముల ప్రాయముగల బ్రాహ్మణ బాలుఁ డొకఁడు పాకీపని నేర్చుకొనఁగోరి మా సబర్మతీ-ఆశ్రమమందుఁ జేరెను. అతఁడేవగింపనునది యించుకంతేనియు లేక పాకీపని పరిశుభ్రముగాఁ జేయుచుండెడివాఁడు. అతఁడు పాకీవాఁడుకాదు. శుద్ధ వైదిక కులమునఁ బుట్టిన బ్రాహ్మణ బాలుఁడు. దైనందినము గీతాపారాయణము సేయుచుండును. సంధ్యావందనాది కర్మల నతి భక్తిశ్రద్ధలతోఁ గావించు చుండెడివాఁడు. ఆతని వేషభాషలు నా కచ్చెరువు గలిగించుచుండెడివి. ఆతని వేషము నిరాడంబరము, భాష మృదు మధురము. ఆతఁడు పాటలు పాడుచుండును. ఆ పాట వసంతర్తువునందలి కోకిల కంఠమును మించి తీయందనమును జాల్వార్చును. ఆశ్రమవాసు లందఱికంటె నాతఁడు పాకీపని నేర్పుతోఁ జేయుచుండెడివాఁడు. పాకీపని చేసినంత మాత్రమున నాబాలుఁడు బ్రాహ్మణుఁడు కాకపోయెనా?" యని మహాత్ముఁడు వ్రాసియుండెను. వేద మతమునకు వేఱు పురుగనఁదగు నీ యెక్కువ తక్కువలు వర్ణాశ్రమ ధర్మమందు లేవని మహాత్ముని నిశ్చితాభిప్రాయము. "కావున పుట్టుకతో నెక్కువ తక్కువలు కల్పించుట ధర్మవిరుద్ధము." పుట్టుక ననుసరించియు, కర్మము ననుసరించియు నేను వర్ణాశ్రమ ధర్మమును నమ్ముచుంటిని. పాకీవానిని దక్కువ వానినిగా భావించుట లేద"ని యనుటబట్టి మహాత్ముని యభిప్రాయము స్పష్టమగుచున్నది.

## సహపంక్తి భోజనము

హిందువుల సహపంక్తి భోజనాదికములలో నెన్నియో విధి నిషేధములు కలవు. ఒక తెగవారితో నొక తెగవారు

భుజింప నొల్లరు ఇది యెంత యవివేకమో యూహింపుఁడు. ఒక సంఘముతో నింకొక సంఘము కలిసి కూర్చుని యేక పంక్తిని భుజింపఁగూడదఁట. భుజించినంత మాత్రమున వర్ణాశ్రమ ధర్మము లడుగంటి మాయమై పోవునుగాఁబోలు! సహపంక్తి భోజనము చేయకుండిన మాత్రమున హిందూమత ముద్ధరింపఁ బడునా? అదియు రిత్తగదా! అగుచో, నిట్టి ఛాందసనియమములు హైందవులకేలకో తెలియకున్నది. అన్నపానీయములఁ గైకొనుటయందు నియమము కలదు కాని, వర్ణాంతర భోజనము సేయుట పాడిగాదను నియముగలదా? అన్ని వర్ణములవారు కలసిమెలసి యొక పంక్తిని గూర్చుండి కడుపార నారగించుటకు నియమ మెందులకు? లేనిపోనివి కల్పించుకొని శాస్త్రసిద్ధములని పెనగులాడుట హైందవులకు నైజగుణము కాఁబోలు! ఇట్టి నియమములందుఁ దనకెట్టి నమ్మకము లేదని మహాత్ముఁడు స్పష్టపఱచి యుండెను.

'ఈ నియమము ఆ యా వారల ననుసరించి తలయెత్తిన దనియు, నద్దానిని శాస్త్రసిద్ధమని గ్రుద్దులాడుట గ్రుడ్డితనమ' నియు మహాత్ముని యభిప్రాయము. "మీఁదు మిక్కిలి వర్ణాంతర సహపంక్తి భోజనము పరస్పర సౌహార్దమును బెంపొందింపఁ గలదు." 'బ్రాహ్మణుఁడు శూద్రునితో భుజించినంత మాత్రమున బ్రాహ్మణత్వము గోల్పోవఁ జాలఁడని వ్రాయుచు, 'అయ్యో! హిందూమతము నేఁడు భోజన విషయమున లగ్నమై యుండుట కరము సంతాపకరమ'నియు, మహాత్ముఁడు హిందూమత మను పేరిట జరుగు నవివేకమునకు వాపోవుచుండెను. ఇతరులను నిర్బంధింపఁ జాలను. నేను మాత్రము వర్ణాంతర భోజనము సేయుటకు సంసిద్ధుఁడన'నియు, 'మాల బాలిక ప్రేమతోఁ బరి

శుద్ధాన్నమును బెట్టుచోఁ గడుపార భుజించెదన'నియు, 'నేను వర్ణాశ్రమ ధర్మము నందెంతయో నమ్మకము కలవాఁడనయి నను పాకీవానితోఁ గలిసి భుజించెదన'నియు మహాత్ముఁడు వ్రాసిన వ్రాఁతలును వేద ప్రమాణ బుద్ధితో హైందవులు పాటించెదరుగాత !!

మహాత్ముఁడు 'తాను అనేక పర్యాయములనేకస్థలము లందు వివిధ సంఘీయులతో భుజించితిన'ని తన యాత్మకథ యందు వివరించి యుండెను. ఇంగ్లాండునందును దక్షిణాఫ్రికా యందును ఐరోపియనులతోఁ గలసి భుజించిన సంగతి లోక విదితమేగదా! 'ఫోనిక్సు'లోఁ దన గృహమందే ప్రముఖ మిత్రుఁడైన 'కాలన్‌బగ్', 'పోలకు' మొదలగు ఐరోపియన్ మిత్రు లుండుటకుఁ దావిచ్చుట యిచట గమనింపఁదగిన విషయము. సబర్మతీ - ఆశ్రమవాసులెల్లరు నించుమించుగాఁ గలసి మెలసి భుజించుట లోకప్రసిద్ధము. మహాత్ముఁడు వర్ణాంతర భోజనవిషయమునను మతాంతర భోజనవిషయమునను ననుకూలుఁడని పై విషయములు చెప్పక చెప్పుచున్నవి. 'కేవల సహపంక్తి భోజనము చేసినంతమాత్రమున నొరుగున దేమియు లేద'నియు, 'నందుల కేరిని బలవంతము చేయరాద'నియు నయ్యది వారి వారి యిష్టములకు వదలివేయుట సమంజసమగున'నియు మహాత్ముని యభిప్రాయము.

## మహాత్ముని వర్ణాశ్రమ ధర్మము

మజ్జన భోజనాదికము లేకముగాఁ గలిగిన పాండవులకుఁ గౌరవులకును గయ్యము కలుగుటయు, దినుట వినుట - కనుట మొదలగువానియందు భేదములేని యాంగ్లేయు

లకు జర్మనులకు యుద్ధములు జరిగినను మజ్జన భోజనములను గలిసి చేయుచు, నాడుచు, పాడుచు వినోదములతోఁ బ్రొద్దు పుచ్చుచుండుటయు గమనింపఁ దగును. సహపంక్తి భోజనాదికములు లేకపోయినను నాత్మీయభావము అనఁగా నాత్మస్నేహము అభివృద్ధి కావచ్చుననియు మహాత్ముని యభిప్రాయము. అందుచే నొంటరిపాటున దినినను, పదుగురితోఁ దినినను జెప్పుకొనఁదగు లాభమేమియు కలుగఁజాలదు.

మహాత్ముఁడు చెప్పుచున్న వర్ణాశ్రమ ధర్మమును జక్కగా నవగాహనము చేసికొనవలెను. మహాత్ముని వర్ణాశ్రమ ధర్మమును వైదికులును సమ్మతించుటలేదు; సంస్కర్తలును సమ్మతించుటలేదు. మహాత్ముఁడు పుట్టుకనుబట్టి వర్ణాశ్రమము లాచరింపవలయుననును. పుట్టుక ననుసరించి వర్ణాశ్రమములు నెఱపవలయునని మహాత్ముని యభిప్రాయమందలి యాంతర్యమేమో యేరికి నర్థముగాకున్నయది. 'కర్షకుని కుమారుఁడు కృషిని వ్యాపారముచేయుబిడ్డ వ్యాపారముచేయవలయున'నియు, ట్లు తమ పుట్టుకల ననుసరించియే యాయా వృత్తులు గల బిడ్డలు నాయా వృత్తులనే నేర్వవలయునని మహాత్ముఁడు చెప్పుచుండెను. ఈ వృత్తి ధర్మము ననుసరించి భేదభావములోఁ బుట్టుకయందు నెక్కువ తక్కువలు పరిగణించుట పాడిగా దనియుఁ జెప్పుచుండెను. వర్ణాశ్రమ విషయమునుగూర్చి మాట్లాడుట వ్రాయుట తటస్థించునప్పు డెల్లను, పుట్టుకయందు హెచ్చుతగ్గు లెంచుట యజ్ఞానమనియుఁ జెప్పుచునే యుండెను. కట్టుట, తినుట, చదువుట, వేదము లభ్యసించుట, దేవాలయ పూజలు మొదలగువానిని బుట్టుకనుబట్టి నిర్ణయింపవలయునని మహాత్ముఁడు చెప్పుటలేదు. పుట్టుకనుబట్టి వంశపారంపర్యముగా

వచ్చు వృత్తులను జేపట్టినయెడల లోకమందు విరోధములు సమసిపోయి, అన్యోన్య భావము కుదురుకొనుననియు మహాత్ముని యాంతర్యమై యుండనోవును.

వర్ణాశ్రమ విషయమునుగూర్చి మహాత్ముఁడు వెలిఁబుచ్చిన యభిప్రాయములు సువర్ణాక్షరములతో లిఖింపఁదగినవి. కాని యొకటిమాత్రము ఈ నా యల్పబుద్ధికి బోధపడుటలేదు. అది యేది? అది పుట్టుకనుబట్టి వర్ణాశ్రమములు నెఱపలయుననుట. ఈ విషయమై పంద్రెండు దినములు అహర్నిశలు నా బుద్ధికొలఁది నాలోచించి చూచితిని. కాని ఇందలి యర్థమేమో యింకను నాకు బోధపడకున్నది.

ఇంతకు ఈ విషయమున మహాత్ముని యభిప్రాయమేమో తెలియరాకున్నది. తల్లిదండ్రుల వృత్తులను వారి వారి బిడ్డలు చేయవలయుననుట మాత్రము మా మందబుద్ధికి నచ్చుటలేదు.

తల్లిదండ్రుల ననుసరించి బిడ్డల పుట్టుకచే వృత్తులను విధించుట ప్రకృతిని నవరోధించుట యగును. ఆయా వారల చిత్తము చొప్పున నాయా వృత్తుల నవలంబించుట యుత్తమ మగును. అంతియకాని తల్లిదండ్రుల వృత్తులనే బిడ్డలు నవలంబింప వలయుననుటకుఁ గారణము కన్పింపకున్నయది. తమ కిష్టమగు వృత్తుల నవలంబించుట శ్రేయోదాయక మగును. కాని నిర్బంధముననో, పారంపర్యముననో వృత్తుల నవలంబింపఁ జేయుట యనఁగా నిబంధించుట మాత్రము శ్రేయోదాయకము కాదని మా యూహ.

జన్మము ననుసరించి యంటరానితనముకలదా? లేదా యను వాద ప్రతివాదములు మన దేశమున శతాబ్దులనుండియు

జరుగుచున్నది. భగవత్సృష్టిలో మానవులంను అంటరానితన మెచ్చటనుండి యంటుకొనినదో తెలియుటలేదు.

## అస్పృశ్యత

ఈ యెక్కువ తక్కువలు ముదిరి యంటరానితనమనెడి మంటయొక్కటి వేదమతమున కంటుకొని కాల్చివేయుచున్నది. ఈయంటరాని మంటలంబడి వేదమతము మొదలంట నాశనమగుచున్నది. మన మతమెంత గొప్పదియో చూడుడు. అట్టి మతమునకు నంటరానితనమొక్కటి యంటగట్టి మత పవిత్రతను వమ్ముచేయుచున్నారము. నిజమునకిట్టి యంటరానితన మనాది సిద్ధమగుచో నితర మతములందిది యేల కాన్పింపదు? ఇతర మతములందులేని యీపాపమొక్కటి మన మతమును జుట్టుకొననేల? అన్ని మతముల కంటె మన మతమెంతయో దొడ్డది యందుముకదా! ఆ దొడ్డతన మీ యంటిరానితనమె కాఁబోలు? అయ్యో! ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన యీ యార్యావర్తనమున న్యాయమనుమాట తెలిసికొనలేక తమ మతమందు అస్పృశ్యత నేలపాటించిరో కడు వింతగానున్నది? న్యాయమెఱుంగక పోవుటచే హైందవులు ప్రపంచ విఖ్యాతిని గడించిరా? మతములన్నింటికి వేదమతమొక్కటియే తలమానికమని పేరు గాంచుటకుఁ గారణమేది? దయాధర్మములకు వేదమతము పుట్టిల్లనుటకు పుట్టువేది? అట్టి వేదమతమందు అస్పృశ్యత పుట్టనేల? ఎవరో హిందూమతమునఁ దంటరానితన మొక్కటి యెక్కించినంత మాత్రమున మనము వెఱ్ఱులము కానేల? ఎవరో, ఏ శాస్త్రమో చెప్పుచున్నదని మూఢవిశ్వాసముతో విశ్వసించి హిందూమతమును నాశనముచేయుట

న్యాయముకాదు. శాస్త్రమైనను, శాస్త్రకారుఁడైనను రానున్న కాలమందలి మార్పులను గనిపెట్టలేఁడుగదా! రానున్న కాలమునకు ముందు వెనుక లాలోచింపక విధి నిషేధముల నిప్పుడే సేయఁబూనుట లోకవిరుద్ధము. రానున్న పండుగ దినమందుఁ దినఁబోవు కూరలకు నేఁడు తాలింపుపెట్టుటయా? ఆ కూరలా పండుగ దినమునఁదిన యోగ్యమగునా? బ్రదుకుమీఁద నాస గలవాఁడెన్నఁడు తినఁబోవఁడు. అట్లే ముందెన్నఁడో జరుగఁ బోవు మతాభివృద్ధికి నేఁడు కట్టుకట్టుట యెంతటి యవిచార మూలకమో యూహింపుఁడు.

మానవులెల్లరు భగవంతుని బిడ్డలగుటచే మనమెల్లరము సోదరులము. ఇందొకఁడు స్పృశ్యుఁడు మఱియొకఁ డస్పృశ్యుఁడు ననుటకుఁ దావెద్ది? మన బిడ్డలను బొట్టిపొడుగులను బట్టి ప్రేమింతుమా? స్పృశ్యతా స్పృశ్యతను బాటించెదమా? మనము పాటింపకపోయనను ఆ బిడ్డలైనను బాటించెదరా? పాటించుట పాడియా? అంధులమై మనము సోదర భావమును జంపుకొని సోదరులగు పంచములను నంటరానివారని యంటిమి. నీవెట్లు పుట్టి పెరిఁగితివో; అతఁడు నట్లే పుట్టి పెరిఁగెనుగదా? అట్టిచో వారలనేల యస్పృశ్యులని భావించుచున్నావు? మన తాతలనాఁటి శాస్త్రములు చెప్పుచున్నవిగదాయని పంచములఁ జూచినంతనే దూరదూరానఁ దొలఁగిపోవుచున్నావు. పోయిన పొడుగున "గ్రుడ్డియెద్దు కంచెను బడిన చందమేకాని గంతవ్యా గంతవ్యమార్గాన్వేషణము సేయవలదా? మూఢ్యముతో మాతాత ముత్తాతలు పట్టుకొని ప్రాఁకులాడిరని నీవు నట్లే ప్రాఁకులాడఁ దలంచితివా?

ఓయి! హైందవుఁడా! తెలివివారికి రమ్ము! కన్నులు తెఱచి చూడుము. అస్పృశ్యతా పిశాచ పీడితులగుచు పంచము లెందఱు కుందుచున్నారో చూడుము! మనసార, హిందూ మతమును నమ్ముకొని బ్రక్కప్రేవులతో నూరి వెలుపల సూర్య చంద్ర నివాసమైన యాకుటీరంబుల నివసించుచున్నారు. పరికించి యటు చూడుము! సూర్య చంద్రులకు లేని యంటు దోసము నీకెందులకు? వెఱ్ఱివై ప్రాఁత పురాణముల నమ్మి హిందూ మతమును నాశము చేయఁబోకుము.

బడిపిల్లలు తమ తమ పాఠములను భక్తిపెంపున నేర్చుకొలఁది వర్ణించి గురువున కప్పగించి యాతర గతినుండి పైతరగతికిఁ బోవుచుందురు. అంతియకాని యందచంద ములకు, భాగ్యభోగ్యములకుఁ బైతరగతి యందుఁ జేర్పఁబడరు గదా! గురువునకుఁ జదువుసంధ్యలు ముఖ్యముగాని భాగ్యభోగ్య ములు కావు. బాలుఁడు భక్తిశ్రద్ధలతోఁ జదివి గురువునకు నచ్చె నేని పై తరగతియందుఁ జేరఁగలఁడు. ఆబాలుఁడితో ధిక భక్తి శ్రద్ధలతోఁ విద్య నార్జించిన గురుని యంత కాఁగలఁడు. అనఁగా గురుపీఠ మెక్కి బాలురకు విద్యాభ్యాస మొనర్పఁగలఁడు.

అట్లే; ప్రపంచ మొక చదువులబడి యనుకొనుము. అందు భగవంతుఁడు గురువనియు, మానవులు బాలురనియుఁ దలంచుము. మానవుఁడు గుణకర్మలచే మించినేని ఉత్తముఁడు కాఁగలఁడు. అంతకంటె మించినేని గురుస్థాన మలంకరించి బాలుని పగిది దైవస్థాన మలంకరింపఁగలఁడు. కావున స్పృశ్యాస్పృశ్యతలను పాటించుట పాడికాదు.

అస్పృశ్యతా నివారణమునకై మహాత్ముఁ డెంతయో ప్రయత్నించు చుండెను. మహాత్ముఁడు;

"అస్పృశ్యత హిందూమతమునకొక పెద్దకళంకము."

"హిందూ సంఘము తనచే బహిష్కరింపఁ బడినవారిని (అస్పృశ్యులను) దిరిగి తన సంఘమందుఁ జేర్చుకొనిన యెడలఁ దన కళంకమును బాపుకొనఁ గలదు."

"ఈ యస్పృశ్యత నాకుఁ బండ్రెండవ సంవత్సరమందు బోధపడెను. అప్పటినుండియు నా హృదయము పరితాప మనుభ వించుచున్నది. మాయింటి పాకీపని చేయువాని నంటుకొనుట యందుఁ దప్పేమికలదని మా తండ్రిగారిని నే ననేక పర్యాయ ములు ప్రశ్నించు చుండెడివాఁడను."

"హిందూమతమందు అస్పృశ్యత కలదని నేను విశ్వ సింపను. ఒకవేళ కలదని తోఁచుచో హిందూమతమును నే నెంత మాత్రము గౌరవింపఁ జాలను."

"ఈ యస్పృశ్యత హిందూమతమునకు జీవమని ఋజు వగుచో హిందూ మతమునకు వ్యతిరేకిగా నుండుటకు నే నెల్ల ప్పుడు సంసిద్ధుఁడను."

"పలువురు హిందువులు అస్పృశ్యత హిందూమతసమ్మత మనుచు పాకీ వారిని దూర దూరమున నుంచుచున్నారు. హిందూమతమున కస్పృశ్యతయే,సమ్మతమగుచో నేనీ హిందూ మతమును వదలిపెట్టి నా కోరిక లన్నియు నెఱవేఱు, మఱి యొక మతమందుఁ బ్రవేశించెదను. అయితే, అస్పృశ్యత హిందూమత సమ్మతమని నేను నమ్మఁ జాలను."

"ఈ యస్పృశ్యతను జేపట్టుటచే హిందూ మతము

పాపమున కొడిగట్టుకొనుచున్నది. ఆ పాపము హైందవులమగు మనలనందఱను అస్పృశ్యులనుగాఁ జేయుచున్నది."

"హిందువులు తమమత మందు అస్పృశ్యతను పాటించు నంత వఱకు – హిందువులు తమ తోఁబుట్టిన పంచములను అస్పృశ్యులనుగా భావించునంత వఱకు – మనకు స్వారాజ్యము లభించుట కల్ల."

"మన సోదరులను బహిష్కరించుటచే మనము పాపుల మైతిమి. వారిని మనతోఁ గలసిమెలసి తిరుగనీయము, మన మెక్కిన బండ్లను ఎక్కనీయము, తిన్నని దారిని నడువనీయము. ఈ మన ద్రోహముకంటె బ్రిటీషువారు మనకెక్కువ ద్రోహ మేమి చేసిరి ? మన తప్పులను మనము దిద్దుకొనవలయును. పంచములను నాదరించనంతవఱకు మనము స్వారాజ్యము పడయలేము."

"పంచమ సోదరులను అస్పృశ్యులనుగా భావించునంత కాలము మనము మృగములకంటెఁ గడు హీనులము."

"మోక్షము పొందఁ గోరి నేను సేవసేయు చున్నాను. తిరిగి పుట్టుటకుఁగాదు. అథవా, పుట్టుటయే సంభవించుచో నే నస్పృశ్యుఁడనై పుట్టి, వారలకష్టములయందు భాగస్వామినై వారలను అస్పృశ్యత నుండి గట్టెక్కు మార్గాన్వేషణము చేయఁ బ్రయత్నించెదను. కావునఁ దిరిగి పుట్టుటయే సంభ వించుచో నేను పంచముని యింటఁ బుట్టవలయుననియే నా కోరిక."

"నా జీవితమందు నాకు రెండు కోర్కెలు గలవు. అందొ కటి అస్పృశ్యతా నివారణము. రెండవది యాత్మరక్షణము.

ఇవి రెండు నెఱవేఱునప్పుడే స్వారాజ్యమును బడయుట. నాఁడే నాఁ మోక్షమనునది లభింపఁ కలదు."

"పంచములను అస్పృశ్యులుగా భావించు నగ్రజాతుల వారి కొక విన్నపము చేయుచున్నాను. అస్పృశ్యతను బాపుట అగ్రవర్ణములవారి విధి యని యెఱుంగుఁడు. ఆ విధిని నెఱ వేర్చుట యగ్రజాతుల హస్తగతమై యున్నది."

మహాత్ముఁడు తాను జెప్పునది యంతయుఁ జేతలందుఁ జూపెట్టును. అంతియకాని వ్యాసములతో నుపన్యాసములతోఁ బ్రొద్దుపుచ్చు వాఁడుకాఁడు. ఆచరణమందుఁ జూపనిమాట యొక్కటియు నెన్నఁటికి బయటఁబెట్టఁడు. అస్పృశ్యుల నుద్ధ రింప నెంతయో తమకము కలవాఁడు.

డర్బను నగరమందు మహాత్ముఁడు బారిష్టరుగా నున్న ప్పుడు తన యింటి మలమూత్రములను జక్కజేసికొనుట కిత గుని నియమింపక తనంతటఁ దానే మలమూత్రముల దొడ్డిని శుభ్రము చేసికొనుచుండెడివాఁడు. మహాత్ముని యింటియందు తన గుమస్తాలును గాఁపురము చేయుచుండెడివారు. ఆ గుమా స్తాలును మహాత్మునియట్లే వెనుకాడక తమతమ మలమూత్ర ముల దొడ్లను దామే పరిశుభ్రము గావించుకొనుచుండెడివారు. కాని యా గుమాస్తాలలో నొక క్రైస్తవ గుమాస్తా కలఁడు. అతని తల్లిదండ్రులు పంచములు. అతఁ డెన్నఁడు నిట్టి పనులఁ జేసియుండక పోవుటచే దొడ్డిని పరిశుభ్రము చేసికొనుటకు వెను కాడు చుండెడివాఁడు. మహాత్ముఁ డది కనిపెట్టి మనస్సునందు సంకోచము లవలేశములేక యా క్రైస్తవగుమాస్తా దొడ్డిని గూడ బాగుచేయ మొదలిడెను. మహాత్ముఁ డిట్టి పనులు

సేయుటయందు దిట్టయై లోకసేవయందు గట్టివాఁడాయెను. శ్రీ కస్తూరీబాయి కాదినములలో నిట్టిపనులనినఁ గొంతవఱకు నేవగించుకొనుచుండెడిది.

ఆ క్రైస్తవుని దొడ్డిని శుభ్రముచేయుటను జూచి చీద రించుకొనుచుఁ గంటివెంట నీరు కార్చుచున్న కస్తూరిబాయిని జూచి మహాత్ముఁ డుగ్రుఁడై యామెను మెడఁబట్టి బయటకు గెంటివైచెను. మహాత్ముని పట్టుదలను జూచితిరా! వాకిపని చేయుటను జూచి యేవగించుకొన్నంత మాత్రానఁ దన యర్థాంగిని - కోమలగాత్రిని మెడఁబట్టి బయటకు గెంటివేయు టకు మహాత్ముఁడు వెనుదీయలేదు. పరోపకార పారీణుల కిది పాడియేగదా!

## సబర్మతీ ఆశ్రమము - అస్పృశ్యత

సబర్మతీ తీరమందు స్థాపింపఁబడిన సత్యాగ్రహాశ్రమ మందుఁ బంచమ కుటుంబ మొక్కటి చేరనెంచి మహాత్మునకుఁ దమ కోర్కెను విజ్ఞాపించెను. అందులకు మహాత్ముఁడు 'ఆశ్రమ నియమములకు సమ్మతించుచో రావచ్చున'ని ప్రత్యుత్తర మిచ్చెను. నియమములకు నిచ్చగించి యాశ్రమమందుఁ బంచమ కుటుంబము చేరెను. చేరినంతనే హిందూమతమం దావరించియుండిన పంచమద్వేషాగ్ని యాశ్రమమందును రగు ల్కొనెను. సత్యాగ్రహాశ్రమమందుఁ బంచములు చేర్చుకొఁ బడిరనిన వార్త చెవి సోకినంతనే సమస్త భారతదేశమందు సంచలనము సాగ నారంభించెను. పాపము! పంచము లందుఁ బోయిన నందుఁ గష్టముల నెదురీదుటయేగదా! పంచములు చేర్చుకోఁబడినంత మాత్రముననే యాశ్రమమున కీయ సంక

ల్పించిన చండాలను హిందువు లెగురఁగొట్టెది. అందుచే మహా త్మున కాశ్రమ నిర్వహణ మొక్కింత శ్రమపూర్వక మగు చుండెను. ఇంతలో మహాత్ముని మిత్రుఁడు ఉదారబుద్ధి సంపన్నుఁ డొకఁ డేతెంచి, మహాత్మునకు నమస్కరించి, మహా త్ముని యాశ్రమ నిర్వహణ సమర్థతకు నెంతయో యానందించి, ప్రస్తుత సమయమున హిందూదేశము చూపుచుండిన యనా దరణ కొక్కింత చింతించి, మహాత్ముని మెచ్చుకొని యాశ్రమ నిర్వహణమునకుఁ బదుమూఁడు వేల రూప్యములను సమర్పించి, మహాత్ముని యాజ్ఞ గైకొని యింటికిఁ బోయెను. ధర్మకార్యా చరణమందుఁ గష్టము లెదుర్కొనుట యెట్లు సహజమో; అట్లే వైదొలఁగుటయు సహజముగదా!

భారతదేశ మెంత గగ్గోలు పెట్టినను మహాత్ముఁడు తాఁ బట్టిన దీక్షను వీడక, యా పంచమ కుటుంబమును ఆశ్రమ మందుఁ బోషించుచుండెను. ఆ పంచమకులమునకుఁ జెందిన లక్ష్మి యను బాలికను మహాత్ముఁడు ప్రేమానురాగములతోఁ బెంపుడు కుమార్తెను బోలెఁ జూచుచుఁ బెంచి పోషించిన సంగతి సర్వజన విదితమేగదా!

## అనారోగ్యము — అస్పృశ్యత

ఒరిస్సాదేశము పర్యటించుచుండఁగా, మహాత్మున కస్వస్థత కలిగెను. వ్యాధి తీవ్రమై మహాత్ముని బాధింపఁ జొచ్చెను. ఆ వార్త దేశము నలుమూలలకుఁ బ్రాఁకెను. వెంటనే మహా త్మునిఁ జూచుటకై పలువురు పటుగెత్తుకొని వచ్చిరి. అట్లు వచ్చినవారిలో సి. ఎఫ్. అండ్రూసుమహాశయుఁడును గలఁడు. అండ్రూసు, మహాత్ముని దర్శించు సమయమున నస్పృశ్యుఁ

డోకఁడు మహాత్మునియొద్దకుఁ జేరి నమస్కరించి మహాత్ముని యనారోగ్యమునకుఁ జింతాక్రాంత హృదయుఁడై కన్నుల నశ్రువు లొలుక నిలువఁబడెను. ఆ యస్పృశ్యుఁడు చేరి చెంత నిలువఁబడినంతనే మహాత్ముని వ్యాధి తగ్గుముఖము పట్టెను. ఈ దృశ్యమును గన్నులారఁ గాంచుచుండిన అండ్రూసుమహాశయుని మనస్సు ఆనందమునఁ బరవళ్ళు ద్రొక్కెను.

దేశమందలి యస్పృశ్యతారోగము మహాత్మునిఁ బీడించుచుండెను. మహాత్ముని రోగమునకు అస్పృశ్యత మూలమయ్యెను. అస్పృశ్యత నంతరింపఁ జేయుటకై మహాత్ముఁడు చేసిన సేవ యమూల్యము.

## పూనా – ఒడంబడిక

మహాత్ముఁ డారోగ్యమును బడసినపిమ్మట హిందువులు–అస్పృశ్యులు అని రెండు తెగలుగా వేఱుచేయుట తగదనియు, నిరువురు నేకజాతివార మను భావముతో నొండొరులు కలసి మెలసి యుండుట యుక్తమనియు, నట్టి భావముతో ప్రజలలోఁ గలుగునట్లు ప్రభుత్వము ప్రయత్నింపవలె ననియుఁ, బ్రబోధింపుచు నస్పృశ్యతా పిశాచమును బాఱఁద్రోలుటకై "ఎఱ్ఱవాడా" యందు నిరశనవ్రతము పూనెను. ఆ వ్రత మహిమచే హిందూమత నాయకులు ఆదిమవాస నాయకులు మహాత్ముని మతానుసార మొక యొడంబడికకు సమ్మతించిరి. అదియే "పూనా ఒడంబడిక" యను పేరునఁ బ్రసిద్ధి కెక్కెను. ప్రభుత్వముగూడ నా యొడంబడికకు సమ్మతించెను.

అస్పృశ్యత యుగయుగములనుండి భారతదేశమున

హైందవులలోఁ బాదుకొని యుండుటవలన మహాత్ముఁ డాశించిన విధమున ఫలింపకపోయెను. మూఢవిశ్వాస మావేశించిన వారికి సదుపదేశములు చెవికెక్కవుగదా !

హరిజన నామము

అందులకు, మహాత్ముఁడు వ్యాకులిత మనస్కుఁడై హైందవ సంఘమందు అస్పృశ్యులనువారు వేఱుగా నుండుట దేశమునకు శ్రేయస్సు కాదని తలంచి, 'హరిజనుల'ని మఱియొక క్రొత్తపేరునఁ బిలువఁ దొడంగెను. భారత జాతీయ మహాసభ వారు, మహాత్ముఁడు పెట్టిన యీ పేరునకుఁ బరమానందమంది యెల్లెడ ప్రచారము చేయ మొదలిడిరి. కాఁగా; భారతావని యందా హరిజన నామము ప్రసిద్ధమాయెను. "హరిజనుఁడ"ను నామము భగవన్నామముతోఁ గూడినదైనను, భగవద్భక్తి కలవారమని విఱ్ఱవీగు హైందవులకుఁ జెవి దూరకుండెను.

ఆదిమవాసులు – పంచములు – అను పేరుగాక హరిజనులను క్రొత్తపేరు కలుగుటతప్ప ప్రయోజనము శూన్యమయ్యెను. అందుచే; పేరుమాఱుటతప్ప మఱెట్టి మేలును గలుగదాయెను. అస్పృశ్యులను హరిజనులని హైందవులు వాకొనఁ జొచ్చిరి. హరియొక్క జనులని హైందవుల మనుకొనువారు తలఁపరైరి. అందుచే నాదిమవాసులు హరిజన శబ్దమువలన నినుమంతయుఁ బ్రయోజనము కానరాని కారణమున నదనముగా మాకీ హరిజననామ మేలయని సమ్మతింపరైరి.

దేవాలయ ప్రవేశము

అయినను, మహాత్ముని ప్రబోధమువలన దేశమంద చ్చోట

నచ్చుట నస్పృశ్యత నిర్మూలింపవలయునని పట్టుదల వ్యాపించిన మాట వాస్తవము. అందులకు 'తిరువాంకూరు' మొదలగు ప్రదేశములందు దేవాలయ ప్రవేశము హరిజనులకుఁ గల్పింపఁబడెను. కాంగ్రెసు ప్రభుత్వమువలన దేశమునఁ బలుతావుల దేవాలయ ప్రవేశము హరిజనులకుఁ గలిగెను. కాంగ్రెసు ప్రభుత్వము ప్రారంభించిన హరిజన దేవాలయ ప్రవేశమువలనఁ దమకు హైన్యమావరించునని కొంచెలు హైందవులు కొందఱు వ్యతిరేకించుట ప్రారంభించిరి. ఇట్టి హైందవుల వలన హిందూమత మెంతకాలము పాపపంకిలమై యుండవలయునో గదా! కట్టా! ఇట్టి చెట్ట యున్నంతవట్టు హైందవమతము వర్ధిల్లుట కల్ల సుమా! అస్పృశ్యతా పిశాచము హిందూమతమందున్నంతకాలము హిందూమతము - భారతభూమి ప్రపంచమున నెట్లు తలయెత్తి తిరుగఁగలదు? హైందవుఁడా! ఈ యస్పృశ్యత నీ మతమున నుండునంత కాలముదనుక నీకు - నీ మతమునకు - నీ దేశమునకు గౌరవము కలుగఁజాలదు. కావున మహాత్ముని దివ్యబోధామృతమును గ్రోలి యస్పృశ్యతను బాఱఁద్రోలి నిన్ను - నీ మతమును - నీ దేశమును గౌరవ ప్రపత్తుఁలతోఁ గాపాడుకొనుట నీ ధర్మముగా భావించుట మేలుసుమా!

పలుమాటలేల? మహాత్ముఁడు అస్పృశ్యతా నివారణకై తన ప్రాణములనైన నీయ నెన్నఁడు వెనుదీయఁడు ... కారాగృహమందుండియు నస్పృశ్యతా నివారణమునకై నిరశన వ్రతదీక్ష నవలంబించినప్పుడు ప్రపంచ విఖ్యాత పండితోత్తములను రావించి, కారాగృహమందలి మామిడిగున్న నీడయందు శాస్త్రచర్చ కావించి పంచములు అస్పృశ్యులు కారని శాస్త్ర

ప్రమాణములఁ జూపించి సిద్ధాంతీకరించి, భారతీయుల- హిందువుల సంశయములను బాఱఁద్రోలెను.

మహాత్ముఁ డవతారపురుషుఁ డనుట కెట్టి సందియము లేదు. అస్పృశ్యతను శాస్త్రము పాటింపకపోయినను, హైందవులు అస్పృశ్యతా నివారణకై యావచ్ఛక్తిని వినియోగించుట లేదని నిశ్చయించి, మఱల నిరువదియొక్క దినములు నిరశన వ్రతదీక్ష నిర్విఘ్నముగాఁ జేసెను. ముసలితనమునఁ బ్రాణభయ మావంతయు లేక యిరువదియొక్క దినములు నిరశనవ్రతము పూనుట మహాత్ముని గట్టి పట్టుదలను చూపెట్టుచున్నది. ఇట్టి పూనికయేగదా మహాత్ముని జీవితము రాణకెక్కుటకు మూలము!

మహాత్ముని యభిప్రాయములను గ్రహించిన, 'పుట్టుకచే నంటరానితన మంటద'ని స్పష్టమగుచున్నది. ఈ యంటరానితనము నేఁటితో నశించి వేదమతము నిష్కళంకమై యలరారుఁగాక ! యని మా ప్రార్థన.

## స్త్రీ జ న్మ ము

స్త్రీజన్మమును నిరసించు మఱియొక చెడుగు మన దేశమందుఁ గలదు. ఈ విషయమునుగూర్చి మహాత్ముఁడు "మానవుఁడు అసహానముతో నుండుటవలనఁ గలిగిన చెడుగులలో, సృష్టిలో నొక భాగమగు స్త్రీని దక్కువతనముతోఁ జూచుట యొకటి. అట్లు స్త్రీలను జిన్నచూపుతోఁ జూచు బుద్ధి మనలను హీనపఱచుచున్నది; దుఃఖము పాలుచేయుచున్నద"ని చెప్పియుండెను. ఈవిషయము ముందు ప్రకరణమున వివరింపఁబడును.

పుట్టుకనుబట్టి హెచ్చుతగ్గులు నిర్ణయించుట తప్పని మహాత్ముని నిశ్చయము. "ఎల్ల ప్రాణులను దన ప్రాణమట్లు చూచుట" యను మహా ధర్మమును ప్రబోధించిన మహాపురుషులకు జన్మమునుబట్టి హెచ్చు తక్కువలు కలుగునా ?

## ప్రేమతో చెడుగులను దొలగింపవలెను

ఇట్టి యంధవిశ్వాసములు దేశమం దున్నంతవఱకు దేశ మభివృద్ధి పొందుటకల్ల. ఇట్టి తరుణమున మహాత్ముఁ డుద్భవించి యెల్ల చెడుగులను బాఱఁద్రోలి, దేశమునకు స్వాతంత్ర్య సముపార్జమునకై పాటుపడుచుండుట మన యదృష్టము. అంటరానితనము, స్త్రీలను దక్కువ తనముస భావించుట, మొదలగు నంధవిశ్వాసములు నశింపవలయునని మహాత్ముని సంకల్పము. నిజమున కిట్టి యంధవిశ్వాములు ప్రబలుట వలననే దేశము అభివృద్ధిగచలేక పతనమునకు లోనగుచున్నది. అందుచే మహాత్ముఁడు ప్రేమానురాగములతో దేశము నుద్ధరింపనెంచి యిట్టి మూఢ విశ్వాసములు నశించుటకై భగవదాజ్ఞాబద్ధుఁడై నిరశనవ్రతము (ప్రాయశ్చిత్తము) ఆచరించుచుండెను.

మహాత్ముఁడు మన దేశమందలి దురాచారములను నశింపఁజేయుటకై పట్టిన పట్టు వీడని మహాతపశ్శాలి. మహాత్ముఁ డెప్పుడేరిని బలవంతము చేయునదిలేదు. దయార్ద్ర హృదయముతో - ప్రేమ స్నిగ్ధవాక్కులతో - సత్క్రియా కలాపముతో మంచిచెడ్డలను జూపుచు హితోపదేశము చేయుచుఁ గర్తవ్య ధర్మమును ప్రపంచమునకు బోధించుచుండెను.

మహాత్ముఁడు పుట్టి పెరిగిన కుటుంబము సనాతనాచారముల కునికిపట్టు. అట్టి కుటుంబమునఁ బుట్టియు మహాత్ముఁడు

ఇట్టి సంస్కారము గలిగి యుండుటకుఁ దల్లిదండ్రుల సంస్కార ప్రియత్వము కారణ మనుటలో సందేహము లేదు. మహాత్ముఁడు ఉన్నత విద్యాభ్యాసమునకు విదేశముల కేగినప్పుడు మహాత్ముని బంధువులు కొందఱు మహాత్ముని సోదరుని కుటుంబమును కులమునుండి వెలిఁబెట్టిరి. కొంతకాలమునకు మహాత్ముఁడు విద్యాభ్యాసము ముగించుకొని బారిష్టరు పరీక్షయందుఁ గృతార్థుఁడై మాతృదేశమునకుఁ దిరిగివచ్చినప్పుడు మహాత్ముని సోదరుఁడు జరిగిన విషయ మంతయుఁ బూసగ్రుచ్చినట్లు చెప్పి ప్రాయశ్చిత్తము చేసికొనుమ'ని బలవంతము చేసెను. మహాత్ముఁ డన్నగారి యాజ్ఞను జవదాటలేక తప్పు లేకపోయినను, నాఁటి సంఘాచారములకు విదేశయాత్ర విరుద్ధ మగుటవలన లోకమునకు వెఱచి, చేయునదిలేక ప్రాయశ్చిత్తము కావించుకొనెను. కాలమున కెదురీఁదుట తగదుగదా!

ఇంతియగాక, భారతదేశ పర్యటన సమయమున 'తిరువాంకూరు' దేశపర్యటనము గావించి తిరిగివచ్చుచుఁ గన్యాకుమారి వెడలినప్పుడు 'ఇంగ్లాండునకు వెళ్ళి వచ్చిన గాంధి' యని యచటి దేవాలయ ధర్మకర్తలు దేవలములోనికి రావలదని యడ్డుపెట్టిన మాత్రమున మహాత్ముఁడు 'వల్లె' యని దేవాలయములోనికిఁ బోవుటను మానుకొనెను. మహాత్ముని యుచిజ్ఞత ప్రశంసనీయముగదా!

ఇట్టి మూఢవిశ్వాసములు పెద్దకాలము తద్దయుఁ బేరొని యుండుటను బోఁగొట్టుట వజ్రసంకల్పముగల మహాత్మునికే తగును. అట్టి యంధ విశ్వాసముల నణచుటకు సత్యాగ్రహము సరియైన సాధనము. ఇతరులను నొప్పింపక తా నొక్కఁడు

నొావ్వచు సాధించునట్టి సత్ఫలము వేఱెద్దానియందును గాన్పిం
డని చెప్పఁగలము.

పుట్టుకనుబట్టియో, జాతినిబట్టియో యెక్కువ తక్కువలు
అను భేదభావము లేని భావుకుల జీవితమే చరితార్థ జీవితమై
దేశక్షేమమునకు - మానవశ్రేయస్సునకు - ప్రపంచ కళ్యాణము
నకు దోహదము కాఁగలదు. మహాత్ముని జీవిత మిట్టి యెడు
దుడుకులకు లోనుగాక, ఎల్లరు సమాను లనియు "ఆత్మవత్సర్వ
భూతాని యః పశ్యతిస పండితః" అను నార్యోక్తికి లక్ష్యము
కాఁగల • మహాత్ముని జీవితము పరమపవిత్రమై, ఆదర్శమై
యొప్పుచున్నది. ఇట్టి యాత్మశక్తి, ఆత్మప్రేమ గలది మహా
త్ముని జీవితము.సర్వసమత్వ బుద్ధి యుండుటయేగదా మహాత్ముల
లక్షణము !

## విద్య

జన్మ సార్థక్యమునకు విద్య సాధనము. దేహపుష్టి కాహారమువలె, జ్ఞానపుష్టికి విద్య ప్రధానము. మానవుని యజ్ఞానమును బోఁగొట్టి జ్ఞానమునిచ్చి జీవితమును సన్మార్గమున నడుపుకొనుటకు విద్య ముఖ్యసాధనము.

విద్య యనఁబుస్తక పఠనము మాత్రముకాదు. ప్రకృతి తత్త్వమును పరిశోధించి సాధించిన సత్యమును పూర్వులు, తమ ముందు తరములవారు సులభముగ గ్రహించునట్లు గ్రంథములు రచించిరి. ఆ గ్రంథములు పదార్థ తత్త్వమును బోధించునేకాని "అనుభూతి" (Realisation) అను సృష్టితత్త్వ జ్ఞానమును నిరూపింపవు. కొన్ని యెడల పుస్తక జ్ఞానము తత్త్వజ్ఞానమును వృద్ధిచేయుట కుపయోగింపఁగలదు. కాన, గ్రంథము విద్యా జ్ఞానమునకొక సాధనమగునని చెప్పవచ్చును.

పుస్తకము చేతఁబట్టకయే కాన్పించునట్టి ప్రకృతి తత్త్వమును గ్రహించి చదువుకొనిన వారికంటె నెక్కువ ప్రయోజనమును బొందినవారు పలువురు కలరు. మన దేశమందు స్త్రీలలోఁ గొందరు పుస్తకముపట్టి చదివినవారుకారు. వారిలోఁ బలువురు స్త్రీలు, జీవితములో విద్యా ఫలమును, పుస్తకములను జేతఁబట్టి

రాత్రింబవళ్ళు చదివి పరీక్షలందుఁ గృతార్థులైన మగవారి జ్ఞానముకంటె నెక్కుడు జ్ఞానము కలవారు కలరు.

విద్య యనఁ బుస్తక పఠనము మాత్రముకాదు. జ్ఞాన విజ్ఞానములని విద్య రెండు విధములు. అందు "ఐహిక పదార్థ తత్త్వము బోధించునది విజ్ఞానమనియు, పారమార్థిక తత్త్వము బోధించునది జ్ఞానమ"ని యుఁ ప్రాజ్ఞులు చెప్పుచుందురు. కావున జ్ఞాన విజ్ఞానముల కధిష్ఠాన దేవతయగు విద్యాదేవిని నెల్లరు నుపాసింపవలయును. విద్య నెల్లరును నేర్వవలయును. పుస్తక జ్ఞానము లేక లోకవాసనా ధర్మముచే సంసారమును సాగించు కొనుచు బిడ్డలను గని యితరులను ప్రేమించుటయందు దార్ఢ్య కలవారికంటె నెల్లప్పుడు పుస్తకములను మాత్రము చదివి పట్టములను బొంది యితర ప్రాణులను దనయట్లు ప్రేమింపని వాఁడు విద్యాగంధము గలవాఁడెట్లగును? అంతియకాని పొత్త ముల పొత్తులను ముందిడుకొని పట్టములకొఱకు విద్యాలయము లందుఁ జదువుకొనునట్టి విద్య విద్యకానేరదు. గ్రంథములందలి యక్షరములమీఁద బుద్ధి నిలుపక, అర్థముమీఁద బుద్ధినిలిపి చదివిన చదువు సార్థకమగునుగాని; జీవితమునకు సరిపడనట్టి యర్థములేని చదువు వ్యర్థముగదా!

## ప్రకృతియే పాఠశాల

సత్యమైన చదువు ప్రకృతియందుఁగలదు. ఆ ప్రకృతి తత్త్వ ప్రతిబింబమే గ్రంథమనుఁడు, అక్షరమనుఁడు. పర్వతా రణ్యములు-నదీసాగరములు-చరాచరములు మొదలగు సమస్త స్త్రీ పురుష భేదము గలిగి యొప్పునట్టి యీ ప్రకృతి కళాశాల యందుఁదాను లోకపుఁబోకడను దెలిసికొను ఛాత్రుసిసచ్చరిత్రమే

దొడ్డది. ఈ ప్రకృతితత్త్వ కళాశాలయందుఁ జేరి లోకప్రవృత్తి తత్త్వబోధకునియొద్దఁబర తత్త్వ విషయమును శిష్యుఁడు చదువుకొని విజ్ఞాన పరీక్షయందుఁ బట్టభద్రుఁ డగుటయే గొప్ప. అట్లు, పట్టభద్రుఁడైనవాఁడు మన గాంధిమహాత్ముఁడు.

గాంధిమహాత్ముఁడు చిన్నతనమున వీధిబడియందుఁ జదువుకొని పిమ్మట నాంగ్లపాఠశాలయందుఁ జేరి నేఁటి యాంగ్ల విద్యను జదువుకొనెను. దక్షిణాఫ్రికాయందు ప్రకృతితత్త్వ విద్యాజ్ఞానమును సంపాదించెను. ఈ ప్రకృతితత్త్వ విద్యాజ్ఞానమువలన మహాత్ముఁడు ఎల్లప్రాణులను ప్రేమించునట్టి జీవితముగలవాఁడై బ్రాహ్మణుఁడయ్యెను.

పూర్వకాలమున మన దేశమందు జ్ఞానవిజ్ఞానములను నేర్పు పాఠశాలలు కలవు. కాలవశమున దేశము పరాధీనమగుటచే నా బడులు నాశనమై వానికి బదులు ప్రభుత్వ పాఠశాలలు కుక్కగొడుగులవలె వెలసినవి. ఇందు కొంచెమైనను మన జాతీయవిద్య కానరాదు. కావుటంజేసి మనము జ్ఞానవిజ్ఞానముల కెంతయో దూరమైతిమి ఈ చదువులవలన 'అనుభూతి'యను పరమ విజ్ఞానము పట్టుపడుట కల్లయగుచున్నది. ఈ కల్ల చదువులు చదువుకొని పట్టభద్రులై కాలము గడుపుకొనుట కష్టమగుచున్నది నేటి మన విద్యార్థులకు.

జాతీయ ధర్మమును బోధించు విద్యలు మన కావశ్యకము. ఆ విద్యల నార్జించుటకు ప్రాచీనకాలపు వీధిబడులు — గురుకులములు మన కెంతేని యావశ్యకము. అట్టి విద్యవలన మన జాతీయత యభివృద్ధి కాఁగలదు.

తన చిన్నతనమున వీధిబడియందు జాతీయ విద్య

భ్యాసము చేసియుండుటచే మహాత్ముఁడు మహాత్ముఁడగుటకు గారణమయ్యెనని తలఁపవచ్చును. నేఁటి విద్యాలయములు విద్యార్థులకు జ్ఞానప్రదములు గాకున్నవి. నాఁటి వీధిబడుల చదువులు విద్యార్థి యాత్మజ్ఞానమునకు దోహదముగా నుండెడివి. నేఁటికాలపు చదువులు పరప్రభుత్వ పుణ్యమాయని పురాణవిద్యలై యీ కల్ల చదువులు మనకుఁ దెల్లమయినవి.

నాఁటి వీధిబడి చదువు మూలముననే గాంధిమహాత్ముఁడు జాతీయ భావములు గలవాఁడగుటకుఁ, గారణమనియు మన మూహించుకొనుటకుఁ గారణమగుచున్నది.

నాఁటి వీధిబడి చదువు చదువుకొనుచు నింటియొద్ద మహాత్ముఁడు పురాణ గ్రంథములను జదువుకొనుచు వినుచు నుండెడివాఁడు.

గాంధీమహాత్ముఁడు వీధిబడియందుఁ జదివి యాంగ్ల పాఠశాలయందుఁ బ్రవేశించి యందు జదువుకొనుచుఁ గ్రమముగా నా పాఠశాల విద్యను బూర్తిచేసి, పిమ్మట నాంగ్లదేశమున కేఁగి, 'బారిష్టరు' పరీక్షయందుఁ గృతార్థుఁడయ్యెను. ఈ యన్య భాషాభ్యాసమువలని యనర్థకమును తరువాత జీవితమున మహాత్ముఁడు తెలిసికొనఁ గలిగెను.

మహాత్ముఁడు దక్షిణాఫ్రికాలో ప్రజాసేవకుఁ గడంగక పోయెనేని మహాత్మునకు జాతీయ విద్యా ప్రభావము తెలియక పోయెడిది. అప్పటినుండి నిజమగు విద్య యిదికాదని యెఱింగి మహాత్ముఁడు జాతీయ విద్యా వికాసమునకుఁ బ్రయత్నింప నూహించెను.

## దేశభాష

ప్రకృతి ననుసరించి దేశములు భేదించినట్లే, ఆయా దేశములకు భాష-జీవనము-సంప్రదాయము భేదించినవి. ఆ ప్రకృతి కనుగుణ్యముగా జీవితములు నడుపుకొందుమేని దేశ మభివృద్ధికి రాఁగలదు. దేశముతోఁబాటు దేశభాషలు-దేశాచారములు-జాతీయ భావములు పెంపొందఁగలవు. జాతీయ భావములేని జాతి నిర్వీర్యము కాఁగలదు.

ఈ ప్రకృతితత్త్వ జీవితము, దేశ గౌరవమునకు మూలము—ఆత్మవికాసమునకు ఆలంబము. ఈ ప్రకృతి తత్త్వమునకు దూరమైన జీవితము దేశగౌరవ నాశనకరము; ఆత్మవికాసమునకు ఆఘాతము.

ఈ ప్రకృతితత్త్వమును గ్రహించుమార్గమేది ? ఆ మార్గము చూప సమర్థమగునదేది? ప్రకృతి తత్త్వమునుబట్టి పుట్టిన దేశభాష ప్రకృతితత్త్వము బోధించును. ప్రకృతి జీవితమునకుఁ బ్రప్రథమముగా నావశ్యకమగునది దేశభాషయందలి ప్రేమ. దేశభాషమీఁద భక్తిప్రేమలు కలిగెనేని, తక్కిన జాతీయ భావములు తమంతట తామే పట్టుపడును. తన గొప్పతనమును విప్పి చెప్పునది దేశభాష. దేశభాష మాతృభాషయని భావింపఁబడుటకుఁ గారణమేమి? తల్లికడనుండియేగదా బిడ్డఁడు తన భావి జీవితసౌభాగ్యమునకుఁ గావలసిన విజ్ఞానబీజములను సంపాదించుకొనును. మన పండితులు దేశభాషలందుఁ గబ్బము లెందుకుఁ జెప్పిరి? ప్రజాజీవితము ప్రకృతి తత్త్వమునకు హత్తుకొనుటకే వారు పొత్తములు వ్రాయుట! ఉచ్చారణ - భాష-వేషము, ప్రకృతి స్వభావ జన్యములేగదా! కనుకనే నన్నయ

భట్టారకులు 'స్వస్థాన వేషభాషాభి మతాస్సంతోరస ప్రలుబ్ధ ధియః' అని వ్యాక్రుచ్చిరి. ప్రజా జీవితావసరములకు జతుష్షష్టి కళలు ప్రకృతి లబ్ధములు. అట్టి ప్రకృతి లబ్ధములగు కళా రహస్యమును గుఱుతెఱుంగవలయున్, ప్రకృతి తత్త్వమున కనుగుణ్యమయిన స్వీయభాషను మఱచుటయెట్లు? పెంపొందింపక యుండుటెట్లు? భాషనుబట్టి, దేశగౌరవ మభివృద్ధి, గాంచును. దేశగౌరవమునుబట్టి, భాష యభివృద్ధియగును. ఇట్లు, దేశము-భాష యొకదానికొకటి యభివృద్ధి కారకములై వర్థిల్లుచుండ, దేశభాషను వదలి యన్యభాషా దేశముల నాదరించుట యభివృద్ధి గాముల లక్షణమగునా? ఈ యథార్థమును మన గాంధి మహాత్ముఁడు తాను జాతీయ జీవితమును ప్రారంభించినప్పుడు స్పష్టముగా గ్రహించెను. తా నెఱిఁగిన యథార్థమును నితరులకుఁ దెలియఁజెప్పి దేశభాషలను ప్రేమింపవలయునని ప్రబోధింప నారంభించెను. మహాత్ముఁ డెప్పుడును సత్యమును, లక్ష్యమును సాధించుటకుఁ బ్రయత్నించువాఁడని మహాత్ముని జీవితమువలన మనము గ్రహింపఁగలము. సత్యసాధనమునకై మహాత్ముఁడు చేయు కృషి యపూర్వమని మన మెల్లరెఱిగిన విషయము. సత్యమును సాధించుటకై మహాత్ముఁడు తన ప్రాణమునుగూడ లెక్కసేయఁడుగదా! మహాత్ముని మాతృభాషాభిమాన మెనలేనిది. దేశభాషల నభివృద్ధికై మహాత్ముఁడు పడరాని పాట్లుపడెను. మాతృభాషాభిమానము లేనివాఁడు మాతృదేశాభిమాని కాఁజాలఁడు. దేశము, పిమ్మట దేశభాషను ప్రేమించు జీవితమే జీవితము.

మహాత్ముఁడు తన మాతృభాషాభిమానమును బలుతడవలు పలుతావుల స్పష్టపఱచియుండెను. మాతృభాషా

ప్రేమను పలుచోట్ల తెలియఁజేసెను. మహాత్ముని మాతృ భాషాప్రేమను నొకటి రెండు ఉదాహరణములను దెలిసి కొందము.

మహాత్ముఁడు చాలకాలము దక్షిణాఫ్రికాయందుండి, తన మాతృ దేశమునకు తిరిగివచ్చినప్పుడు స్వాగతసభలు పెక్కుచోట్ల జరుపఁబడెను. ఆ సభావేదిక యందలి పెద్ద లందఱి నాలుకలమీఁద నాంగ్లభాష యధికారము నెఱపు చుండెను. ఆ వచ్చిన ప్రజాసమూహమును జాలవఱకు నాంగ్ల వేషామయులై యుండెను. చాలకాలము విదేశమందుండివచ్చిన మన గాంధిమహాత్ముఁడు తన మాతృభాషయందే మాటాడెను మొట్టమొదటగా బొంబాయిలో జరిగిన స్వాగత సన్మానసభను గూర్చి 'ఆత్మకథ'యందు "సమాధానమిచ్చువంతు నాకు వచ్చి నపుడు నేను గుజరాతీ భాషయందే మాటాడితిని. గుజరాతీ లుండిన సభలో నాంగ్లము మాటాడుటను మానివేసితిన"ని వ్రాసియుండెను.

తమిళదేశ సంచారములో మాయవరమను గ్రామ మందు మహాత్మునికిచ్చిన స్వాగతపత్రమునుగూర్చి యిచ్చిన సమాధానమున,

"స్వాగతపత్రము ఆంగ్లభాషలో నచ్చొత్తింపఁబడినది. భారత జాతీయ మహాసభయందు స్వదేశీయోద్యమము తీర్మా నింపఁబడినది. మీరు స్వదేశీయులని తెలిసియు, ఈ స్వాగత పత్రము నాంగ్లభాషయందుండుటవలన నేను స్వదేశీయుఁడను కాకపోవుచున్నాను. ఆంగ్లభాషకు వ్యతిరేకముగాఁ జెప్పుటలేదు, మీరు మీ దేశభాషను జంపి, దాని సమాధిమీఁద నాంగ్ల

భాషనునుంచఁబిలఁచిన యెడల మీయీ స్వదేశీయోద్యమమును నిర్విఘ్నముగాఁ గొనసాగింపలేరని నేను దలఁచుచున్నాను. (వినుఁడు. వినుఁడు) నాకు మీమాతృభాష యరవము తెలియదని తెలిసినప్పుడు నాకాభాషను నేర్పుటకుఁ బ్రయత్నించి, ఆ భాషను మాటాడుటకు నన్నుఁ బ్రేరింపరేఁడు. ఆ యరవ భాషయందు స్వాగతపత్రమిచ్చి, భాషాంతరీకరణముతో నాకుఁ జెప్పినచో మీ బాధ్యత నెరవేర్చిన వారయ్యెదరు" అనియు, మఱియొక తావున,

"మాతృభాషలో బిడ్డలను జదివించుట ముఖ్యము
మాతృభాషను దృణీకరించుట దేశద్రోహము."

అనియు మహాత్ముఁ డుద్బోధించెను.

కలకత్తా నగరమందు 1901వ సంవత్సరమున జరిగిన జాతీయ మహాసభయందు గోపాలకృష్ణగోఖలే మహాశయుఁడు, గాంధిమహాత్ముఁడును దక్షిణాఫ్రికా భారతీయులకడగండ్లను నివేదించుటకు వెళ్ళియుండిరి. ఆ మహాసభయందలి యుపన్యాసములన్నియు నాంగ్లభాషామయములై యుండుటచే మహాత్మునకెంతయో హృదయ సంతాపమును గలిగించెను. ఆ విషయమై యాత్మకథయందు "ఇంగ్లీషు భాషయొక్కయధికారము చూచితిని. దానిని చూడఁగా నా కపుడే దుఃఖము వచ్చెను" అని చెప్పుకొనెను. నాఁటి సభలో మహాత్ముని మనస్సెట్లు బాధపడెనో పై మాటలవలనఁ దెలియుచున్నది. కాంగ్రెసు సభలందు దేశభాషలో మాటాడుటకు మహాత్ముఁడు నాయకులను కోరెను. నాయకులును సాధ్యమగునంతలో హిందీలో మాటాడు

టకుఁ బూనుకొనిరి. నేఁడు మన భారతదేశభాష లభిమానింపఁ బడుటకు మన మహాత్ముఁడే కారణభూతుఁడు.

దక్షిణాఫ్రికాయందు భారతీయ బాలురకుఁ దమమాతృ భాషా మూలముననే విద్యలఁ గఱపించెను. అందులకు వలయు పాఠశాలలను స్థాపించెను. ప్రప్రథమమున బాలుఁడు మాతృభాష యందే విద్య నేర్వవలయునని తలంచి యచ్చట జాతీయ విద్యా లయములను నెలకొల్పుటవలననే మన దేశభాషల కీనాఁడు ప్రేమించుట కవకాశములభించినది. లేనిచో దేశమేమయ్యేడిదో, దేశభాష లేమయ్యేడివో యూహాకందని విషయముగాఁ బరిణ మించెడివి. ఇంతకు, మాతృభాషాభిమానము దేశీయుల హృత్ఫ లకమున నాటిన మహాత్ముని మేలు ప్రపంచ మున్నంతకాలము మరువరానిది.

మాతృభాషను విడిచి యాంగ్లభాషను నభ్యసించుట వలన ప్రయోజనము శూన్యము. మన మాతృభాషల నభ్య సించుటవలన ప్రయోజన మనన్యముగదా !

మహాత్ముఁడు మాతృభాషావశ్యకత గూర్చియు విదేశ భాషల నెంతవఱకు నేర్వవలయును, అను విషయములను గూర్చియు, విద్యా విషయక విషయములను గూర్చియుఁజెప్పిన వానిలోఁ గొన్నింటిని నిట పొందుపఱచుచుంటిని.

"మన పాలకులు తమ మాతృభాషయగు నాంగ్లభాషను మన భారతదేశమందు విస్తరింపఁ జేయుచుండుటచే మనదేశ భాష లభివృద్ధినందఁ జాలకున్నవ"ని కొందరు చెప్పుకొనుటను నేను వింటిని. పాలకులు తమ భాషను విస్తరింపఁజేయుచున్నా రనుటను నేనొప్పుకొనను. మీ రెందులకా భాషను నభ్యసింప

వలెను? పాలకు లొకవేళ తమ భాషను విస్తరింపఁజేయఁదలఁచి నను మన మాతృభాషను నభ్యసింపక మన మాతృభాషనే యభ్యసించినచో మన దేశభాష యభివృద్ధి పొందఁగలదని నా యభిమతము."

"మనము చదువుచున్నది యాంగ్ల విద్య. ఏఁబది సంవత్సరములుగా మాతృభాషనే యభ్యసించుచున్నచో మన మెంతటి గౌరవము గలిగియుండెడి వారమో కదా! మన మీపాటికి స్వతంత్ర భారతదేశమందుండెడి వారము."

"ఏఁబది సంవత్సరములనుండి మాతృభాషను నభ్యసించుచున్న యెడల, మన పెద్దలు, బంధువులు, మిత్రులును మాతృభాషయందు విజ్ఞాను లయ్యెడివారు. జగదీశచంద్రబోసో-రాయో కనుఁగొనిన నూతన సిద్ధాంతములు రామాయణ భారతములవలె నింటింటను బూజలందుకొని యుండెడివి."

"మాతృభాషలు పెంపొందించుటకు మాతృభాషా గ్రంథాలయములను స్థాపింపఁ దలఁచితిని."

"అన్యభాషా వ్యామోహమునుచే భారతీయులు భారత జాతీయతకు నెడమగుచున్నారు. కావున భారతీయులు అన్య భాషాభ్యాసము నింతటితో మాని తమతమ దేశభాషల నభ్యసించి దేశగౌరవమును బెంపొందింపఁ బ్రయత్నించుట ప్రతి భారతీయుని విధి."

"మాతృభాషవలన బుద్ధి వికాసము కలుగునట్లు అన్య భాషలవలన గలుగఁజాలదు. అన్యభాషోద్దేశ్యములను మాతృ భాషయం దనువదించుకొనుటయందలి మార్పే యిందులకు గారణము."

"అందుచే మాతృభాషలను విడిచి, పెఱ భాషలను దీనులమై ఆశ్రయించుట తెలివిమాలిన పని."

"ఆంగ్లభాషను నభ్యసింపక మాతృభాషను నభ్యసించి నచో భారతదేశమునకు మేలు చేకూరఁగలదు. పాఠశాలల యందు, కళాశాలలయందు నాంగ్లభాష మూలముననే విద్య గఱపఁబడుచున్నది. అందుచే నాంగ్లము ప్రజా సామాన్య భాషగా మాఱఁగలదు. మన గొప్పభావములన్నియు నాంగ్ల భాషా మూలముననే వెలువరింపఁ బడుచున్నవి. పెద్దపెద్ద కుటుంబములందు నాంగ్లము మాతృభాషగా మారునని లార్డు జేమ్సుఫర్డు నమ్ముచున్నాఁడు. ఆంగ్లభాషయం దుత్తీర్ణులము కావలయునను నమ్మకమే మనలను దాసులను చేయుచున్నది. ఆంగ్లభాష మనఁను దేశసేవ చేయుటకు అనర్హులనుచేయుచున్నది. ఈ యాంగ్లభాషా మూలమున బీదల సంఘము మనలనుండి వేఱగుచున్నది. ఈ భాష పేదల కందరానిదిగదా!"

"నేఁటి బోధనా పద్ధతులు బాలుర బుద్ధి వికాసములకు దోడ్పడునవి కాఁజాలకున్నవి. మాతృభాషా సహాయ మపేక్షింపకయే యాంగ్లము గఱపఁబడుచుండుటవలన బుద్ధివికాసమెట్లు కలుగఁగలదు? ఆదిలో అన్యభాషా మూలమున విద్య గఱచుట యెంతేని వెఱ్ఱి."

"ఈ యన్యభాషాభ్యాస ప్రణాళికా విశేషముచే మన మాతృభాషలకు దూరమగుచున్నాము. ఈ పద్ధతి, ఘాతుక పద్ధతిని మించిపోవుచున్నది. ఈ యాంగ్లభాషవలన మన మాతృభాష లడుగంటుచున్నవి. నా కధికారమున్నచో నీ పాఠశాలల

నింతటితో మూసివేసి జాతీయ విద్యాలయములను నెలకొల్పుదును."

"లోకమాన్య బాలగంగాధరతిలకు మహాశయుఁడు, రాజా రామమోహనరాయ్ ఆంగ్లభాషయందుఁ జేసినకృషియే మాతృభాషయందుఁ జేసియుందురేని యింకెంతయో మహాపండితులై యుండెడివారు ... నే నాంగ్లభాషను నిందించుట లేదు. ఆంగ్లభాషాభ్యాసనా పద్ధతిని భారతీయులు విడనాడవలయునని కోరుచున్నాను. అంతేయకాని యాంగ్లమును నిర్మూలింపఁ దలఁచుటలేదు. భారతీయ పద్ధతిని ఆంగ్లమును జనువు కొనుఁడు. ప్రజాసామాన్యముమీఁద, చైతన్యుఁడు, శంకరుఁడు, కబీరు, నానకు మొదలగువారికిఁగల సంబంధము బాలగంగాధర తిలకు, రామమోహను మొదలగువారికి లేదు. ఆ సింహముల ముందు వీరెంతవారు? శంకరాచార్యుఁ డొక్కఁడు చేసిన పనికి సమానముగా నాంగ్లము చదివిన పండితులు చేయలేరు. గురుగోవిందుఁ డాంగ్లమందు పండితుఁడా? ... రామమోహనరాయ, తిలకుమహాశయులు నాంగ్లముజోలికి పోక, తమ మాతృభాషయందుఁ బాండితిని గడించి యుండినయెడల చైతన్యునివలె మహాజ్ఞాను లయ్యెడివారు. ... ఆంగ్లవిద్య మన యాత్మశక్తిని నమ్మ చేయుచున్నది. మన జ్ఞానమును నశింపఁ జేయుచున్నది.

"ఆంగ్లభాష లేనిచో ప్రభుత్వ పరిపాలనా యంత్రమును జరుప వలనుపడదని కొందరు భయపడుచున్నారు. బాలురు పెండ్లిండ్లకై యింగ్లీషును జదువుచున్నారు. ఆంగ్లేయులతోడనే యాంగ్లములో మాటాడవలయునని యాంగ్లము నభ్యసించుటకు స్త్రీలు అభిలషించుచున్నారని నే నెఱుఁగుదును. తమవారితోఁ

దమ మిత్రులతోఁ దమతమ భార్యలు ఇంగ్లీషు మాటాడలేక పోవుటకుఁ ఖిన్నులగు భర్త లుండుటయు నాకుఁ దెలియును."

"ప్రస్తుతము ఆంగ్లభాషయే చదువఁబడుచున్నది."

"మాతృభాషను నిరసించుటను జూడ నా మనస్సు ఖేదపడుచున్నది. తల్లిదండ్రులు తమ బిడ్డలకును, భర్తలు తమ భార్యలకును జాబులు మాతృభాషయందు వ్రాయక యాంగ్లమందు వ్రాయుదలంచుటను నా మన సొప్పకున్నది.

"పిల్లలకు ఆంగ్లభాషను నలవడఁజేయు విషయములో మిత్రుఁడు పోలకు మహాశయునితో నే ననేక పర్యాయములు వాదించియున్నాను. బాల్యముననే యాంగ్లభావములు కలుగుటకును, వెలువరించుటకును బాలురకు నలవఱచుచున్న భారతీయ మాతా పితరులు బాలురను, దేశమును వంచించుచున్నారని నా తలంపు. ఆ తల్లిదండ్రులు బిడ్డలను దేశాచార సంప్రదాయముల నుండి వేఱుచేసి దేశసేవకే యనర్హులనుగాఁ జేయుచున్నారు. అందుచే నేను బాలురతో మాతృభాషయందే మాటాడుటకు నిశ్చయించితిని."

పై ప్రసంగములవలన గాంధిమహాత్ముఁడు నేటి విద్యా విధానముమీఁద జూపుచున్న యభిప్రాయమును దేశీయ విద్యా విధానముమీఁదఁ జూపుచున్న యభిప్రాయమును మనకు స్పష్టమగుచున్నది. మహాత్ముఁడు ఆంగ్లభాషయందుఁ బండితుఁడని లోక మెఱుఁగును. విదేశములలోనుండి యావిదేశాచార వ్యవహార సంప్రదాయములు బాగుగాఁ దెలిసికొనినవాఁడు మన మహాత్ముఁడు. ఆ యనుభవములు ముందు రాఁబోవు వారికి మిక్కిలి యుపకరింపఁగలవు. గాంధిమహాత్మునకు ఆంగ్ల

భాషమీఁద నెట్టి ద్వేషము లేదనియు, ఆ యాంగ్లము ప్రయో జనము లేదని తలఁచువాఁడును గాదనియు పై నుదాహరించిన మహాత్ముని ప్రసంగములే స్పష్టపఱచుచున్నవి.

మహాత్ముని మాతృభాషాభిమానము అసదృశము. ప్రకృతి తత్త్వమునుబట్టి దేశములు భేదించినట్లు, దేశభేదముల ననుసరించి యా యా దేశముల ప్రకృత్యనుసారముగా భాష లుద్భవిల్లినవి. అందుచేఁ బ్రకృతి ననుసరించి పుట్టిన దేశమును, భాషను బ్రేమించుట యా యా దేశములం దుద్భవించిన వారు తమ మాతృదేశమును, మాతృభాషను గౌరవించుట ప్రతి మానవుని విధియనియు, దేశ స్వాతంత్ర్యమును సాధించుట కిది యొక తరణోపాయ మనియు మహాత్ముని యభిప్రాయము.

మున్ముందట మాతృభాషను నేర్చి, యందలి గొప్ప తనమును గ్రహించి, తరువాత నితరభాషల నేర్చినఁ బ్రయో జన ముండును గాని; తొలుదొల్తనే యన్యభాషను నేర్చుట వలనఁ దన భావములను విప్పిచెప్పు నేర్పు మాతృభాషవలనఁ గలిగినంతగాఁ గలుగఁజాలదు. అందుచే మాతృభాషను నేర్చి, అందు నైపుణ్యము సంపాదింపవలయును. అట్లు నేర్వవలయు ననిన మాతృభాషయం దభిమాన మావశ్యకముగదా!

అట్టి యభిమానమే మన యందఱి హృదయములందుఁ బాదుకొనినయెడల మన మాతృభాషాభివృద్ధి కిఁక నడ్డులేదు గదా! ఈ యాంగ్లభాషా వ్యామోహముచే నీవు నీ దేశ భాషల కెంతటి యంతరాయము తెచ్చిపెట్టినావో తెలిసి కొనుము. పండితుఁడన నాంగ్లభాషా వేత్తయని నేఁడు మనము పరిగణించుటకు మాతృభాషాభిమాన శూన్యతయే కారణము

గదా! దేశభాషలందు లేని గౌరవ మీ యాంగ్లభాషయం దొక్క దానియందే కలదని యనుకొందువేల? సమవాయి సంబంధముచే హితమహితమగు నను చందమునఁ దెలివితక్కువ తనముచే మన భాషను మన మీసడించుట పాడియా? మన భాషయందు లేని గొప్పతన మీ యాంగ్లభాషయం దేమి గలదు?

పూర్వమీ యాంగ్లభాష మన దేశమునఁగలదా? బుద్ధ శంకర రామానుజాది మతప్రవక్తలెందరు మాతృభాషా మూల మున నెంతటి విజ్ఞాన స్వరూపులైరో యప్పుడే మఱచిపోతివి కాఁబోలు? మన ప్రాచీన కవిపండిత చక్రవర్తులందఱు ఆంగ్ల భాషా మూలముననే యింతటి వారైరని యమాయకబుద్ధినిదలంచు చున్నావా? నీ యీ యమాయకబుద్ధియే నీ గౌరవమునకు హానికరమని తలంపలేకున్నాఁడవు! లేనిచో, నీవు పుట్టిపెరిఁగిన మాతృదేశమందు నీకు- నీ భాషకు గౌరవము లేకపోవుటకుఁ గారణమేమి? నీ మూలమున నెంతయో యభివృద్ధిపొందవల సిన నీ తల్లిభాష నేఁడు నీ మూలమున నెంతయో హైన్య మనుభవించుచున్నదిగదా! ఈ యాంగ్లభాషా మూలమున నీ జాతీయత-నీ భాషయును నాశమగుచున్నవి. నీకిఁక గౌరవ మెక్కడ? ముందువెనుకలాలోచన లేనివాఁడవై యింగ్లీషు బడులయందలి బల్లలమీఁదఁ గూర్చుండుట గౌరవమని పిచ్చి నమ్మకముతోఁ దలపోయుదువుకాని, నీ వీధిబడులయందలి చాపల మీఁదఁ గూర్చొనుట గౌరవమని తలపోయవు? మాతృభాషాభి మానము లేక యాంగ్లము నభ్యసించుదనుక నీవు నిజమగు భారతీయుఁడవు గావనుట నిక్కము.

విద్యార్థి సోదరుఁడా! ఈ మా పలుకులచే నాంగ్ల భాషను నిందించుచున్నారమని నీలాపనిందలు మాపై మోపకుము. ఇంగ్లీషుభాష పఠనీయము కాదని మే మెన్న టికిఁ జెప్పము. నీ మాతృభాషయందు - నిన్నుగ్గుబాలతోఁ బెంచి పోషించిన నీ తల్లి భాషయందు-విజ్ఞానము సంపాదించుకొనక యితర భాషల నాశ్రయించుట ధర్మదూరమని తెలుపుచున్నారము. ఆంగ్ల భాష చదివినఁగాని గౌరవముఱాఁజాలదని వెఱ్ఱి వ్యామోహమునఁబడి నీ భాషను నశింపఁజేయ నుంకించుట యవివేకము. ఆంగ్లము వచ్చినఁ, బండితుఁడను గాఁగలనని నీ గర్వము కాఁబోలు? నీ ప్రాచీనపండితు లెల్లఱు, ఆంగ్ల మెఱిఁగిరా? వారలు తమ మాతృభాషామూలమున నెంతటి విజ్ఞాన ధనులై ధన్యులై రో యెఱుంగుము. మృదుమధురముగా శాకుంతల నాటకము రచించిన కవికుల సార్వభౌముఁడు కాళిదాసు, ఆంగ్ల భాషా విశారదుఁడా? ఆదికావ్యము రామాయణమును సృష్టించిన వాల్మీకిమహర్షి యాంగ్లభాషావేత్తయా? పంచమవేద మనఁబరఁగిన మహాభారతమందు ధర్మోపదేశము గావించిన వ్యాసుఁడు ఆంగ్ల కళాశాలా పట్టభద్రుఁడో కో! తియ్యని పలుకులతోఁ, వెన్నెలవంటి చల్ల నిభావములతోఁ బ్రసన్న కలితార్థయుక్తి భారతము తెలుఁగున వెలయించిన నన్నయ భట్టారకులు ఆంగ్ల కవితా ఛందః పాండితీమండితుఁడా? సుస్థిర హైందవ సామ్రాజ్యమును సంస్థాపించిన ఛత్రపతి శివాజి, యాంగ్ల రాజకీయ చతురుఁడా? ప్రపంచ ప్రఖ్యాతితో ప్రజారాజ్యమేలిన యశోక చక్రవర్తి యాంగ్ల భూపాలనా శాస్త్రచాతురీధురీణుఁడా?

భారతీయ విద్యార్థి సోదరుఁడా! పెక్కు పలుకులేల ? నీ ప్రాచీనులెవ్వరు ఆంగ్ల భాషను నెఱింగినవారు కాదుగదా!

వారు నీ దేశమునకు—నీ భాషకు—నీకు నెంతటికీర్తి సంపాదించి పెట్టిపోయిరో తలంచుకొనిన నొడలు పులకరించును గదా! కావున; నాంగ్ల భాషయే నీకవశ్య పఠనీయము కాదు; నీ మాతృభాషను నభ్యసించి నీ ప్రాచీనులవలె నీవును యశోవిశాలుండవై వర్ధిల్లుము !!!

## విద్య విజ్ఞానము

ఏండ్లతఱబడి చదివి యేదియో యొక పరీక్షయందు తీర్ణుడవైనంత మాత్రమున ఫలము కలుగఁబోదు. సౌజన్య సౌశీల్యాది సద్గుణములుగలిగి సత్ప్రవర్తనానురక్తుఁడగుదువేని నీ నేర్చినవిద్య రాణింపఁగలదు. సద్గుణములు నేర్పని విద్య విద్య కానేరదని మహాత్ముఁడు చెప్పియుండెను. మహాత్ముఁడు తన తనయునకు వ్రాసిన యుత్తరమును జదువుకొనుము. విద్యయన నెట్టిదో స్పష్టము కాఁగలదు. మహాత్ముఁడు వ్రాసిన యుత్తరమునందు,

"విద్యయన జ్ఞానమును గ్రమక్రమముగా బెంచుకొనుట యని నా యభిప్రాయము" పరీక్షలకుఁ జదువు చదువు కాఁజాలదు."

"విద్య యననేమి? ఇతరులకై జీవించి సేవచేయుట; ఆ సేవకుఁ బ్రతిఫల మపేక్షింపకుండుట. నీకు వయస్సు వచ్చిన కొలఁది యిందలి సత్యము బోధపడును."

"నీవు ఏ తరగతియందుఁ జదువుచున్నావని నిన్నెవరైనఁ బ్రశ్నించినప్పుడు నీవు సిగ్గుపడక, బాబుగారి—తండ్రిగారి (గాంధీ మహాత్ముని బంధువులు, మిత్రులు మొదలగువారు 'బాబు' అని

పిలుచునలవాటు కలదు) తరగతియందు జమయుచున్నానని ప్రత్యు త్తరమిూయుము, పరీక్షల చదువునకై వ్యథపడకుము." అని వ్రాసిన విషయమును గ్రహించుచో విజ్ఞానమిచ్చునది చదువు కాని పరీక్షలందు త్తీర్ణత నిచ్చునది చదువుకాదని స్పష్టమగు చున్నది.

విద్యయన నేమో కొంతవఱకుఁ దెలిసికొంటిమి. అనా సక్త బుద్ధితోఁ బ్రపంచ సేవచేయఁదలఁచుట విద్యయన వచ్చును. నీవీ విద్యాలక్షణములను గుఱితించి ముందు జీవితము నందు నలవఱచుకొనుట మంచిది.

కొందఱు, అనవరతము గ్రంథపఠనాసక్తులై యుందురు. కేవల గ్రంథపఠనానుభవము జీవితమునకు సహకారి కాఁజాలదు. నిశ్చలబుద్ధితో గ్రంథమందలిసారము గ్రహించి తనజీవితమందుప యోగించుకొనవలెను. జీవిత సౌభాగ్యమును బెంపొందించు నదియే విద్య. కావున, కేవలము గ్రంథపఠనము మాత్రము విద్యయనఁ జెల్లదు. "నా విద్యాభ్యాస కాలమందు నేనెన్నఁడును పాఠ్య పుస్తకములఁదక్క తక్కిన పుస్తకములఁ జదివియెఱుఁగను. తఱువాతి కాలమందుఁ జదువదుమనిన అట్టి యవకాశము లభింప లేదు. అందుచేత నా కదియొక కొఱఁతయని తలఁపవచ్చును. అయితే, ఈ కొఱఁతచే నాకెట్టి కొఱతయుఁగలుగలేదు. పాఠ్య గ్రంథములవలన నా నేర్చినకొలఁది చదువు నాయందుఁ బరిపక్వత పొందఁగలిగె"నని మహాత్ముఁడు తన యాత్మకథయందుఁ జెప్పి యుండెను. ఆత్మజ్ఞాన పరిశోధనకు మహాత్ముఁడు ప్రయత్నించు నప్పుడెప్పుడును గ్రంథపఠన మాత్రమున నాత్మజ్ఞానము కలుగఁ జాలదనియు నందులకు జీవితమందలి యనుభవజ్ఞానము ముఖ్య మనియుఁ బెక్కుపర్యాయములు వక్కాణించెను. విద్యయనఁగాఁ

పుస్తకముల దొంతరలుగాని, గ్రంథాలయములుగాని కాఁజాల వని మహాత్ముఁడు తన జీవితమందు గ్రహించిన గొప్ప సత్యము.

విద్య, మానవుని జీవితమందలి కష్టముల నెదుర్కొని జీవితమును శక్తిమంతము చేయునదని యర్థము. జీవితము శక్తిమంతము చేయఁజాలని విద్య సెతబీర కాయవంటిదగును. పాఠ్య గ్రంథములను, ఇతర గ్రంథములను దిరుగవేయుట మాత్రము విద్య కాఁజాలదు. బుద్ధివికాసమునకు—శరీరదార్ఢ్యమునకు—గౌరవ జీవితమునకు విద్య పరమావశ్యమగును. కావునఁ బ్రతిమానవ ప్రకృతికి విద్య యెంతేని యావశ్యకము. బుద్ధివికాసమునకు జాతీయ విద్యయు; శరీరదార్ఢ్యమునకు వ్యాయామవిద్యయు, గౌరవ జీవనమునకుఁ బారిశ్రామిక విద్యయు మానవున కత్యంతావశ్యకములు. ఇప్పుడు ఈ త్రివిధవిద్యలు నశించినవి. మనము దాసులమైతిమి. ఈ త్రివిధాత్మకవిద్య లేకయున్నచో భారతీయుఁడు మానవప్రకృతిని గాంచని పశువే యగుచున్నాఁడు. "విద్యార్థుల జీవితములకుఁ బనికిరాని పద్ధతిని భౌతికశాస్త్రములు గఱపఁబడు చున్నవ"నియు "రసాయన పదార్థమును దెలుపుటకు రసాయన శాస్త్రము బోధింపఁబడుచున్నది"నియు, ఈశాస్త్రములు విద్యార్థులు పాఠశాలను విరమించినపిమ్మట నొక నీటిచుక్కనుగూడఁ బరిశోధింప శక్తిలేనివారుగా నున్నార"నియు, "మనదేశ చరిత్రలు, దేశీయవిజ్ఞానమును నితర విషయములను మఱుగునఁబడిన వ"నియు, "పాశ్చాత్యుల బంతులాటలు ఆహ్లాదకరములై యున్నను, ధనవ్యయములేని మన దేశీయ ఖేలనములును, మల్లయుద్ధములును, విలువిద్యలును అనాగరికముగాఁ జూడరాద"

నీఁడు, "పారిశ్రామిక విద్యలు కావలయు" నియుఁ బలుతావు లందుఁ బ్రబోధించియుండెను.

ఈ యాంగ్లభాషా వ్యామోహముచే మన భారత విద్యార్థులు తమ సహజమగు బుద్ధిసంపదను, శరీరశక్తిసంపదను గోల్పోవుచుండిరి. శారీరకశక్తి సన్నగిల్లుకొలఁది బుద్ధిశక్తి సన్నగిల్లుచుండును. ఇట్లు శక్తి సన్నగిల్లినపిదప విచారించిన నేమి ఫలము? శారీరకశక్తిలేనిది స్వాతంత్ర్యానురక్తి పట్టువడఁజాలదు. కావునఁ బ్రతిమానవుఁడు శక్తి (బలము) కలిగియుండవలయును. శరీరబలములేనిది బుద్ధిబలము కలుగఁజాలదని మనము పాఠ్యపుస్తకములందుఁ జిన్ననాఁడే చదువుకొని యున్నారముగదా! బుద్ధిబలమునిచ్చునట్టి శారీరకశక్తి మానవున కెంతేని ఆవశ్యకము. శారీరకశక్తి కలిగియుండుటచేతనే మన మహాత్ముఁడు ముసలితనమందును దేశస్వాతంత్ర్యమునకై యహర్నిశలు అకుంఠితదీక్షతో నపారమగు సేవసల్పుచుండెను. అట్టి శారీరకశక్తి యుండుటవలన మహాత్ముని ధీశక్తిచే భారతదేశమును నొకక్రొత్తబాటమీఁద నడుపఁగలుగుచుండెను.

## సంగీతము

నేఁటి విద్యావిధానములో సంగీతము లేకపోవుటను మహాత్ముఁడు తన యనిష్టతను బలుచోట్లఁ బ్రసంగవశమునఁ బ్రస్తావించి యుండెను. సంగీతము, మానవుని యింద్రియములను సంతోషపఱచుచు, మనస్సును నానందమున నోలలాడించుచు, బుద్ధిని నాహ్లాదపఱచును. మానవుని నుత్తేజపఱచి జీవితము నానందమయముగను, సరిదిద్దును. ముగ్ధమోహన సంగీతము ప్రాణమునకు 'హాయి'ని గలిగించును. పెద్ద పెద్ద సభల

నిశ్శబ్దతను గల్గించుటకు సంగీతము చక్కని బాట యగును. మానవజన్మ మెత్తినవాఁడు సంగీత పండితుఁడై నను గావలెను, లేదేని సంగీతమందలి మాధుర్యముగ్రోలువాఁడై నను గావలెను. సంగీతమును ద్వేషించువాఁడు హత్యాది నేరములకుఁగూడ జంకఁడని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. గాంధిమహాత్ముఁడు సంగీత రసజ్ఞుఁడని మహాత్ముఁడు వెలువరించిన యభిప్రాయము లను బట్టి ద్యోతిత మగుచున్నది. గాంధిమహాత్ముని జీవిత మందు సంగీతముగూడ మాధుర్యమును గల్గించుచున్నది.

## స్త్రీ విద్య

పురుషులకు వలెనే స్త్రీలకును విద్య యావశ్యకము. విద్య యనఁగా జ్ఞానమని యర్థముగదా! అట్టిజ్ఞానము పురుషుల కావశ్యకమై స్త్రీల కనావశ్యక మగునా? విద్యా ఫలమును ఒక తెగవా రనుభవించి, మఱియొక తెగవా రనుభవింపరాదని యేశాస్త్రము నోఁటవిప్పి చెప్పఁగలదు? స్త్రీ పురుషులను నిరు తెగలవారు జీవితయాత్రలో సమాన భాగస్వాములై యుండ, నొక తెగవారు చదువుకొనవచ్చుననియు, నొక తెగవారు చదువుకొనరాదనియుఁ జెప్పనగునా? సీత, సావిత్రి, దమయంతి, ద్రౌపది మొదలగు భారత నారీమణులు చదువుకొని యాదర్శ జీవితములు గడిపి, నేఁటికి మనచేఁ బూజలందుకొనుచుండుట లేదా? కాఁగా; స్త్రీ పురుషులలో నొక పురుషుఁడుమాత్రము చదువుకొనవచ్చుననియు, స్త్రీలు చదువుకొనరాదని చెప్పుట యసంగతము. ఇట్టి విధి నిషేధములే భారతదేశమునకు దాస్య మును దెచ్చిపెట్టినవి. స్త్రీ విద్య నాఁటికి గోఁటయినప్పుడు నేఁటికి మోటగునా? జ్ఞానసంపదకు మూలమగు విద్య నార్జిం చుటకు స్త్రీ పురుషాది భేదము పరిగణింపఁదగునా? సౌజన్య

సౌశీల్యములను బెంపొందించునట్టి విద్య స్త్రీల కావశ్యకమని మహాత్ముఁడు గుజరాతీ స్త్రీ మహాసభయం దుపన్యసించుచు స్పష్టీకరించి యుండెను. మహాత్ముఁడు స్త్రీ విద్యాభివృద్ధికిఁ దహతహ లాడుచుండెడివాఁడు.

మహాత్ముని ప్రయత్నము

ఈ యాంగ్లవిద్య తెప్పలు వేసికొనుచు సముద్రములు దాఁటివచ్చి, మన భారతదేశమందుఁ బ్రవేశించి మన భారత జాతీయ విద్యలను నాశనము చేయుచుండ, నిక్కమగు భారతీయుఁ డెవఁడు సహింపఁగలఁడు ? తనకు – తన దేశమునకు గౌరవప్రదమైన మాతృభాష నుద్ధరించుటకు నిక్కమగు భారతీయుఁ డెవఁడు ముందంజ వేయఁడు ? భారతదేశమందుఁబుట్టి భారతదేశాచారముల నవలంబించుచు, భారతదేశ సౌభాగ్యమును బెంపొందించుట కవతరించిన మన గాంధిదేవుఁడు మౌనముద్ర వహింపఁగలఁడా ? మహాత్ముఁ డట్లు మౌనము వహించిన యెడల, మనము గాంధిని మహాత్ముఁ డనఁగలమా ? అయ్యది మహాత్ముని లక్షణమా ?

మన కిన్ని సందేహము లెందుకు ? మహాత్ముఁడు మాతృదేశమునకు సేవసల్పుటయం దణుమాత్రమైనను జలించువాఁడు కాఁడు. మిన్ను విఱిగి మీఁదఁ బడినను వెనకంజవేయని మేరునగధీరుఁడుమన గాంధిమహాత్ముఁడు.

ఈ యాంగ్లభాషా వ్యామోహముచే భారతదేశము దుర్గతిపా లగుచుండుటను భారతీయులకు విప్పిచెప్పెను. మహాత్ముని యమూల్యములగు మాటలకు భారతీయులు చెవియొగ్గకునికి కారణము కానరాకున్నది. మహాత్ముఁ డొకటి చెప్పి

మఱియొకటి చేయనొల్లఁడు. గాంధిమహాత్మునియందుఁ గల మహిమయే యిది! మహాత్ముఁడు మాతృభాషను గుఱుతించిన నాఁడే, తన తనయులను నేఁటి యాంగ్లవిద్యాలయములకుఁ బంపక, జాతీయ విద్యను నభ్యసించుటకు జాతీయ పాఠశాలకుఁ బంపెను. మాతృభాషాముఖమునఁ దాఁ బొందిన యానంద మును భారతీయులకుఁ దెలియఁ జెప్పుచు, నేఁటి యాంగ్ల పాఠ శాలలను బహిష్కరింప వలయునని దేశీయుల కాజ్ఞాపించుట ప్రపంచమునకుఁ దెల్లముగదా! నాఁటినుండి మహాత్మునియాజ్ఞ మేరకు భారతవిద్యార్థులు ఆంగ్ల విద్యాలయములను బహిష్క రించి యుందురేని నేఁటికి మన మాతృభాష లెంత యభివృద్ధి నంది యుండెడివో! దేశ స్వాతంత్ర్యమునకు భాషా స్వాతంత్ర్య మావశ్యకము. అందుచే, గాంధిమహాత్ముఁడు దేశస్వాతంత్ర్యము నకు వలయు జాతీయవిద్య యావశ్యక మని గ్రహించెను. మహాత్ముని సంకల్పానుసారము ఆంగ్ల విద్యాలయములను బహిష్కరించి యుందుమేని, ఆనాఁడే మన భారతదేశమునకు స్వాతంత్ర్యము, మనమాతృభాష కభివృద్ధియుఁ గలిగియుండెడివి.

## జాతీయ విద్య - స్వరాజ్యము

భారతదేశమందలి విద్యార్థులు—వారి తల్లిదండ్రులు త్యాగబుద్ధిని గ్రహింపలేక మహాత్ముని యుపదేశములను గ్రహింపఁజాలకపోవుట యెంతేని సంతాపకరము. జాతీయ విద్యాలయములు నశించి యాంగ్ల విద్యాలయములు తిష్ఠవేసిన పిమ్మట మనకిఁక స్వరాజ్యమేల? "ఆస్వరాజ్యము వలదని మహా త్ముఁడునొక్కి వక్కాణించియుండెను. మనభారతీయులు నేఁటికిసత్య మును గ్రహింపనేరకపోవుటమిగులలజ్జాకరము. గాంధిమహాత్ముఁడు

విదేశీయ నాగరకతా వ్యామోహమును వీడి, తన దేశీయులకాత్మజ్ఞాన ప్రబోధము కావించి, భారతదేశమును బలిష్ఠము గావించుచుండెను. అందులకు, జాతీయ విద్య యావశ్యకమని తలంచి భారతదేశీయులకుఁ ప్రబోధించుచుండ, భారతీయులు తమకుఁ బట్టనట్లు మెలఁగుట మిగుల శోచనీయము. మహాత్ముని యడుగుజాడల మెలఁగునట్టి జీవితమే చరితార్థము."

### రాష్ట్ర భాష

"భారతదేశమున కాంగ్లభాష రాష్ట్రభాషయగుచున్నది. అందుచే, అట్టి యీ యాంగ్లభాషను మనమేల బహిష్కరింపవలెను?" అని కొందఱనుచున్నారు. ఈ సువిశాల భారతావనియందు వివిధ రాష్ట్రభాషావలంబులెల్లరు నేకమై రాజ్యతంత్రమున కుపయుక్తమగు నొక్కభాషను రాష్ట్రభాషగా నంగీకరించుట యావశ్యకము. ప్రాచీన కాలమందు భారతదేశము కొంతకాలము ప్రాకృత భాషామూలమునను, గొంతకాలము 'పాళీ' భాషాముఖమునను, సకల రాజకీయ వ్యవహారములు చక్కఁబెట్టఁ బడుచుండెడివి. రాష్ట్రభాషలై వర్ధిల్లిన యీ రెండు భాషలును భారతదేశ భాషలు. అయితే యాంగ్లమో?

### హిందీ—ఇతర భాషలు

మన మాతృదేశమునకుఁ దగిన జాతీయ విద్యాపీఠమందు నాంగ్లభాషాదేవతామూర్తినేగాక, ఇతర భాషాదేవతామూర్తులనుగూడఁ బ్రతిష్ఠించి పూజలు చేయవచ్చును. కాని రాష్ట్రభాష మాత్రము మన జాతీయభాషగానుండవలెను. అందుచేత గాంధిమహాత్ముఁడు భారతదేశమందధిక సంఖ్యాకులు మాటాడునట్టి 'హిందీ' భాషను జాతీయ (రాష్ట్ర) భాష

చేయవలయునని సంకల్పించి సల్పుచున్న కృషి యెల్ల రెటింగి నది. నేడు మనము మన దేశభాషలం దొక్కటియు, గొప్పది యునగు 'హింది' భాషను రాష్ట్రభాషగా నంగీకరించుట ముఖ్యము. ప్రపంచమందలి దేశములన్నియుఁ దమ తమ దేశ భాషలలో ప్రభుత్వ పరిపాలనము సేయుచుండ, మన దేశము మాత్రము అన్యభాషను రాష్ట్రభాషగా నంగీకరింపనేల? యే దేశమందెన్నఁడులేని యీ క్రొత్తవింత మన దేశమునకు మాత్ర మేల? దేశౌన్నత్యమునకు మూలము భాష, దేశస్వాతంత్ర్యము నకు మూలము భాష. అందుచే మన దేశమునకు మనభాషయే మన రాష్ట్రభాషగా నుండుట స్వాతంత్ర్య చిహ్నమగును. హిందీ భాషను రాష్ట్రభాషనుగాఁజేయ సంకల్పించిన గాంధి మహాత్ముఁడు తక్కిన దేశభాషలను నిరసించుటలేదు. ఆయా దేశభాషలు వర్ధిల్లవలయునని మహాత్ముని కోరిక. మహాత్ముఁడు సాగించుచున్న స్వదేశీయోద్యమాశయముకూడ నిదియే. రాష్ట్రభాషగా (ప్రభుత్వ భాషగా) వ్యవహరింపఁబడుచున్న యాంగ్లభాషకు మాఱుగా దేశైక్యమునకును, లోకవ్యవహారము నకును హిందీభాషను రాష్ట్రభాషగా నుపయోగింపవలెనని మహాత్ముని యభిప్రాయము. మాతృభాషలను మఱుగుపఱచి హిందీభాషను మాత్రమే నేర్చుకొనుఁడని మహాత్ముఁడు మనకు బోధించుటలేదు. అట్టి పద్ధతి కలిగిన యెడల 'హిందీభాష' యక్కఱలేదనియే మహాత్ముఁడు చెప్పఁగలఁడు. హిందీభాషను రాష్ట్రభాషగా నంగీకరించుటవలనఁ 'బ్రపంచచరిత్రయందు ప్రతి దేశమునకుఁ దమతమ దేశభాష, ప్రభుత్వభాషయయినట్లే మన దేశమునకును మన దేశభాషయే ప్రభుత్వభాషయై తక్కిన దేశములతోఁబాటు మన దేశము స్వతంత్రమై సమానస్థాయిని

నుండఁగలదు. అందువలనఁ దక్కిన దేశభాషలకుఁగూడ నష్టము గలుగదు.

### తెలుఁగు

మన తెలుఁగు దేశమును దీసికొందము. తెలుఁగు దేశము నకు భాషగానున్న తెలుఁగు మిక్కిలి గొప్పభాష. ఆంధ్రభాష యందుఁగల ఆంధ్రమహాభారతమునకుఁ బోలిన గ్రంథము భారత దేశ భాషలందే లేదని చెప్పవచ్చును.

### నన్నయ

పున్నమినాఁటి వెన్నెలను మఱపించు నద్భుత కవితా రసముగలిగి, ప్రసన్న కలితార్థ యుక్తి దవిలి, యతిమనో హరమై తెలుఁగుఁ దనమునకే మెఱుఁగులుకూర్చు నతిలోకసుంద రమును, అఖిలజన శిరోధార్యమునునగు మహాగ్రంథమై యొప్పు నట్లు నన్నయ భట్టారకులు మహాభారత రచనను మొదలిడిరి.

### తిక్కన

తిక్కన భారతము తెలుఁగునకు వెలుఁగునిచ్చు నొక యపూర్వ కవితాసృష్టి. ఇట్టి కావ్య రచనను శిల్పముగా దిద్ది తీర్చుటలో తిక్కన సిద్ధహస్తుఁడై తనకవితా సృష్టిచే దేశభాషలందును, కావ్య జగత్తునందును నొక మహత్తర వినూత్న సౌందర్యమును సృష్టించి దేశభాషలలో నిట్టి విలువగల జాతిరత్నమే లేదనునట్లు నిదర్శింపఁగలిగెను. నిజము నకు, దేశభాషలలో నిట్టి గ్రంథము లేదనుటలో నించుకంతయు నత్యుక్తి లేదని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును. ఇది మన యదృష్టము.

### ఎఱ్ఱన

ఇక్కన ఎఱ్ఱనార్యుఁడును దన భారత భాగమును నతి రసవంతముగఁ దెలిఁగించెను. ఈ ముగ్గురు కవులు, మహాభారత

మును త్రిమూర్తులు లోకసృష్టి కావించినట్లు, సృష్టించి తెలుఁగు గొప్పతనమును లోకమునకుఁ జాటిరి.

పోతన

ఆంధ్ర మహాభాగవతము పోలిన భక్తిభావబంధురమగు కావ్యము భారత భాషలందే కానరాదేమో! భక్తిభరితమై, రసనిష్యందమై, చదువువారలకుఁ గలకండయై, తేనియ తరితీపు లూరుచు, చదువుచున్నంతవరకు నొడలు పులకరింప, భగవత్పా దారవిందములందే మనస్సును లగ్నము కావించి జన్మము ధన్యము చేసితినయ్యా పోతనామాత్యుఁడని పౌనఃపున్యమున మెచ్చుకొనఁజేయును. భక్తిభావములో నీయాంధ్ర మహాభాగ వతమునకు మించిన గ్రంథ మేదేశభాషలయందును లేదనఁ గలము.

శ్రీకృష్ణదేవరాయలు

శ్రీకృష్ణదేవరాయలు తెలుగునఁబుట్టుట మనభాషామ తల్లికి వెలుఁగుబాట యయ్యెను. విద్యానగరమును విజయ నగరముగాఁ జేసికొని తెలుఁగునేలను అవక్రపరాక్రమముతోఁ బరిపాలించి తెలుఁగు సామ్రాజ్యమును దెలుఁగు పౌరుషముతో విస్తరింపఁజేసి జయస్తంభములనాటి, విజయతేజశ్శాలియై తెలుఁగుభూమిని భారతభూమియందు వెలయింపఁజేసెను.

అష్టదిగ్గజ కవులను బోషించుచు, నాంధ్రకవితా కన్యను పెంచుచు, నాంధ్ర ప్రబంధముల వెలయింపఁజేసి స్వయముగా 'ఆముక్తమాల్యద' మహాకావ్యమును రచించి యాంధ్రభోజుఁడై శ్రీకృష్ణదేవరాయలు సాహితీ సమరాంగణ సార్వభౌముఁడను పేరున యశోవిశాలుఁడై యాంధ్రభూమిని, ఆంధ్ర సామ్రాజ్య మను, ఆంధ్ర కవితాకన్యను అనన్య పౌరుషపాండితీ శక్తులతోఁ

బాధవిల్లఁజేసిన యాంధ్రభోజుఁడు మా తెలుఁగువాఁడని చెప్పు కొను గర్వము భారతదేశ చరిత్రమునందుఁ బ్రసిద్ధికెక్కెను.

## భట్టుమూర్తి

భట్టుమూర్తి, తన సంగీత సాహిత్యములను మేళవించి యపూర్వప్రతిభచే 'వసుచరిత్ర'ను సృష్టించి వహ్వా! తెలుఁగున నిట్టి యపూర్వ ప్రబంధము వ్రాయఁగలిగెనుగదాయని గర్వింపక పోము.

## చిన్నయసూరి

తన యద్భుత బుద్ధిసంపదచే, నపూర్వ పాండితీ ప్రతిభచే, సమస్త దేశభాషలలోనే కాదు, గీర్వాణమందైనను అష్టాధ్యాయిదక్క మఱియొక్కటి సాటిరాదనురీతిని పరవస్తు చిన్నయసూరి "బాలవ్యాకరణము"ను సూత్రీకరించి అపరపతంజలి యనిపించుకొని, భారతీయులలో మించిన వైయాకరణులము మేమని ఱొమ్ము విఱిచి చెప్పఁగల సాహసమును తెలుఁగువారికిఁ గూర్చిపెట్టెను.

ఇట్లు, తెలుఁగుదనమును జెప్పుకొనుచుఁ బోయినచో గొప్ప చెప్పుకొనుట పూర్తికాదుగాని గొప్ప గ్రంథము మాత్రము కాఁగలదను గొప్ప భయము మాత్రము తప్పక కలుగును. కాన సంగ్రహించి చెప్పుచున్నాఁడను.

## శ్రీ వీరేశలింగంపంతులు

నిద్రాణమైయున్న యాంధ్రజాతిని - ఆంధ్ర సరస్వతిని మేలుకొలిపిన మన కందుకూరి వీరేశలింగంపంతులుగారి వంటి

వారు భారతదేశ మందెందరుకలరు? బాల్యవివాహములు తగవని వేదప్రమాణములతో నిరూపించుచు, స్త్రీ పునర్వివాహములు శాస్త్రసిద్ధములని సిద్ధాంతీకరించుచు, స్త్రీవిద్య దేశాభ్యుదయమునకు మూలమని శాస్త్రముల మూలమున సమర్థించుచు, అంటరానితనము మానవజాతిని బహుప్రాయము చేయుచున్నదని ప్రమాణీకరించుచుఁ దానమ్మిన సంస్కారములను సంఘమందు నాచరింపఁజేయుచు, నాంధ్ర కవులచరిత్ర తెలియని యంధకారమును ఆంధ్రకవుల చరిత్రతో రూపుమాపి, వివిధరీతుల నాంధ్ర భాషాసేవ చేయుచు, వివిధశాఖలలో సంస్కారమును గలిగించి యుగపురుషుఁడని పేరుగాంచిన వీరేశలింగంపంతులుగారు మన తెలుఁగువాఁడగుటచే భారతావనియందు మమ్మ మించినవారు లేరని చెప్పుకొను గర్వము మన తెలుఁగువారిదని నొక్కి-వక్కాణించుట యతిశయోక్తి కాదు.

## శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు

ఇఁక, తిరుపతి వేంకటేశ్వరుల నుతింతుము. ఆ మహానీయు లిద్దఱు తెలుఁగు భాషామతల్లికి నపూర్వకీర్తిని గడించి పెట్టిరని చెప్పుట గర్వకారణ మగుచున్నది. గంగాలహరిమించు నాశుకవితా స్రవంతిచే నాంధ్రభాషకు – ఆంధ్రావనికి వన్నె దెచ్చిన యాశుకవితా చక్రవర్తులు మన తిరుపతి వేంకటేశ్వర కవితల్లజులు. వారి యమృతధారావాహినివంటి యాంధ్రకవితావాహినియందుఁ దెలుఁగుబాలురు "బావా! ఎప్పుడు వచ్చితీవు" అను తమ రాగతరంగములలో మాతృభాషయందు నోలలాడుచుందురనుట యథార్థము.

మీసాలు పెంచుట వైదికమతమగునా యని సనాతనులు సందేహించినప్పుడు,

దోసమటంచెఱింగియును దుందుడుకొప్పఁగఁ బెంచినారమీ
మీసము రెండు భాషలకు మేమె కవీంద్రులమంచుఁ దెల్పఁగా
రోసముగల్గినన్ గవివరుల్ మముగెల్వుఁడు, గెల్తురేని యీ
మీసముదీసి మీ పదసమీపములం దలలుంచి మ్రొక్కమే!

అని సవాలుచేసి ఆ ఘటికసభ నాశ్చర్యచకితము గావించి విఖ్యాతినందిరి.

అంతేకాదు; ఆ తిరుపతి వేంకటేశ్వరుల శక్తి యనంతము.

ఇచ్చెదవుగాక; మానెదవేమి కొదువ?
మా కవిత్వ పరీక్ష సమ్యగ్గతినిర
చింపు మే కథనేనియుఁ జెప్పునపుడు
చేయి యాపిన నది తెగవేయుమధిప!"

అని పందెము పలికిన పండితులు భాషాప్రపంచమున నెందఱు కలరో లెక్కింపుఁడు.

"చెప్పెద మొక్కమాట, కడుఁజేవఁ దలిర్పఁగనో నృపాగ్రణీ!
గుప్పితిమేని పద్యముల గుంపుల నర్జునుఁ డాహవమ్ములోఁ
గుప్పలుగాఁగ బాణములు గుప్పినరీతిగ నెవ్వఁడేని దా
జెప్పగలాఁడె, వ్రాఁతునని చెప్పినఁ జేయమె శృంగభంగమున్."

కవితా యుద్ధమందీరీతిని నజేయులై 'యేనుఁగునెక్కి, ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కి', సన్మానములంది' "అద్వైత నాంధ్రకవి ప్రపంచ నిర్మాతల"ని వేనోళ్ళ బ్రశంసలందిన మన తిరుపతి వేంకటేశ్వరులు సార్థకజీవులై యాంధ్ర బాలురకారాధ్య దైవములైరి. అట్టి కవితల్లజులుపుట్టినగడ్డ మన తెలుఁగుగడ్డ!

కవిరాజు శ్రీ రామస్వామి చౌదరి

ప్రాఁతపురాణములను బుక్కిటిపురాణములను జేయుచు శతాబ్దుల తరబడి పేరుకొన్న భారతీయుల మూఢవిశ్వాసమును నివారించుచు, యథార్థమననేమో బొత్తిగా గ్రహించుటకు వీలు లేనట్లు, అల్లిబిల్లిగాఁ, గట్టుకథలల్లి, వేదమతమననేమో తెలియ నీయక, కొట్టుమిట్టాడునట్లొనర్చిన యజ్ఞానాంధకారమును అవాస్త మగునట్లు కవిరాజు శతావధాని శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరి వారిష్మరుగారు, తెలుఁగువా రన్నింట సంస్కర్తలుసుమాయని మీసము మెలివేసి చెప్పఁగలిగినట్లు, మహత్తర కమనీయ సాహితీ సృష్టి యొనర్చుట భావుకులకెల్ల రకుఁ దేటతెల్లముకదా !

ఇట్టి తెలుఁగుభాష, నేఁటి భాషగాక ఆర్యద్రావిడ సంస్కారమును దనలో నిముడ్చుకొని ఋగ్వేదము కాలము నాఁటికే యాంధ్ర ప్రతిభచాటఁబంచిన ప్రాఁతభాష. అట్టి తెలుఁగుభాష మాతృభాషగాఁగలవారమై యచ్చతెలుఁగు వారమై యన్నింటను అచ్చకీర్తి నార్జించుకొని ధన్యుల మైతిమి.

త్యాగయ్య

సాహిత్యమందేగాక సంగీతమందును మాదే పైచేయి యన్నట్లు కర్ణాటక సంగీతమందు త్యాగబ్రహ్మ అసంఖ్యాక రమ

నేయు కీర్తనా పరంపరలతో భారతభూమిని నోలలాడించి 'శాంతము లేక సౌఖ్యము లేద'ని రాల్పరగించు భక్తిభావబంధుర గానసుధాలహరీ విశేషములను తెలుఁగుగడ్డపైఁ బ్రాఁకించి, భారత భాషలలో మెచ్చుకోలు నందెచ్చెను.

శిల్పకళ

సంగీత సాహిత్యములే మా సొమ్ములు కావు; శిల్పమందును మమ్ము మించిన వారెవరయ్యాయని వేలయేండ్లనాఁడే కొండలను తొలచి, విగ్రహములమలచి అందచందముల కరుల బోసి, వర్ణ రేఖా విన్యాసముల గులకరించి, దేశీయులనే కాదు విదేశీయులనుగూడ సమ్మోహపఱచు అజంతా-ఎల్లోరాగుహాలు శిల్ప ప్రాగ్భల్యమును వెలార్చి తెలుఁగు వెలుఁగును చాటిచెప్పుచున్నవి.

విద్యారణ్యస్వామి

వేదములకు భాష్యము వ్రాయుటలో మేమే ముందు సుమాయని మతవిజ్ఞానజగత్తునకే వెలుఁగుచూపిన విద్యారణ్య స్వామి వేదములుండు నంతకాలము తెలుఁగు గొప్పతనము వెలుఁగునట్లు చేసెను.

తిరుపతి శ్రీ వెంకటేశ్వరుఁడు

తెలుఁగుబిడ్డలు నావారు, తెలుఁగుగడ్డ నాదియేయన్నట్లు అఖిలభారతావని జాతిమత భేదములు లేకనిత్యము మ్రొక్కులు పెట్టునట్లు ఆర్తరక్షపరాయణుఁడు శ్రీ వేంకటేశ్వరుఁడు వెలసిన మా తిరుపతికొండ తెలుఁగు కాణాచియై భారతావనినే పునీతము చేయుచున్నది.

### కృష్ణా-గోదావరీ నదులు

తెలుఁగునేలను బరవళ్ళుత్రొక్కుచుఁ దెలుఁగు మాగాణమున్ను-పాఁడిపంటలచే భారతదేశమునకు ధాన్యాగారము చేయుచు, తెలుఁగుగొప్పను మెప్పులఁజెప్పుచుఁ బ్రవహించుకృష్ణా గోదావరీ పవిత్రనదులు తెలుఁగును బ్రపంచమందే చాఁటిచెప్పుచున్నవి.

### నాగార్జునుఁడు

అహింసా ధర్మవిజ్ఞానములకుఁ బెన్నిధులము. మేమని మా నాగార్జునాచార్యుఁడు విశ్వవిద్యాలయము నెలకొల్పి ప్రపంచమునకు జ్ఞానభిక్షపెట్టి తెలుఁగు వెలుఁగును బ్రపంచమునకు విరఁజిమ్మెను.

### కోహినూరు వజ్రము

సూర్యుఁడస్తమించని సామ్రాజ్యము నేలిన బ్రిటీషు సార్వభౌముని కిరీటమందు వేవెలుఁగుభాతి కాంతిపుంజముల నిచ్చి యరిరాజులను బాదాక్రాంతము కావించు కోహినూరు వజ్రము తెలుఁగు నేలయందుఁ బుట్టిన మేటి జాతిరత్నము.

తీరు తీయములు కుప్పలువోసిన తేటతెలుఁగు బాస మా మాతృభాష. నీటుగోటులకు, శౌర్య పరాక్రమములకు, నాగరకతా వాసనలకు పోతుగడ్డ మా తెలుఁగుమాగాణము.

అలమతి విస్తరేణ. ప్రపంచమందు మానవ కళ్యాణమునకై, తన జీవిత సర్వస్వమును ధారవోయు గాంధిమహాత్ముఁడును "తెలుఁగువారు కార్యరంగమందును ఉఱుకుటకు పఱుగు లెత్తువార"ని మెచ్చుకొనియుండెను.

ఇట్టి తెలుఁగుభాష నభివృద్ధి చెందించుటయు, హిందీ భాషను జాతీయభాషను జేయుటకుఁ దెలుఁగువారు ముందంజ వేయుట ముదాహావము. స్వార్థముకంటె పరార్థమాత్రైకజీవితమునకుఁ బాటుపడుట తెలుఁగువారికి నేఁడు క్రొత్తగాదు. ఇట్టి యాదర్శ పథగాముల మగుటవలననే తెలుఁగువారనిన మహాత్మునికెంతయో ప్రీతి.

తెలుఁగువారు తమ మాతృభాషను బ్రప్రథమమునఁ జదువుకొనవలయును. అంతియకాని నేఁటి నాగరికతా వ్యామోహమునఁబడి మాతృభాషను మఱచి, తమ బిడ్డలను దొలుదొల్తనే యాంగ్లము నేర్పుట—నేర్పించుట బిడ్డల యభివృద్ధియు దేశాభివృద్ధియుఁ గానేరదు. మాతృభాషను గఱపించి, యాపిమ్మట నేభాషలనైన నేర్పవలయునని విన్నపము.

విద్యా విషయకమగు భాషలనుగూర్చి మహాత్ముని జీవితమునుండి నేర్చుకొనఁదగిన యాణిముత్యములవంటి యభిప్రాయములను గొన్నింట నుదహరించుచుంటిమి. ప్రకృతి ననుసరించి యాయా దేశము లవతరించి యాయా దేశములకుఁదగిన నట్లేర్పడిన ఆయా దేశభాషల యభివృద్ధికై పాటుపడుట ఆయా దేశీయుల విధ్యుక్త ధర్మమనియు, నొకదేశమువారు మఱియొక దేశభాషను నేర్చుకొనుటకుఁ బ్రభుత్వ మవకాశము కల్పింపవలె ననియు, భేదభావమును బురికొల్పునట్టి పాఠములు జీవితమునకుఁ దగినవిద్య కాదనియు, జీవిత రమ్యతకు దోహదమునిచ్చు జాతీయవిద్యను నేర్పవలయుననియు, లోకమే యొక మహాగ్రంథ మనియు, ఆగ్రంథ ప్రయోజనము సఫలమగునట్లు ఏ ప్రాణికిఁ గీడు చేయరాదను నాశయము గలిగియుండుటయే జీవితలక్ష్య మనియు బోధపడుచున్నది.

## హిందీ

మహాత్ముఁడు గుజరాతీ దేశమందు జననమందెను. మహాత్ముని మాతృభాష గుజరాతీభాష. — ఆంగ్లమందు 'బారిష్టరు' చదివెను. హిందీభాషయం దనర్గళమైన పాండిత్యము గలవాఁడు. మహాత్ముఁడు "చిక్కని చక్కని తియ్యఁదనము మెఱయు నాంగ్లము వ్రాయఁగలఁడ"ని యాంగ్లేయులే మెచ్చు కొందురు. 'హిందీ' భారతదేశమునకు రాష్ట్రభాష కావలయునని యుద్యమమును బ్రారంభించెను. అట్టి యుద్యమము ప్రారంభించినమహాత్ముఁడే తన "ఆత్మకథ" నేభాషయందు రచించెను? ఆంగ్లభాషయందా? హిందీలోనా? కాదే; తన మాతృభాష యగు గుజరాతీ భాషయందే రచించెనుగదా! ఆ గుజరాతీ గ్రంథమును మహాదేవ దేశాయి యాంగ్లమున కనువదించెను. ప్రపంచ వ్యాప్తమై నెగడుచున్న యాంగ్లభాషయం దాఱితేఱిన పాండితీ విశేషము గలిగియు, మహాత్ముఁడు తన మాతృభాష యగు గుజరాతీభాషయందే తన యాత్మకథను వ్రాయుట మహాత్ముని మాతృభాషాభిమానము వెల్లడియగుచున్నది. మహాత్ముని మాతృభాషాభిమానమును దెలుపునట్టి యుదాహరణలు పెక్కులు గలవు.

## జ్ఞాన విద్య

మహాత్ముఁడు వివిధ పాఠశాలలందుఁ జదువుకొనెను. పెక్కు ప్రాచీన గ్రంథములను జదివెను. నేఁటి ప్రాపంచిక జీవిత మనుభవించెను. అపూర్వ జ్ఞానప్రదమైన యాదర్శ జీవితమును గడుపుచుండెను. అందుచే మహాత్మున కాత్మజ్ఞానప్రద

మగు విద్య యబ్బెను. అన్ని విద్యలకు ఆత్మజ్ఞానమే మూలము గదా!

విద్యను రెండు విధములుగా విభజింపవచ్చును. అందొకటి విజ్ఞానమును గలిగించునది. రెండవది జ్ఞానమును బోధించునది. మొదటిది భౌతికవాదమును బోధించును. రెండవది యాత్మజ్ఞానమును బెంపొందించును. ఈ రెండువిద్యలలోఁ బరమార్థమేమి?

మొదటిది ప్రాణుల భేదమును దెలుపును. రెండవదగు ఆత్మజ్ఞానవిద్య భేదభావమును నశింపఁజేసి యేకత్వమును బోధించును. ఆ యేకత్వమే మహాత్ముని జీవితమందు ఫలించుచుండెను. ఎల్ల ప్రాణుల ప్రాణము తన ప్రాణమువంటిదని భావించి మహాత్ముఁడు తన జీవితయాత్రను సాగించుచుండెను. మహాత్ముని జ్ఞానసూక్తులు కొన్నిటి నిటఁ జదువుకొందము.

"మన మెల్లరము ఒక్క ప్రాణము."

"ఎట్టి చెడ్డ ప్రాణినుండియు నన్ను వేఱుచేయలేదు."

"మానవుఁడు సర్వ ప్రాణులయందును గలిసియుండును."

"భగవత్సంకల్పమేమి? సమస్త జీవరాసులకు సేవ చేయుటయే. సేవ చేయుటయే ప్రేమ."

"ప్రేమయే భగవంతుఁడు."

"భగవంతుఁ డొక పెద్ద జననాయకత్వము. భగవంతునితోఁ దుల్యుఁడగు వానిని నేఁటివఱకు లోకము కాంచలేదు.

"ప్రాణులన్నియు సహోదర భావముకలవి. ఇది సత్యా

గ్రహ మెఱిఁగినవారికి మాత్రమే యవగతము కాఁగలదు అందువలన సత్యాగ్రహమందు మానవత్వమే యిమిడి యుండ వలెను."

ఇట్టి యమోఘవాక్యములను గ్రహించినయెడల నాత్మ జ్ఞానము బోధపడఁగలదు.

ఆత్మజ్ఞాన ప్రదమగు విద్యకు - భౌతిక విజ్ఞాన ప్రదమగు విద్యకు భేద మెంతయో గలదు. భౌతిక విజ్ఞాన విద్యచే మానవుఁడు జీవించి మరణించును. ఆత్మజ్ఞాన విద్యచే మానవుఁడు మరణించియు శాశ్వత యశస్కుఁడై చిరకాలము కీర్తి శరీరముతో వర్ధిల్లును.

ఆత్మజ్ఞాన సంపాదనకు వివిధ మార్గములు కలవు. అందు సత్యాగ్రహమను మార్గ మొకటి మహాత్ముఁడు మనకుఁ బ్రసాదించెను. గాంధిమహాత్ముని సత్యాగ్రహము "ప్రాణకోటియంతయు సహోదరమ"ను నాత్మజ్ఞానమును గలిగించునని చెప్పవచ్చును. అట్టి యాత్మజ్ఞానమునకు మూలపురుషుఁడు మన మహాత్ముఁడని మనము గర్వింపనగును.

ఈ సత్యమనెడి బీజము పృథివ్యప్తేజో వాయువులుచేరి పెరిఁగిన జీవవృక్షము మన గాంధిమహాత్ముఁడు. మహాత్ముని జీవిత మొక విద్యాలయము. అట్టి మహాత్ముని జీవితమునుండి మానవ జీవితమునకుఁ గావలసిన లక్షణములను బొందవచ్చును.

భగవంతుఁడు సర్వవ్యాప్తుఁడైనను, సామాన్య బుద్ధికగోచరుఁడు. మరియు నిరాకారుఁడు. అగుచోనిఁక భగవంతుని గొలుచుటయెట్లు? ముక్తిని బడయుటయెట్లు? ఆత్మజ్ఞానికొక్కనికిఁదక్క తక్కినవారికెట్లు గోచరించును? భగవత్త్వము తెలి

చిన కొలఁది గంభీరము సమిగహనమయిన విషయము పరమ గహనమైన భగవతత్త్వము న్యాబాలగోపాలము గనుగొనుట యెట్లు? కంటి కగుపడని దేవుని సేవించుటకు మానవమాత్రుఁ డెట్లు ఉత్కంఠతచూపఁగలఁడు? పృథివ్యప్తేజోవాయ్వాకాశము లను పంచభూతములు, సూర్యచంద్రులు, ప్రాణము, అనునీ యెని మిది రూపములతో నెల్లెడల నిండియుండు నావరాత్మపుని సేవిం చుటయెట్లు? కంటి కగపడుచున్న పుణ్యపురుషుల నారాధించుచుఁ దనూ్కలమున భగవంతుని గొలుచుట మిక్కిలి చక్కని దారి. అది యాబాలగోపాలమునకుఁ దిన్ననిదారి.

తల్లిదండ్రులు దైవస్వరూపులు

ప్రపథమముగా మనను గనిపెంచిన తల్లిదండ్రులను భక్తి పెంపున దైవములుగా నెంచి పూజించి మోక్షము పడయుమని వేదములు బోధించుచున్నవి. నిజమాలోచించిన తల్లిదండ్రులు దైవసములనుటకెట్టి యాక్షేపము లేదు. కనిపెంచి పెద్దచేసి సృష్టి రహస్యములను దెలిపి, భగత్సేవాభిలాషను గఱపి, భగవ న్మాహాత్మ్యమును బోధించి, మానవత్వము సార్థకమైనగాని మోక్షము లభింపదను సూక్తిని దెల్లముసేసి తన జీవిత సాఫ ల్యమునకుఁ గారణభూతులైన తల్లిదండ్రులు దైవస్వరూపులు.

మాతాపితరులను భగవద్బుద్ధితోఁ బూజింపవలయును. 'మాతృదేవోభవ' 'పితృదేవోభవ' యని వేదములు ప్రబో ధించుచున్నవి. మనము పుట్టుటకుఁ గారణభూతులైన మాతా పితరులను దైవములుగా నెంచి పూజించుట మన పరమ ధర్మము.

తల్లిదండ్రులమాట జవదాటరాదు. వారి యాజ్ఞ మనకు భగవదాజ్ఞ. వారలను పూజించుట మనము తరించుటకు సాధనము. తల్లిదండ్రులు చెప్పిన చొప్పున నడచుకొనుట మనకుఁ జెప్పరాని గొప్పదనము. ప్రసిద్ధికెక్కిన మహనీయులందరు తల్లిదండ్రుల మాటలను జవదాటనివారు. శ్రీరామచంద్రుఁడు తండ్రిమాటకు మాఱాడక కాఱడవులకుఁబోయి శాశ్వతయశఃకాయుఁడయ్యెను. తల్లిదండ్రులను బూజించుట జీవితమునకు మేలుబంతి. మన గాంధిమహాత్ముఁడు తన తల్లిదండ్రులను దైవబుద్ధిని బూజించినవాఁడు. కలనైన దలితండ్రుల యాజ్ఞలను మీఱినవాఁడుకాఁడు. మహాత్ముఁడు బాల్యమునుండియు నిట్టి సుగుణ సంపత్తి గలవాఁడగుటచేతనే నేఁటికి మహాత్ముఁడు కాఁగలిగెను.

మహాత్ముఁడు తన తల్లిదండ్రులయందుఁ జూపిన భక్తిగౌరవములు మనకెంతయో యాదర్శప్రాయములై యుండుట వలన నా భక్తిగౌరవములను దెలిసికొనుట మనజీవితమునకు వరవడిబంతి కాఁగలదు.

## తల్లి

మహాత్ముని తల్లి పుత్తలీబాయి పూర్వాచారములం దెక్కువ మక్కువ గలది. కావున నామె పంచములను దూరమున నుంచుచుండెడిది. వారలనంటుకొనుట కామెకుఁ గంటగింపు. ఇంక మహాత్ముఁడు తన లేఁబ్రాయమందే యంటరానితనముచూచి కంటఁదడిబెట్ట సాగెను. చిఱుతప్రాయమందు అస్పృశ్యత హిందూమతమునకుఁ దీరని కళంకమని యెఱింగి, తన్నివారణమునకై తానెంతయో పాటుపడసాగెను. కాని తన

తల్లిని జూచినంతనే తన కర్తవ్యమునకుఁ దావులేకుండెను. అస్పృశ్యతా పిశాచమును బాఱఁద్రోలుటయా? తల్లికి లొంగుటయా? ఇందేది మహాపాపము? సోదర మానవుని నంటరాని వానినిగాఁ జూచుట ఘోరపాపమని సర్వశాస్త్రమాత్రము బోధించుచున్నది. తల్లిమాట మీఱిన కల్పకాలము పాపులౌదురని ధర్మము లుపదేశించుచున్నవి. మహాత్ముఁడిందేమి చేయఁగలఁడు? "వెనుకకు మఱలుద మనిన మనస్సు రాదు, ముందునకుఁ బోవుదమనిన బుద్ధియొప్పద"ను చందమునన్నది. మహాత్ముఁడీ ప్రశ్న పరంపరలందుఁ జిక్కి నలుగక యాత్మనిగ్రహముతో తన తల్లినిఁ జేరి "అమ్మా! మన పనిపాటలు సేయు మాలమాదిగలు నంటరానివారంటిమిగదా! అంటినఁ బాపమేమి యంటఁగలద"ని తల్లినిఁ దెలియనడిగెను. అందులకా సాధ్వీమ తల్లి బిడ్డని ప్రశ్నమునకు బదులు పలుకనేరక పూర్వాచార పరాయణురాలగుటచే "బిడ్డా! అంటరానివారి నంటుట తగద"ని గాంధి బాలునకు బుజ్జగించి చెప్పెను. మహాత్ముఁడు తల్లి మాటను గాదనలేక 'వల్లె'యని యామె యిష్టము చొప్పున నడుచుకొనఁ దొడంగెను. తన తల్లిని దైవసమురాలుగా నెంచి పూజించుట మహాత్మునికి వెన్నతోఁ బెట్టిన విద్య. తన తల్లికిఁ గాని పనియని తోఁచిన దానిని దానెన్నఁడు చేసియెఱుంగఁడు.

## మాంసము—తల్లి

మహాత్ముని కుటుంబము మాంసభక్షణ మెఱుంగనది. ఒక చెనఁటి చెలికాఁడుచేరి 'మాంసాశనముచే నాంగ్లేయులు మిక్కిలి బలముకలిగియున్నారు. బలసంపన్నులౌటచే మహాసామ్రాజ్యమును సంపాదింపఁగలిగిరి. ఆంగ్లేయాధీనమయిన మన

భారతదేశము స్వాతంత్ర్యము పడయవలయుననిన మనమందఱము తప్పనిసరిగా మాంసము తినవలయును'నని చెపినిల్లుకట్టుకొని నా నాఁట నుపదేశించుటచే మహాత్ముఁడు నిజమని నమ్మెను. నిజమని నమ్మి చెలికాని మాయమాటలకు లొంగి మాంస భక్షణము చాటుచాటునఁ గ్వాచిత్కముగఁ జేయఁదొడంగెను. మహాత్ముఁడు "నేను రుచికి మాంసము భక్షింపలేదు. బల మభిలషించి నాఁడన"ని యాత్మకథయందుఁ దెలిపియుండెను. మహాత్ముఁడు సాయంసమయములందు స్నేహ బృందముతోఁ గలిసి మాంసపు విందారగించుటచే రాత్రి భోజనము సయించుటలేదు. అందుచే రాత్రి భోజనము మానివేయుచుండెను. రాత్రి సమయములందు 'భోజనమునకు రమ్మ'ని తల్లి పిలిచినంతనే 'ఆఁకలిలేదే' యని మహాత్ముఁడు కుయుక్తులు పన్నుచుండెడివాఁడు. ఈ యసత్య భాషణముచే నొక్కనాఁడు పరితపించి "అయ్యో! మాంసభక్షణముచేఁ దల్లియెదుటఁ గల్లలాడుట తప్పకున్నదే"యని లోలోన నెంతయో చింతించి తల్లి యెదుటఁ గల్లలాడుట కాని కార్యమని తలంచి నాఁటితోఁ గల్లలాడుటకుఁ గారణమయిన మాంసము ముట్టనని తనలోఁ, దాను బ్రతిజ్ఞ గైకొనెను. మహాత్ముఁడు తల్లియెదుట నబద్ధములాడుట తగదని చిన్నతనముననే తెలిసికొనఁగలిగెను.

### ఇంగ్లాండు - తల్లి

ప్రవేశ పరీక్షయం దుత్తీర్ణుఁడై కళాశాలయందుఁ జదువుకొనుచున్న గాంధిని నింగ్లాండునకుఁబోయి 'బారిష్టరు' పరీక్షను జదువుకొనిరమ్మ"ని మహాత్ముని తండ్రి కాప్తమిత్రులగు మావు జీదవేగారు గాంధిమహాత్మునితో జెప్పిరి. మావుజీదవేగారు

చెప్పినమీఁదట మహాత్ముఁ డాంగ్లదేశమునకుఁ బోవ నుబలాటపడి తన కోరికను దల్లికి నివేదించెను. తల్లి తనయునిమీఁది ప్రేమ పెంపుచే దూరదేశమునకుఁ బంప నిష్టపడకుండెను. మహాత్ముఁ డింగ్లాండునకుఁ బోవుట కెప్పుడెప్పుడాయని యువ్విళ్ళూరుచుండెను. చదువునకని యింగ్లాండునకుఁ బోయివచ్చిన భారత యువకుల దుశ్శీలమును, దుస్థితిని దలఁచుకొనినంతనే యామె హృదయము కలవరపడఁ జొచ్చెను. భారత విద్యార్థు లాంగ్లదేశమునకుఁబోయి యచట దురభ్యాసములకు లోనై మద్యపానాదికము లలవఱచుకొనుచున్నారని యామె కర్ణాకర్ణిగ వినుటచేఁదన గారాబుపట్టిని గాంధిబాబును విదేశములకుఁ బంప నొల్లకుండెను. మహాత్ముఁడు తల్లి సంశయాత్మ నెఱింగియామెను జేరి 'అమ్మా! నేనట్టి దురభ్యాసములకు లొంగను. నాయందు దయయుంచి యింగ్లాండునకుఁ బంపుము. పోయి చక్కఁగాఁ జదువుకొని వచ్చెదను. తల్లీ! నిన్ను మోసగించువాఁడనుకాను. నన్ను నమ్ముమ"ని తనయాత్మ నిశ్చయ మెఱింగించెను. అంతఁ దల్లి తనయుని మనోనిశ్చయమునకు లోలోన ముదమందుచు "బిడ్డఁడా! నాకు నీయందు నిండు నమ్మకముండును. అయినను, ఇంగ్లాండు దూరదేశమగుటచే నమ్మజాలకున్నాను. అయినను మంచి చెడ్డల నారయు, బేచరజీస్వామి నడిగి చెప్పెదన"ని బదులిచ్చెను. పండిత బేచరజీస్వామి మహాత్ముని కుటుంబపు మంచి చెడ్డల నారయుచుండువాఁడగుటచే నా పండితునియందు గాంధి కుటుంబమునకు గౌరవముమెండు. మహాత్ముని తల్లి యా పండిత బేచరజీస్వామికిఁ దనయుని దూరదేశప్రయాణోత్సుకతను నెఱుకపఱచెను. అంతట నా పండితుఁడు "ఇతనినుండి మూఁడు వాగ్దానములు పుచ్చుకొని ఇంగ్లాండునకుఁ బంపవచ్చున"ని చెప్పి,

భారతదేశము స్వాతంత్ర్యము పడయవలయుననిన మనమంద అము తప్పనిసరిగా మాంసము తినవలయును'ని చెవినిల్లుకట్టుకొని నా నాఁట నుపదేశించుటచే మహాత్ముఁడు నిజమని నమ్మెను. నిజమని నమ్మి చెలికాని మాయమాటలకు లొంగి మాంస భక్షణము చాటుచాటునఁ గ్వాచిత్కముగఁ జేయఁదొడంగెను. మహాత్ముఁడు "నేను రుచికి మాంసము భక్షింపలేదు. బల మభిలషించి నాఁడన"ని యాత్మకథయందుఁ దెలిపియుండెను. మహాత్ముఁడు సాయంసమయములందు స్నేహ బృందముతోఁ గలిసి మాంసపు విందారగించుటచే రాత్రి భోజనము సయించు టలేదు. అందుచే రాత్రి భోజనము మానివేయుచుండెను. రాత్రి సమయములందు 'భోజనమునకు రమ్మ'ని తల్లి పిలిచినంతనే 'ఆఁకలిలేదే' యని మహాత్ముఁడు కుయుక్తులు పన్నుచుండెడి వాఁడు. ఈ యసత్య భాషణముచే నొక్కనాఁడు పరితపించి "అయ్యో! మాంసభక్షణముచేఁ దల్లియెదుటఁ గల్లలాడుట తప్ప కున్నదే"యని లోలోన నెంతయో చింతించి తల్లి యెదుటఁ గల్ల లాడుట కాని కార్యమని తలంచి నాఁటితోఁ గల్లలాడుటకుఁ గారణమయిన మాంసము ముట్టనని తనలోఁ, దాను ప్రతిజ్ఞ గైకొనెను. మహాత్ముఁడు తల్లియెదుట నబద్ధములాడుట తగదని చిన్నతనముననే తెలిసికొనఁగలిగెను.

## ఇంగ్లాండు - తల్లి

ప్రవేశ పరీక్షయందు త్తీర్ణుఁడై కళాశాలయందుఁ జదువు కొనుచున్న గాంధిని నింగ్లాండునకుఁబోయి 'బారిష్టరు' పరీక్షను జదువుకొనిరమ్మ"ని మహాత్ముని తండ్రి కా ప్తమిత్రులగు మావు జీదవేగారు గాంధిమహాత్మునితోఁ జెప్పిరి. మావుజీదవేగారు

చెప్పినమీఁదట మహాత్ముఁ డాంగ్లదేశమునకుఁ బోవ నుబలాటపడి తన కోరికను దల్లికి నివేదించెను. తల్లి తనయునిమీఁది ప్రేమ పెంపుచే దూరదేశమునకుఁ బంప నిష్టపడకుండెను. మహాత్ముఁ డింగ్లాండునకుఁ బోవుట కెప్పుడెప్పుడాయని యువ్విళ్లూరుచుండెను. చదువునకని యింగ్లాండునకుఁ బోయివచ్చిన భారత యువకుల దుశ్శీలమును, దుస్థితిని దలఁచుకొనినంతనే యామె హృదయము కలవరపడఁ జొచ్చెను. భారత విద్యార్థు లాంగ్లదేశమునకుఁబోయి యచట దురభ్యాసములకు లోనై మద్యపానాదికము లలవఱచుకొనుచున్నారని యామె కర్ణాకర్ణిగ వినుటచేఁదన గారాబుపట్టిని గాంధిబాబును విదేశములకుఁ బంపనొల్లకుండెను. మహాత్ముఁడు తల్లి సంశయాత్మ నెఱింగియామెను జేరి 'అమ్మా! నేనట్టి దురభ్యాసములకు లొంగను. నాయందు దయయుంచి యింగ్లాండునకుఁ బంపుము. పోయి చక్కఁగాఁ జదువుకొని వచ్చెదను. తల్లీ! నిన్ను మోసగించువాఁడనుకాను. నన్ను నమ్ముమ"ని తనయాత్మ నిశ్చయ మెఱింగించెను. అంతఁ దల్లి తనయుని మనోనిశ్చయమునకు లోలోన ముదమందుచు "బిడ్డఁడా! నాకు నీయందు నిండు నమ్మకముండును. అయినను, ఇంగ్లాండు దూరదేశమగుటచే నమ్మజాలకున్నాను. అయినను మంచి చెడ్డల నారయు, బేచరజీస్వామి నడిగి చెప్పెదన"ని బదులిచ్చెను. పండిత బేచరజీస్వామి మహాత్ముని కుటుంబపు మంచిచెడ్డల నారయుచుండువాఁడగుటచే నా పండితునియందు గాంధి కుటుంబమునకు గౌరవముండు. మహాత్ముని తల్లి యా పండిత బేచరజీస్వామికిఁ దనయుని దూరదేశప్రయాణోత్సుకతను నెఱుకపఱచెను. అంతట నా పండితుఁడు "ఇతనినుండి మూఁడు వాగ్దానములు పుచ్చుకొని ఇంగ్లాండునకుఁ బంపవచ్చున"ని చెప్పి,

'మద్యమును, మాంసమును, మహిళను ముట్టన'ను మూఁడు వాగ్దానములను మహాత్మునినుండి గైకొని ప్రేమ పురస్సరముగా నాశీర్వదించి గాంధిబాబును నింగ్లాండునకు విద్యాభ్యాసమునకై పంపిరి.

మహాత్ముఁ డింగ్లాండునకుఁ బయనమైపోయి తల్లి దేశ మందుఁ దల్లి కిచ్చిన బాసచొప్పున నడచుకొనెను. తన ప్రతిజ్ఞా పాలనమున కెట్టి యాటంకములు వచ్చినను, వానిని మన మహాత్ముఁడు దరిఁజేరనీయలేదు. తల్లి కిచ్చిన బాసచొప్పున మహాత్ముఁడు ప్రవర్తించి లోకమున కాదర్శప్రాయుఁడయ్యెను. కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించుటయందు మహాత్మునికీ ప్రపంచమందు సాటిరాగలవాఁడు మఱియొకఁడు కానరాఁడు. వయస్సు చిన్నదిమైనను హృదయము పరమ గంభీరమైనది. మహాత్ముఁడా యాంగ్ల దేశమునం దెట్టి దుర్వ్యసనములందగులొక-సక, తన తల్లి కిచ్చిన వాగ్దానత్రయమును త్రికరణశుద్ధిగాఁ బరిపాలించెను. లేఁ బ్రాయమందిట్టి గట్టిపట్టుదలగలిగి యుండుట సాధారణమా? మహాత్ముఁడా మూఁడు వాగ్దానముల నెట్లు పాలించెనో యొక్కింత పరిశీలింతము.

### ప రీ క్ష

మహాత్ముఁ డింగ్లండునకుఁ బయణమైపోవు సమయమున స్టీమరులో నాతనికొక యాంగ్లమిత్రుఁడు తటస్థించెను. ఆతఁడు మాటలమీఁద మహాత్ముని మాంసాశన వైముఖ్యము నెఱింగి యోడ ఎఱ్ఱసముద్ర మధ్యభాగమునఁ బోవుచుండ నా యాంగ్ల ప్రయాణిక మిత్రుఁడు మహాత్మునిఁ దిలకించి "మిత్రమా! బిస్కే-సముద్రమును చేరనంతవఱకు నీవనుకొన్నటు

లుండునుగాని పిమ్మట నీ నియమమును మార్చుకొనవలసి యుండును. మాంసము తిననిమొదల బ్రతుకఁజాలనంత చలి ఇంగ్లండులో ఉండునని చెప్పెను. మహాత్ముఁడా మాటలను జెవియొగ్గివిని 'అచట మాంసము వర్జించియు బ్రదుకవచ్చునని జనులు చెప్పఁగా వింటినే' యని బదులుపల్కెను. అంతట నా యాంగ్ల మిత్రుఁడు 'అది వట్టికల్ల. నా యెఱుకలో అట్టివారెవ రును లేరు. ఒకటిచూడు; నేను సారా త్రావుచున్నను నిన్ను త్రావుమంటినా? కాని మాంసముతిని తీరవలెను. తినకున్న బ్రదుకఁజాలవ'ని చెప్పెను. మహాత్ముఁ డీ మాటలనువిని యెట్టి కలఁతయుఁ జెందలేదు. తన తల్లి కిచ్చిన బాసలు మాటిమాటికి స్మృతిపథమునవిహరించుచుండెను. మహాత్ముఁడా మిత్రునిఁ దిల కించి "మీ ఉపదేశమునకు వందనములు. కాని నేను మాంసము ముట్టనని మా అమ్మగారికడ యథావిధిగ ప్రమాణము చేసితిని కావున తినఁజాలను. అది లేకుండఁ జరుగదేని ఇంటికి తిరిగి వెళ్ళుటయే మేలని తలఁతున"ని తన నిశ్చయమెఱింగించెను.

ఇంగ్లండునందు డాక్టరు ప్రాణజీవన మెహతాగారి మిత్రునితోఁ గలిసియున్నప్పు డామిత్రుఁడు 'మాంసము తిను మ'ని మహాత్ముని బలవంతము పెట్టసాగెను. మహాత్ముఁడు తన తల్లియొద్ద నిచ్చిన ప్రమాణముల నా మిత్రునకుఁ దెలియఁ జెప్పెను. మహాత్ముఁ డాహారవిషయమునఁ బడుచున్న కష్టము లను జూచి యా మిత్రుఁ డోర్వలేక మహాత్మునిఁ జూచి "నీవు నా సోదరుఁడవై యుండుచో, ఈపాటికి మూటకట్టించియుందును. ఇచ్చట తప్పనిసరియైన విషయము లెఱుఁగక, చదువురాని నీ తల్లికడ చేసిన ప్రమాణమునకు ఏమి విలువ ? అది ప్రమా ణమే కాదు. అది 'లా' ననుసరించియు ప్రమాణముగాఁ బరిగ

ణింపఁ బడదు. అట్టి ప్రమాణమునకు బద్ధుఁడవై యుండుట అజ్ఞానము. ఇదిగో చెప్పుచున్నాను. ఈ పట్టుదలవలన ఇచ్చట నీ కేమియు మేలు కలుగఁబోదు. మఱియు నీవు మాంసము తినినపుడు, అది రుచించుచున్నటులు ఒప్పుకొనుచున్నావు. ఆవశ్యకము కానిచోట తిని ఆవశ్యకమగు చోట మానుచున్నావు. ఔరా అభాగ్యము!" అని పల్కెను. ఆ మిత్రుఁ డనేక గ్రంథముల నుండి ప్రమాణములను జూపెను. మిత్రుఁ డెంత ప్రయత్నించినను మహాత్ముఁడు పట్టు వీడకుండెను. మఱియుఁ దొల్లింటి కంటెఁ బట్టుదల యెక్కుడు కాఁజొచ్చెను. తుదకా మిత్రునిఁ జూచి "అయ్యా! నన్ను క్షమింపుఁడు. ఈ గహనవిషయములు నా తలదాఁటినవి. మాంసాహార మావశ్యమని ఒప్పుకొందును. కాని నేను నా ప్రమాణమును జవదాఁటను; దాని గురించియు వాదింపను. నేను మీతో వాదించి జయింపలేనని ఒప్పుకొందును. అజ్ఞుఁడననిగాని, వెంకెవనిగాని, తలఁచి నన్ను విడిచి పెట్టుడు. తమ ప్రేమకు మెత్తును. తాము నా హితైషులని ఎఱుఁగుదును. మీరు నా మేలుకే మరల మరల చెప్పుచున్నారనియు తెలియును. కాని నేను నా నియమము విడువఁజాలను. ప్రతిజ్ఞ ఎన్నఁడును ప్రతిజ్ఞయే. అది అనుల్లంఘనీయమ"ని మహాత్ముఁడు తన పట్టుదలను విప్పి చెప్పెను. మిత్రుఁ డిది యంతయు విని యాశ్చర్యచకితుఁడై, నాఁడు మొదలు మాంసాశనము చేయుమని మహాత్ముని నెన్నఁడు బలవంతము చేసి యెఱుఁగఁడు. మహాత్ముఁ డాహారము చాలక కడుపు కాలుచున్నను సత్యమును జాఱవిడిచి యెఱుఁగఁడు. ఈ యొక్క విషయముననే మహాత్ముని యాత్మశ్రేష్ఠ్యము తెల్లమగు చుండుటలేదా!

ఒకనాఁడా మిత్రుఁడు నాటకమునకు రమ్మని పిలువఁగా నందులకు మహాత్ముఁ డిష్టపడి మిత్రునివెంట నాటకము చూడఁ బోయెను. నాఁటి రాత్రి 'హాల్ బరన్ రెస్టరెంటు' లో భోజనము చేయ నిద్దఱును గూర్చుండిరి. అఁట మొదట 'సూప్' వడ్డింపఁ బడెను. అందు మాంసము కలదేమో యను పెద్ద విచికిత్స కలిగి మన సత్య పరిపాలకుఁడు గాంధిమహాత్ముఁ డా పదార్థము నిట్టటు నెగా దిగాఁ జూడ నారంభించెను. మిత్రుని నడిగి తెలిసికొన మహాత్ముఁడు సాహసింపఁజాలక పోయెను. అంత మహాత్ముఁడు వడ్డనవానిం బిలచెను. మిత్రుఁడు విని 'యేమల క'ని ప్రశ్నించెను. అందులకు మహాత్ముఁ 'డిందు మాంసము కలియలేదుగదా అని అడుగుటక'ని భయమున జవాబిచ్చెను. అంత నా మిత్రుఁడు పట్టరాని కోపమున "నీవు ఇట్టి సమాజములో ఉండదగవు. ఎటులు మెలఁగవలయునో నీకు తెలియని యెడల ఇంకొక భోజనశాలకు పోయి భుజించి నావచ్చువఱకును వెలుపల వేచియుండుము"ని పల్కెను. అంత నా పూటకూళ్ళ యింట భుజించుచున్న మాంసాశను లెల్లరు మహాత్ముని నెగా దిగాఁ జూచుట మొదలిడిరి. మహాత్ముఁడిప్పు డేమి చేయఁగలఁడు? మిత్రునకు లొంగుటయా? చూచువారలు హేళన చేయుదురని పాపభీతిని వీడి మాంసమును మ్రింగుటయా ? తల్లికిచ్చిన బాస కాపాడుటయా ? నాఁ డీ ప్రశ్నపరంపరకు దిగి ప్రతిజ్ఞా పాలనము గావింపక పోయినచో నేఁడు మహాత్ముఁడు కాఁగలఁడా ?

ఇట్టి చిన్నచిన్న సందియములందే డెందమును గట్టి పఱచుకొనక పోవుచోనిఁక గాంధి యెట్లు మహాత్ముఁడగును? ఇట్టి చిన్న సందేహము లందెందఱు గౌరవమును గోల్పోవుటలేదు ! మన గాంధిబాబు 'నేనిట కృత్రిమ గౌరవమునకు జంకి తల్లి

మాటను దృణీకరించుట పాడియా? మిత్రునిమాట మన్నించు టపాడియా?" యనుధర్మసందేహములం దగుల్కొని యెట్టకేలకుం దల్లిమాటయందు నిండుగౌరవము కలద'ని నిశ్చయించి యా యన్నశాలనుండి 'బ్రతుకుజీవుఁడా'యని బయటఁబడెను. ఆహా! ఏమి మహాత్ముని నిశ్చలత!

## గ్రుడ్లు

మహాత్ముఁ డింగ్లండు నందున్నప్పు డాహార విషయమున నెన్నియో గ్రంథములను దిరుగవేసెను. ఎందఱి స్నేహమో సంపాదించెను. ఆ గ్రంథములవలన, నా స్నేహితులవలన గ్రుడ్లు మాంసజాతికిం జేరవనువాదమును నమ్మి గ్రుడ్లను దినమొద లిడెను. గ్రుడ్లు ప్రాణము లేనివని మహాత్ముని యభిప్రాయము. కాని యా యభిప్రాయ మెంతకాలమో నిలువలేదు. ధర్మ దృష్టిచే గ్రుడ్లను మాంసజాతికిఁ జేరినవని యెఱింగి యాత్మ పవిత్రీకరణకై గ్రుడ్లనుగూడఁ దిన మానివేసెను. తల్లిమాటను మీఱుటకు మహాత్ముఁడు తన హృదయమున నెప్పుడును దావీయలేదు. మహాత్ముని మాతృభక్తి యనన్యము. అట్టి మాతృభక్తియే మనకందఱకుఁ గలుగుఁగాత!

## అగ్నిపరీక్ష

మహాత్ముఁడు సీమయందున్న చివఱి దినములలో (1890 వసంవత్సరమున) 'పోర్ట్సుమతు' అను పత్తనమున శాకాహార సభయొకటి జరిగెను. ఆహ్వానములు వచ్చుటచే మహాత్ముఁడు తన మిత్రునితోఁగలసి యాసభకు హాజరాయెను. మహాత్ముఁడు తన మిత్రునితోఁగలిసి యా పత్తన మందొక యింటియందు

బసచేసెను. ప్రథమ దినమున సభానంతర మిండ్లకువచ్చి భోజనాదికములను ముగించుకొని ప్రొద్దుపోకకుఁ జీట్లాడ నారంభించిరి. ఆ యాటయందా యింటి యాఁడుపడుచులును బాల్గొని యాడ నారంభించిరి. ఆటలతోఁబాటు సంభాషణములుకూడ మురిఁతి పై పెచ్చు సేఁతలకు దిగెను. మహాత్ముఁడు నా మాటల నందుకొనుచు నా యాఁడువారితో సరససల్లాపముల కుపక్రమించెను. మహాత్ముఁడు మితిమీఱి యా మిటారికత్తెల సరస సంభాషణాసక్తుఁడై యుండుటను మిత్రుఁడు కంటఁగని "నీవు కూడనా ఈ ఘోరకలిలో? ఈ పాపములో? నీ కిచట పని లేదుపో - లేచిపో"యని మహాత్ముని మందలించెను. అంత మహాత్ముఁడు సిగ్గువడి తన తల్లి చెంతఁ దాఁజేసిన బాసను జ్ఞప్తికిఁ దెచ్చుకొని బుద్ధికి మంచిచెప్పుకొని యటనుండి నిష్క్రమించెను.

ఇఁక నీయూరనుండిన నేమి కీడుమూడునో యని సంశయాత్ముఁడగుచు నటనుండి పాఱిపోయెను. "వేఁటకాని నుండి తప్పించుకొన్న లేడివలె నా గుండెలు తటపట కొట్టుకొనెస"ని తన యాత్మకథయందుఁ దెలిపియుండెను. మహాత్ముని హృదయమందు దుశ్చింత దూరక మునుపే మిత్రుఁడు మందలించెను. అంత మహాత్ముఁడు తప్పిదమునుండి తెప్పరిల్లి తల్లి కిచ్చిన బాసను హృదయమునఁ బదిలపఱచుకొని యటనుండి వెడలిపోయెను. సభా వ్యవహారములకు స్వస్తిచెప్పి యటనుండి తన బసకుఁ జేరుకొనియెను.

కామపాశవశులై మానవత్వమునే సర్వనాశనము కావించుకొనిన వారెందఱులేరు. యమపాశమునకు లొంగని ధీరుఁడు కామపాశమునకు దోసిలొగ్గును. మృత్యుదేవతకు

లోంగని సంయములు కామదేవతకు దాసానుదాసులు. ఇట్టి వారలు సంయములలో-దేవతలతోఁ బెక్కు-వుగలరని మనపురాణములు మనకుఁ దెలియఁజేయుచున్నవి.

కామోద్రేకముచే నెంతటివా రెంతవారుగానై పోయిరో చూడుఁడు. కూడు-నీళ్ళుమాని, ఎండ వానలను లెక్కిం-పక రాత్రింబవళ్ళు ఏండ్లు తరబడి తపమాచరించు మహామునులే-దేవతలే కామదేవతలకు దాసానుదాసలగుచుండ నిఁక సామాన్యులమాట యొకమాటయా?

అయినను, మహాత్ముఁడు అచంచలుఁడు; ఆత్మనిగ్రహుఁడు; కర్తవ్యాకర్తవ్యవివేచనుఁడు; కావుటం జేసియే మహాత్ముఁడా క్రూరకర్మలఁ దగుల్కొ-నక గంభీరహృదయుఁడై తల్లికిచ్చినబాసచొప్పుననడచుకొనఁగలిగెను. "తల్లి యెక్క-డనోదూర దేశమందుఁ గలదు. మనమిటఁజేయు మంచిచెడ్డల నామె యెట్లు పరిశీలింపఁగలదు? కావున, మనము మనచిత్తము చొప్పున జిందులు త్రొక్కు-దము"ను దురభిప్రాయము మహాత్ముఁడు కలనైనఁ దలఁచెనేమో చూడుఁడు. తన తల్లికిచ్చిన మూఁడు శపథములను మహాత్ముఁ డేయే సమయములందు నేయే విధమునఁ బరిపాలింపఁ గల్గెనో చూడుఁడు! మహాత్ముని మాతృభక్తికింతకంటెఁ దార్కా-ణము వేఱెద్దికలదు? సత్యసంధుఁడనుట కింతకంటె నుదాహరణమేమి కావలెను?

## తులసిమాల

మహాత్ముఁడు దక్షిణాఫ్రికాయందున్న దినములందుమహాత్మునకు 'కోట్సు' అను నాంగ్లమిత్రుఁడొకఁడు కలఁడు. అతఁడు

క్రైస్తవమతమందు మిక్కిలి పండితుఁడు. గుణసంపన్నుఁడు. వీరిద్దఱు అవకాశము లభించునప్పుడెల్లను మత విషయములం గూర్చి ప్రస్తావించుకొనుచుండెడివారు. ఒకనాఁడు కోట్సు, మహాత్ముని కంఠసీమ నలంకరించిన తులసిమాలనుగాంచి, తులసిమాలను ధరించుట మూఢాచారమనియెంచి, యొక్కింత చింతించి మహాత్మునిఁ గిలకించి 'ఈ గ్రుడ్డినమ్మకము నీకుఁ దగదు. దండను త్రెంపుదు నిటుఁ రమ్మనెను.' అంత మహాత్మునకుఁ దన తల్లి జ్ఞప్తికివచ్చెను. తనతల్లి పరమపదించి నాఁటికి కొన్ని యేండ్లాయెను. అయినను మాతృభక్తిని నేఁటికిని మహాత్ముఁడు వీడలేదు. తల్లి స్మృతిపథమునకు వచ్చినంతనే యుప్పొంగి పరవశుఁడై మహాత్ముఁడు "కూడదు. ఇది మా అమ్మగారి ప్రసాదము"ని మిత్రునకు బదులిచ్చెను. అంత నా మిత్రుఁడు 'అందు నమ్మకమున్నదా?'యని మఱలఁ బ్రశ్నించెను. అంత మహాత్ముఁడు 'అందలి రహస్యము నాకుఁ దెలియదు. ధరింపకున్నచో కీడుకలుగునని నేననుకొనను. ఆమె నా శ్రేయస్సుకోరి ప్రేమతో వేసిన యీ దండను ప్రబలమగు కారణము లేక తీసివేయను. కాలము పక్వమై, యిది జీర్ణమై, తనంతతాను తెగిపోయినచో మఱియొక తులసిపేరు కొనుటకు నాకు లోభములేదు. కాని దీనిఁ ద్రెంపవలను పడద'ని మాఱువలికెను. ఆహా! మహాత్ముని మాతృభక్తి యపారముకదా!

## పితృదేవుఁడు

మహాత్ముఁడు మాతృభక్తియందెట్లు అసమానుఁడో, అట్లే పితృభక్తియందును అసమానుఁడు. దండ్రియందు మహాత్ము

నకుఁ జిన్ననాఁటినుండియు భయభక్తులు గలవు. మహాత్ముఁ డెప్పుడు తండ్రిమాటను మీఱి నడచిన వాఁడుకాఁడు. తండ్రిని సదా సేవించుచుండెడివాఁడు. తండ్రి రోగగ్రస్తుఁడై మంచము పట్టినప్పుడు చెంతగూర్చుండి మహాత్ముఁడు తండ్రి పాదములఁ బట్టుచు సకలోపచారములఁ గావింపుచుండెడివాఁడని యాత్మకథ తెల్పుచున్నది. మహాత్ముఁడు తండ్రిని దైవమని తలంచి పూజించుచుండెడివాఁడు.

## సిగరెట్టు - దొంగతనము

మహాత్ముఁడు తన లేఁబ్రాయమందుఁ దన సహజ చాపల్యమువలన 'సిగరెట్టు' ద్రాగుట కలవాటుపడెను. ఆ చిన్నతనమందు 'సిగిరెట్టు'లకు డబ్బులు దొరకని కారణమునఁ దనయింటి నౌకరుల డబ్బును దొంగిలింపఁ దొడఁగెను. కొంతకాలమునకీ దొంగతనమందలి చెడ్డతనమును గ్రహించి 'సిగిరెట్టు'లను ద్రాగుటయు, దొంగతనము చేయుటయు మానుకొనెను. తమ తప్పులను తమంతటదామే సవరించుకొనుట సత్పురుషులకు సహజలక్షణముగదా! మంచివాని పగిది, పైకగపడుచు లోలోన దొంగపనులుచేసి లోకమును మోసగించుటకు మహాపురుషు లొడంబడరుగదా!

## అనుతాపము

గాంధిమహాత్ముఁడు తాఁజేసిన తప్పులకెంతయో కుంది లుచు చేసిన తప్పులను దాఁచుట గౌరవహీనమని తలపోసి తన

తప్పులనన్నిటిని దండ్రికి విన్నవింప నిశ్చయించి, యొక్కనాఁడు తాఁజేసిన తప్పులన్నిటి నేరికూర్చి పట్టికయొకటివ్రాసి తండ్రిచేతి కందించెను. తండ్రి యా తప్పులుగల యుత్తరము నామూలా గ్రముగాఁ దిలకించి కన్నులనుండి యశ్రుకణములను బొటబొట రాల్చుచుండెను. తండ్రినిఁజూచి కలవరముచెంది తాఁగూడఁ గన్నీటమున్గి "ముందిక దొంగతనము చేయన"ని మహాత్ముఁడు మనమున దిటవొనర్చుకొనెను. తన యాత్మకథయందీ విషయ మును గురించి,

"నేను ఆ చీటిని మా నాయనగారికి ఇచ్చుచు వడఁకి పోవుచుంటిని. ఆయన అపుడు భగందరమువలన బాధపడుచు మంచము పట్టియుండెను. ఆయనశయ్య ఒకబల్ల. చీటి వారిచేతి కిచ్చి నేను ఎదురుగా కూరుచుంటిని.

వారు దానినంతయు చదివిరి. ముత్యములంతలేసి కన్నీటి బొట్లు గండఫలకములనుండిజాఱి ఆ చీటీని తడిపివేసెను. ఒక నిముషము ఆయన కనులు మూసికొని ఆలోచనలో మునిఁగి పిదప ఆ చీటీని చింపివేసెను. లోఁగడ ఆయన దానిఁ జదువ లేచెను. ఇపుడు మరల శయనించెను. నాకును అపుడు ఏడుపు వచ్చెను. నేను నాతండ్రి వేదనను గ్రహించితిని. నేను చిత్ర కారుఁడ నేని నేఁడు అదియంతయు చిత్రింపఁగలిగి యుందును. అది యింకను నా కనులకు కట్టినటులున్నది.

ఆ ప్రేమ బాష్పములు నా హృదయమును ధౌతము చేసి నా పాపమును కడిగివైచెను. అనుభవించినవానికే ఆ ప్రేమ తెలియును—

ద్వి. అనురాగశరముల యనుభూతివెలయు
మనుజునకే దానిమహిమలు తెలియు.

(మూలము:- రామ-బాణవాగ్యాంరే హోయ్‌తేజాణేం)

నాకు ఇదియొక అహింసాపాఠము ఆయెను. అందు పితృ వాత్సల్యముకంటె ఎక్కుడు ఏమియు నాకు అప్పుడు కాన రాలేదు. కాని నేఁడు అది కేవలము అహింసయని తెలిసెను. అట్టి అహింస ఎప్పుడు వ్యాప్తముగా గృహీతమగునో అప్పుడు దాని స్పర్శనుండి ఎవఁడు అలిప్తుఁడై ఉండగలఁడు? దానిశక్తికి మేర లేదు.

ఇంత శాంతమగు ఓర్పు మా తండ్రికి స్వభావేతరము. ఆయన కోపించునో, దూషించునో, తల పగులఁగొట్టుకొనునో అని అనుకొంటిని. కాని ఆశ్చర్యము కలిగించు ఆయన శాంతికి కారణము నా దోషస్వీకారమే అని నా నమ్మిక. 'మరల ఈ దోషము చేయను' అను శపథముతోఁగూడిన దోషస్వీకృతి దానిని గ్రహించుటకు అధికారముగలవానిముందు సమర్పింపఁ బడినపుడే అది సరియగు ప్రాయశ్చిత్తము.

(తెలుఁగు - ఆత్మకథనుండి)

మహాత్ముని పితృభక్తి యపారమని పై మాటలవలన స్పష్టపడుచున్నది. "తప్పుచేయుట మానవునకు సహజము; అది తెలిసికొని పశ్చాత్తాపపడుట మహాత్ముల లక్షణ"మని యార్య

లనుచుందురు. ఈ లక్షణము మహాత్మునియందు సత్యమై సార్థకమై లక్ష్యమై యొప్పుచున్నది.

తల్లిదండ్రులు దైవసములను నార్యోక్తిని దన జీవితము నందాచరించి లోకమునకుఁ బరమధర్మమని ఋజువుచేసెను.

మహాత్ముని జీవిత విశేషములు, మానవులు కాఁగోరు వారి కెంతయుఁ బరమాదర్శమై మేలుబంతియై యొప్పుచున్న వనుట నిక్కువము.

# గార్హస్థ్యము

విద్యయు, మాతా పితృభక్తియు, మానవుని యున్నత జీవితమునకు సాధనములని వెనుకటి ప్రకరణమునఁ జదువు కొంటిమి. ఈ సాధనములకుఁదోడు గార్హస్థ్యము కూడ గొప్ప దయి యుండిన యెడల మానవుఁ డున్నతస్థానమును బొందుట నిశ్చయము. ప్రేమావిర్భావమునకు గార్హస్థ్యము బీజమువంటిది. గార్హస్థ్యము లేనిచోఁ బ్రేమకలుగదు. ప్రేమలతిక పెనవేసి కొని ప్రాఁకుచు వ్యాపించుటకు గార్హస్థ్యమనెడు గృహావృక్షము దగినదని చెప్పుట యతిశయోక్తికాదు. గృహస్థాశ్రమమందుఁ దలసిడనివాని బ్రతుకు, జీవితములేని శరీరమువంటిది. గృహస్థా శ్రమము మానవుని యందున్నట్టి ప్రేమలతను వికసింపఁజేయు సత్సాధనము.

ఒక పురుషుఁడొక స్త్రీనిగూడి, కలసిమెలసి సంసార యాత్ర సాగించునప్పుడు ప్రేమ మొలకెత్తును. అంతియకాని వేలకొలఁది గ్రంథములను జదివినను, నిరంతరము ఉపన్యా సము లిచ్చినను ప్రేమకలుగదు. ప్రేమాస్పదమగు గార్హస్థ్యమే గార్హస్థ్యము.

ప్రేమకుఁ గుదురగు గార్హస్థ్యము ప్రపంచమందుండి తీఱ వలయునను సత్సంకల్పముచేతనే భగవంతుఁడు సమస్త జీవ

కోటిని స్త్రీ పురుష భేదముచే సృష్టించుచుండుట! స్త్రీ పురుష మూలమున సృష్టి పెంపొందుటకు ప్రేమవర్ధిల్లును. స్త్రీ పురుష భేదముచే నీ ప్రేమ ప్రవృద్ధిగాంచుటయే భగవత్సృష్టికిఁ గారణము. తత్కారణమారసితదనుగుణ్యముగాఁ బ్రదర్శింపనివాఁ డెట్లు భగవంతున కెట్లు ప్రేమాస్పదుఁడు కాఁగలఁడు?

ఒకతోఁట యందిద్దఱు పనివారలు కలరను కొందము అందొకఁడా తోఁటలోనిఁ బనిపాటలుసేయక యిట్టటు తిరుగాడు చుండును. ద్వితీయుఁడు యజమానుఁ డాజ్ఞాపించిన పనులను జక్కపెట్టుకొనుటయందే ప్రొద్దుపుచ్చుచుండును. యజమానుఁడు చూచిపోవుటకుఁ దోఁటకు వచ్చినంతనే ప్రథముఁడు కృత్రిమ భయభక్తులతో సమీపించి ముఖస్తుతి మాటలతోఁ గాలము గడుపుకొనుటకుఁ బ్రయత్నించును. ద్వితీయుఁ డట్లుగాక, తన కర్తవ్యమునం దాయత్తచిత్తుఁడై యజమానుని రాకయు గమనింపక శ్రమించుచుండును. ఇందెవఁడు స్వధర్మనిర్వాహణపరాయణుఁడు? అట్లే, ప్రపంచమందు మానవుఁడై జన్మించి గృహస్థాశ్రమ ధర్మనిర్వాహణమందుఁ బాల్గొననివాఁడు, మాటలతోఁ బ్రొద్దుపుచ్చు మొదటి సేవకునివంటి వాఁడగును. గృహస్థాశ్రమమును స్వీకరించినవాఁడు రెండవ సేవకుని వంటి వాఁడగును. కావున గృహస్థుఁడు భగవదాజ్ఞా పరిపాలకుఁడు కాఁగలుగును.

## మహాత్ముఁడు—గార్హస్థ్యము

మన గాంధిమహాత్ముఁడు పరమ పవిత్రమైన గార్హస్థ్య మూలమునఁ దన జీవితము నాదర్శముగఁ గడపి యెల్ల ప్రాణులను దన ప్రాణమువలెఁ దలంచి ప్రపంచసేవ సల్పుచుండెను.

మహాత్ముఁడు గృహస్థాశ్రమము స్వీకరింపనిచో లోకసేవ చేయు ప్రేమ రసార్ద్రి హృదయము కలిగియుండఁగలఁడా ? మహాత్ముని తల్లిదండ్రులుగృహస్థాశ్రమముస్వీకరింపనిచో నుత్తమపురుషుఁడు మహాత్ముననిని లోకము పొందఁగలిగి యుండెడిదా? మహాత్ముఁడు అవతరించుటకుఁ గారణమయిన గార్హస్థ్యము చిరకాలము వెలయుఁగాక ! మహాపురుషుల పుట్టుకకు మూలమగు గార్హస్థ్యము శాశ్వతకాలము వెలయుఁగాక !

## వి వా హ ము

గృహస్థాశ్రమమునకు విధింపఁబడిన వివాహము లనేకములు గలవు. అందు వానిని మన పూర్వు లష్టవిధముల విభజించిరి. బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, రాక్షసము, ఆసురము, గాంధర్వము, పైశాచమునని

"బ్రాహ్మంబు దైవంబుఁ బరగనార్షంబుఁ బ్రా
జాపత్యమును రాక్షసంబునాసు
రంబుగాంధర్వంబు రమణఁబైశాచంబు
నను నెనిమిది వివాహముల......"

(మహాభారతము, ఆదిపర్వము.)

## గా ర్హ స్థ్య ము

అందుత్తమమైనది గాంధర్వ (స్వయంవర) వివాహము. ఈ స్వయంవర వివాహము కాలక్రమమున నశించిపోయెను. నేఁడు తల్లిదండ్రుల యిష్టానిష్టముల ననుసరించి వివాహములు జరుగుచున్నవి. ఈ వివాహములను 'దైవ' వివాహములని

యుండెను. ఈ దైవ వివాహమే మహాత్మునకుఁ గావింపఁబడెను. మహాత్ముఁడు పెండ్లినాఁటికి పదమూఁడేండ్ల ప్రాయముగలవాఁడు. ఇఁక కస్తూరిబాయి యంతకంటెఁ జిన్నదికదా! ఇట్టి బాల్య వివాహములు చేయరాదని దేశమంతయు తిరుగాడుచున్నది. మహాత్ముఁడు తన బాల్య వివాహముచేఁ గలిగిన యనర్థకములను దన యాత్మ కథయందుఁ జెప్పియుండెను చిన్నతనమందు వివాహము చేసికొనుటకు మహాత్ముఁ డేమి చేయఁగలఁడు? పాపము. మహాత్ముఁడు తల్లిదండ్రుల యాజ్ఞ మీఱని ప్రాయముగలవాఁడుకదా!

## బాల్య వివాహము

బాల్యవివాహమువలన ననర్థకము లనంతములు. ఈ యనర్థక వివాహములు నశించినఁగాని మన భారతదేశము బాగుపడఁజాలదు. బాల్య వివాహము లనర్థదాయకములని వృద్ధవివాహములు చేయరాదు. అవి యింతకంటె ముప్పు దెచ్చిపెట్టును. బాలబాలికలకు యుక్తవయస్సున వివాహము చేయుట ధర్మము. యుక్తవయస్సురాని పదునాలుగేండ్లకు ముడి వెట్టరాదు. స్వాతంత్ర్యజీవన మలవఱచుకొనుటకు ఇరువదియైదేండ్ల ప్రాయమందు బాలునకు, పదునాఱేండ్ల ప్రాయమున బాలికకు వివాహము చేయుట ధర్మము.

అయితే; బాల్యవివాహముచే మహాత్ముని పరహితైక జీవితమున కెట్టి యాటంకము కలుగలేదు. ఆ బాల్యవివాహము ప్రేమానురాగముల కాస్పదమై వర్ధిల్లుచుండెను. కాని యంత మాత్రముచే బాల్య వివాహము తగునని మన మనుకొనరాదు. బాల్య వివాహములు నశింపవలయుననియే మనము నిక్కముగా నభిలషింపవలెను.

## స్త్రీ స్వాతంత్ర్యము

స్త్రీపురుషులు అను శరీరద్వంద్వమున కేకప్రాణము గార్హస్థ్యము. స్త్రీ పురుషు లిద్దరు విద్య, జ్ఞానము, సత్ప్రవర్తనము, ప్రేమ, సత్యము మొదలగు సద్గుణములు కలిగియుండవలయును. లేనిచో, గార్హస్థ్య జీవితము దుఃఖమయ మగును. గార్హస్థ్యమునకు గృహిణి ముఖ్యురాలు. కావున స్త్రీ, పురుషునివలె నన్నింట స్వాతంత్ర్యము కలిగియుండవలయును. ప్రాచీన కాలమున నారీమణు లెల్లరు స్వాతంత్ర్యమును జేబట్టినవార లేగదా! నేడు స్త్రీలకు స్వాతంత్ర్యము లేకపోవుట మిగుల లజ్జాకరము. పురుషుల యజ్ఞానముచే స్త్రీలు తమస్వాతంత్ర్యమును గోల్పోవు చుండిరి. ఎన్నఁడు, పురుషుఁడు స్త్రీకి విద్యను గఱపింపక, స్వాతంత్ర్య మీయక ఘటదాసియని తలంచెనో, నాఁడే యువిదకు స్వాతంత్ర్యము నడుగంటెనది. ఆ కారణమున గృహస్థాశ్రమము నిర్జీవ మైపోయెను. స్త్రీలోక మెప్పుడు 'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి' యను నజ్ఞానమునకు లోఁబడెనో; అప్పుడే ప్రేమయు నశించెను. స్త్రీ ఘటదాసిగా భావించునంతవఱకు మానవుఁడు మానవుఁడు కాఁజాలఁడు; దేశ మభివృద్ధి యగుటయుఁ గల్ల.

## మహాత్ముని గార్హస్థ్యము

మహాత్ముని జీవితము విదేశ నాగరకతా వ్యామోహము ననుసరింపక భారత జాతీయ జీవనమున కలవాటుపడుట యొక యపూర్వ విశేషము. విదేశ నాగరకతా పిశాచము భారత దేశమందలి యింటింటను జిందులు త్రొక్కుచుండుట నాఁటికి నేఁటికిఁ గాన్పించుచుండుట భారతదేశ దౌర్భాగ్యమని చెప్ప

వచ్చును. అందుచే జనులు చదువుకొని పట్టములు పొంది విదేశముల కేగివచ్చినవారు కేవలము తెల్లవారల మాదిరిగా నుండి తమ జాతీయ జీవన సౌభాగ్య మనుభవింపలేక తెల్ల మొగము వేయుచుండు దినములలో వారియనుకరణమునకై, మిడి మిడి జ్ఞానము గలవారు నహితము అచ్చము తెల్లవారమగుదు మని భల్లుక తెల్లవారినను నిద్రనుండి లేవక సోమరులై, యదియే నాగరకతయని భ్రమసి జీవితమును వ్యర్థపుచ్చుచు విదేశీయుల ననుకరించుట యజ్ఞాన మగును.

అట్టి దినములలో మహాత్ముఁడు విదేశ నాగరకతా వ్యామోహ పంకమునఁ బడక జాతీయ జీవితము కలిగియుండుట నిజమునకు గర్వింపఁదగిన విశేషము.

మహాత్ముఁడు గృహస్థాశ్రమ ధర్మములను బాలించుచు తన జీవితమును ప్రపంచమున కాదర్శముగా నడుపుకొనఁ గలిగెను. కామవశుఁడై పురుషుఁడు వివాహము చేసికొనక మానవసేవ చేయఁదలఁచి పెండ్లాడుట ధర్మము. భగవదాజ్ఞను బాలించి లోకసేవకని సంతానమును గనవలయును. మహాత్ముఁడు తన జీవితేశ్వరి కస్తూరిబాయితోఁగూడి గార్హస్థ్యమును కామ మోహముల కెన్నఁడు నగ్గము చేయలేదు. గృహస్థాశ్రమము ప్రేమకుఁ బుట్టిల్లని ఇంతకుముందునుండి చెప్పుచున్నాము. మహాత్ముని గార్హస్థ్య జీవిత విశేషములను దెలిసికొనుట మనకెల్లర కావశ్యకము. మహాత్ముఁడిప్పుడిట్టి స్థానమలంకరించుటకుఁ గారణము లేవో యూహింపుఁడు. మహాత్ముఁడు సర్వభూతములను ఆత్మసదృశముగా భావించుచుమానవసేవ చేయుచుండుటకుఁ గత మెద్ది? గృహస్థాశ్రమధర్మ నిర్వహణముచే నెంతటివాఁడెంతటి

మహాత్ముఁడు కాఁగలిగెనో చూడుఁడు! మహాత్ముఁడిట్టి యున్నత స్థానము పొందుటకు గార్హస్థ్య జీవితముగదా కారణము!

గార్హస్థ్యము తన దారపుత్రాదులనువలె నెల్ల జీవులను ఆత్మసదృశముగ భావింపవలయునని ధర్మములు ప్రబోధించుచున్నవి. మహాత్ముఁడు నిజదార సుతాదులను ప్రేమించినట్లే లోకమును ప్రేమింపఁ గలిగెను. మానవసేవ సల్పుటయే మహాత్ముని సంకల్పము. మానవ సేవయే మాధవ సేవయని మహాత్ముని యాశయము. ఈ యాశయము మహాత్మునికి గార్హస్థ్య ధర్మమువలననే కలిగినది. మహాత్ముఁడు గార్హస్థ్యధర్మ మెఱుఁగనివాఁడగుచో మోహనదాసు కరమచందు గాంధి — మహాత్ముఁడు కాఁగలఁడా?

## బా ల్య మం ద లి చే ష్ట లు

మహాత్మునకు లేఁత్రాయమందు కస్తూరిబాయినిచ్చి తల్లిదండ్రులు వివాహము చేయుటచే మహాత్ముని బాల్య దాంపత్యమును మనము ప్రమాణముగా గైకొనఁదగదు. పదుమూఁడేండ్ల గాంధి, తన భార్యనెట్లు గౌరవింపఁగలఁడు? బుద్ధి పరిపక్వము కానప్పుడు మనస్సెట్లుపోయిన నట్లు నడుచుకొనుట యెల్లరకు సహజమేగదా! మహాత్ముఁడా చిఱుత ప్రాయమునందుఁ దన భార్యను ఘటదాసివలెన తలఁచినాఁడు. తానీ తలంపుచేఁ దన భార్యయెడఁ జేసిన తప్పిదము నెల్లను దన యాత్మకథయందు విశదీకరించెను. ఎల్ల వేళలందు మహాత్ముని మనస్సు కస్తూరిబాయి యందే లగ్నమై యుండెడిది. చదువుకొను నప్పుడు, నిద్రపోవు నప్పుడు మహాత్ముఁడు కస్తూరిబాయిని నటుపోకుము; ఇటు రాకుమ'ని నిర్నిమిత్తముగా నాజ్ఞాపించుచుండెడివాఁడు. మాటి

మాటికాయెను సందేహించుచుండెడివాఁడు. తండ్రి మరణకాలమందుఁ దాను పడకగదియందు కస్తూరిబాయితోఁ గలిసి పరుండి నిద్రపోవుటయు, పిమ్మట తండ్రి మరణవార్త చెవి సోకుటయు వంటి తన యజ్ఞానమునకు దుఃఖించుటయు మొదలగు బాల్యచేష్టల నెల్లను మఱుగుపుచ్చక సర్వము నాత్మకథయందుఁ జెప్పియుండెను. మనమీ గాంధిని ప్రస్తుతము మఱచి పోవుదము. ఆ పెద్ద చేష్టలకు బాల్య వివాహమే కారణమై యుండవచ్చును. తగిన వయస్సువచ్చిన పిమ్మట భార్య విషయమున వెనుకటి యభిప్రాయముల నన్నిటిని మార్చుకొనఁగలుగుటచే మహాత్ముఁడు మన కాదర్శనీయుఁడు కాఁగల్గెను. మహాత్ముఁడు భార్యావిషయమున కిట్లు నిర్వచనము కావించెను.

"అహింసను నేను సాంగోపాంగముగా తెలిసికొనిన పిమ్మటనే నాకీ అనుమాన ప్రవణము మానిపోయెను. అప్పుడు నేను బ్రహ్మచర్యముయొక్క మహిమను తెలిసికొని భార్య భర్తకు ఘటదాసి కాదనియు, అతనికి సహచారిణి యనియు, సహధర్మిణియనియు, ఆమెకు అతని సుఖదుఃఖములలో పాలు కలదనియు, తనవారి తాను చూచుకొనుటకు భర్త ఎంత స్వతంత్రుఁడో తానును అంత స్వతంత్ర యనియు నే నెఱిఁగితిని. సందియములతో అనుమానములతో నిండిన ఆ చీకటి దినములు తలఁచినప్పుడెల్ల నా మూర్ఖతకు, విషయాంధమగు నిర్దయత్వమునకు క్రోధమును, నా మిత్రునితో చేసిన గుడ్డిసహవాసమునకు దుఃఖమును కలుగును" అని మహాత్ముఁడే తన ఆత్మకథయందుఁ జెప్పియుండెను.

దినములు గడచిన కొలఁది మహాత్మునకుఁ గస్తూరిబాయియందు గౌరవమేర్పడుచుండెను. వయస్సువచ్చిన పిమ్మట

మహాత్ముఁడు భార్యను భోగసాధనమని తలఁచి యెఱుఁగఁడు. అట్టితలంపే కలుగుచో గాంధిమహాత్ముఁడెట్లు కాఁగలఁడు? మహాత్ముఁడు తన భార్యయందుఁ జూపిన ప్రేమ గౌరవములు వర్ణించుట మా కలమున కలవిగానిపని. కస్తూరీ గాంధులు శరీర భేదముచే నిద్దరైనను హృదయ సమ్మేళనముచే నొక్కరు. ఇరుమేను లొక్కప్రాణం బిరుడెందము లొక్కతలంపు అను సూక్తికి మన యీ పుణ్యదంపతులు పరమలక్ష్యమై యొప్పుచుండిరి. ఇంక మహాత్ముఁడెందుఁబోయిన నందు కస్తూరీబాయి ప్రత్యక్షమే కదా! కస్తూరీబాయి పతిమాట జవదాఁటి యెఱుంగదు. మహాత్ముఁడు భార్య స్వాతంత్ర్యమున కడ్డుపడియెఱుఁగడు. జంటశరీరములందుఁ బ్రకాశించునేకాత్మవలె నా పుణ్యదంపతులిద్దఱు నేక మనస్కులై, ప్రపంచమందాదర్శ దాంపత్య శోభితులై మన భారతావనిని బునీతము గావించుచుండిరి.

ఆర్యనారీ ధర్మములన్నియు మన కస్తూరిబాయి మాత యందు మూర్తీభవించియున్నవి. వేయేల? ఈ తల్లి పతివ్రతా మహాత్మ్యమువలననే మోహనదాసు కరమ్‌చందుగాంధి మహాత్ముఁడు కాఁగల్గెననినఁ నీకనామె గొప్పతనమును వేఱుగాఁ జెప్పవలయునా? మహాత్ముఁడు "నాభార్యను సోదరివలెను, దల్లివలెను, దైవమువలెను చూచుకొనుచుందున'ని పలుచోట్ల ప్రసంగవశమునఁ బ్రసంగించియుండెను. ఈ పూజ్యదంపతు లిద్దరు కాలక్రమమున నలువురు బిడ్డలను బడసిరి. సంతాన సౌఖ్యమనుభవించిన పిమ్మట గార్హస్థ్యముకంటె బ్రహ్మచర్యము దేశసేవ చేయుటకు మిక్కిలి యనువగు సాధనమని తలంచి నిర్లేపమునఁ దమ జీవితమును బ్రహ్మచర్యవ్రత మవలంబించి ప్రపంచమందుఁ బూజ్యుఁడయ్యెను.

బ్రహ్మచర్యము

కేవల గృహకార్యములందే నిమగ్నమై యమూల్యమగు కాలమును బవిత్రమగు జీవితమును వ్యర్థపఱచుట యేరికిధర్మము కాదుగదా! సతతము గృహమును-గార్హస్థ్యమును జక్కపెట్టు కొనుటయందే ప్రొద్దుపుచ్చిన మోక్షమెట్లు లభింపఁగలదు? కావున, మనపూర్వులు మన బాగోగులను గమనించి మనము తరించుటకు సులువగు మార్గమొక్కటే చూపియుండిరి. ఆ మార్గానుసరణముఁ బ్రవర్తించిన యెడల మోక్ష ప్రాప్తి కలుగఁగలదు. తన యాలుబిడ్డలను బోషించుకొనుచుఁ దన యమూల్య జీవితమునువ్యర్థపఱచిన యెడలఁ గర్తవ్య ధర్మమెట్లు నిర్వహింపఁగలఁడు? మానవుఁడు గృహస్థాశ్రమము స్వీకరించుట లోకసేవకేగదా! కావున గృహస్థుఁడు కేవల గృహకార్యములను జక్కదిద్దుకొనుటయందుఁ గాలమును - జీవితమును వ్యర్థపఱచుట తగదు. శక్తికొలఁది మానవసేవ యొనర్పవలయును. మానవసేవయే మాధవసేవ. కావున గృహస్థుఁడెప్పుడును సేవాతత్పరమతియై లోకమున కూఢిగము చేయవలయును. సేవకు శక్తి, శక్తికి ఆత్మశక్తి ఆవశ్యకములు.

శక్తియన నాత్మశక్తియని యర్థము. ఇంద్రియ నిగ్రహముచే నాత్మశక్తికలుగును. బ్రహ్మచర్యవ్రతపాలనమున నింద్రియ నిగ్రహము కలుగును. అందువలన బ్రహ్మచర్యవ్రత మూలమున నాత్మశక్తి సంపాదించుట సౌలభ్యమగును. చంచలములగు నింద్రియములకు లొంగక యింద్రియములను నైవస మొనర్చుకొని విషయ పరాఙ్ముఖుఁడై మానవుఁడు సంచరింపవలయును. విషయలోలత్వబుద్ధి నశింపవలయును. అనాసక్తబుద్ధితో 'సర్వము సర్వేశ్వరార్పణబుద్ధితో-సర్వసమ భావబుద్ధితో - ఎల్లెడల నెల్ల

రను ప్రేమింపవలయును. ఇట్టి యుదారబుద్ధి కలిగి తన మనో వాక్కాయములచే నెవఁడు బ్రహ్మచర్యవ్రతపాలనము కావించునో వాఁడే ఋషిసత్తముఁడు. ప్రపంచవాసనలం దగుల్కొని తెన్నుగానక పర్వెత్తు మనసును గుదుటఁబెట్టుకొనలేక కీకారణ్యములకు-పర్వతగుహాలకుఁ బఱుగిడిన నేమిఫలము? అంత మాత్రమున మనస్సు కుదుటఁబడఁగలదని యెటు చెప్పఁగలము? ఆలుబిడ్డలతో-చుట్టపక్కములతోఁ గలసి మెలసి మెలఁగుచు మనోరథమును ఇంద్రియాశ్వములు లాగినట్లెల్లను బోనీయక బుద్ధి సారథివశమున మెలఁగినచో నడవులకుఁ బోవ నావశ్యక మేమికలదు? నీకీ సామర్థ్య మడవులయందైన నుండితీఱవలయును గదా! కావున గృహస్థాశ్రమమందే సర్వము భద్రపఱచుకొనుట యుక్తము. ఆత్మశక్తిని బెంపొందించుకొనుము. ఆత్మశక్తిచే నీశ్వర సాక్షాత్కారము గలుగును.

ఇంద్రియములను వైవస మొనర్చుకొనలేక, విషయ వాంఛలను దూరీకృతము కావింపలేక కేవల మరణ్యము లకుఁ బర్వెత్తిన నేమిఫలము? సన్యాసమన నేమి? బ్రహ్మచర్య మన నేమి? మూలమట్టుగ నాలోచించిన నన్నిటి యంతరార్థము పరార్థ మొక్కటియనితోఁపక మానదు! కేవల దారపుత్రులను సన్యసించుట సన్యాసము కాఁజాలదు. తాఁజేయు ప్రతి కర్మ ఫలాపేక్షను విడనాడుటయే సన్యాసము. అట్లే, బ్రహ్మచర్యము నని తలంపుఁడు. బ్రహ్మసాక్షాత్కారమునకు ఇంద్రియనిగ్రహము కలిగి యాత్మశక్తిని సంపాదించుకొని బ్రహ్మచర్య మాచరించుచు ప్రపంచసేవ యొనర్పవలయును. అంతియకాని 'యే ఁడవికో పోయి' అట 'దేవదేవా'యని పలువరించిన నేమిఫలము? ఇందు లేని దేవుఁడందుఁగలఁడా? ఆత్మపరిశుద్ధికి బుద్ధి ప్రధానముకాని

స్థలము ప్రధానమా? బుద్ధికి శీలము ప్రధానముకాని, యడవు లందలి చెట్టుచేమల నీడ ప్రధానమా? పలుపలుకులేల? ఆత్మపరి శుద్ధివలయునుకాని, ఎంతన్న నేమి? ఏమిచేసిన నేమి? ఆలుబిడ్డలను బోషించుకొనుచు భగవంతుని దర్శింపవలనుపడదా? ఎల్లెడలఁ బ్రకాశించు భగవంతుని నీవిటఁ గాంచఁజాలకపోవుచో నడవులం దెట్లు కాంచఁగలవు? భార్యమీఁదఁ గినిసి సన్యసించుటయు, బ్రహ్మచర్యము గైకొనుటయు వెఱ్ఱితనము. ఆత్మపరశుద్ధికిఁ బైఁజెప్పిన విధమున బ్రహ్మచర్యమో, సన్యాసమో యవలంబించుట ధర్మము. తన జీవితమునంతను ప్రపంచసేవకు - భగవత్సేవకు వినియోగింపవలయును. జీవితము చరితార్థమగుటకు మన పూర్వులీ తిన్ననిదారి ద్రొక్కిరి.

పాఠకమహాశయులారా! మహాత్ముని జీవితమును గమనింపుఁడు. మహాత్ముఁడు భార్యాపుత్రులతో జీవితము గడుపువాఁడైనను కామమోహములకుఁ దావిచ్చుట లేదుగదా! మహాత్ముఁడు స్త్రీలను భోగసాధనమని తలంచుట లేదు. కావుననే, మహాత్ముఁడు భార్యతో నున్నను బ్రహ్మచర్య వ్రతమును నియమమునఁ బరిపాలింపఁ గల్గుచుండెను. సంయమియన మహాత్ముఁడేకదా! కొందఱు ఇంద్రియవశులై స్త్రీలను దూఱుచుందురు. స్త్రీల నంటినను - చూచినను పాపమని తలంతురు. స్త్రీని దేవతా స్వరూపముగా నెంచుచో నెట్టి యాపత్తు వాటిల్లదుగదా! అట్టి దేదియులేక యాత్మనిగ్రహము లేక కామము పీడక స్త్రీలను దెగడిన నేమి ప్రయోజనము? పురుషుఁ డాత్మ నిగ్రహ సంపన్నుఁ డగుచో నబల యేమి చేయఁగలదు? చిత్తశుద్ధి యున్నచో స్త్రీ చెంత నున్నను పురుషున కెట్టి ముప్పును వాటిల్లదుగదా!

"స్త్రీల పవిత్రతకుఁ బురుషులు కారణమై యుండ వలయును."

"అజ్ఞానముచేఁ బురుషుఁడు కామాంధుఁ డగుచున్నాఁడు."

"స్త్రీ భోగసాధన యోగ్యమని తలంచునంతదనుక మన మెల్లరము నీచులముగానే భావింపఁబడుచుందుము. భగవత్సృష్టి యందు స్త్రీఘట దాసియని తలంచుటకంటెఁ బురుషులు చచ్చిన నెంతయో మేలు."

అను పరమార్థమును గ్రహించుట మానవుని లక్షణమని యెఱుఁగవలయును.

### స్త్రీలు — మహాత్ముఁడు

పురుషులు స్త్రీలయెడఁ గామాంధకారులై ప్రవర్తించుటయు, నందులకు మాత్రమే యని స్త్రీలను దూరముగా నుంచు తలంపును, స్త్రీలను ఘోషాపద్ధతియం దుంచుటయును లోకమునఁ బురుషుఁడు చేయు మహాపరాధము. స్త్రీ భోగ్య వస్తువు కాదు. పురుషునికి దూరముగా నుండఁదగినదియుఁగాదు. ఈ భగవత్సృష్టిలో మగవానికి నాఁడుదియే యాప్తురాలు. అట్టి యెడ స్త్రీని సమభావమునఁ జూడని మగవాఁడు సహితము ఆఁడుది లేకుండఁగ నెట్లు పుట్టఁగలఁడో యూహింపుఁడు? మహాత్ముఁడు తన ప్రియురాలియెడఁ జూపిన ప్రేమాదరములు లోకమునకుఁ బరమప్రమాణములు. స్త్రీలయెడ మహాత్మునకుఁ గల గౌరవభావ మింత యంతయని చెప్ప నలవికాదు. ఈ విష

యమునుగూర్చి మహాత్మునికిఁగల యభిప్రాయములలో నొకటి రెంటిని నిట నుదాహరించుచుంటిమి.

గాంధిమహాత్ముడు భారతదేశ పర్యటన సమయమందు దాను వెళ్ళిన తావులందు అహమహమికతో నా పుణ్య పురుషుని, ఆలోకైకపూజ్యుని, ఆ భారత స్వాతంత్ర్య భానుని దర్శించి తమ జీవితమును ధన్యము గావించుకొనఁ దలంచి పురుషులతోఁబాటు స్త్రీలును మహాత్మునకు స్వాగతమిచ్చుట కలదు. అట్టియెడ మన మహాత్ముఁ డా స్త్రీలను జూచి యానంద కందళిత హృదయారవిందుఁడై ప్రేమపూర్వకముగా నా స్త్రీలను నాహ్వానించి ప్రేమతోఁ బలుకరించి వారు చెప్పెడి సర్వ విషయములను శ్రద్ధతో వినుచుండెడివాఁడు. భారత నారీమణియై విశ్వమునందుఁ గవికోకిలయని వాసిగాంచిన శ్రీమతి సరోజనీదేవినాయుఁడు భారతదేశ స్వాతంత్ర్యోద్యమమునఁ బాల్గొని సర్వవిధముల మహాత్మునకుఁ దోడ్పడుచు అఖిలభారత జాతీయ మహాసభాధ్యక్షురాలై యార్య నారీమణుల కాదర్శమై ప్రపంచ ప్రసిద్ధి గాంచుట చరిత్ర ప్రసిద్ధమేగదా! అక్కారణమున మహాత్మునకు స్త్రీలయెడఁగల ప్రేమ గౌరవాదరములు లోక కళ్యాణదాయకములై విలసిల్లుచుండును. స్త్రీలకుఁగల అందము — సౌకుమార్యము మొదలగునవి యెల్లను గాంధి మహాత్మునకుఁ దెలియనివికావు. అయినను మహాత్ముఁ డెప్పుడును స్త్రీలను దైవముగా భావించుచుండెడివాఁడు. అదియే స్త్రీలయెడఁగల మహాత్ముని మహిత భావములు. భారత భాగ్యోదయమునకు స్త్రీలే ముఖ్యమని మహాత్ముని యభిప్రాయమై యుండెడిది. అందుచే స్త్రీల యభ్యున్నతికై మహాత్ముఁ డెంతయో ప్రయత్నించుచుండెడివాఁడు.

సృష్టి పెంపునకు స్త్రీ పురుషు లిద్దఱు ముఖ్యులుగదా! అట్టియెడ స్త్రీని దూరము చేసినచో సృష్టియే యుండదుగదా! స్త్రీలేని పురుషుఁడు పురుషుఁడులేని స్త్రీ పుట్టుట బూటకమే గదా! అట్టిచోఁ బురుషునితో స్త్రీకూడ ముఖ్యురాలని తేట తెల్లమగుచున్నది. అందువలనఁ బురుషునితో స్త్రీ కూడ సమురాలు. అట్లగునప్పుడే దేశము సర్వతో ముఖాభివృద్ధి గాంచఁ గలదు. స్త్రీలయెడ నెప్పుడును దప్పుగఁ దలంపరాదు. వారి నెప్పుడును గౌరవమునఁ జూడవలెను. స్త్రీకి అగౌరవము జరుగుచో జాతియే నశించును. ద్రౌపదిని మానభంగము కావించుటచే కౌరవులు రూపుమాసి చనిరి. ఆఁడుదాని కవమానము జరుగుట లోకకళ్యాణమునకే ముప్పు సుమాయని శ్రీకృష్ణ భగవానుఁడు ద్రౌపదీదేవికి మానసంరక్షణ సమయమున లెక్కకు మిక్కిలి వలువలిచ్చి స్త్రీలోకమునకు విలువ నిచ్చెను. స్త్రీల యభ్యున్నతికై మహాత్ముఁడు వ్రాసిన 'యంగ్ ఇండియా' పత్రికయందలి 'స్త్రీల స్థితి'- 'మన సోదరీమణులు'- యువతీమణుల కార్యభారము' మొదలగు వ్యాసములను జదువుట మంచిది.

## వె ల యా ం డ్రు

కొందఱు; కులస్త్రీల నొక విధముగను, పడుపువృత్తిని జీవించు పడఁతుల నొక విధమునను జూచుటకద్దు. మహాత్ముఁడీ యిరుతెగలవారిని గౌరవ భావమున నాదరించెడివాఁడు. అవును; మహాత్ముల కెల్లరు సమానులే గదా! లోక కళ్యాణ మెల్లటి మీఁద నాధారపడి యుండును, కాని కొందటి మూలమున మాత్రము గాదని మహాత్ముని యభిప్రాయము. కులస్త్రీలు - కులటలునని రెండు తెగ లేర్పడుటకుఁ గారణమేమి? ఇట్టి చెట్ట

పుట్టుటకు మగవాఁడే కారణమై యుండునుగదా! మగవాఁడు దుర్వ్యసనలోలుఁడై ఆశలు గొల్పి స్త్రీని పడుప్రవృత్తి నవలంబింపఁ జేయును. అట్టి చెయిదము మానవ సంఘమునకే చేటు తెచ్చుట నిక్కముగదా! భగవత్సృష్టియెడఁ బురుషుఁడు స్త్రీల దెస నిట్టి తప్పిదము క్షమింపరానిది సుమా! పరకాంతలను గౌరవమున మాతృభావమునఁ జూడవలసిన పురుషుఁడిట్టి విషయలోలుప బుద్ధిని జూపినచో నాతని మానవత్వమే నశించును గదా! "రోగులకేగాని ఆరోగ్యముగలవారికి వైద్యుఁడు అక్కర లేదుగదా" యని యేసు ప్రభువు పలికిన పలుకులు అమృత తుల్యములు. 'సద్బుద్ధిగలిగి దయార్ద్ర హృదయముతో పతిత మానవోద్ధరణయే మహాపురుషుల లక్షణము. అట్టిదేదియులేక పంచేంద్రియములకులోనై విషయలోలుఁడై పురుషుఁడుండుచో లోకమెట్లు బాగుపడఁగలదు? లోకోద్ధరణకు స్వశక్త్యనుసారము పాటుపడుట మానవుని విధిగదా! అట్టియెడఁ బురుషుఁడు స్త్రీని కామినిగా భావించుట భావ్యముకాఁజాలదు. పొట్టకై ప్రాఁకులాడు పడుప్రవృత్తి నవలంబించు పడఁతులకు నేదేని సద్వృత్తిని గల్పించి సుఖజీవనము చూపినయెడల నిట్టి చెడుగులు తొలఁగఁ గలవు. వెలయాండ్ర జీవితముకై మహాత్ముఁడు పలుపర్యాయములు వాపోయిన ఘట్టములు పెక్కులు కలవు.

కాకినాడ - బారిసాలు పట్టణములందుఁ దనను దర్శింప వచ్చిన వెలయాండ్రను హృదయపూర్వకముగా నాహ్వానించి మనసార వారిమంచిచెడుగులను మహాత్ముఁడడిగెను. కానిపాపమా స్త్రీలు తమ నడవడి లోపము బయటపడునని శంకించిరి. మహాత్ములయెడ దోషములు దాఁచుదమన్నను దాగవుగదా! అట్లే పాపమా పడఁతుల ప్రవృత్తి మహాత్మునికి కరగతమయ్యెను.

'యంగ్ ఇండియా' పత్రిక యందు 'మన సోదరీ మణులు' అను మహాత్ముని వ్యాసము చదివిన యెడల ప్రతి భారతీయుని హృదయము ద్రవింపక మానదు. మహాత్ముఁడు వారిమీఁదఁ జూపిన సోదర్రీ ప్రేమ భారతీయునకు జ్ఞాన ప్రబోధము కలిగించును.

"జీవిత పోషణకై మానమమ్ముకొని బ్రదుకుచున్న స్త్రీలను ఆంధ్రదేశమందలి కాకినాడ నగరమందుఁ దొలుదొల్తగాఁ జూడఁగలిగితిని. అప్పుడు నాతో మాటాడినవి కొలఁది స్త్రీలు మాత్రమే. రెండవ పర్యాయము 'బారిసాలు' నందునట్టి యువతులఁజూడఁ దటస్థించెను. దాదాపు నూరుమంది యువతులు నాతో మాటాడిరి..."

"అందు కొందఱుమాత్రము సిగ్గరితనముచేఁ గాఁబోలు తమ మనస్సునందలి యభిప్రాయములను వెలువరింపలేక యుత్తర మొకటి వ్రాసి నాచేతి కందించిరి. తమ విషయమును స్వయముగాఁ జెప్పినచో నాకుఁ గోపమో అసహ్యమో కలుగునను నభిప్రాయముచే నుత్తర మిచ్చియుందురని యనుకొందును. నిజమునకిందు కోపమునకుఁ గారణమేమి కలదు? పాపమా స్త్రీల దుస్థితియెట్లు బాగుపడునోయని నేను పెక్కుమాఱులు బాధపడితిని. నేను ఆలోచించి యాలోచించి యేదియో యొక సద్వృత్తి నవలంబించి గౌరవ జీవితము గడుపుకొనుట మంచిదని నా నిశ్చయ మెఱింగించితిని. వారితో మాటాడిన రెండుగంటల కాలమును నే నెప్పుడును మఱువఁజాలను."

"బారిసాలయందు మగవారు తమను హీనముగా జూచుచుందురని చెప్పియుండిరి. అట్లు; ఆ స్త్రీలను హీనముగాఁ జూచుటగాని, హేళనచేయుటగాని పురుషుల లక్షణము కాఁజా

లము. అంతేగాక; ఈ చెడుగు అచటనేగాక, దేశమందంతటను గూడఁ గలదు. కాఁగా; బారిసాలను ఉదాహరణమాత్రముగాఁ జెప్పితిని. ఆ సోదరీమణులను సద్వృత్తికలవారినిగాఁ జేయుట యువకుల విధి."

"గౌరవభాజనమైన భారతావనియందు నితర భామిను లనుగూడఁ దమ సోదరీమణులనువోలెఁ జూచుకొనుటవలన మగ వారు తమ గొప్పతనమును గాపాడుకొను వారగుదురు."

"ప్రతి భారతీయుఁడు ఈతఁడు, నా సోదరుఁడు – ఈమె నా సోదరి యను భావమేర్పఱచుకొనుటయే స్వరాజ్యమునకుఁ బ్రధాన సోపానము.

"మనము మన బాధ్యతను గుఱుతెఱుఁగ వలయును. అందువలన ఆ స్త్రీలు గౌరవమగునేదియో యొక సద్వృత్తి నవలంబించి మంచి జీవిత మలవఱచుకొనుట యావశ్యకమనుట మఱువరాదు."

"దురాశ దుఃఖములకుమూలము. అది లేనిచో సర్వ సుఖములు కలుగును."

"ఆ సోదరీమణులు దినమునకు సగటున రెండురూపా యలు వచ్చునని చెప్పిరి. మగవాఁడు కామ వికారమునకు లోనుగాక తమ సోదరీమణుల దుశ్చరితము బాపుటకై కొంత ధనమును దుర్వ్యయములను మానుకొని యా సోదరీ మణుల పోషణకై యుదారబుద్ధిని వెచ్చించి వారికి గార్హస్థ్య జీవిత మేర్పఱతురేని తమ జీవితములు బాగుపడఁగలవనియుఁ జెప్పిరి."

గాంధిమహాత్ముఁడా సోదరీమణులతో సంభాషించుచు రాట్నమువడకి గుడ్డలునేసి యందువలనవచ్చు రాఁబడితో నుదరపోషణ చేసికొనుచు గార్హస్థ్యజీవిత మలవఱచుకొనవలసి నదిగాఁ జెప్పినతీరున నడుచుకొనుట యెంతయో మేలుగాఁ గన్పించుచున్నది. గాంధిమహాత్ముఁడు స్త్రీలయెడఁ జూపునట్టి గౌరవ ప్రేమాదరముల కింతకంటె నిదర్శనము లేల?

హితవులు

మగవారికొరకే మగువల జీవితమని భావింపక తాము మగవారితోఁబాటు సమానులమనుకొని దేశసౌభాగ్యమునకుఁ బాటుపడవలసినదిగా మహాత్ముఁడు స్త్రీలనుగూర్చి పెక్కు పర్యాయములు తన యభిప్రాయములను వెల్లడించుచుండెడి వాఁడు. దక్షిణాఫ్రికా యందలి స్త్రీల మహాసభలో నుపన్యసించుచు,

"స్త్రీ లెప్పుడును దాము మగవారి కామమునకుప కరణములు మాత్రమేకాదని యెఱుంగవలెను. ఇందులకు, మందు మగవారికంటె నాఁడువారికడనే కలదని గ్రహింపుఁడు. స్త్రీ, తాను మగవానితో సమానముగా నుండవలయుననినఁ దన నాయకుని వదలకయుండుట మంచిది. అట్టి నిత్యసహచర్యమువలన నెంతయో మేలుకలుగఁగలదు. సీతాదేవి శ్రీరాముని నొక్క క్షణమైన నెడఁబాయకుండుట చరిత్ర ప్రసిద్ధము." అని మహాత్ముఁడు చెప్పెను.

పరదా పద్ధతి

ఆత్మగౌరవము స్త్రీ పురుషులిద్దఱ కావశ్యకము. అట్టి యెడ స్త్రీ గౌరమును వ్యర్థముచేయుట వ్యర్థనిపని. మగవాఁడు,

తన యిష్టముచొప్పున నడచుకొనవచ్చును; ఆఁడుది నడచుకొన రాదు. ఇందులకు లోకమందేమైన ప్రకృతిసిద్ధమగు నియతి గలదా? అట్టియెడ మగవాఁడు స్త్రీ లోకమును పరదాపద్ధతిని నుంచుటయేలకో!

## బ్రహ్మచర్యము

గాంధిమహాత్ముఁడు, పెండ్లి చేసికొనరాదనియు, నొక వేళ చేసికొనినయెడలఁ గామ పరతంత్రబుద్ధిగలిగి యుండరాద నియుఁ జెప్పిన మాటల యాథార్థ్యము గమనింపఁదగును. అందు వలన ముఖ్యముగా మూఁడులాభములు కలుగును. పురుషుని చిత్త వికారమునకుఁ గారణభూతమగు కామము నణచ వలయుననునదియొకటి; బ్రహ్మచర్యవ్రతముచే దేశస్వాతంత్ర్య సముపార్జనమున కెల్లరు పాటుపడవలయుననునది రెండవది; భ్రూణహత్యాది దోషములు ప్రబలనీయక తగు సంతానమును మాత్రమే పొందవలయుననునది మూఁడవదియు నై యుండెను. ప్రపంచమందుఁ గొందఱుసంతానము తగ్గించుకొనవలెను; కామ మును దీర్చుకొనవలెన"నియందురు. బ్రహ్మచర్యవ్రత మనుష్ఠింప లేక ఆత్మనిగ్రహ మలవఱచుకొనలేక, యిట్టి బేలమాటలాడు చుందురు. బ్రహ్మచర్యవ్రతమే, మానవజీవిత సౌఖ్యమునకు ముఖ్యమని మహాత్ముని యభిప్రాయము. దుర్వ్యసనములవలన మనశ్చాంచల్యముకలిగి, తన్మూలమున నారోగ్యాదికము కుంటు వడి శరీరసౌష్ఠవము చెడి, బుద్ధిమాంద్యమేర్పడుట నిక్కము.

గార్హస్థ్య జీవితము మానవునకిహాపరసాధనమై, యుండును. ఆలుమగలు నియమప్రవర్తనముగలవారై సంసార జీవితయాత్రను సాగించుకొనుటలెస్స. వయోభేదముల ననుస రించి చతురాశ్రమములు మనప్రాచీనులు నియమించిరి. ప్రాచీన

కాలమునుండియు మన భారతవర్షము, ఆశ్రమచతుష్టయము నవలంబించుచుఁ, దమతమ గృహములను భూతలస్వర్గముగాఁ జేసికొని సర్వసౌఖ్యములనుభవించిరి. నేఁడు విదేశ నాగరికతా వ్యామోహముచే మనప్రాచీననాగరికత నశించి, భారత కుటుంబ జీవనపద్ధతియే పాడగుచున్నది. మహాత్ముని జీవితము ప్రాచీన కాలమందలి యార్షసంప్రదాయము కలదియై, భారత జీవన విధానమున కాదర్శమై యొప్పుచున్నది. పురుషులు మహాత్ముని వలెను, స్త్రీలు కస్తూరిబాయి మాతవలెను తమ, జీవితములను నడుపుకొనుచు సుఖసంతోషములతో నలరుచుందురుఁగాక !! మహాత్ముని గార్హస్థ్య జీవితమువంటి జీవిత మలవఱచుకొని చరితార్థతను బడయుట ప్రతిమానవుని విద్యుక్తధర్మము. అందువలన నాలుమగలు సుఖజీవితములు గలవారగుటయు, నారోగ్యముగల సంతానము పడయుటయుఁ గలుగును. ఆ సంతానము నారోగమై తమ భావిజీవితమున సుఖపడఁగలుదురు.

# త్యాగము

గృహస్థాశ్రమజీవితము త్యాగమునకు మూలము. త్యాగములేని గార్హస్థ్యము గార్హస్థ్యము కాఁజాలదు. మనోవాక్కాయములు మూఁడు నితరుల క్షేమమునకు వినియోగించు గృహస్థాశ్రమ జీవితమే గొప్పది. అందుచేతనే నాలుగాశ్రమములందును గార్హస్థ్యము దొడ్డదని పెద్దలందురు. ఎల్లరినిఁ బ్రేమించుటకుఁ ద్యాగము ముఖ్యము. క్రమక్రమముగఁ ద్యాగమభివృద్ధియగు కొలఁది బ్రేమయు నభివృద్ధియగును. తన మేలునకు మాత్రమే యగుచోఁ బ్రేమ కావశ్యకమేమికలదు? ప్రేమ లేనిచో దయ యెట్లు కలుగును?

త్యాగము మానవుని యాత్మశక్తిని పెంపొందించి తనకుఁ గల సమస్తము నితరుల యుపయోగార్థము, వినియోగింపఁ జేయును. తనకు మాత్రమే 'యిది'యని తలఁచువాఁడే త్యాగి కాఁజాలడు. తనకుఁ గలిగినంతలో నితరుల కుపయోగింపఁజేయు వాఁడే త్యాగియగును. తాను ఇతరులకొఱకు జీవించుచున్నానను తలంచువానిని లోకము నిర్వ్యాజముగఁ బ్రేమించును. అట్టి వాని మనోవాక్కాయములు లోకకళ్యాణప్రదములై రాణించును.

ఈ ప్రపంచమున మోహనదాసు కరమచందుగాంధి, మహాత్ముఁడగుటకుఁ గారణమేమి? ఆతని త్యాగమేగదా! మహాత్ముఁడగుటకు గాంధియెన్నఁడు నెట్టి ప్రయత్నమును జేయలేదు. చేసిన త్యాగమునుబట్టి లోకమూ గాంధిని మహాత్ముఁడని భావించి పూజించుచున్నది. గాంధి, 'బారిష్టరు' వృత్తిచే నెంతధనము సంపాదింపఁ గలిగినను మహాత్ముఁడగునా? గాంధిమహాత్ముని జీవితము త్యాగవంతమెట్లు కాఁగలిగెనో కొంత విచారింతము.

మన మోహనదాసుకరమచందుగాంధి, సంపన్న గృహమందు జననమందెను. అందుచే, గాంధి విదేశములకేగి 'బారిష్టరు' చదువుకొనఁ గలిగెను. గాంధివృత్తి న్యాయవాద వృత్తి. లోకమందలి ధనమంతయుఁ గుప్పలు కుప్పలుగా వచ్చిపడినను ఆశతీఱని పేరాసయా న్యాయవాదవృత్తికుండును. తృప్తియనునదా వృత్తికి లవలేశములేదు. అట్టి న్యాయవాదవృత్తిని ద్యజించి దేశసేవకుఁగడంగి మహాత్ముఁడగుట జగదాశ్చర్య విషయమే!

### అవతరించుట

ఇట్టి పరిణామము తనకుఁ గలుగునని గాంధిమహాత్ముఁడు మునుదెన్నఁడు నెఱుఁగఁడుగదా! ఎఱిఁగియుండినచో గాంధి యింగ్లాండునకుఁ బోవుటగాని, బారిష్టరుపరీక్ష యగుటగాని జరిగియుండదుగదా! రానున్నకాల మెవఁడెఱుఁగఁగలఁడు? సర్వమెఱిఁగినవాఁడు సర్వజ్ఞుఁడొకఁడేగదా! ఈశ్వరాజ్ఞ లేనిది లోకమందేదియు జరుగదు. త్యాగబుద్ధివలన నాత్మశక్తి సంపాదించుకొని లోకకళ్యాణమునకై గాంధిమహాత్ముఁ డవతరింపఁగలఁడని

భగవంతునకుఁ దెలియుచు. కాని గాంధిమహాత్మునకు మాత్ర మీా విషయమేమి తెలియఁగలదు? సర్వేశ్వరుని యనుగ్రహము వలన మన గాంధిమహాత్మున కాత్మశక్తి పెంపొందెను. పాఠకమహాశయులారా! కొంచె మాలోచింపుఁడు. కంటికిఁ గన్పించునదే సత్యమనియు, శరీరముకంటె వేఱుగా నాత్మ లేదనియు వాదించుచున్న నేఁటి భారత యువకులకు గాంధి మహాత్ముఁ డవతరించి ఆధ్యాత్మికబుద్ధిని లోకమునకుఁ బ్రసాదించుట భగవత్సంకల్పమై యుండును. భగవత్సంకల్పము నుతించుటకు మనమెంతవారము? ఈశ్వరకటాక్షము లేనిచో నీ జగత్తే శూన్యముగదా! అట్టి సృష్టికారకుఁడగు నీశ్వరుని స్తుతించుటకు నాదిశేషువు సహితము సమర్థుఁడు కాఁజాలఁడు. కాఁగా నిఁక మనమెంతవారము?

శ్లో॥ ఉత్పత్తించ వినాశంచ భూతనా మగతిమ్ గతిమ్
వేత్తి విద్యామవిద్యాంచ సవాచ్యోభగవానితి॥

సర్వసృష్టి కారకుఁడైన సర్వేశ్వరుఁడులేనిచో నీ జగత్తు పుట్టుట, పెరుఁగుట, విఱుగుట మిథ్యయేగదా! అట్టి పరమాత్ముని స్మరింపక మాయావశులమై; మమకారముచే నజ్ఞానులమై కన్నులు మూసికొని నేనే పుట్టితినని పలవరించినంత మాత్రాన ఫలమేమి? ఆ దేవదేవుని దివ్యలీలలు గ్రహింప నీలోకమున నెవ్వారితరము? ఆతనిసంకల్పముచేతనే 'నేను' అని యనుకొనఁగలుగుచుంటిమి. ఈ లోకమేమి? ఈ శరీరమేమి? ఈ జీవనమేమి? సర్వమాతని యధీనము. అట్టిచో నీలోకమున నేను—నాదియని యనుకొను నధికారము మనకెక్కడఁగలదు? సర్వేశ్వరుని మఱచి మనమెట్లు బ్రదుకఁగలము? ఆతని యను

గ్రహమున్నచో మాయ మటుమాయమై జ్ఞానికాఁగలఁడు. జ్ఞానివలన లోకమునకు వెలుఁగు కలుగును. ఆ రహస్య మెఱుఁగక యజ్ఞానాంధకారమునఁబడి దురపిల్లుచుంటిమి. సర్వ వ్యాపకుఁడయిన సర్వేశుని మఱచుటయెట్లు? మఱచి బ్రతు కుట యెట్లు? తెలిసియో తెలియకయో నీవాతనిని మఱచిన మాత్రాన నిన్నాతఁడు విడిచిపెట్టునా? సర్వేశ్వరుఁడు, మన మోహనదాసు కరముచందుగాంధిని, నే విధముగ రూపొందించు చుండెనో చూడుడు.

## గాంధిమహాత్ముఁడు మానవుఁడైన స్థలము

గాంధిమహాత్ముఁడు 'బారిష్టరు' పరీక్షయందు తీర్ణుఁడైన పిమ్మట బొంబాయి హైకోర్టునందుఁ దన న్యాయవాదవృత్తి నారంభించెను. కాని యీ వృత్తియందే మాత్రము మహాత్ముఁ డెక్కిరాఁడాయెను. మొదటగా వ్యాజ్యమును వాదింపఁ దలఁచి తికమకపడి ముచ్చెమ్మటలుపోసి తుదకు వాదింపఁజాలక పోయెను. నాఁటినుండి మహాత్ముని కావృత్తియందేవగింపు కలుగఁజొచ్చెను. అందుచే నుపాధ్యాయవృత్తిని జేపట్టియు నందును గొలఁదికాలము మాత్రమే పనిచేయఁగలిగెను. న్యాయవాదిగా బొంబాయి హైకోర్టునందుఁ గలిగిన తడబడయే యుపాధ్యాయవృత్తియందును గలుగుటవలన గాంధిమహాత్ము నకు వృత్తులు పనికిరావని భగవత్సంకల్పమై యుండనోపును. బొంబాయి హైకోర్టునందు గాంధిమహాత్ముఁడు న్యాయవాదిగా రాణించుచో దక్షిణాఫ్రికాకుఁ బయనము కాఁగలఁడా? మహా త్ముఁడగుటకు గాంధికి దక్షిణాఫ్రికాయే తగునని భగవంతుని సంకల్పమయి యుండును. అట్టి సమయము నొక వ్యాజ్యము

వ్యాజముకాఁగా దక్షిణాఫ్రికాకు మహాత్ముఁడు వెళ్లుట సంస్థిం చెను. ఈ దక్షిణాఫ్రికాయందు గాంధి మానవుఁడయ్యెను. గాంధి మహాత్మునికి మాయమర్మములచెడుగులు మెల్ల మెల్లన బోధపడ సాగెను. చూడఁగాఁ జూడఁగాఁ గాలక్రమమున గాంధిమహాత్ము నకు సత్యాసత్యములందలి యెచ్చులొచ్చులు మనస్సునకెక్కెను. సత్యమెఱిఁగియు నసత్యమార్గమున నడుచుట భగవంతుని మఱ చుట యగును. అట్టివాఁడు మానవత్వమును గోల్పోవుట నిక్కము. అసత్యము విడనాడి మనస్సాక్షిగా సత్యపథమున నడచుట. భగవంతుఁ డేర్పఱచినబాట యగును. ఈ రహస్య మెఱిఁగి మెలఁగువాఁడు మానవుఁడుగాఁబుట్టి చరితార్థుఁడు కాఁగలఁడు. తగదని తోచినప్డు డద్దానిని త్యజించి సత్పథమున జీవనుంకించుటచేతనే గాంధిమహాత్మునికి త్యాగమందలి మహి మయు, నాత్మశక్తియందలి యౌన్నత్యమును బట్టువడినవి.

## రంగుభేదము

గాంధిమహాత్ముఁడు దక్షిణాఫ్రికాయందలి నెటాలులో నుండుచుఁ దన బారిష్టరువృత్తిని జూచుకొనుచుండెను. అచ్చట తెల్లవారు నల్లవారిని హీనముగా మాటాడుటయుఁ జులక నగాఁ జూచుటయు గాంధిమహాత్ముని హృదయమును గలఁచి వైచెను—"రంగెట్లున్న నేమి? పుట్టుకలో భేదములేదే! ఎల్లరికిఁ జావుబ్రదుకులు సమములే! భగవంతుఁ డొక్క విధముననే సృజించెనుగదా!" అట్టియెడ నిట్టి పొరపొచ్చెపు బుద్ధులేల పుట్టెనోయను నాత్మజ్ఞానము గాంధిమహాత్మునకుఁ బొడఁగట్టెను. ఈ విధముగా నచట జరుగుచున్న పలు చెడుగులు గాంధిమహా త్మునకుఁ దెలియనయ్యెను.

దక్షిణాఫ్రికాయందెల్ల యెడలఁ దెల్లవారి దొరతనము, దురుసుతనమునఁజేయు దుండగములు పెక్కులు. వానిని బ్రత్యేకముగాఁ జెప్పఁబనిలేదు. గాంధిమహాత్ముని యాత్మకథ చదివిన యెడల నా వివరములు విశదముకాఁగలవు. కాఁగాఁ; బ్రస్తుతము నకుఁ గావలసిన విషయములను దెలిసికొందము.

## తెల్లవారి దౌష్ట్యము

గాంధిమహాత్మున కచట న్యాయస్థానమునందును, రంగు భేదముండుట గాంచి మనోవాక్కాయముల పరిశుద్ధత ప్రజ్వరిల్ల సాగెను. తనను, ఆ దక్షిణాఫ్రికాకుఁ గొంపోయిన అబ్దుల్లాసేటు నొద్దను, దక్కిన భారతీయుల యొద్దను, ప్రభుత్వమువారి రంగు భేదముయొక్క సంకుచితత్వమును బలు పర్యాయములు చెప్పెను. ఇచటనే గాంధిమహాత్మునకు మానవకళ్యాణమునకై పాటుపడు నవకాశము లభించెనని భావింపవచ్చును.

## తలపాగా తగవు

గాంధిమహాత్ముఁడు డర్బనునగరముచేరిన రెండవనాఁడో మూఁడవనాఁడో మిత్రుఁడు అబ్దుల్లాసేటు, మహాత్మునివెంట నిడుకొని న్యాయస్థానమునకుఁబోయి యచటి తలపాగల వారికి గాంధిమహాత్ముని బరిచయముచేసి తన 'అటార్ని'సి ఏర్పాటు చేసెను. మాజిస్ట్రేటు గాంధిమహాత్ముని నాపాదమస్తకముపాఱఁ జూచి తలపాగా తీసివేయవలసినదిగా గాంధిమహాత్ముని నాజ్ఞాపించెను. భారతీయుల తలపాగా ఆ మేజిస్ట్రేటునకుఁ దలనొప్పి యెందులకుఁ గలిగించెనో తెలియదు. మహాత్ముఁడు తన తల పాగాతీయుట యాత్మగౌరవముకాదని భావించి న్యాయస్థానము నుండి వెలుపలకివచ్చెను. అపును. జాతి గౌరవరక్షణమే మహా

త్ముని లక్షణముగదా! గాంధిమహాత్ముఁ డచటి దేశాచారము చొప్పున నాంగ్లేయ దుస్తులను ధరించుట కలవాటుపడెను. దేశ కాల పాత్రముల నెఱిఁగి మెలఁగుట గొప్పవారి పద్ధతిగదా! నాఁటినుండి గాంధిమహాత్ముఁడు కోటు-సూటు-హేటు-బూటు మొదలగు నాంగ్లదుస్తులను ధరించి కోర్టునకు వెళ్ళుచుండెను. మిత్రుఁడు అబ్దుల్లా సేటు గాంధిమహాత్ముని తలపాగా విషయ మున మాజిస్ట్రేటుచేసిన నిర్ణయము భారత సభ్యతకు దూరమని పత్రికలందు వ్రాసెను. నాఁటినుండి కొన్నిదినములు పత్రికా ముఖమునఁ దమ భారతీయుల యభ్యంతరమును బాహాటముగా వెలువరించిరి. అందువలన గాంధిమహాత్ముని పేరు కొంతవఱకు వెల్లడి కాఁజొచ్చెను.

ఈ తలపాగా విషయము మఱియొక్కటి జరిగెను. ఒక నాఁడు మహాత్ముఁడు న్యాయస్థానమునఁ గొలఁదిసేపు విశ్రాంతి తీసికొనఁదలఁచి, తన పాగానుదీసి విశ్రాంతిగదిలో గోడనుగల చిలుకకొయ్యకుఁ దగిలించెను. వెంటనే యచ్చటకువచ్చినయొక యాంగ్లేయ న్యాయవాది మొగము జేవురించుకొని మహాత్మునిఁ జూచుచు "ఏయ్! తలపాగా అచటినుండి తీయుము; నల్లవారు తమ తలపాగాలుంచుకొను స్థలమిదిగాద"ని చీత్కారముతో ననెను. కాఁబోవు ప్రపంచ మహాత్ముఁడు- బారిష్టరు-ఆంగ్లదుస్తు లను ధరించినవాఁడు-భావిభారత భాగ్యోదయ కారణపురుషుఁడు నగు మహాత్ముఁడా మాటలకెంతయో ఖిన్నుఁడాయెను. గాంధి మహాత్ముఁడు మునుదెన్నఁడు నిట్టి బెట్టిదపుఁగూఁత వినియుండ లేదు! ఆ వెంగలిమాటలు చెవికి ములుకులవలె గాటముగా నాటి మహాత్ముని హృదయమెంతయో కలఁకబాఱెను. మన జాతి పిత మహాత్ముఁడు "అయ్యో! భారతీయుల దుస్థితి యిదియేమి!"

యని పలుమారులు వాపోయెను. మహాత్ముఁ డేమిచేయఁగలఁడు? పాపము! ఇట్టి ఘటన లొక్కటొక్కటిగా రాఁదొడంగెను. అవును; ఇట్టి వానివలననేగదా మహాత్ముల మనస్సు గట్టిపడుట. సానఁబట్టిన కొలఁది రత్నకాంతి ప్రజ్వరిల్లుచుండునుగదా!

## అ ప మా న ము

ఒకనాఁడు కోర్టుపనిమీఁద నెటాలునుండి "ప్రిటోరియా" పట్టణమునకు మహాత్ముఁడు పొగబండియందు మొదటి తరగతిలోఁ బయనించుచుండెను. దారిమధ్య "మారిట్జ్ బర్గు" స్టేషనులో నొక యాంగ్లేయుఁడు మహాత్ముఁ డెక్కిన పెట్టెలో నెక్కి 'నల్లనివాఁడు పద్మ నయనంబులవాఁడు' నగు గాంధి మహాత్మునిఁ జూచి వెంటనే 'గార్డు'ను బిలిచి యాతనిని నిక్కడ నుండి మఱియొక పెట్టెలోనికిఁ బోవలసినదిగాఁ జెప్పుమనెను. 'గార్డు' మహాత్మునివంక చూచి 'మొదటి తరగతిలో నీవు ఎక్కరాదు. మఱియొక పెట్టెలో నెక్కుమ'ని గాంధిమహాత్ముని నాజ్ఞాపించెను. మహాత్ముఁడు మొదటితరగతి 'టికెటు' చూపి యా 'గార్డు' మాటను నిరాకరించెను. వెంటనే 'గార్డు' పోలీసునిఁ బిలచి యాతనిని ఈపెట్టెనుండి పంపివేయవలసినదిగాఁ జెప్పెను. ఆ పోలీసు మొదటితరగతి పెట్టెనుండి దుడుకు తనముతో గాంధిమహాత్ముని మెడఁబట్టి క్రిందికి గెంటెను. వెంటనే బండి సాగిపోయెను. ఆ సమయ మర్ధరాత్రి. పైఁగాఁ జలి కాలము. పాపము మన బారిష్టరు గాంధి చలిలో గడగడ వణఁకుచు నిద్రలేక యాదురిగాలికిఁ జొక్కిపోయెను. తెల్లవారి దుందుడుకుతనము మిక్కిలి రోఁతగాఁ గన్పించుటవలన నాఁటి ఘటన గాంధిమహాత్మున కుపదేశించెనో యన్న ట్లాయెను. ఇట్టి తలవంపులవలన గాంధిమహాత్మున కెన్నియో తలంపులు

కలిగి మహాత్ముని హృదయము కలఁక చెందసాగెను. అయినను పెద్దల మనస్సు ఒక పట్టున నిశ్చయమునకు రాదుగదా!. "ఏమి? ఈ తెల్లవారి దురభిమానము? భారతీయులను హీనముగాఁ జూచుటయా? ఇందుల కేమిచేయుట? ఇట్టి ప్రశ్న పరంపరలతో గాంధిమహాత్ముని హృదయము గాలితాఁకునఁ గొట్టుకొను రథ చక్రముపలె నయ్యెను. అయినను నా కొఱకునికి జరిగిన యీ పరిభవమునకు ధిక్కారము చూపుటయా? లేక మాతృదేశమునకు మఱలుటయా? ఈ యవమానమునకై 'ప్రిటోరియా కోర్టుపనిమాని మూటముల్లెతో భారతదేశమునకుఁ బ్రయాణ మగుటయా?' యని పలువిధముల గాంధిమహాత్ముఁడు ఆలోచనా తరంగిత హృదయుఁడయ్యెను. అవమానాగ్నిచే హృదయము సంతప్తమగుచుండెను. చేఁబట్టిన పనిని బూర్తిచేయకమునుపే దిగవిడిచిపోవుట ధర్మమగునా? అని పలువిధముల మహాత్ముని హృదయము ప్రశ్నించెను. "నాకు జరిగిన యీ యవమానము భారతజాతికే యవమానము. మీఁదు మిక్కిలి మానవజాతికే చేయరాని యవమానమిది" యనియు, నింతకు రంగుభేదమువలననేగదా యీ యవమానము జరుగుటకు మూలము. కాఁబట్టి యిందుకై ప్రభుత్వము నెదుర్కొనుటయే కర్తవ్యము. అందు నెట్టి కష్టములు వచ్చినను వచ్చుగాక!"యని కర్తవ్యజ్ఞాన ప్రబోధితుఁడయ్యెను. గాంధిమహాత్ముఁడు మానవజాతి నుద్ధరించుట కవతరించిన మహాత్ముఁడగుట కిదియే యారంభము. మహాత్ముని త్యాగము పక్వమగుట భారతీయుల - ప్రపంచ మానవుల యదృష్టము.

మహాత్ముఁడు 'మారిట్జుబర్గు' స్టేషనులో నట్టి కొన్ని గంటల కాలము గడపి, పిమ్మట వచ్చిన పొగబండి యెక్కి-

'సార్లస్' పట్టణము చేరెను. అక్కడనుండి రైలుబండిలేని కారణమున 'జోహానుబర్గు' చేరుటకు గుఱ్ఱపుబండి యెక్కెను. ఆ గుఱ్ఱపుబండి యజమానుఁడు నల్లవాఁడను కారణమున గాంధిమహాత్ముని బండిని దోలువాని ప్రక్కను గూర్చుండఁ బెట్టెను. అప్పటికి మహాత్ముఁడు సహించి యూరకుండెను. సహన మెప్పటికైనను శక్తిని బెంపొందించునుగదా! ఆ యజమానుఁడు దారిలో గాలి కావలెను; చుట్ట త్రాగవలెను; అడ్డు లెమ్ము; అటు జరుగు మనుచు కాలితోఁ జూపుచుఁ నిటుఁ గూర్చుండు మనెను. గాంధిమహాత్ముఁ డాతని యసహనమును సహింపలేక నిరాకరింపఁగా నా క్రూరుఁడు ముక్కోపముతో గాంధిమహాత్ముని ముఖమునఁ జేతితో నొక గ్రుద్దు గ్రుద్దెను. ఆ గ్రుద్దునకు గాంధిమహాత్ముఁడు క్రిందఁ బడఁబోయి కమ్మిని బట్టుకొని వ్రేలాడుచుండెను. ముఖమునుండి నెత్తురు వఱదలుగా స్రవించుచుండెను. నాఁడు మన గాంధి యా బండికమ్మిని బట్టుకొనక పోయినచో, మన మీనాఁడు మహాత్ముఁడని యెవరిని బిలువఁగలము? ఇంతకు మన యదృష్టము మంచి దగుటవలన నెవరేమిచేసినను మనగాంధిప్రపంచమునకు మహాత్ముఁడయ్యెను. ధర్మసంస్థాపనార్థ మవతరించిన మహాత్ముఁడు తన కర్తవ్య ధర్మము నెఱవేర్చక పూర్వమే తనువును దొఱఁగునా? దేశ కళ్యాణమునకై పుట్టిన గాంధిని భగవంతుఁడు రక్షింపఁడా? ఆ దృశ్యమును జూచుచున్న బండియందలి తక్కిన తెల్లవారు ఆ కొట్టిన రాక్షసునిఁజూచి "కొట్టకుము; కొట్టకుము. ఆతని తప్పులేదు. మా ప్రక్కనఁ గూర్చొనఁగలఁడ"ని మందలించిరి. అంత నా తెల్లవాఁడు, తెల్లఁబోయి వెల్లనైన మొగముతో గాంధిమహాత్ముని వదలిపెట్టుచు, ఊరు చేరిన పిమ్మట నీతనిపని పట్టెదనుగాక!' యని బీరములాడుచు వదలిపెట్టెను.

ఈ పోటుమాట పుండుమీఁద గారము చల్లినట్లు గాంధిమహాత్మునకుఁ గంప మొందించెను.

'జోహాన్సుబర్గు' నుండి 'ప్రిటోరియా'కు ప్రయాణము చేయుటకై మొదటితరగతి టికెటు తీసికొని మన గాంధిమహాత్ముఁడు పొగబండియెక్కి పోవుచున్నతఱి, దారిలో 'చెర్ మిస్టన్' స్టేషనులో కాలీస్థలము చూచుటకై వచ్చిన 'గార్డు' గాంధిమహాత్ముఁడుగల పెట్టెనుజూచి 'ఏమిది? నల్లవారు ప్రయాణముచేయఁదగిన పెట్టె కాదిది. మూఁడవతరగతిపెట్టెకుఁ బోపో'యని ఈసడించెను. మన మహాత్ముఁడు మొదటితరగతి 'టికెటు'ను ఆ గార్డునకుఁ జూపెట్టెను. అందులకు 'గార్డు' 'అదేమియు లాభము లేదు. మూఁడవ తరగతికిఁ బఱుగెత్తు'మని గాంధిని గదమాయించెను. ఆ మొదటితరగతి పెట్టెయందుఁ బ్రయాణము చేయుచున్న యాంగ్లేయుఁ డొకబుద్ధిమంతుఁడు గార్డునుజూచి "ఏమి? ఈ ప్రయాణికుని బాధించుచుంటివేల? ఆతనియొద్ద టికెటుకలదు. అదిచూచియు నీవేల యతనిని గదమాయించుచున్నావు? ఈతఁడిక్కడఁ గూర్చుండిన మాత్రాన నాకేమియు నాక్షేపము లేద'నియూ గార్డును మందలించెను. ఆ మాటవిని యులికిపడి గార్డు 'కూలివానితోఁగూడి ప్రయాణము చేయుటకు మీ రిష్టపడుచున్నప్పుడు నాకేల' యని సణుగుచు నావలకుఁ బోయెను. ప్రయాణములందిట్టిపాట్లు గాంధిమహాత్మున కెన్నియో జరిగెను.

నల్లనివాఁడను కారణమున, మన గాంధిమహాత్మునకు 'బారిష్టరు'వృత్తికనుజ్ఞనీయరాదని తెల్లబారిష్టరులందఱు న్యాయమూర్తికి విన్నవించిరి. కాని తెల్లవాఁడైనను న్యాయమూర్తి యగుటవలన న్యాయాధికారి గాంధిమహాత్మునికి 'బారిష్టరు' వృత్తి నవలంబించుట కనుమతెనిచ్చెను. తుదకు బారిష్టరుగాఁ

గూడ గాంధిమహాత్ముఁడు పనికిరాఁడని యవమానముతోఁ దెల్ల బారిష్టర్లు అడ్డుపెట్టుట న్యాయమేక్కడ నున్నదో కానరాదను టకు దార్కాణముగానున్నది.

దక్షిణాఫ్రికావారు భారతీయులను కూలివారని పిలుచు చుండిరి. ఆ యలవాటుచొప్పున నచ్చటివారు మన గాంధి మహాత్ముని కూలి బారిష్టరు అనుపేరునఁ బిలుచుచుండెడివారు. "యే యథామాంప్రపద్యంతే, తాంస్తంథైవ భజామ్యహమ్" అను గీతోక్తికిది తార్కాణకాఁబోలు !

గాంధిమహాత్ముఁడు వీధులవెంట నడచుటకుఁగూడ నా తెల్లవారల కిష్టములేదు. ఒకనాఁడు తెల్లపోలీసుభటుఁడొకఁడు వీధినిఁబోవుచున్న గాంధిమహాత్ముని బట్టుకొని కొట్టెను. ఇట్టి యవమానము లొకటి రెండుగావు; పెక్కులుగలవు. ఈ యవ మానము పెరుగుచున్నకొలఁది గాంధిమహాత్ముని యందలి యజ్ఞానము విఱిగి జ్ఞానము పెరుఁగఁజొచ్చెను. జ్ఞానము హెచ్చినకొలఁది గాంధి త్యాగమూర్తిగా రూపొందుచుండెను.

### ఆత్మనివేదనము

గాంధి, మానవత్వమును నశింపఁజేయు వేఱుపురుగు వంటి దురభిమానమును జంపుకొనుటకు మిక్కిలి ప్రయత్నించు చుండెడివాఁడు. క్రైస్తవ పాదరీలవలె నడచుకొనుటయు, క్రైస్తవ దేవాలయములకుఁ బోవుటయు, బైబిలును నేకాగ్ర చిత్తముతోఁ బఠించుటయు మొదలగువానితోఁ గాలమును గడపుచుండెడివాఁడు. ఆ కాలమున రష్యా దేశజ్ఞాని యగు 'టాల్స్టాయి' రచించిన గ్రంథములు కొన్ని మహాత్మునకి లభిం చెను. ఆ గ్రంథములను జదువుటవలన మహాత్మున కెంతయో

జ్ఞానము కలిగెనని చెప్పవచ్చును. 'రస్కిన్' రచించిన పుస్తకములు గూడ గాంధి కెంతయో తోడ్పడెను.

గాంధిమహాత్ముఁడు దక్షిణాఫ్రికా యందలి తెల్లవారి యజ్ఞానమునకు ఖిన్నుఁడగుచు, టాల్స్టాయి గ్రంథములవలన జ్ఞాని యగుచుండెను. అంతకుముందే భారతీయవిజ్ఞానమెఱిఁగినవాఁడు గదా! అజ్ఞానమును బాఱఁద్రోలి యాత్మశక్తియే గొప్పదను భావము గాంధి హృదయఫలకమున గాఢముగా నాటుకొనెను. విదేశీయుల బాహ్యాడంబరానురక్తియు, మాత్ర దేశీయులయాత్మ శుద్ధియు గాంధిమహాత్మున కలవడెను. ఈ రెండిటియొక్క మంచి చెడ్డలు మహాత్మునకుఁ దెలియనివికావు.

ఇట్టిస్థితిలో గాంధిమహాత్ముఁడు ఆత్మశక్తితో దక్షిణాఫ్రికాయందలి తెల్లవారిని నచట కడగండ్లు పడుచున్న భారతీయులను గూడఁగట్టుకొని మైత్రితో మెలఁగునట్లు చేయుటకై గాంధిమహాత్ముఁడు దక్షిణాఫ్రికాలోనేయుండి సేవచేయ నిశ్చయించుకొనెను. దక్షిణాఫ్రికా యందలి నాఁటి భారతీయుల దుస్థితి చెప్పశక్యముగా కుండెను. ఇంగ్లీషు చదువుకొని బారిష్టరుగా నుండుచు, విదేశీయులవలె దుస్తులను దాల్చుచు, నుండిన గాంధిమహాత్మునికే దెబ్బలతోఁగూడిన యవమానములు పెక్కు సంభవించినప్పుడు, ఇంగ్లీషుభాష – ఇంగ్లీషు వేషము తెలియని యమాయకులగు భారతీయుల యవస్థ లెట్లుండునో వేఱుగా వ్రాయవలయునా?

దక్షిణాఫ్రికా తెల్లవారికి 'నల్లరంగు' మహామారి రోగమువలెఁ దోఁచెనో లేక పెనుభూతమువలెఁ గాన్పించెనో తెలియదు. నలుపు–తెలుపు రంగులు భగవత్సృష్టిలోనివే యని యా తెల్లవారికిఁ గొంచెమైనను దెలియదు. తెల్లవారు పోవు

బాటయందు నల్లవారు పోరాదు; వారెక్కిన బండిని వీ రెక్క రాదు; వారు విందులు గుడిచిన తావులకు (హోటల్సు) వీరు వెళ్ళరాదు; ఒకటి రెండు తగతుల రైళ్ళ పెట్టెలందు నల్లవారు ప్రయాణము చేయరాదు. నల్లవారు రాత్రివేళలం దటునిటు తిరుగరాదు. న్యాయస్థానములందు నల్లవారికి న్యాయము కలు గుట దుర్లభము. స్థిరనివాస మేర్పఱచుకొనిన భారతీయుల కచట వాక్స్వాతంత్ర్యము శూన్యము. ఓహో! భారతీయులు బానిసలుగా, నాంగ్లేయులు దొరలుగా భగవంతుఁడు సృజించె నేమో? ఇంతకంటె నజ్ఞాన మేమి కలదు? జాతి దురహం కారము చచ్చినఁగాని ప్రపంచము బాగుపడదు!. ఆ దక్షిణా ఫ్రికా తెల్లవారు, వేఁటకాఁడడవిపక్షులనువలె భారతీయులను వేఁటాడఁ జొచ్చిరి. కొన్ని ప్రదేశములందలి భారతీయుల యిండ్లను ఇంగ్లీషువారు యథేచ్ఛముగాఁ దోఁచుకొను చుండిరి. కొన్ని ప్రదేశములందలి నల్లవారి యిండ్లను అగ్ని కాహుతి చేయుచుండిరి. అడవియందలి పక్షుల కైనను రక్షణ యుండును. కాని, దక్షిణాఫ్రికాయందలి భారతీయులకు రక్షణ లేదు. ఇది సభ్యతగల నాగరకతా ప్రపంచము చేయు పనియా? ఇట్టి యిడుములు పెక్కులు గలవు. ఇందు సూక్ష్మాతి సూక్ష్మ ముగా వ్రాసితిమి.

గాంధిమహాత్ముఁడు, మండు టెండలలో నిసుక గుట్టల మీఁదఁ గాళ్ళు తెక్కలుగట్టి పడవేసిన కోకిలలవలె మన భార తీయ సోదరులు పడుచున్న బాధలను గాంచి, స్వయముగా ననుభవించి యెంతయో దుఃఖితుఁ డయ్యెను. "దేశము విడిచి, ఊరు వదలి, చుట్టపక్కములకు దూరమై యొంటరిగా నీదేశము చేరి, నివాస మేర్పఱచుకొని పాముపాతఁబడిన కప్పవలె బాధ

పడుచున్న యీ భారత సోదరులను రక్షించుటయే నాధర్మము. ఇదియే నా విధి విలాసము. ఇందులకు నేను బద్ధకంకణుఁడనై దీక్ష వహించుచున్నాన'ని గాంధిమహాత్ముఁడు కంకణము వహించెను. దక్షిణాఫ్రికాలో బారిష్టరుగానుండి సొమ్ము కూడబెట్టవచ్చునను తలంపు మెల్ల మెల్లన సన్నగిలి, తుదకు మటుమాయమై మానవసేవయే జీవిత పరమార్థము, అందుకై నేను జన్మించితిన'ని గాంధిమహాత్మునకు సత్యము దృగ్గోచరమయ్యెను. ఇటు మాఱుటయే రెండవ జన్మమని చెప్పవచ్చును. కురుక్షేత్ర సంగ్రామరంగమున నర్జునునివలె గాంధిమహాత్ముఁడు కర్మయోగి యయ్యెను.

గాంధిమహాత్ముఁడు తన 'బారిష్టరు' పట్టాను మూలఁబెట్టి పరభృతములైన కోయిలలకు దేవుఁడె దిక్కనునట్లు భారత సోదరుల నుద్ధరించుటకు దిక్కయ్యెను. దక్షిణాఫ్రికా భారతీయ సోదరుల నుద్ధరించుటకై సంసిద్ధుఁడాయెను. గాంధి, మానవుఁడయ్యెను. గాంధిమహాత్ముఁడు, నాటి మానవుల నుద్ధరించుటయే యార్ష సంప్రదాయమని నిశ్చయించెను. ఇతర మానవుల యట్లే తానుగూడ నని తలంచెను. ఇతరుల కష్టసుఖములే తన కష్టసుఖములుగా భావించెను. తాను సంపాదించిన ద్రవ్యమంతయు నచటి భారతీయుల కడగండ్లను జూడలేక వెచ్చించెను. బారిష్టరు గాంధి భోగ జీవితమును త్యజించెను. బుద్ధిపూర్వకముగా సంతోషముతో నిరుపేదతనమును మనసార నవలంబించెను. మహాత్ముఁడొక కటిక నిరుపేద కూలివానివలె జీవనముచేయు నారంభించెను. నిరుపేద లుండెడి యాకుటీరముల యందే మహాత్ముఁడు నివసింప మొదలిడెను. ఆ నిరుపేద తినెడి యన్నమునే మన బారిష్టరు గాంధి యారగింప మొదలిడెను.

డర్బను నగరమున నొక యాశ్రమ మేర్పఱచి తనవలె నితరులు కూడ భాగ్యభోగ్యములను విసర్జించి పేదసాదల యట్లు జీవింప వలయునని యుద్బోధించి యితర భాగ్యవంతులనుగూడఁ దనయట్లే మార్చివేసెను. ఆలు బిడ్డలు — అను మమకారము మనస్సును వికారము కలుగనీయ కుండునట్లు బుద్ధిని లోఁబఱచుకొని మనస్సును దృఢము గావించుకొనెను. ఇతరులను జూచి నట్లే, తన యాలు బిడ్డలను జూడసాగెను. గాంధి తన కేమియు లేని యొక గొప్ప యాదర్శ జీవితము నలవఱచుకొనెను. త్యాగమూర్తిగా మన గాంధి మహాత్ముఁడు మన కారాధ్య దైవ మయ్యెను. ఇట్టి త్యాగమున కచటి భారతీయు లుత్తేజితులై చంద్రోదయమున కుప్పొంగు క్షీరాబ్ధివలె నుత్తుంగ భావ పరంపరా తరంగితాంతరంగములతో మహాత్ముని దివ్యబోధామృతమును గ్రోలుట కువ్విళ్లూరుచుండిరి. ఎల్లరు గాంధిని దైవముగా భావించిరి. ఎల్లరు గాంధిమహాత్ముని మాటయే దైవాజ్ఞయని లోలోన శపథములు పలికిరి. బారిష్టరు గాంధి యిట్టి మార్పును బొందుట భగవత్సంకల్పమై యుండును. గాంధిమహాత్ముని మనోవాక్కాయములు మూఁడును దైవప్రేరితములై యుండును. మన గాంధి మనకు — లోకమునకు భగవంతుఁ డయ్యెను. నాఁటి నుండియే గాంధి మనకు మహాత్ముఁ డయ్యెను. పాఠకమహాశయులారా! ఇంతవఱకు గాంధి యనియు నంటిమి. క్షమింపుఁడు. ఇంతటినుండి గాంధిమహాత్ముఁ డందము.

గాంధిమహాత్ముఁడు దక్షిణాఫ్రికా భారతీయులకు జరుగుచున్న యన్యాయములనుగూర్చి ధైర్యముతో బలుపర్యాయములు ప్రభుత్వమునకు విజ్ఞప్తులంపెను. సూర్యుఁ డస్తమించని సామ్రాజ్యమునకు గాంధియనిన సింహస్వప్నము

కాఁదొడఁగెను. తేఱిపాఱఁజూడరాని బ్రిటీషు సామ్రాజ్య సింహాసనము కదల నారంభించెను. సామ్రాజ్య మత్త ప్రభుత్వ మారహంకారమున కాదిలో మహాత్ముని విజ్ఞప్తు లన్నియుఁ జెవిటికి శంఖమూదినట్లయ్యెను. అయినను భారతీయో ద్ధరణకై భారతభూమిని జన్మించిన మహాత్ముఁడు దిగంతరాళ ములు ప్రతిధ్వనించునట్లు తన పాంచజన్యమును బూరించెను. ఇఁక నేమి? ఇరువాగులవారు యుద్ధమునకుఁ దలపడిరి. ప్రభుత్వ పక్షము, సమస్త యుద్ధసాధనసంపత్తితోఁ గాలుదువ్వుచుండెను. మహాత్ముని సైన్యము, సత్యాగ్రహముచేపట్టి యెలపై ధ్వజ వెత్త నుంకించుచుండెను. ఈ యుద్ధమెట్టిది? భారత యుద్ధమా? కాదు; ప్రపంచ మహాసంగ్రామమా? అంతకంటెను గాదు. ఎన్నఁడు నెవరు నెప్పుడు నూహింపనియుద్ధము. అది ద్వేషము కలిగింపని యుద్ధము; రక్తబిందువుచిందని యుద్ధమది; స్నేహము చెడని యుద్ధమది; ప్రేమానురాగములతో హోరా హోరిగాఁ బెనగులాడు యుద్ధము. ఇతరుల కుట్రలను దానే యనుభవించు యుద్ధము; ఆ యుద్ధము పేరేమని చెప్పఁగలము? ఆత్మనివేదన యుద్ధమని చెప్పుకొందము.

గాంధిమహాత్ముఁడు 'రౌండుటేబిలు' సమావేశమునకు వెళ్లినపుడు లండనులో కొన్ని తావుల నుపన్యసించెను. అందు 'గ్లిట్ హాలు'లో జరిగిన యుపన్యాసములో మహాత్ముఁడు,

“గాంధి! మీ శరీరముమీఁద దుప్పటి యొకటి కలదు. నా కేమియు లేదంటివే!” యని మీరు నన్ను బ్రశ్నింపవచ్చును. అందులకుఁ బ్రత్యుత్తర మొకటి చెప్పఁదలఁచితిని. నాకై శరీర మొకటికలదు. ఆ శరీరముండునంత దనుక దుప్పటి యొకటి

యావశ్యకముగదా! అయినను, ఎవరైన నీ దుప్పటి కావలయు నని యందు రేని నిరాతంకముగా దుప్పటిని తీసికొనవచ్చును. అందులకు నాకెట్టి యాక్షేపము నుండదు" అని చెప్పిన మహాత్ముని త్యాగనిరతి కిదియొక మచ్చుతునక.

"గ్లిట్‌వహాసు" సభ ముగిసినపిమ్మట విడిదికి వెళ్ళుటకై మహాత్ముఁడు మోటారుదీసికొని రావలసినదిగా మ్యాడ్రిడ్ సోదరిని గోరెను. సభచాలించి మహాత్ముఁడు వెలుపలికి వచ్చు సరికిఁ దమతమ మోటారుబండ్లలో మహాత్ముని నెక్కించుకొని పోవుటకై యుబలాటముతోఁ బెక్కురు గుమిగూడిరి. అట్టియెడ 'మ్యాడ్రిడ్' సోదరి మోటారేదియో గుఱుతింపవలను గాకుం డెను. తమతమ మోటారు నెక్కుఁడని యెల్లరు ప్రార్థించు చుండిరి. ఆ విషయమునుగూర్చి మ్యాడ్రిడ్ సోదరి యిట్లు వ్రాసెను.

"చలి మిక్కుటముగా నుండెను. చలికిఁ జాలినన్ని దుస్తులు మహాత్ముఁడు దాల్చియుండలేదు. ఆ చలిలో మహాత్ముఁడు నిలువఁబడుటకు నా మనసొప్పకుండెను. నేను మహాత్ముని సమీపించి 'నా బండికై మీ రెదురుచూడవలదు. ఏ బండియో యొకటి యెక్కుట మంచిద'ని యంటిని. అందులకు మహాత్ముఁడు "మఱియొకటి మోటారేల? మీ మోటారు మీఁదనే పోవుదమ"ని నవ్వుచు ననెను. ఆ పలుకులు నా కెంతయో 'హాయి'ని గూర్చెను. ఆ సమయములో నాకని యేదియులేదు. సర్వమాతనిదే' యను యేసుప్రభువాక్యము నా హృదయమును బల్లవింపఁజేసెను. నిజమునకు మహాత్మునికని మోటారొకటియు లేదు. ఎల్ల మోటారులు మహాత్ముని

నెక్కించుకొనుటకై యహింసాపూర్వకవృాని అచ్చటకు వచ్చి వాలినవి.

ఇట్టి యుదాహరణములు పెక్కులుగలవు.

భారతీయ వ్యక్తిస్వాతంత్ర్యమును నశింపఁజేయు శాసనములను ధిక్కరించుటకై మన మహాత్ముఁడు సంసిద్ధుఁడాయెను. ముందుగఁ దానె శాసనోల్లంఘనము చేసెను. ఇఁక దక్షిణాఫ్రికా భారతీయులందఱు శేకకంఠముగ శాసనోల్లంఘనమును గావింప మొదలిడిరి. శాసనోల్లంఘనము చేసి మన భారతీయసోదరులు చెఱసాలకుఁ గ్రిక్కిరియుచుండిరి. ఆ వివరములను వ్రాయఁబూనిన నేండ్లు పూండ్లుపట్టును.

## శత్రువుల యెడ మైత్రి

ఈ శాసనోల్లంఘ నోద్యమము పలువిధముల నడచెను. అందువలన మన మహాత్ముఁడు ప్రభుత్వమువారియాగ్రహమునకు గుఱియై శ్రీకృష్ణజన్మస్థాన మలంకరించెను. మహాత్ముఁ డెచ్చట నుండినను బూజ్యుఁడే గదా! మహాత్ముని బంధించిరి; కొట్టిరి; తన్నిరి. చెఱయందు బంధింపఁ బడినప్పుడు ప్రభుత్వమువారు మహాత్మునిచే ఱాళ్లను బగులఁగొట్టించిరి. పాకీపని చేయించిరి. ఇట్టిపనులెన్నియో మన మహాత్మునిచేఁ జేయించిరి. 'విశన్న పిరవేర్మధ్యంశీతవవ సదాశశీ'

ఇట్లు నీచముగాఁ జూచినను మహాత్ముఁడు తొణకక శాంతమే భూషణము. త్యాగమే శరణ్యమని దేశీయుల కుద్బోధించుచు, భారతీయులనందఱిని నొక్కత్రాటిమీఁద నడిపించుచు వచ్చెను. త్యాగము నాత్మశక్తియు నెట్టి కష్టములనైన ననుభ

వించు స్థైర్యగుణమిచ్చునుగదా ! కొందఱు భారతీయులు "ఓ మహాత్మా! దౌర్జన్యమును దౌర్జన్యముతో నెదుర్కొనవలె న"ని మొఱపెట్టుచుండిరి. గాంధిమహాత్ముఁడు "ప్రభుత్వము వారి మీఁదఁ బ్రేమతో నుండుచు వారుచేయు దుండగములను మాత్ర మెదుర్కొనుటయే శ్రేష్ఠమైన యుద్ధమని" పలుపర్యాయములుచెప్పి వారిని శాంతపఱచెను.

శత్రువులను మిత్రులవలె భావించుట ధర్మమని కేవలము నోటిమాటలతో మాత్రమే చెప్పలేదు. మహాత్ముఁడు చెప్పునదిచేయు స్వభావముగలవాఁడు. మహాత్ముఁడు చెప్పునది చేయునది తలఁచునది యొక్కటియే. సత్యాగ్రహ సమరము జరుగుచుండఁగా నచట రెండు పర్యాయములు యుద్ధములు జరిగెను. ఆ యుద్ధసమయములందు మహాత్ముఁడు ప్రభుత్వమువారి మీఁద ద్వేషభావము పూనక బ్రిటిషువారికి నెంతయో సహాయ మొనరించెను. ఆ యుద్ధసమయమున బ్రహ్మాండము బ్రద్దలగునట్లు కాల్పులు జరుగుచున్నను, మహాత్ముఁడు బ్రిటిషు సైనికులకు సహాయపడుటచూడ మహాత్ముని యనంతౌదార్యాదర్శములు ప్రపంచమునకే మకుటాయమానమై శాశ్వతముగా వెలయుటను ప్రదర్శించెను. ఒకసమయమునఁ గొందఱు ఆఫ్గనీయులు నిజమెఱుఁగలేక నిర్దయులై మహాత్ముని మిక్కిలి చావమోదిరి. అంతియగాదు. పండ్లనునూడఁగొట్టిరి. ఆదృశ్యము చూచుచున్న మహాత్ముని యనుయాయుఁడు 'కాల్పెన్ బగ్' అను జర్మను దేశీయుఁడు తన సహచరులతోఁగూడి మహాత్మునిఁ జావమోదుచున్న యా యాఫ్గనీయులను దుపాకులతోఁ గాల్చుటకు నుంకించెను. మహాత్ముం డదిచూచి యా దెబ్బల

బాధల నోర్చుకొనుచు, నోటమాట రాకపోవుచున్నను, ప్రతి కష్టమునుమీఁద మాట పెకలించి "మిత్రులారా! వలదు వలదు. నాకును మనసు లేదు. కావున మీ ప్రయత్నము, నా యెడలి ప్రేమ పెంపున మానుకొనుఁడు" అని దయార్ద్రహృదయముతో నా జక్కను దేశీయులను ప్రార్థించుచు దెబ్బల బాధలకు మహాత్ముఁడు మూర్ఛపోయెను. కొంతసేపటికి దెప్పరిల్లి లేచి" "నన్నుఁ గొట్టిన యా యాష్లేసీయ మిత్రులు కెట్టిహానియుఁ జేయ రాదు" అని యక్కడ మూగినవారికి మొఱలిడెను.

దక్షిణాఫ్రికాలో మహాత్ముఁడు సత్యాగ్రహము జరుపు చుండిన దినములలో "జనరల్ స్మట్సు" గవర్నరుగా నుండెను. ఆతఁడు సత్యాగ్రహము కావించుచుండిన మహాత్మునికిఁ జెఱవాల శిక్ష విధించెను. అందులకు మహాత్ముఁడు 'జనరల్ స్మట్సు'ను విరోధిగా భావించి యెఱుఁగఁడు. మీఁదుమిక్కిలి, ఆతనిని, ఆతని యనుచరులను మహాత్ముఁ డెంతయో గౌరవించుచుఁ డెడి వాఁడనుట యెల్లఱి కాశ్చర్యము కలిగింపకపోదు.

అట్టి యచ్చెరువు గలిగించు మహాత్ముని విషయము నొకటి రెండింటిని జదువుకొందము.

జనరల్ స్మట్సు మిత్రుఁడొకడు సందర్భవశమునఁ గలసి కొని మహాత్మునితో మాటాడుచు,

"తమరు హింసచేయుటలేదు. చేసినయెడలఁ దమను సద్దుకొను శక్తి మాకుఁ గలదు. తమ మార్గమే వేఱు విధముగా నున్నది. తమరు శత్రువులను మిత్రులనుగా భావించు చుంటిరి. తమరే, కష్టము లనుభవించుచుంటిరి. అందుచే, తమ

నేమిచేయుటకు మా కేమియుఁ బాలుబోవుటలేదు. మే మెంతయో బాధపడుచుంటిమ”ని మహాత్ముని యజాతశత్రుత్వము నాతఁ డెంతయో గొనియాడెను.

ప్రపంచ ప్రఖ్యాత వేదాంత తత్త్వవేత్త యగు శ్రీ శ్రీ రాధాకృష్ణ పండితమహాశయులు వెలువరించిన యొక గ్రంథ మందు జాన్. హెచ్. హాప్ మేయరు అను నాంగ్లేయ ప్రముఖుఁడు మహాత్మునిగుఱించి యొక యపూర్వ విషయమును వెల్లడించియుండెను. అందిట్లుకలదు.

“......జోహాన్సుబర్గు నగరోపకంఠమున నిప్పుడొక బడి కలదు. శిక్షింపబడిన బాలురను సత్ప్రవర్తన గలవారినిగాఁ దిద్ది తీర్చుటకై యా బడియందు విద్య గఱపఁబడుచుండెను. పూర్వ మది చెఱసాల. పిమ్మటఁ గొంతకాలమునకు నే నొక మిత్రునితోఁ గూడి యటు పోవుచుంటిని. అప్పుడాతఁ డా బడి యందలి యొక గదిని పనికట్టుకొని జుట్టును దిరిగి చూపుచు “ముప్పదేండ్లకు ముందీ గదియందే మహాత్ముఁడు నిర్బంధింపబడెను. ఆకాలమందు నేను మాజిస్ట్రేటుగాఁ బని చేయుచుంటిని. జనరల్ స్మట్సు నాయాలమున తత్త్వ గ్రంథము లను మహాత్మునకుఁ బంపుచుండెడివాఁడ’ని వ్రాసుచ్చెను. మహాత్మునకు – జనరల్ స్మట్సునకు హోరాహోరిగా సత్యా గ్రహ సమరము జరుగుచున్నను, స్మట్సునకు మహాత్మునిమీఁద శత్రుత్వ ముండెడిదికాదు. మీఁదు మిక్కిలి ప్రేమయే యింకను బెంపొందుచుండెను.”

ఇంకను, ఇట్టి ప్రాగల్భ్యములు ప్రస్ఫురించునట్టి జనరల్

స్మట్సు వ్రాఁతలు పెక్కులు గలవు. అందు రెండిటిని మాత్రము చదువరులకుఁ జవులూరించు నని యిట నుల్లేఖించు చున్నాను.

1. "నేను గాంధిమహాత్మునకు శత్రువను. మహాత్ముఁడు డెబ్బది యేండ్లవాఁడయ్యు, పీనుగువోలె నుండుటకు నాకెంతయో సంతోషముగా నున్నది.

2. మహాత్ముఁడు చెఱసాలయం దుండుచు నాకై కుట్టిన చెప్పులజతను చెఱసాలనుండి విముక్తిపొందిన పిమ్మట నాకుఁ బంపించెను. నేను, ఆ చెప్పులను వాడుట కాతురతగల వాఁడనయ్యు 'పెద్దలు కుట్టిన చెప్పులమీఁద నా కాలు మోప నగునా' యను సందేహము నా మనస్సున గాఢముగా నాటుకొనెను......మా పోరాటమందు మహాత్మునిమీఁద మాకెప్పుడును ద్వేష ముండెడిది కాదు.

ఇట్టి మహోన్నతభావములు గలుగుటకు మహాత్ముని త్యాగమహిమయే కారణమని చెప్పక చెప్పుచున్నది. మహాత్ముని త్యాగము విరోధమునకుఁ దావు లేనిది గదా! ధర్మబద్ధమైన త్యాగమువలనఁ బ్రేమయే జనించును గాని తద్విపరీతములు కలుగనేరవని యెల్ల రెఱిఁగిన సత్యము సుమా!

విరోధముచే విపరీతములు జనించుట లోకనైజము. మహాత్ముఁ డెన్నఁడే సందర్భమున నెవరిని విరోధిగా భావించి యెఱుఁగఁడు. ఆహా! మహాత్ముఁ డజాతశత్రువుగదా! ప్రతీకార బుద్ధి ప్రతిబింబించినప్పుడే ప్రత్యపకారము చేయఁదలంచుట సాధారణ మానవునకు సహజము. ప్రతీకారబుద్ధి యుండుట ప్రాజ్ఞుని లక్షణము కాదు. అదను జూచి యదనులు గ్రక్కుట

యజ్ఞునిలక్షణము. మహాత్ముఁ డెట్టి సమయమందును విజ్ఞత వీడ కుండుట మహాద్భుతము.

1914 వ సంవత్సరమందుఁ బ్రపంచ మహాసంగ్రామము సంభవించినప్పుడు ఆంగ్ల దేశసహాయమునకై భారతీయులను యుద్ధ మందుఁ జేర్చుకొనిన మహాత్ముని చిత్తశుద్ధి లోక ప్రసిద్ధము. 1939 వ సంవత్సరమున మేరమీఱిన మహాయుద్ధము ప్రపంచ మును దల్లడిల్లఁజేయునప్పుడుగూడ భారత స్వాతంత్ర్యమునకై యాంగ్లప్రభుత్వముమీఁద నంతిమ్యుద్ధము ప్రేరేపింపని జగత్పూజ్యు డైన మహాత్ముని మహామహిమను మనమెట్లు గ్రహింపఁ గలము? ఎల్లలు దాఁటిన యట్టి మహిమ, యే యుగమందైనఁ గంటిమా? ఆ మహాయుద్ధమందు సంధియగుట విశ్వశాంతికి విఘ్నేశ్వరపూజ యని మహాత్ముఁడు భారతదేశ రాజప్రతినిధికి నుత్తరము లంపెను. భారత దేశ స్వాతంత్ర్యసమరము ప్రేమ పథ మున నడుపఁ గలుగుటకు విశ్వక్షేత్రమున బంగారు పండించుట సుమా! భారత స్వాతంత్ర్యమునకై యాంగ్లప్రభుత్వముమీఁద యుద్ధము కావించుచు, నాంగ్లేయుల యెడ నెనలేని ప్రేమను బ్రదర్శించు మహాత్ముని ప్రేమ స్నిగ్ధ హృదయమును గ్రంథము లెన్ని రచించినను విప్పి చెప్పఁదరమా ? ఆంగ్లేయుల యెడ నీవంతయు విరోధము పూనకుండుట భారతదేశ చరిత్రకే యొక యపూర్వ రసమయ ప్రకరణము కాఁగలదు. ‘భారత దేశము విడిచిపెట్టి పో (Quit India), యుద్యమము ఆంగ్లేయుల యెడఁ గాదనియు, ఆంగ్లప్రభుత్వమునెడ ననియు మహాత్ముఁడు పెక్కుపర్యాయములు వెల్లడించియుండుట లోక విదితము. గాంధి, మహాత్ముఁ డగుటకుఁ బ్రేమయే కారణము.

'శత్రువును ప్రేమింపుమ'ని యేసుప్రభు ప్రవచనము. ఆ యాదర్శమునకుఁ దార్కాణమై ప్రకాశించు మహాత్ముఁడు మన కర్మభూమి యందవతరించుట భారతదేశ మహాభాగ్యము. ఆహా! మహాత్ముని జీవితము ప్రేమమయముగదా!

ఇట్టి యద్భుతమగు నుదారభావము సృష్టినుండి నేఁటి వఱకు నే చరిత్రయందును లేదనుట యథార్థము. ఇట్టి మహిమాన్వితమగు నుదారబుద్ధి మహాత్మునకు సహజముగదా! ఆహా! ఏమి త్యాగము? ఎంతటి యుదారబుది! రాశీభూతమై త్యాగము మహాత్ముని నాశ్రయించియుండెను. లేనిచో ప్రపంచమందు, ముందెన్నఁడు లేని యిట్టి మహిమాన్విత త్యాగ మాశ్రయించుటచేతనే గాంధి, మహాత్ముఁడయ్యెను. గాంధిమహాత్ముఁడు 1893 వ సంవత్సరము మొదలు 1913 వ సంవత్సరము వఱకు దక్షిణాఫ్రికా దేశమందుండి సర్వశ్రేయములకుఁ ద్యాగమే ముఖ్యమని మనోవాక్కాయముల నెలుఁగెత్తి చాఁటుచు నాత్మశక్తి సంపదచే సత్యాగ్రహసమరము గావించి, విజయము గాంచి, ప్రపంచమందలి యెల్లరి మన్ననలకుఁ బాత్రుఁడయ్యెను. జయమునకుఁ ద్యాగము ముఖ్యమని భారతీయులు మఱువకుందురుగాక!!!

లోక శ్రేయస్సునకై పాటుపడిన మహాపురుషులు, చరిత్రల నెక్కి మన కారాధ్యులైరి. కాని మన యదృష్టము పండి ఫలించుటచే మన నోముల పంటగా మహాత్మునిఁ గన్నులారఁ గాంచి మన జీవితములు ధన్యము గావించుకొంటిమి. గాంధి యను పదమునకుఁ ద్యాగ మర్థముగా నైఘంటికులు నిర్ణయించుట సత్యము నకుఁ జేసువ.

ఆ త్యాగమే గాంధిని మహాత్మునిగాఁ బరిఢవిల్లఁజేసెను. త్యాగములేని జీవితము జీవితము కాఁజాలదు. త్యాగయుక్త జీవితమే ప్రపంచమున కారాధ్య మగునని మన మహాత్ముని జీవితమువలనఁ దెలిసికొనుచున్నాము.

మహాత్ముని త్యాగజీవితము ప్రపంచమున మేలుబంతియై సమస్త మానవ కళ్యాణమునకు దోహదమై యలరారుచున్నది.

# ఆదర్శ జీవితము

తనకుఁగల సర్వసంపదలను స్వార్థమునకని తలంపక పరార్థమునకని భావించి త్యాగముచేసి నిరాడంబర జీవితమును గడుపుకొనుటయే యాదర్శ జీవితమగును.

ఆదర్శ జీవిత మనఁగా ధనికుని జీవితమును, దరిద్రుని జీవితమును గాదు. ప్రాచీనకాలమున జ్ఞానులు, ధన – దారిద్ర్యముల రెంటిటిని దరికిఁ జేరనీయరైరి. జ్ఞానులు; ధనమం దాశయు, దారిద్ర్యమం దేవగింపును గలిగియుండలేదు. "ధనము మదమును బెంచును; దారిద్ర్యము జీవితమునం దాసక్తిని రేకెత్తించును. ఈ ధన దారిద్ర్యములు రెండిటిని జేతికట్టుకు బిగించిన బంగారు పొన్ను, ఇనుప పొన్నులవంటివి. చేవగల కట్టుకుఁ బొన్నులతో నిమిత్తమేమి? నిమిత్తమైనను బంగరు పొన్నువలన లాభమేమి? ఆ రెండిటిని దీసివేసినయెడలఁ జేతికట్టుకు నష్టమేమియు నుండదుగదా! అట్లే; ధన దారిద్ర్యములను సమభావమునఁ జూచువాఁడే ధన్యుఁడు. ఆతని జీవితమే యాదర్శమగును.

## ధన దారిద్ర్యములు

సాధారణముగా నాదర్శ జీవితమును గడుపుకొనువాఁడు చక్రవర్తిని మించిన గొప్పవాఁడు కాఁగలఁడు. ఏలయన? రాజు ఐశ్వర్యవంతుఁ డగుటవలన తన జీవితమును భోగలాలాను జీవితాశయమునే మఱచిపోయి, సుఖాభాసములనే సుఖములుగాఁదలఁచి తదను గుణ్యముగా జీవితము నెఱపుకొనుచుండును. ఆదర్శ జీవితము గలవాఁడు లోకక్షేమమే తన క్షేమముగా భావించు కొనుచు, నితరుల కష్టసుఖములందు భాగస్వామి యగుటను జీవిత పరమావధిగా నెంచి లోకసేవకుఁ డగుచుండును. కాఁబట్టి యాదర్శ జీవితమే మానవత్వమును బోషించునదియని బోధ పడుచున్నది.

త్యాగయుక్త మయిన జీవితమే యాదర్శ జీవితము. ఈ యాదర్శ జీవితమును గుఱించి 'జీవిత' ప్రకరణమున గొంత వఱకుఁ జదివియున్నారముగదా !

గాంధిమహాత్ముఁడీ యాదర్శ జీవితమారంభించి మానవ సేవకుఁ డగుటట లోకప్రసిద్ధము. దక్షిణాఫ్రికాయందు గాంధి మహాత్ముఁడు చేసిన త్యాగమే గాంధిమహాత్ముని జీవితమును ఆదర్శనీయముగఁ బరిణమింపఁజేసెను. ఆంగ్ల వేష మాడంబరము-గా భావించి, ప్రాచీన భారత జాతీయతను బెంపొందించుచు నార్ష వేషమును దాల్చెను. ప్రాసాదములందుండుట పనికిరాదని యాశ్రమవాసి యయ్యెను. విలువగల మజ్జనభోజనములు మానవునకు మత్తెక్కించునని పేదవాని భోజనము చేయ మొదలిడెను. ఆదర్శజీవితమన పేదవాని జీవితమని యర్థము. అంతియకాని నిర్భాగ్యుని జీవితము కాదుసుమా! పేదవాని

జీవితమన, భగవంతుఁడిచ్చిన కాయకష్టముతో సంపాదించు జీవితము. తాను కష్టింపక యొరుల సాయముతో జీవించు జీవితము జీవితము కానేరదు. తమతమ కష్టార్జితమగు స్వసంపాదనతో జీవితము గడుపుకొనిన యెడల లోకమందు ధనవంతుని జీవితమేల సాటియగును? అట్లు కష్టించుచో దరిద్రుని జీవితము నందలిదారిద్ర్యమువదలును. ధనవంతుఁడుతనకుమించినయాత్మోప జీవితమును నడుపుకొనిన యెడల నితరులు కష్టించి సంపాదించిన ధనమును దానుమాత్రము తనపొట్టకై వెచ్చించిన వాఁడగును. దరిద్రుఁడును నిష్ప్రయోజనముగాఁ దిఱిగి తనబాధ్యత నెఱుఁగక సోమరియగుచో నాతనిజీవితము జీవితముకాఁజాలదు. ఈ పద్ధతి జీవితములు రెండును నిష్ప్రయోజనముగలవి యగును. ఈ రెండు జీవితములనుగాక యాదర్శజీవిత మవలంబించుట మేలగును. ధనవంతుఁడు, ఇతరుల కష్టములచేఁ దాను సంపాదించిన ధనమును దనకొఱకు మాత్రమే యుపయోగించుకొనుచో నాతఁడు లోకవంచకుఁడగును. దరిద్రుఁడు తన బాధ్యత నెఱుఁగక, శ్రమింపక పట్టెఁడన్నమునకై తిరిపమెత్తుటచే నాతఁడు నిరర్థకుఁడగును. కాఁగా; తన సర్వస్వము లోకసేవ కుపయోగించి యాదర్శ జీవిత మాచరించుచున్నవాఁడే మానవుఁడగును. "తనపొట్టకుఁ దానే సంపాదించుకొనుట భగవత్సంకల్పము. అట్టిదేదియు లేని వాఁడు నిష్ప్రయోజకుఁడు—సోమరి—వంచకుఁడుసుమా" యని గాంధిమహాత్ముఁడు చెప్పియుండెను.

జీవితమునకుఁ గావలసిన దానికంటె మించిన ధనమును గలిగి, తనకుఁ దనవారలకు సరిపోవు పరిమితిని మించి వ్యయముచేయుట జీవితము వ్యర్థముచేయుట యగును. ఇట్టి చేతలవలన లోకమందుఁ గొందఱుపస్తులుండి బాధపడుట సంభ

వించుచున్నది. తమ జీవనభృతికి మించిన సంపద తమయొద్ద నుంచుకొనినయెడల నట్టివారు కొందఱికడుపులు కాల్చిన వారగుదురు. ఇట్లు మీఱిన సంపద కూడఁబెట్టుటవలన లోకమందు దారిద్ర్యము ప్రబలుటకుఁ గారణమగుచున్నది. ప్రతివ్యక్తియుఁ దమకు సరిపోవు సంపదనుమాత్ర ముంచుకొనిన యెడల దేశమందు దారిద్ర్యమెచ్చట నుండఁగలదు? ఆ దేశము బంగారు దేశముకాదా?

"ఎల్లరికిఁ గావలసిన ధనమును, ఎల్లరికడ నుండవలసిన ధనమును నే నొక్కఁడనే ప్రోగుచేసితిననుకొనుఁడు. అందువలన నేను ధనవంతుఁడ నగుదును. అందుచే జీవిత పరమార్థము గ్రహింపక, కుటుంబపోషణమునకు మితిమీఱి వెచ్చించి సుఖసంతోషములతోఁ దులదూఁగుచుండుట యగును. ఇట్లు చేయుటచేత నేను కుటుంబగౌరవము, దేశగౌరవము కాపాడువాఁడనుగాకపోదును. జీవితమునకు, సన్నాశ్రయించియున్న నా కుటుంబ జీవితమునకుఁ బోషణనిమిత్తమై పరమాత్ముఁడు కాళ్ళు చేతులిచ్చి యున్నాఁడను తలంపు కలిగినయెడల నా జీవితమే గాక; యితరుల జీవితముకూడ వన్నెకు, వాసికి రాఁగలదు. ఇందువలన నే నితరులకు లోటురానీయక నా కుటుంబ పోషణమునుగూడ సమర్థించుకొనువాఁడను గాఁగలుగుచుందును. ఎల్లరు నిట్టి యాదర్శజీవిత మవలంబించుచున్న యెడల దేశము బంగారు దేశమగును."

అని మహాత్ముఁ డుపదేశించిన యుపదేశమును భక్తి ప్రపత్తులతోఁ దిలకింపుఁడు. తన జీవితమున కెంత ధనమావశ్యకమో, యంత ధనము నుంచుకొనక మించి వ్యయించిన యెడల నాతఁ డొందఱి పేదల పొట్టలనో కొట్టుచున్న వాఁడగును.

ఇట్టి ధనసంపన్నులు లేకుండుట యెంతయో లోకశ్రేయము. ఈ ధనవంతుల జీవితమే దేశదారిద్ర్యమునకుఁ గారణ మగుచున్నది. రేపటి కేమిచేయుట, రేపటి మాటేమి, యను విషయమున గాంధిమహాత్ముఁడు,

"రేపటి పూట యెట్లని తలంచుట తగదని వేదాంతము బోధించుచున్నది ... ఒక దేశముయొక్క గొప్పతనము ఆ దేశ మందలి కోటీశ్వరులవలనఁ దెలియదు. పట్టెఁ డన్నములేక యుండుచున్న పేదలవలన నా దేశస్థితి తెలియును. ధనరాసులతో మూలిగిన రోమునగరము నాశనము కాలేదా? ఎహింబెత్తుకూడ నష్టేగదా! పెంపెక్కిన సిరిసంపదలతోఁ దుల దూఁగిన తక్కిన దేశములునాశనమైనసంగతి చరిత్రప్రసిద్ధముగదా! శ్రీకృష్ణభగవానుని పదునాఱువేల భార్యలు సంపదలతోఁ దుల దూఁగియు నాశనమైరి.

...దక్షిణాఫ్రికాయందును మిత్రులతోఁ గలసి మెలసి యుండునప్పుడు గూడ భోగజీవితము తగదని చెప్పియుంటిని. పేదలు సత్యాగ్రహ సమరమునకుఁ దోడ్పడినట్లు భాగ్యవంతులు తోడ్పడలేదు ... వేదాంతమందుఁ జెప్పినట్లు ధనము సద్వినియోగము చేయుట మంచిదని యప్పుడున్నట్టి యార్థిక శాస్త్ర పాఠ్య పుస్తకములను జదివినట్లు గుఱుతు... రెండువేల సంవత్సరములనాఁడే యేసుక్రీస్తు ప్రభువు ఈ విషయమై చెప్పియుండెను. 'మార్కు' రచించిన 'వ్యాఖ్యానమందు ఈ విషయము వివరింపఁబడియుండెను. అది యీ క్రిందజదువుకొందము.

"ఒకఁడు పరుగెత్తికొనివచ్చి, ఆయన యెదుట మోకాళ్లూని – 'సద్బోధకుఁడా! నిత్య జీవితమునకు వారసుడ నగుటకు

నే నేమి చేయుదునని ఆయన నడిగెను. యేసు – నన్ను సత్పు రుషుఁ డని యేల చెప్పుచున్నావు? దేవుఁ డొక్కఁడేగాని మరి యెవడును సత్పురుషుడు కాడు. నరహత్య చేయవద్దు, వ్యభిచరింపవద్దు, దొంగిలవద్దు, అబద్ధసాక్ష్యము పలుకవద్దు, మోసపుచ్చవద్దు, నీ తలిదండ్రులను సన్మానింపుము అను ఆజ్ఞను నీకు తెలియునుగదా అని అతనితో చెప్పెను. అందు కతడు – బోధకుడా, బాల్యమునుండి ఇవన్నియు అనుసరించు చునే యుంటినని చెప్పెను, యేసు అతని చూచి అతని ప్రేమించి – నీకు ఒకటి కొదువగా నున్నది; నీవు వెళ్ళి నీకు కలిగినవన్నియు అమ్మి బీదలకిమ్ము, పరలోకమందు నీకు ధనము కలుగును; నీవు వచ్చి నన్ను వెంబడించుమని చెప్పెను. అతడు మిగుల ఆస్తిగలవాడు గనుక ఆ మాటకు ముఖము చిన్నపుచ్చు కొని దుఃఖపడుచు వెళ్ళిపోయెను. అప్పుడు యేసు చుట్టుచూచి– ఆస్తిగలవారు దేవునిరాజ్యములో ప్రవేశించుటయెంతో దుర్లభ మని తన శిష్యులతో చెప్పెను. ఆయన మాటలకు శిష్యులు విస్మయమొందిరి. అందుకు యేసు తిరిగి వారితో ఇట్లనెను— పిల్లలారా! తమ ఆస్తియందు నమ్మిక యుంచువారు దేవుని రాజ్యములో ప్రవేశించుటకంటె ఒంటె సూది బెజ్జములో దూరుట సులభము. అందుకు వారు అత్యధికముగా ఆశ్చర్య పడి – అట్లయితే ఎవడు రక్షణ పొందగలడని ఆయన నడిగిరి. యేసు వారిని చూచి – ఇది మనుష్యులకు అసాధ్యమేగాని దేవునికి అసాధ్యముగాదు; దేవునికి సమస్తమును సాధ్యమే అనెను. పేతురు – మేము సమస్తము విడిచిపెట్టి నిన్ను వెంబ డించితి మని ఆయనతో చెప్పసాగెను. అందుకు యేసు ఇట్ల నెను – నా నిమిత్తమును సువార్త నిమిత్తమును ఇంటి నై నను

అన్నదమ్ములనైనను, అక్క-చెల్లెండ్రనైనను, తలిదండ్రులనైనను, పిల్లలనైనను, భూములనైనను విడిచినవాఁడు ఇప్పుడు ఇహమందు హింసలతోఁ కూడ నూరంతలుగా ఇండ్లను, అన్నదమ్ములను, అక్క- చెల్లెండ్రను, తల్లులను, పిల్లలను భూములను రాబోవు లోకమందు నిత్య జీవనమును పొందునని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను. మొదటివారనేకులు కడపటివారగుదురు, కడపటివారు మొదటివారగుదురు."

(బైబిలునుండి)

కోట్లకొలఁది ప్రజలు పట్టెఁడన్నము లేక యలమటించుచుండఁగా భోగలాలస బుద్ధితో సొమ్మును వమ్ముచేయుట పాపము."

అని సిరిగల జీవితమందలి చేటును వెల్లడించెను. ఒకని భాగ్యజీవితము మఱియొకని దారిద్ర్య జీవితమునకుఁ గారణమగుటవలన, నాదర్శ జీవితము చరితార్థ జీవిత మగునని గాంధిమహాత్ముని యాశయము.

అర్థము పురుషార్థములలో నొకటి. పురుషార్థపరుఁడైన మానవ జీవన విధానమునకు ధనము ప్రధానము. అందుచే ధనమువలదని మహాత్ముఁడు చెప్పుచుండుటలేదు. కాని వలసిన దానికంటె మిన్నగా ధనము కూడఁబెట్టుట తగదని మహాత్ముని యాశయము. కూడఁబెట్టి ధనవంతుఁ డగుటవలన వేఱొకఁడు నిర్ధనుఁడగుటకుఁ గారణము కాఁగలదు. అందుచే నితరులు దరిద్రులగు విధమున ధనము సంపాదింపవలదని మహాత్ముని హితబోధ.

జగజ్జీవనమునకు ధనముమూలము. జీవనమూలమగు ధనము నితరులనుండి యాచించి 'జీవించుటవలన జీవిత సౌభాగ్యమే నశించును. నేఁటి భారతదేశము నిరర్థకమై పేదతన మనుభవించుచున్నదనుట యథార్థము. ఈ విషయమై మహాత్ముఁడు,

"భారతదేశము తన సంపదను బోగొట్టుకొన్నది. తత్ఫలితముచే భారతీయుల మానవత్వము నశించుచున్నది. భగవత్తత్త్వముగూడ నశించుచున్నది."

అని వెలువరించిన మాటలందలి యర్థము యథార్థము గదా!

సాధారణముగాఁ బ్రపంచమందు అందు ముఖ్యముగాఁ బాశ్చాత్యదేశములందుఁ బ్రకృతివిరుద్ధమగు ప్రభుత్వ పద్ధతులు, ప్రస్తుత కాలమున సామ్రాజ్యములుగాఁ దలలెత్తుచున్నవి. ఆ సామ్రాజ్యములు ప్రజలనుభాగ్యవంతులు-భాగ్యహీనులునని విభజించుచున్నవి. ఈ భేదభావములు ప్రపంచమందు ప్రబలునంతకాలము శాంతిజీవనము కలుగుటకల్ల. ఇట్టి పాలిటఁగి ప్రపంచము, సామ్రాజ్యతత్త్వము రూపఱుటకుఁ బ్రయత్నించుచున్నది. అర్థబలాదికములను తగ్గించుకొనుటకై కుతూహలపడుచున్నది. పొదుపరితనమున శాంతిజీవనము, ఆదర్శజీవితము నలవడును. గంపలకెత్తు సంపదలు నిర్భాగ్యజీవితమును బెంచి యాదర్శజీవితమును, సుఖజీవితమును దూరముగావించును. ఎల్లరు శాంతికాములై సుఖజీవనము గలిగి యాదర్శ జీవితము గడుపుకొనుటయే ప్రపంచమునకు శాంతిసుఖములు చేకూర్చఁ

గూరు. ప్రభుత్వములు సర్వవిధముల దేశసంపదను బొక్కవలెతన మునఁ బెంపొందించుకొనుట మేలు.

## భారతీయ జీవితము

మనప్రాచీన భారతీయజీవితము ప్రేమనిలయమై యాదర్శ జీవితమై యలరారుచుండెడిది. మన దేశ చరిత్రలు, మహాపురుష జీవితగ్రంథములు, మహామునుల తపోజీవిత గ్రంథములు, వేద ములు మానవజీవితమునకు లక్ష్యములై యాదర్శములై యున్న వని వెల్లడించుచున్నవి. 'తినుట దొరక ముద్ద, కట్టునది నాలుగు మూరల గుడ్డ' యను లోకోక్తి కలదు. మన ప్రాచీనుల జీవిత మాదర్శజీవితమై మార్గదర్శకమై యుండుటచేతనే, యార్యా వర్తము జ్ఞానవిజ్ఞానములకు, దయా ధర్మములకుఁ బ్రపంచ మందుఁ బ్రసిద్ధిగాంచెను. సర్వేశ్వరుని సాక్షాత్కరింపఁజేసికొనిన దేశము మన యార్యావర్తదేశము! "మహాపర్వతములు భగ వంతుఁడనియు, మహారణ్యములు భగవంతుని దయ యనియు, వాయువు భగవంతుని హృదయమనియు, చిలుకలు మొదలగు వాని పలుకులు భగవంతుని పలుకులనియు, కోయిలల కంఠ మాధుర్యము భగవంతుని లీలలనియు, పురుషుని యెడఁ గల భగవంతుఁడు పౌరుషమనియు, స్త్రీలయెడఁగలఁ భగవంతుఁడు సౌందర్యమనియు, ఆసేతు హిమాచలము పరమేశ్వరుని యానంద తాండవ మనియు," మన ప్రాచీన మహర్షులు తమ తపోమహిమచేఁ గీర్తించియుండిరి. ఇట్టి సర్వమంగళప్రశస్తం బయిన స్తుతికీర్తుల కాదర్శజీవితమే కారణమని బోధపడు చున్నది. అట్టి యాదర్శజీవితము చరితార్థము పరమ పవిత్రము నని తేలుచున్నది. ఆదర్శజీవిత మహిమాతిశయము చెప్ప నలవి యగునా? "తనకుఁ గల సమస్తము సర్వేశ్వరుని యనుగ్రహ

సంజాతమ'ని మన ప్రాచీనులెల్లరు నాదర్శముగాఁ బెట్టుకొని తమ జీవితములను గడుపుకొనిరి. అట్టి యాదర్శములచేఁ బేరు కెక్కిన మన భారతదేశము నేఁడు విదేశీయ నాగరకతా వ్యామోహములఁ జిక్కి మానవత్వముననే నాశము కావించుకొనుచు నేఁటి మన భారతీయులు తమ జాతీయతను మంట గలుపుచున్నారు, ఆ విదేశీయనాగరకతా వ్యామోహపిశాచము తన వికటాట్టహాసములచే మన భారతీయ జీవితమునే మలినము గావించుచున్నది. అందుచే నేఁటి మన భారతీయులు దురహంకారులై మదమాత్సర్యాద్యరిషడ్వర్గమునకు లోనై యజ్ఞానులై యథేచ్ఛాచారులై యుండుటవలన విదేశములందలి యాడంబర వేషభాషల కధీనులయి తమ యాదర్శజీవితమును వ్యర్థపరచుచున్నారు. ఇట్లు అధీనమగుటవలననే, నేఁటి మన భారతదేశము విదేశములవలె నాత్మీయభావమును బోఁగొట్టుకొని జారత్వ చోరత్వహత్యాది దారుణ కర్మములకు నిలయమగుచున్నది. ఆదర్శములేని జీవిత మన్నివిధముల చేటులకు మూలము. మహాత్ముఁడు,

"విదేశములందు ద్వేషాసూయలు పెచ్చుపెరుగుచున్నవి. ఆ దేశములందు ధనమో, ధనమోయని పిశాచపుఁ గేకలు పిక్కటిల్లుచున్నవి. ఆ దేశీయులు పౌను, షిల్లింగు, పెన్ను మొదలగువాని లెక్కలతోఁ దల బ్రద్దలు చేసికొనుచున్నారు. అవే కాసీమను భాగ్యసీమయని భావింపవచ్చును. ఆ సీమను చూచి తక్కిన దేశములవారు కన్నెఱ్ఱఁ జేయుచున్నారు. అమెరికా భాగ్యమును పొందవలెనని యనుచు, అమెరికా ధన సంపాదనా పద్ధతులు మాత్రము మనకు పనికి రావనియు, మన భారతీయులు పెక్కురు వాదించు చుండుట నే నెఱుఁగుదును"......

"లోక జీవితమును బాగుపఱచు పద్ధతిని మనకు బోధింప వలసినదిగా విజ్ఞులను గోరుచున్నాను.

"అయితే, నాగరకతను విదేశములనుండి దిగుమతి చేసి కొనవలసిన యావశ్యకత మనదేశమున కింతమాత్రము లేదని నా నిశ్చయము. చెడుగులకు మూలమగు (వ్యాధులకు [illegible] మగు)ఆ విదేశ దురభ్యాసములు మన దేశమునకుఁ [illegible] మనమెంతో జాగ్రత్తగా నుండవలెను."

"అబద్ధముకంటె సత్యమందును, అధికారముకంటె సేవ యందును, ఐశ్వర్యముకంటె నాదర్శ జీవితమందును, తన క్షేమముకంటె నితరుల క్షేమమునందును మన నిశ్చయ[illegible]దిని జూపుదుమేని యథార్థముగా మనము ఆత్మజ్ఞానము [illegible] మగుట నిక్కము."

అని వ్రాకుచ్చిన సత్యవాక్కులను నేటి భారతీయులు ఆదర్శములుగా భావించుకొందురుగాక!

ఆదర్శజీవిత మాచరింపఁ దలచినప్పుడు ప్రశాంత [illegible] దేశము నభిలషించుట సహజము. ప్రాసాదాదికములందు [illegible]సించుట తగదని మహాత్ముని యాశయము. పర్వతారణ్యా[illegible]లు, నదీ సముద్రతీరములు ప్రశాంతమునకు నిలయములు. అ[illegible]చే నట్టి తావులందు ఆదర్శజీవిత మవలంబించువారలకు మ[illegible]వ యెక్కువ. ఆ ప్రశాంతమగు నాశ్రమపదములు విజ్ఞాన ప్రపములు. అట్టి తావులందలి జ్ఞానమే మానవుని యున్నతికి మూలము.

## మ హా త్ము ని జీ వి త ము

మన మహాత్మునివాసస్థానమెద్ది? తనకని యిల్లు లేదు; పరుండుటకు మంచము లేదు. దాఁచుకొనుటకుఁ బెట్టెలేదు. మన మహాత్ముఁడొక నదీతీరమున వసించుచుండును. తలదాఁచు కొనుటకొక యాశ్రమము. దొంగల కాశగొల్పనిదది. ధనవంతు లకు నచ్చనదది. మహాత్మునకు సొత్తు లేదు; సొమ్ము లేదు. అయి నను మహాత్ముఁడేమియు దిగులొందఁడు. మానవ కళ్యాణమును గోరు మహాత్ములకుఁ దాపత్రయములుండవుగదా! తాపత్రయ మున్న వానికి ఇల్లు వాకిళ్ళు పెట్టెబేడలుండవలెను.

రాజకోటయందుఁ దన కర్పింపఁ బడిన నగ - నత్ర మొదలగు కానుకలు స్వీకరించుచు మహాత్ముఁడు "వీనిని దాచు టకు పెట్టెగూడ నాకు లేదు. ఇవి దొంగల మనస్సు నాకర్షిం చును. వీని నన్నిటిని 'జమ్నాలాల్ బజాజ్' నకుఁ బంపుదున"ని చెప్పెను. ఇతరులకుఁగూడ నచ్చెరువు గలిగించు చందమున మహాత్ముని యాదర్శ జీవితవిధానమందలి గొప్పతన మిట్లెన్ని విధములనో చూపవచ్చును. ఇట్టి పవిత్రము స్వచ్ఛందమునగు నాదర్శ జీవిత మవలంబించి మన మహాత్ముఁడు ప్రపంచమున కాదర్శ పురుషుఁడయ్యెను.

గాంధి మహాత్ముఁడాదర్శ జీవితము నారంభించినది డర్బను నగరము. అచట మహాత్ముఁడొక యాశ్రమ మేర్పఱచి యందుండుచుఁ దనకుఁ గావలసిన యాహారాదిక పదార్థములు, దుస్తులు మొదలగునవి తానే సంపాదించుకొనుచు, నట్లే యితరులనుగూడ నాతీరున నడుచుకోవలసినదిగా నుద్బోధించెడి వాఁడు. చాఁకలి మంగలి పనులు మొదలగు సమస్తమును దానే స్వయముగా నిర్వర్తించుకొనుచుండెడివాఁడు. సబర్మతీ నదీ తీర

మున స్థాపించిన 'సత్యాగ్రహ' ఆశ్రమము నందుండుచుఁ దన యాదర్శ జీవితమునఁ బ్రపంచ పూజ్యుఁడయ్యెను.

ఇంగ్లాండు దేశములో వెస్టెండు (West end) ఈస్టెండు (East end) అను రెండు ప్రాంతములు గలవు. అందొకటి భాగ్యవంతులుండునది. రెండవది పేదలుండునది.

మహాత్ముఁడు బాల్యమున బారిష్టరు చదువుకొనుట కింగ్లాండునకు వెళ్ళియుండినప్పుడు మహాత్ముఁడు భాగ్యవంతుల యిండ్లయందే యుండెను. తన మనుగడను వెస్టెండు నందే కుట్టించుకొనుచుండెడివాఁడు. తదుపరి రెండేండ్లు గడచినపిమ్మట, ప్రపంచమంతయుఁ గొండాడు భారత స్వాతంత్ర్యయోధుఁడై, మహాత్ముఁడై రౌండుటేబుల్ సమావేశమునకై ఇంగ్లాండునకుఁ బోయెను. అప్పుడు మహాత్ముని మనస్సు భాగ్యవంతులుండు (వెస్టెండు) నివాసభూమికిఁ బర్వెత్త లేదు. అవును, మహాత్ములకు భోగభాగ్యములతో నిమిత్తమేమి? పేదల ప్రాంతముననే విడిదచేసెను. ఆహా! లోకమందు మానవుఁడు మహాత్ముఁడగుట యెంతటి మహాభాగ్యమో గదా!

ఆనాఁడు గాంధి–మానవుఁడు; ఈనాఁడు మహాత్ముఁడు. మహాత్మా! నీకివే మా జోహారులు. ఇట్టి పరిణామము లోకమందుఁగలదా?

ఈస్టెండు నందలి 'కింగ్స్లీ హాలులో మహాత్ముని వసతి యేర్పాటుచేఁబడెను. అయ్యది పేదల నివాసము.

నాఁడు వెస్టెండులో గాంధి; నేఁడు ఈస్టెండులో మహాత్ముఁడు. నాఁడుబారిష్టరు గాంధి. నేఁడు మహాత్మాగాంధి. ఆహా! ఎంతటి పరిణామము. ప్రపంచమున కెంతటి యదృష్టము!"

ధనవంతుఁడైన బారిష్టరు మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధి పేదల పెన్నిధియైన మహాత్ముఁడు కాఁగలిగెను. ఆహా! లోకచరిత్రయం దపూర్వము గదా! భారత మాతృగర్భము మహాత్ముని మూలమున ధన్యమయ్యెను. పౌరుపరితనమందును మహాత్ముఁ డాదర్శనీయుఁడుగదా!

## శరీరము - ఆరోగ్యము

ఆదర్శజీవితమున కారోగ్యము ముఖ్యము. ఆరోగ్యమును గుఱించి యీ గ్రంథమందు మొదట వ్రాయఁబడిన 'జీవిత'మను రెండవ భాగమున వివరింపఁబడెను. మహాత్ముఁడు ఆరోగ్యమం దెప్పుడును గనుగలిగియుండును. ఆరోగ్యము లేనివాఁడు లోకమందు దేనికిఁ గొఱగాని వాఁడగును. కాఁగా నాతని జీవితమేవ్యర్థము. కాఁబట్టి యారోగ్యము ముఖ్యావశ్యకము. ఆరోగ్యమున్న యెడల శరీరము బలదార్ఢ్యములుగలది యగును. బలదార్ఢ్యములు శరీరమునకుఁ గలిగినప్పుడు బుద్ధితీక్ష్ణమగును. బుద్ధి తీక్ష్ణమగునప్పుడు మంచి యాలోచనలు పొడకట్టును. మంచియాలోచనలవలన సంఘమునకు-దేశమునకు మేలుచేయ వీలగును. 'మానవశరీరము, ఆత్మనివసించు దేవాలయము' కావున శరీరమున కారోగ్యము ముఖ్యమని తేలుచున్నది. ఆరోగ్యమువలన శరీరసౌష్ఠవము పొందును. కాఁబట్టి 'శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్మ'ని పెద్దలు వాక్రొయుండిరి. మహాత్ముఁడు ఆరోగ్యవిధులం దెప్పుడు నేమఱుపాటు కలిగియుండెడివాఁడు కాఁడు. మహాత్ముఁడు "ఆరోగ్యమునకు మూలసూత్రములు" అను గ్రంథమును రచించుటనుబట్టి మహాత్మునికి ఆరోగ్యమందుఁగల నిశ్చయము తెల్లమగుచున్నది.

## వ్యాయామము

'ఆరోగ్యమే మహాభాగ్యము'ని పెద్దలందురు. అందువలనఁ బ్రతిమానవుని కారోగ్యము ప్రధానము. ఆరోగ్యముగా నుండుట కనేకపద్ధతులు కలవు. అందు మహాత్ముఁ డవలంబించిన కొన్నిటిని తెలిసికొనుట ముఖ్యము. శరీరారోగ్య పద్ధతులలో నొకటియగు శరీర పరిశ్రమనుగూర్చి మొదటగాఁ దెలిసికొందము. శరీరపరిశ్రమ పద్ధతులనేకములు గలవు. వానిలో మహాత్ముఁ డాచరించుచుండిన పరిశ్రమను గుఱించి కొంత తెలిసికొందము.

మహాత్ముఁడు విద్యార్థిదశలో నున్నప్పుడు పాఠశాలా వ్యాయామమునందుఁ బాల్గొనియుండలేదు. ఇందులకు మహాత్ముని బాల్యమందలి సిగ్గరితనమే కారణము. సహవిద్యార్థులతోఁ గలసిమెలసి యుండుట యెఱుఁగని మహాత్ముని కెంతయో సిగ్గుగా నుండెడిది. అందువలన సహవిద్యార్థులతోఁ గలసి యాటపాటలందుఁ బాల్గొనఁజాలఁడయ్యెను. "దేహపరిశ్రమను గలిగించు బంతియాటలు మొదలగు నాటలకు నేను వెళ్ళుచుండెడివాఁడను కాను. ఇందులకుఁ గారణము నాసిగ్గరితనమే" యని తన యాత్మకథయందుఁ జెప్పియుండెను. కాని పిమ్మట దేహపరిశ్రమను గుఱించి మహాత్ముఁడు గైకొనిన శ్రద్ధ యపారము:—

"శరీరపరిశ్రమకును విద్యకును సంబంధము లేదని నాకొక తలంపు నా విద్యార్థిదశలో నుండెడిది. బుద్ధిపరిశ్రమకువలెనే శరీరపరిశ్రమకుఁగూడఁ బాఠశాలలందు స్థానముండుట యావశ్యకమని నే నిప్పుడు తెలిసికొంటిని.

మహాత్ముని మాటల నంతరార్థ మెఱిఁగి శరీరపరిశ్రమ విషయమున నేఁటి విద్యార్థులు శ్రద్ధగైకొందురుగాక!

మహాత్ముఁడు చిన్నతనమున బడియందలి యాటలలోఁ బాల్గొనక పోయినను, శరీరపరిశ్రమ విషయమున నుపేక్షించెడి వాఁడుకాఁడు. మహాత్ముఁడు విద్యార్థిదశయందారంభించిన శరీరపరిశ్రమ తుదివఱకుఁ జేయుచుండెడివాఁడు. ఆ పరిశ్రమ యేదియన:—

"(బడియందు) శరీరపరిశ్రమలోఁ బాల్గొనకపోయినందువలన నా కెట్టిలోపము కలుగలేదు. దానికి బహిరంగ ప్రదేశములలో పరిశుభ్రమగు గాలివీచుచోట చాలసేపు విహరించు నలవాటు ఉండుటయే యగును."

అని మహాత్ముఁడు చెప్పిన యారోగ్యమునకుఁ గారణములను మఱువకుందురుగాక!

శరీరపరిశ్రమ విషయమున మహాత్మునకుఁగల యభిప్రాయము లొకటిరెండు చెప్పుచున్నాను.

మహాత్ముఁడు, గోపాలకృష్ణ గోఖలేతో నుండుట తటస్థించినదినములందుఁ బలువిషయములను గుఱించి యా యిద్దఱు మాట్లాడుకొనుచుండెడివారు. ఒకసారి మహాత్ముఁడు గోపాల కృష్ణగోఖలేతో "అయితే మీరు సికారుకైన పోవరుకదా! ఇఁకఎప్పుడు అస్వస్థులై యుండుట వింతయగునా? దేశకార్యములలో వ్యాయామమున కవకాశము దొరకదా?" అని యనెను.

ఆయన "సికారు పోవుట కవకాశ మెన్నఁడేని కనిపెట్టితివా?" యని మహాత్మునడిగెను. ఆ విషయమును గుఱించి

తన నిశ్చయమును మహాత్ముఁడు తన ఆత్మకథ యందిట్లు వ్రాసెను.

"(గోఖలే) వారి యంపలి యాదరణము వలన నేను సమాధాన మొసఁగ లేను. ఈ ప్రత్యుత్తరము వలన నాకు సంతోష మొదవలేదు. కాని మాఱుపలుక కూరకుంటిని. భోజనమునకు మనకు సమయము దొఱకుట లేదా? ఆ రీతిగనే వ్యాయామమునకు దొఱకునని నాఁటికిని నేఁటికిని నా యాశయము. దీనివలన దేశసేవ తక్కువ కాదు. మఱి యెక్కువ అగునని నా సవినయాభిప్రాయము."

## బ్రహ్మచర్యము

ఈ వాక్యములవలన మహాత్మున కారోగ్యము మీఁదఁ గల శ్రద్ధ స్పష్టమగుచున్నది. గాంధిమహాత్ముని శరీర మారోగ్యము గలదియై యుండుట కొక యుత్తమ పద్ధతి మహాత్ముఁడవలంబించి యుండెను. అది బ్రహ్మచర్యము. మహాత్ముఁడు బ్రహ్మచర్య మహిమను గుఱించి వ్రాసిన వ్రాఁతలు చెప్పిన మాటలు అనంతములు నిరుపమానములును. అవి యన్నియు మహాత్ముని జీవితమం దనుభూతి వలనఁ గలిగిన విషయములు. ఆరోగ్యమునకు బ్రహ్మచర్యము మిక్కిలి గొప్ప సాధనమనుట తథ్యము. ఆరోగ్య విధులు బ్రహ్మచర్యమం దనంతములుగా నున్నవి.

బ్రహ్మచర్యమును గుఱించి మన ప్రాచీనులు పెక్కు గ్రంథములు రచించి యుండిరి. ఆ గ్రంథములందు వ్రాయఁబడిన బ్రహ్మచర్య వ్రతానుష్ఠాన ప్రక్రియలు పలుతెఱఁగులు. ఆ విషయములతోఁ బ్రస్తుతము మన కేమి నిమిత్తము?

బ్రహ్మచర్యము చతురాశ్రమము లలో మొదటిదై యున్నది. గార్హస్థ్యమందు మాత్రము బ్రహ్మచర్యము లేదనియు, వానప్రస్థ సన్యాసములు, అను రెండు ఆశ్రమము లందును బ్రహ్మచర్యము గలదనియుఁ జెప్పఁబడుచున్నది. బ్రహ్మచర్యమునకు స్త్రీ సంగమము పనికిరాదని నిర్ణయింపఁబడెను. కాని గృహస్థాశ్రమ జీవితమందు బ్రహ్మచర్య జీవిత మారంభమగుట నేటి మహావిశేషము!.

బ్రహ్మచర్య మనఁగా బ్రహ్మదర్శన మొందుట యని యర్థము. ఈ బ్రహ్మచర్య వ్రతానుష్ఠాన జీవితమునకు నియమ నిబంధనములు పెక్కులు కలవు. ఆ నియమ నిబంధన లాచరించు పద్ధతులును పెక్కుకలవు. బ్రహ్మచర్యమునకు స్త్రీవాంఛ విసర్జించుట ముఖ్యమని చెప్పఁబడి యుండెను. ఈపద్ధతులు స్త్రీని త్యజించుటయును, ఇంద్రియాశ్వములను దమ యిచ్ఛవచ్చిన చోట్లపోఁ బోనీయకుండుటయును ముఖ్యమని తెలుపుచున్నవి. ఆహార నియమము గలిగి స్త్రీ సంగమేచ్ఛ నిషేధించుట వలన మనస్సు కట్టుబాటునకు వశమై యుండునని తలంపు అందుచే, మన ప్రాచీనులు బ్రహ్మచర్యము మొదటి యాశ్రమముగాఁ జేర్చి యుంచిరి. నేఁడు కొన్ని ప్రాచీన ధర్మము లెట్లు పనికి రానివగుచున్నవో; అట్లే బ్రహ్మచర్య వ్రత ధర్మములును మాఱుచున్నవి. బ్రహ్మను గూర్చి చరించుటను నర్థము స్త్రీవాంఛ లేకయుండుట యను నర్థముగా మాఱినది.

భగవంతునిఁ గనుగొను విధానము బ్రహ్మచర్యార్థమగు నేని అది గృహస్థాశ్రమ మందును జెల్లునని యొప్పుకొనియే తీఱవలెను. ఈశ్వర సాక్షాత్కారమను జ్ఞాన సౌధమునకు సోపానములుగా నుండిన చతురాశ్రమములందు గృహస్థాశ్రమమును

వహ్నాత్రము వదలి, భగవంతుని గనుగొను విధానము కొన్ని యాశ్రమములందును, అందును ముఖ్యముగా మొదటి యాశ్రమమునందే కలదని నిర్ణయించుట, జ్ఞాన సౌధమును గూలద్రోయుట వెఱ్ఱిగాక మఱేమగును? బ్రహ్మచర్యము చతురాశ్రమములందును గలదని నా యంతరార్థము. ఇందులకు "ఇదేమి ? ఇంత మోసమా ?" యని కొందఱు అక్కజంపడుదురు; కొందఱు కలఁత పడుదురు; మఱి కొందఱు భయపడుదురు. "బ్రహ్మచర్య మనఁగా; బ్రహ్మచర్యము, వానప్రస్థము సన్న్యాసమను నాశ్రమత్రయ మందుఁ గలిగియున్నదని చెప్పుట కర్థము గలదు. గార్హస్థ్య మందు బ్రహ్మచర్యము కలదని చెప్పుట కర్థ ముండునా?" యని పాఠకులు కొందఱు వాదింపవచ్చును.

బ్రహ్మచర్యము విద్యాభ్యాసమునకే యేర్పడినదని చెప్పుట యాలోచన లేని మాట. బ్రహ్మచర్యము విద్యాభ్యాసమునకని నిర్ణయించుట యజ్ఞానము. ఈ యజ్ఞానము, ఈ మూఢ విశ్వాసము భారతదేశమును వదలి పెక్కు శతాబ్దము లయ్యెనని గ్రహింపుఁడు.

గార్హస్థ్య మందు విద్యాభ్యాసమున కవకాశమున్నప్పుడు బ్రహ్మచర్యాశ్రమము ఆవశ్యకమ"ని మిత్రులు ప్రశ్నింపవచ్చును. ఆ విద్య ప్రకృతి విరుద్ధమా? బుద్ధి సిద్ధమా? యని నా ప్రశ్న. ఆ విద్య, బుద్ధి సిద్ధమగు నెడల ప్రకృతి సిద్ధమనుటకుఁ గొఱఁత నాపాదించుట యగును. కొఱఁతలు చెప్పుట కవకాశము ప్రకృతి యందుండదుగదా? కాఁగా; కొఱఁత ప్రకృతి యందుండదని గ్రహింపుఁడు.

గార్హస్థ్య మనఁగా నాలుమగల జీవితమని యర్థము. గార్హస్థ్యము ప్రజా వృక్షమునకు మూలము. అందు గృహిణీ

గృహస్థులు ప్రజా వృక్షముయొక్క పెంపునకు దోహద కారులు. అట్టి ప్రజా వృక్ష దోహదకారులగు గృహిణీ గృహస్థు లిద్దఱు గార్హస్థ్య జీవితమును గొంత కాలమనుభవించి, బిడ్డ పాపల పెంపును బొంది, పిమ్మట మోహాముఁవీడి తమ భావి జీవితమును శక్తిమంత మొనర్చు కొనుటకై బ్రహ్మచర్యము పూనుట కర్తవ్య ధర్మమని భావించుట శ్రేయస్కరము.

"ఆలుమగలు గల జీవితయాత్రలో బ్రహ్మచర్య మవ లంబించుట సాధ్యమగునా?" యని కొందఱు ప్రశ్నింపవచ్చును. బ్రహ్మచర్య వ్రత పాలన సాధ్యా సాధ్యతలు ఇంద్రియ నిగ్ర హముఁమీఁద నాధారపడి యుండునని నా మనవి. అంతియకాని యరిషడ్వర్గమును జయింపలేక గృహస్థాశ్రమమందు బ్రహ్మ చర్యము పనికిరాదనుట పసలేనిమాట. మనస్సును ఇంద్రియ వశము గానీయక బుద్ధియొద్ద మెలఁగునట్లు చేయవలెను. అట్లు గుచో బ్రహ్మచర్యము సులభమగుట తథ్యము.

స్త్రీని కామసాధన భోగ్య వస్తువుగా భావించుటయే మన మొదటి తప్పు. ఇంతకంటె బుద్ధిహీనత మఱెద్దికలదు? ఈ యజ్ఞాన బీజమే ప్రపంచమునఁ బ్రాఁకి వేళ్లై, వృక్షమగు చున్నది. ఇట్టి యజ్ఞాన వృక్షమును మొదలంట నఱికివేసినఁ గాని ప్రపంచమునకు మోక్షములేదు.

మహాత్ముఁడు యువకత్వమునఁ గాముకత్వమునకుఁ దగిన యుక్త వయస్సునందు, బ్రహ్మచర్య మవలంబింపలేదు. గార్హస్థ్య జీవిత మనుభవించుచు భార్యతో జీవయాత్ర చేయుచుఁ గాలక్రమమున, బ్రహ్మచర్యమవలంబించెనని యెఱుఁగ నగును. ఈ విషయము మహాత్ముని జీవితమందు రాఁజుచున్న యగ్ని కణమువలెఁ బ్రకాశించుచున్నది. మహాత్ముఁడు తన

మొదటి కుమారుఁడు తన పోలిక లేకపోవుటకును, తన కడ
గొట్టు బిడ్డఁడు తన పోలిక కలిగియుండుటకును సందర్భముగాఁ
జెప్పిన కారణము గమనింపదగినది. మహాత్ముఁడే విషయమై
చెప్పిన కారణమేద్ది? తాను కాముకత్వమున నుండిన దినము
లలో మొదటి కుమారుఁడు కలిగెననియు, నా కాముకత్వము
తెలియుచున్న దినములలోఁ జివరి కుమారుఁడు కలిగెననియు
మహాత్ముఁడు చెప్పియుండెను. మహాత్ముఁడు చెప్పిన యీ
కారణము నా యుద్దేశ్యమున కుపపత్తిగా నున్నది.

మహాత్ముఁడు 1903 న సంవత్సరమున బ్రహ్మచర్య వ్రత
మవలంబించుటకు నిశ్చయించుకొనెను. మహాత్ముఁడు తన
భార్యతోఁ గామమోహిత మనస్సుతో గార్హస్థ్య సుఖము
లనుభవించుచు వచ్చుచుండెను. గార్హస్థ్యము ప్రేమరాజ్యము
వంటిది. గార్హస్థ్య సుఖము లనుభవించినను బ్రహ్మచర్య
దీక్షగొని తత్పాలనమునకై భార్యను బలిగా భావింపవలెను.
ఆ తలంపునకు మాటిమాటికి కంతరాయములు కలుగుచుండఁగా
మహాత్ముఁడు బ్రహ్మచర్య వ్రతధారణ మొనరించెను. కామే
చ్ఛను త్యజించి బ్రహ్మచర్య మాచరించుచున్నను, ప్రాంత వాస
నలు మానవుని పట్టి పల్లార్చుచుండును. వాని నన్నిటిని ఆత్మ
సంయమన బుద్ధిచేఁ జోకొట్టుకొనుచుండవలెను. ఈశ్వ
రానుగ్రహముచేఁ గ్రమ క్రమముగా బ్రహ్మచర్య వ్రతపాలనము
సుగమమగును.

మహాత్ముఁడు బ్రహ్మచర్యమునకు ఆహార నియమా
దులు ముఖ్యమని తొలుదొల్తగా నిశ్చయించుకొనెను. అను
భవముమీఁద నాహారాదిక నియమములకంటె దైవచింతన
ముఖ్యమని మహాత్ముఁడు గ్రహించెను. ఈ విషయమును

గుఱించి పెక్కు పర్యాయములు మహాత్ముఁడు తన నిశ్చితాభిప్రాయములను వెల్లడించియుండెను. అందుఁ గొన్నిటి నిఁట నుదాహరించుచున్నాఁడను.

"మిగుల చర్చించి కడు నాలోచించి 1906 వ సంవత్సరమున నేను బ్రహ్మచర్య వ్రతధారణ మొనరించితిని. వ్రతము పూనువఱకు ఈ విషయమున నా భార్య యుద్దేశ్యము కైకొనలేదు. వ్రతసమయమున ననుమతి గైకొంటిని. ఇందులకామె యెట్టి ఆతంకమును పెట్టలేదు.

ఈ వ్రతము తీసికొనుటకు నాకు కడు కష్టమయిపోయెను. నాకు శక్తి కొలఁది, వికారముల సడప నెటులు సాధ్యమగును? భార్యయెడఁగూడ వికారముల కంటక యుండుట అర్థములేని మాటగా కానిపించెను. అయినను అది నా కవశ్య కర్తవ్యమని తెలియుచుంటిని. నా లక్ష్యము శుద్ధము. కరుణించి ఈశ్వరుఁడు నాకు శక్తిని, సాయమును ప్రసాదించుగాక యని ఇందు దుమికితిని."

"అయితే ఇట్టి బ్రహ్మచర్యము కేవలము ప్రయత్న సాధ్యము కాదని దేశమునకు తిరిగివచ్చిన తరువాత తెలిసికొంటిని. అంతవఱకు ఫలాహారమువలన వికారములు సమూలము నశించిపోవుననియు తావన్మాత్రమున మఱి యేమియు చేయఁ బనిలేదను మోహమునఁ బడియుంటిననియు చెప్పనగును

అయితే ఇందులకు నా చేసిన ప్రయత్నములను దెలుపుటకు విలంబము వలయును. ఈ నడుమ ఈ విషయము తెలుపుటావశ్యకము. ఈశ్వర సాక్షాత్కారముకొఱకు నేను చెప్పియున్న బ్రహ్మచర్యమును చరింపఁగోరువారు తమ ప్రయత్న

ముతోపాటు ఈశ్వరునిపై శ్రద్ధ వహింపగలవారగుదురేని యీ విషయమున నిరాశులగుట కిసుమంతయు కారణము లేదు.

"విషయావినివర్తన్తే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య పరందృష్ట్వా నివర్తతే."
గీత - ౨ అధ్యా - ౫౯ శ్లో.

(ఆహారము మానివేసినవానికి విషయములు శాంతించును, కాని రసము శాంతింపదు. ఈశ్వర దర్శనమువలన రసమును శమించును. — అని పై శ్లోకభావము.

కావున ఆత్మదర్శనము కావలసినవానికి రామనామము, రామ కృపయు అంతిమ సాధనములు. నేను భారత దేశమునకు వచ్చిన తరువాతనే యీ విషయ మనుభవము చేసికొంటిని."

(ఆత్మకథనుండి)

బ్రహ్మచర్య మహిమను గుఱించి మిత్రుఁ డొకఁడు మహాత్మునిక కొక లేఖ వ్రాసెను. అందులకు మహాత్ముఁడు బ్రహ్మచర్యమును గుఱించి యిచ్చిన యభిప్రాయములు నమూల్యములు. వాని నిట నుదాహరించుచున్నాను.

మిత్రుని లేఖ

" ... నేను మిక్కిలి దుఃఖపడుచున్నాను. రాత్రియనక పగలనక, కార్యాలయమందేమి, వీధిని నడుచునప్పుడేమి వరుండునప్పుడును, పనిచేయునప్పుడును తుదకు భగవంతుని ధ్యానించు సమయమందుఁగూడ కామాగ్నిచేఁ దప్తుఁడ నగుచుంటిని.

కాఁగా విషయాసక్తమగు మనస్సును బంధించుటెట్లు? పర కాంతను దల్లివలె భావించుట యెట్లు పొసఁగును? వలపుఁ జూపునుండి నేత్రేంద్రియమును మఱలించుటెట్లు? చెడు తలంపులు దూరము చేయుట యెట్లు? తాము (చాలకాలము క్రిందట) బ్రహ్మచర్యమునుగూర్చి వ్రాసిన గ్రంథము నా యెదుటనే యున్నది. అయినను నా కేమియుఁ బ్రయోజనము లేకున్నది. . . . "

మహాత్ముని సమాధానము

"ఈ స్థితిహృదయమును గలఁచివేయుచున్నది. పెక్కురు దీనివలన బాధపడుచున్నారు. చెడుతలంపులు దరిఁజేయనీయరాదు. వానిని దరిఁజేరకుండ నిగ్రహించు నాత్మశక్తి కలవారి విషయములోఁ గలఁతజెందు నవకాశములేదు. చూపులకు వలపులు గలిగించు దృశ్యములు కనిపించునప్పుడు కన్నులు మూసికొనవలెను. అట్లే, శ్రవణేంద్రియములను చెడ్డప్రసంగములనుండి వినకుండఁ దప్పింపవలెను. క్రిందిచూచి నడుచుట మంచిది. ఇట్లు నడుచుకొనుటవలనఁ జెడుగులు కొంతవఱకుఁ దొలఁగును. చెడు ప్రసంగములు, కామోద్దీపక సంగీతము మొదలగువానిని దరిజేరనీయరాదు. రుచికిలోఁబడక నాలుకను కట్టుకొనవలయును. నాలుకను కట్టివేయలేనివాఁడు కామపాశమును ద్రెంపఁజాలడనుట నిర్వివాదము. నాలుకను కట్టుకొనుట చాల కష్టమని నాకుఁ దెలియును. రుచులజోలికి పోకుండుమేని తక్కినచెడుగులు వానియంతట నవియే తొలఁగిచనఁగలవు. పులుపు, కారము మొదలుగాఁగల యాహారము విసర్జించుటవలన రుచులను బోకడించుటయగును. మనము శరీరపోషణకు భుజించుటయేగాని, నాలుక రుచికిమాత్రము కాదని యాహార నియమమేర్పఱచు

కొనవలెను. నాలికె రుచికై తీసికొనుటలేదు. ఆరోగ్యమునకు గాలిని పీల్చుచున్నాము. దాహము తీర్చుటకుఁగాను నీటిని త్రాగుచున్నాము. అట్లే ఆఁకలికి మాత్రమే మనము భుజింపవలెను. కాని మనము పసితనమునుండియు ఎందుకు భిన్నమార్గము నవలంబించెను. మా తల్లిదండ్రులు పలువిధములగు రుచులకు మమ్ము అలవాటుచేసిరి. ఆహారము శరీరపోషణకేనని వారు గ్రహింపలేకున్నారు. రుచిగానున్నదే మంచిదని వారి తలంపు. రుచిచెడ్డదని వారికిఁ దెలియదు. ఇట్లు మనము చెడుటకు కలవాటుపడితిమి. కాని మనము ఆ పద్ధతి మంచిది కాదని యెఱుఁగవలయును.

"నైష్ఠికాభ్యాస మొక బుద్ధియందే ఉత్పన్నమగును. అందువలన నిన్ను నీవు స్వాధీనమందుంచుకొనుట అవసరము. దానిని సువిశదము చేసికొనవచ్చును. బుద్ధి ఎల్లప్పుడును ఆ విషయమందు నిమగ్నమై యుండవలెను. ఉన్నతమైనట్టియు, ఉదాత్తమైనట్టియు ఆలోచనయందే బుద్ధిని పోనీయవలెను. కనుక నీవు చేయవలసిన పనియందు నీబుద్ధిని కేంద్రీకరింపుము. ఏమియు తబ్బిబ్బులుపడ నావశ్యకతలేదు. నీ పనియందు నీవెట్లు సమర్థుఁడవు కాఁగలవో ఆలోచించుకొని ఆ ఆలోచనలను క్రియారూపములోనికి తెమ్ము. నీ ఆలోచనలను వృథాచేయవద్దు. భగవన్నామమును జపించినయెడల బుద్ధిమాంద్యముపోయి నీకు బలము కలుగఁగలదు. భగవంతుఁడు రూపరహితుఁడు. అట్టివాని నూహించుకొనుట నీకు సాధ్యము కాకున్న నీవు వాని నెట్టిరూపములో ఆరాధింపఁదలఁతువో అట్టి రూపములో ఆరాధింపుము. నీవట్లు జపించునపుడు ఇతర ఆలోచనలు పొడమఁగూడదు. ఇది వాంఛనీయమైనస్థితి. ఇట్టిస్థితి

కలుగక ఏవేవియో ఆలోచనలు కలిగినను అధైర్యపడవలసిన యావశ్యకత లేదు. నామజపమును జాగ్రత్తగా పఠింపవలెను. చివరికి ఉత్తీర్ణుఁడగు నమ్మకముతోనే అట్లు జపింపవలెను." (మహాత్ముఁడు వ్రాసిన "ఆరోగ్యమునకు మూలసూత్రములు" అను గ్రంథమునుండి)

మహాత్ముఁడు బ్రహ్మచర్యమును గుఱించి చెప్పిన యింక నొకటి రెండు విషయముల నిట నుదాహరించుచున్నాను.

"బ్రహ్మచర్యమును సరిగా పాలించుట యనఁగా బ్రహ్మ దర్శన మొనరించుట. ఈ జ్ఞానము నాకు శాస్త్రములవలనఁ గలుగలేదు. నాకీ యర్థము మెల్ల మెల్లగా అనుభవసిద్ధమగుచు వచ్చెను. శాస్త్రవచనములు పిదపఁ జదివితిని. బ్రహ్మచర్యము వలన శరీరరక్షణము, బుద్ధిరక్షణము, ఆత్మరక్షణము సమస్తము కలుగునను సంగతి బ్రహ్మచర్యము తాల్చినపిదప దినదినమధి కాధికముగా అనుభవము కాఁదొడఁగెను. ఏలయనఁగా బ్రహ్మ చర్యమనిన ఘోరమగు తపశ్చర్య యనిపించుటకుబదులు నా కిపుడు రసమయమనిపించుచున్నది; దీనిబలముననే పనులు జరుగుచున్నవి. దీనిసౌందర్యము దైనందిన మెక్కువగా కాని పించుచున్నది." (తెలుఁగు — ఆత్మకథనుండి)

"బ్రహ్మచర్యమునకు భ్రమలేని జీవితమని యర్థము. బ్రహ్మము సర్వత్ర వ్యాపించియున్నది. దానిని కనుగొనుటకుఁ జేయు ప్రయత్నము బ్రహ్మచర్యమగును. ఇంద్రియ నిగ్రహము లేనిదే యీ బ్రహ్మసాక్షాత్కారస్థితి కలుగఁజాలదు. ఎల్ల ప్పుడు సర్వత్ర ఇంద్రియములను తమ యిచ్ఛవచ్చినట్లు పోనీ యక సంయమము చేసికొనుట బ్రహ్మచర్యమగును."

"బ్రహ్మచర్యమును బూనఁదలఁచిన యెల్లరు (స్త్రీ పురుషులు) ఎల్ల కోరికలను త్యజించవలెను. అట్టివారు భగవంతునికి దగ్గఱ వారగుదురు. లేక భగవంతుఁడే కాఁగలరు."

"బ్రహ్మచర్యము లేని జీవితము ప్రయోజనకారి కాఁజాలదనియు స్పష్టమగుచున్నది. గార్హస్థ్యాశ్రమ జీవిత మనుభవించుచుండుటవలన నింద్రియ సంయమమున నేమో తెలియరు. మానవునకు శక్తికలదు. అందుచే మానవుఁడు అను పేరుగలిగి యున్నాఁడు. అతఁడు ఇంద్రియ నిగ్రహశక్తి నలవఱచుకొనని యెడల మానవుఁడు కాఁగాఁడు. మన శాస్త్రములందు బ్రహ్మచర్యము గుఱించి చెప్పఁబడిన విషయములు గంభీరములు, నాచరణయోగ్యములని నా నిశ్చయము. ఆ బ్రహ్మచర్యవ్రతపాలన లాభములు అనంతములని నా యనుభవమునందు గనుగొంటిని."

"...నేను చెప్పిన అర్థముగల సంపూర్ణ బ్రహ్మచర్యమును పొందితినని నేను చెప్పజాలను. కాని నేనట్టి ప్రయత్నములో చాలమట్టుకు ఉత్తీర్ణుఁడనైతినని నా యభిప్రాయము. దైవచిత్తానుసారము ఈ జన్మలోనే బ్రహ్మచర్యమును నేను సంపూర్ణముగా పొందవచ్చును. అట్లు పొందినను పొందకున్నను నేనా కృషిని మాత్రము విడువను. నాకీ విషయములో అధైర్యము ఎంతమాత్రమును లేదు. (ఆరోగ్యమునకు మూలసూత్రములు—అను గ్రంథమునుండి)

బ్రహ్మచర్య వ్రతపాలమునకు నాలుకను కట్టుకొనవలయునని నాతలంపు. నాలుకను జయించుచో బ్రహ్మచర్యము మిగుల తేలికయయి పోవునని నేను కేవల మనుభవమువలన కనిపట్టితిని. (తెలుఁగు—ఆత్మకథనుండి)

"బ్రహ్మచర్యమనఁగా మనోవాక్కాయములచే సర్వేంద్రియములను నిగ్రహించుట. ఇందులకు పూర్వోక్తముల నన్నిటిని విసర్జింపవలయునని దైనందినము నాకు విశదమగుచున్నది. నేఁటికిని అటులే విశదమగుచున్నది. త్యాగక్షేత్రమునకెల్ల లేనటులే బ్రహ్మచర్యమహిమకును ఎల్ల లేదు. ఇట్టి బ్రహ్మచర్యమల్ప ప్రయత్న సాధ్యము కాదు. పలుపురి కది యెల్లప్పుడును ప్రాప్యముగనే యుండును. దానఁ జేసి ప్రయత్నశీలుఁడగు బ్రహ్మచారి యెల్లప్పుడును తన లోటులను కనిపట్టుకొనుచుండవలయును. తన హృదయకుహరమున గూఢముగా దాఁగియున్న వికారములను పోఁగొట్టుకొనుచుండవలయును. ఎంతవఱకు వృత్తులను నిరోధింపలేఁడో అంతవఱకు అది సంపూర్ణ బ్రహ్మచర్యము కాదు. వృత్తులెన్ని విధములో లేని యగుఁగాక. అవన్నియు వికారమే. వీనిని వశపఱచుకొనవలయు ననినచో మనస్సును వశపఱచికొనవలయును. ఇఁక మనోనిగ్రహము వాయునిగ్రహమువలె సుదుష్కరము. ఇటులయినను మనస్సునందీశ్వరుఁ డున్నచో నదియు సులభము కాఁగలదు. దారిలో కడుఁ జిక్కులు కలుగును. కావున నదియు సాధ్యమని యెవ్వరు ననుకొనకుందురుగాక! అది పరమార్థము. అట్టి పరమార్థమునకు పరమ ప్రయత్న మావశ్యమగుటలో ఆశ్చర్యమేమి?"

(తెలుగు - ఆత్మకథనుండి)

ఈ బ్రహ్మచర్యజీవితము నవలంబించుటవలన శరీరారోగ్యమును నినుమడించును. అయితే ఆరోగ్యము లేని జీవితము వ్యర్థమని ముందే చదివియున్నారము. బ్రహ్మచర్యవ్రతానుష్ఠానమువలన నారోగ్యముకూడఁ బెంపొందు ననుట యథార్థము.

ఇంతకు బ్రహ్మచర్యమునకు శరీరారోగ్యమునకు అవినాభావ సంబంధము కలదని తేలుచున్నది. కావున, ఆరోగ్య విషయమునఁగూడ నతి జాగ్రత్త యుండుట యెంతేని యావశ్యకము.

## నాలుకను గట్టికొనుట

ఆఁకలికి మించి తినుటయు కేవల ముపవాసములచే శరీరమును శుష్కింపఁజేయుటయుఁ దగదు. వలసినంత యాహారమునే భుజించుట శ్రేయము. మహాత్ముఁడు రసనేంద్రియమునకు వశముగాక, శరీరపోషణకు వలసిన యాహారమును మాత్రమే భుజించెడివాఁడు. రసనేంద్రియము నకు లోనగునేని మానవుఁడు తిండికిమాత్రము పెద్దయగును. తనర్హాలమున రోగములవాతఁబడును. ఆరోగ్యము గలిగి సుఖముగా జీవింపఁ దలఁచువాఁడు నాలుకను లోఁబఱచుకొనవలెను.

"తనమీఁద స్వారిచేయు నింద్రియములను వశపఱచు కొనవలయు ననినయెడల మొదటగా రసనేంద్రియమును కట్టుకొనవలెను. కాని యది యంతంత మాత్రమున జరుగు పని కాదు......టీ-కాఫీ-కోకో మొదలగు పానీయములకు, దినుబండారములకుఁ బరుగెత్తు మనస్సును గట్టివేయునమేని - శరీరపోషణ కావశ్యకమగు నాహారమును దీసికొనఁ గలుగుదుమేని పులుపు - కారము - ఇంగువ - ఆవాలు - జీలకఱ్ఱ - మెంతులు మొదలగువానితోఁ జేసిన కూరలమీఁదికి - ఊరగాయలమీఁదికి మన బుద్ధిని బోనీయక గట్టివేయఁ గలుగుదుమేని మనము మనమీఁద స్వారిచేయు నింద్రియములను గట్టివేయఁగలము." అనియు,

"బ్రహ్మచర్యవ్రతమునకు మొదటిసూత్రము నాలుకను గట్టికొనుట యొక్కటియే. దానిని చేయఁగల్గుచో బ్రహ్మచర్య వ్రతము పాలించుట యేమంత కష్టముకాదు." అని మహాత్ముఁడు రసనేంద్రియ విజయముతోనే జీవితము విజయవంతము కాఁగలదని పలుపర్యాయములు చెప్పియుండెను.

## ఆ హా ర ము

శాకాహారముచేయు కుటుంబమందు మహాత్ముఁడు జన్మించెను. అందుచే మహాత్ముఁడు బాల్యమునుండియు శాకాహారమే యభ్యాసము కలవాఁడై యుండెను. మహాత్ముఁడు బాల్యమునుండియు దురభ్యాసములను దరిఁజేరనీయని వాఁడగుట చేతనే మహాత్ముఁడై ప్రపంచమున కాదర్శపురుషుఁడై భారత దేశ స్వాతంత్ర్యమును సంపాదించిపెట్టి యజరామర కీర్తి గల వాఁడాయెను. మహాత్ముఁడు విదేశమున కేగినను మాతృదేవి కిచ్చిన బాసచొప్పున శాకాహారమే గాని యన్యము భుజించి యెఱుఁగఁడు. ఈ విషయము నింతకుముందుఁ జరివియున్నా రముగదా! చదువునకై యింగ్లాండు దేశమునకుఁ బయనమగుచు మాతృదేవి కిచ్చిన మూఁడు ప్రమాణములలో శాకాహారమే తినుదుననుట యొకటి. ఆ దేశమందెట్టి యిక్కట్టులు సంభ వించినను, వాని నన్నిటి నధిగమించి తల్లికిచ్చిన మాట చొప్పున శాకాహారమే భుజించుటవలన మహాత్ముఁ డాడి బొంకనివాఁడాయెను. మహాత్ముఁ డింగ్లాండునందుండినప్పుడు శాకాహార విషయికములగు పుస్తకములను బెక్కింటిని జదివెను. ఆ గ్రంథములను బఠించినకొలఁది మహాత్ముని మనస్సులో మఱింతగా శాకాహారముమీఁద గట్టి నమ్మక మేర్పడి మాంసాహారము శరీరమునకు - బుద్ధికి మంచిదికాదని

నిశ్చయించుకొనెను. అందుచే మహాత్ముఁడు పితరుల యట్లు నాగరకతా వ్యామోహముచేనైనను మాంసమును ముట్టఁజాలఁ డయ్యెను. పుట్టిన కుటుంబమును బట్టియు, తల్లి కొసఁగిన వాగ్దానముల బట్టియు మహాత్ముఁడు మాంసాహారము కావింప రాదని నిశ్చయించుకొనెను. పిమ్మట బరిశోధనాపూర్వక జ్ఞాన మభివృద్ధియగుకొలఁది మాంసాహార విషయమే తాను బట్టించు కొనలేదు. ఆత్మజ్ఞానమువలనఁ గలిగిన విధి నిషేధములే హృదయమున నాటుకొనుచుండెనా! ఆ యాతని పరిజ్ఞానమే మానవుని నుత్తేజపఱచును. దక్షిణాఫ్రికాయందుఁ జదివిన శాకాహార విషయకములగు గ్రంథములును, చేసిన పరిశోధనలను మాంసాహారముమీఁద వైముఖ్యమును శాకాహారోత్కృష్టత మనస్సునఁ బాదుకొల్పెను. తన ఆలుబిడ్డలు రోగపీడితులైనప్పుడు మాంసాహార మీయవలసినదిగా వైద్యులు (Docters) మహాత్ముని బలవంతముపెట్టిరి. అందులకు మహాత్ముఁడు మాంసాహారావశ్యకత యేమి కలదని యా వైద్యులతో వాదులాడెను. తల్లి బిడ్డలు ప్రాణము పోయినను సమ్మతింతుము. కాని మాంసాహారము మాత్రము ముట్టనొల్లమని తమ నిశ్చయముల నెఱింగించిరి. ఇట్టి సంఘటనలు మహాత్ముని జీవితమం దెన్నియో సంభవించుచుండెడివి. వాని నన్నిటిని సమర్థతతో సంబాళించుకొనుచుండెడివాఁడు. అవును; మహాత్ములు తమ యాదర్శములకై యెట్టి యిక్కటుల నైనను లెక్కచేయరుగదా!

మహాత్ముఁడు బ్రహ్మచర్యవ్రత మారంభించినప్పుడే ఆహార విషయమునఁగూడ నియమము గలవాఁడాయెను. వ్రత మారంభించిన మొదటి దినములలో మహాత్ముఁడు కాయ

ధాన్యములు, పప్పు దినుసులు మొదలగు వానిని దినుచుండెడి వాఁడు. పాలుఁగ్రోలెడివాఁడు కాఁడు. అనుభవముమీఁద మేఁక పాలను ద్రాగ నారంభించెను. మేఁకపాలు, పండ్లు, గోధుమ పిండి, యుడకని కూరలను దినుచుండెడివాఁడు. బ్రహ్మచర్యమున కనువగు నాహారమును మాత్రమే మహాత్ముఁడు భుజించు చుండెడివాఁడు.

మహాత్ముఁడు నిర్ణీత సమయమునకు మాత్రము భుజించు చుండెడివాఁడు. పులుపు – కారము – ఉప్పు మొదలగునవి నిషేధము. మహాత్ముఁడు వ్రాసిన "ఆరోగ్యమునకు మూల సూత్రములు" అను గ్రంథమును జదివినచో శరీరపోషణకావశ్యక మగు నాహార మెద్దియో తెలియును.

## నిరశనవ్రతము

మహాత్ముఁడు నియమితాహారము తినుచు వారమున కొక నాఁడును, కొన్ని సమయములందు రెండుదినములునుగూడ నిరశన వ్రతమును బూనెడివాఁడు. ఏకాదశి మొదలగు దినములందును గూడ నిరశన వ్రతముండుట కలదు. ఈ వ్రతము ఉపవాసము కాదా యని కొందఱు తలఁప వచ్చును. నిరశనవ్రతమునకు ఉపవాసమునకు భేదము కలదు. నిరశనవ్రతము శరీరమును బోషించును; ఉపవాసము శుష్కింపఁ జేయును. నిరశనవ్రతము మిత్రునివలె శరీరమును సంరక్షించును; జీర్ణకోశమును శుభ్రపఱచును. నిరశనవ్రత లాభములను తత్సంబంధ గ్రంథము లను జదివి తెలిసికొందురుగాక !

మహాత్ముఁడు సాధారణముగాఁజేయు నిరశనవ్రతము ఆరోగ్యమునకు మాత్రమని తెలియుచున్నది. మఱి కొన్ని వేళ

లందు నిరశన వ్రతముఁ మానవ శక్త్య సాధనముఁ జేయుచుండెడి వాఁడు. ఈ వ్రతములు, ఆహార నియములు, మహాత్ముని శరీరమును మిక్కిలి యారోగ్యమును గలిగించి బుద్ధి శక్తులను మిక్కిలి పెంపొందించు చుండెను.

ఇఁక మహాత్ముఁడు ధరించు దుస్తులను గుఱించి కొంత తెలిసికొనుట యావశ్యకముగదా !

## వస్త్రములు

మహాత్ముఁడు సాధారణమగు దుస్తులను ధరించు చుండును. చేతితో వడికి చేతితో నేసిన దుస్తులు. మిల్లు గుడ్డను వాడరాదని మహాత్ముని నిశ్చయము. యంత్రములవలనఁ గలుగు నష్టముఁ లనంతములని మహాత్ముని యుద్దేశము.

## యంత్ర పిశాచము

నేఁటి కాలము యంత్రయుగమని యెల్లరెఱిఁగిన విషయము. మానవుఁడు యంత్రమునకు దాసుఁడయినది మొదలు దేశము దారిద్ర్యమునకు స్థానమైనది. ఈ యంత్రముల మూలమున భారతదేశ ప్రజలు పెక్కురు వృత్తులు లేక యాఁకలి బాధకు గుఱియగు చున్నారు. ఈ యంత్రములు స్థాపించినవారు మాత్రము కోటీశ్వరులై కోటికిఁ బడఁగలెత్తి తులుకుచున్నారు. అందుచే నీ యిరుతెగల మధ్య గొప్ప ద్వేషభావము ప్రబలు చున్నది. ఈ యంత్ర సహాయమున విదేశ వ్యాపారము సాగించి వ్యాపారులు లాభములు గడించి మీసములు త్రిప్పుకొను చున్నారు. ఇందువలన మాతృదేశము దారిద్ర్యమునకు నిలయమై మఱియొక దేశమునకు బానిసయగుటను వ్యాపారస్థులు

తెలిసికొన్నదారి. ఆ కారణమున దేశ విదేశముల మధ్యఁ గల హములు కన్నెఱ్ఱఁ జేయుచున్నవి. ఆ కలహములకుఁ గావలసిన కత్తికటారులు, తుపాకి ఫిరంగులు మొదలగు మారణాయుధములు ఉపయోగమున కావశ్యకము లగుచున్నవి. తన్మూలమున యుద్ధములు ప్రజ్వరిల్లి ప్రపంచము సంక్షుభితమగుచున్నది. ఈ యరిష్టముల కన్నిటికి మూలము యంత్రములు. తన ప్రాణములమీఁది తీపి యితరులకుండ దను దురూహాపొడమి తన స్వార్థమే పరమార్థమని పరమావధిగా భావించి దేశము నట్టి హీనస్థితికి వ్యాపారస్థుఁడు తెచ్చిపెట్టుట యాసురకృత్యమని తలఁపవలయును. లోకమాదెల్ల వారిని దనవలెఁ జూచుకొనవలసిన మానవుని, యంత్ర మితర మానవుల హానికి కారకునిగాఁ జేయుచున్నది. మానవుని మంచితనమంతయు నేఁడు యంత్రమునకు బానిస తనముగాఁ బరిణమింపఁజేయు చున్నది. యంత్రము మానవుని నాదర్శ జీవితమునుంచి వేఱుచేయుచున్నది. అందుచే మానవుఁడు తన సహజౌదార్య గుణ సంపత్తిని విడనాడు చున్నాఁడు. యంత్రము ఆదర్శ జీవిత లక్ష్యమున కవరోధము గల్పించి, జాతిని నాశముచేయు భాగ్య సంపదలతో నొక తెగవారికి నిరుపేద జీవితముతో మఱియొక తెగవారికిని భేదము కల్పించి ద్వేషాసూయలను బ్రజ్వలింపఁ జేయుచున్నది. ఇట్టి చెడుగులకు మూల మగు యంత్రములు మన దేశమున కెంతమాత్రము తగదని మహాత్ముఁడు పలు పర్యాయములు భారతీయులకు బోధించి యుండెను.

"యంత్రము వలనఁ గలుగు చెడుగులు చెప్ప శక్యము గానివి. యంత్రము మానవుని బానిసనుగాఁ జేయుచున్నది."

("యంత్రము) జీవిత పరమార్థ తత్త్వమునుండి మానవుని వేఱుపఱచు చున్నది. ఇందుచే మానవుని జీవితము ఆత్మ గౌరవమునకు దూరమగు చున్నది; ఆడంబర వేషమునకే బలి కొల్పుచున్నది. నిజతత్త్వమాలోచించుటకుఁ గూడఁ దనకుఁ దీతిక యోపికలు గానరాకున్నవి. పత్రికలు - ఆటలు మొదలగు వానికై ప్రొద్దుపుచ్చునేగాని యాత్మ విచారమునకు సమయము లేనివాఁడగుచున్నాఁడు."

"నేఁటి నాగరకతా విజ్ఞానము, చట్టములతో ధనమును గూడఁబెట్టు యంత్రములను, మారణోపయోగ సాధనములను గనిపెట్టుటను సహాయపడుచున్నదే కాని యాత్మ విచారమునకు లవలేశము పనికిరాకున్నది."

అని మహాత్ముఁడు యంత్రము వలనఁ గలుగు ననర్థకములను వెల్లడించి యుండెను.

ఏకముగా యంత్రములను మూసివేయుఁడని మహాత్ముఁడు మనకు బోధించుటలేదు. నెమ్మది నెమ్మదిగా వడుకు నూలు వస్త్రములను ధరించుట మంచిదని మనకు బోధించు చుండెను. భారతదేశమందుఁగల యంత్రములు భారతదేశమున నిర్మింపఁబడినవి కావు. విదేశములనుండి యీ యంత్రములను దెప్పించుకొనుటవలన భారతదేశ సౌభాగ్యము నదీ ప్రవాహము వలె విదేశములకుఁ బోవుచున్నది. సంపద పోవుటయేగాదు; విదేశ వస్త్రములతో మన మానములను గాపాడుకొను దుర్దశ మన దేశీయులకుఁ బట్టుచున్నది. ఆలోచించిన నింతకంటె సిగ్గు చేటు లోకమున నేమి కలదు? అందుచేఁ బాదుపుగా భారతీయులు వడుకు నూలు వస్త్రములు (ఖద్దరు వస్త్రములు) ధరింపవలెనని మహాత్ముఁడు బోధించుచుండెను.

## చేతి రాట్నము

మహాత్ముఁడు సాగించిన మహోద్యమములలో చేతిరాట్నపు ఉద్యమమే కడు గొప్పదై యొప్పుచున్నది. ఈ యిరువదవ శతాబ్దియందు - యంత్రములు భారతదేశమం దంతటను గూడు కట్టుకొనిన యీ దినములలో - రాట్నమును భారతదేశమునం దింటింటను వెలయఁజేయుట గాంధిమహాత్ముని మహిమ !. ఈ యుద్యమము ప్రతి భారతీయుని నైవసము చేసికొనుట యద్భుతావహము ! భారతీయులెల్లరు రాట్న మహిమను గుఱించి "కదురు కవ్వములాడిన యింటఁ గఱవే యుండద"ను పాటను ఆబాల గోపాలము నాప్యాయముగాఁ బాడుకొనఁ జొచ్చిరి. మహాత్ముఁ డేది మఱచినను మఱచుఁగాక ! రాట్నమును మాత్రము మఱువఁడు. కూర్చున్నప్పుడు - నిలుచున్నప్పుడు - నడచునప్పుడు - పరుండునప్పుడు - ఎల్లవేళల మహాత్ముని యుల్లము రాట్నము మీఁదనే పరుగిడుచుండును. చెఱయందున్నప్పుడును రాట్నమును మహాత్ముఁడు వదులుకొనే యుండెడివాఁడు.

సత్యమునకు హరిశ్చంద్రుఁడు, జ్ఞానమునకు బుద్ధుఁడు, ప్రేమకు ఏసుక్రీస్తునని లోకము చెప్పుకొనుచున్నట్లే; రాట్నమునకు మహాత్ముఁడని ప్రపంచము కొండాడుచున్నది. మహాత్ముఁడు తనను "చరఖా పిచ్చివాఁడన"ని చెప్పుకొనుచుండెడివాఁడు. ప్రభుత్వమువారిచేఁ బ్రప్రథమమున శిక్షింపఁబడి శ్రీకృష్ణ జన్మస్థాన మలంకరింపఁబోవుచున్న సమయమున మిత్రులు పలువురు మహాత్ముని సమీపించి "స్వామీ ! భారతీయులకుఁ దమ సందేశము సెలవిండ"ని ప్రార్థింపఁగా "ఖద్దరు" అని చేసైగ చేసి వెడలెను. మహాత్ముఁడు చేతి

రాట్నమునకై భారతదేశమందలి పల్లి పత్తనములను బర్యటించి చేసిన ప్రచారము అవధిలేనిది. కాంగ్రెసు ముఖ్యాశయములలో రాట్న పరిశ్రమ యొకటి. ఇరువది లక్షల రాట్నములు భారతదేశమున నిత్యము శ్రవణపేయముగాఁ దిరుగాడు చుండవలెనని మహాత్ముని దృఢసంకల్పము. కాంగ్రెసు నాయకులు కొందఱు రాట్న పరిశ్రమ విషయమున నశ్రద్ధ చూపుచున్నప్పుడును, కాంగ్రెసు నియమావళినుండి రాట్నమును దీసివేయఁ దలఁచి నప్పుడును "నూలు దీయుటను దొలఁగింపరాద"ని పట్టుబట్టెను. ఆ నియమము కాంగ్రెసునందు స్థిరముగా నుండుటకై 'నూలు నిధి' నేర్పఱచెను. ఆ తఱువాత 'నూలు నిధి' నిలిపివేయఁ బడుట వలన నేఁడు కాంగ్రెసునందే ప్రత్యేకముగా "చర్ఖా సంఘము"ను నెలకొల్పెను.

ఆసురమును బెంచు యంత్రవిధానమును రూపు మాపుటకు 'రాట్నము' భాసురము దైవసంబంధమునైనదని మహాత్ముని యభిప్రాయమై యుండనోపును! రాట్నమును గుఱించి చేసిన ప్రచారములు, ఒనర్చిన ప్రసంగములు – వ్రాసిన వ్రాఁతల కొక యవధి యున్నదా? అందుఁ గొన్ని:—

"కుటీర పరిశ్రమలు లేనియెడల భారత కర్షకుఁడు నాశనమొందఁ గలఁడు. ఆతఁడు కర్షకవృత్తి మూలముననే తలయెత్తి బ్రదుకుట దుర్లభము. అందుచే నాతని కింకొక యుపవృత్తి యుండుట యావశ్యకము. అది సులభము – శ్రేష్ఠము – నైతికము – అగు నూలు వడుకు వృత్తి యగును."

"బాలురకుఁ దమ బడులందు 'నూలు వడుకుట' ప్రత్యేక విషయము నిర్బంధ పాఠ్యభాగముగా నుండవలెను."

"ఇంటింటి పెంపును రాట్నము కోరుచుండును."

"అసంఖ్యాకులగు భారతీయులు వృత్తులు లేక యుపవాసములు చేయుచున్నారు. వారు వారి పిల్లలతోఁబాటు నూలు వడుకు చేతి రాట్నముండినయెడల వారు ఆఁకలిని, దారిద్ర్యమును బాపుకోఁగలరు. రాట్నమొక్కటియే వారి పేదతనమును బాపుట కోపునది యనుట నిశ్చయము."

"నా కధికార మున్నయెడల విద్యాలయములందును, కార్యాలయములందును పను లన్నిటిని మాన్పించి 'నూలు వడుకుట' కేర్పాటుచేసి, విద్యార్థులకు 'నూలు వడుకు' విద్యాబోధకులను మాత్రమే యుపాధ్యాయులుగా నియమించి, కార్యాలయ కర్తలకు (ఉద్యోగస్థులకు) చేతిరాట్నములు చేయు పనిని పురమాయించి, ప్రభుత్వ యంత్రాంగము వారిని ఇంటింటికిఁ దీసికొనిపోయి 'నూలు వడుకుట'ను బోధింపుఁడని కోరియుండు వాఁడను."

"వ్యవసాయము, నూలు వడుకుట మానవునకుఁ గుడి యెడమ చేతుల వంటివి." — "(నూలు వడుకు) రాట్నము లేనియెడల మన యెడమచేయి లేనియట్లనుకొనుఁడు. అప్పుడు మన పాట్లేమగును? రాట్నముండినయెడలఁ గుటుంబ పోషణకు లోపము కలుగఁజాలదు."

"భారతదేశమున దాదాపు మూఁడుకోట్ల ప్రజలు ఒకపూట యన్నముననే యలమటించుచున్నారు. అట్టి యెడఁ బ్రతి గృహమందును రాట్నము దిఱుగుచున్నయెడల వేలకొలఁది యువకులు చేతి వృత్తుల నవలంబించినయెడల వస్తు లుండవలసిన బాధ భారతదేశమునకుఁ గలుగదు."

"అది (రాట్నము) మన సోదరీమణులకు ఆదాయము నాహారము మనశ్శక్తిని బోషించుచు సోమరితనమును బాఱఁద్రోలి సహనమును బెంపొందించును."

"మన భారతదేశమందుఁ గష్టించి పనిచేయు వారనఁగా వ్యవసాయ వృత్తి చేయువారు - ఇరువది నాలుగు కోట్ల మందియు, వ్యవసాయ కూలీలు - దాదాపు ఆరు మాసములు పనిలేక యుందురు. వీరికి నేదియో యొక యుపవృత్తి యేర్పాటు చేసినచో వారి యీ దాయము గొంతవఱకుఁ బెరిఁగి సుఖజీవనమునకు మార్గము కాఁగలదు. కాఁగా; ఆ యుపవృత్తి నూలు వడుకుట యని నా యుద్దేశ్యము."

"రాట్నము, విశ్వాసమును - వినయమును - మనశ్శక్తిని గలిగించి దేశసేవ కుపయోగించు ముఖ్య సాధనము. ఈ రాట్నపు శక్తిని గుర్తెఱిఁగి లోకమున కుపయోగించుటే మేని, భగవంతునితో నిమిత్తములేక సుఖముగా జీవింపఁగలమని చెప్పగలను."

"నేను ఒంటరిగా నున్నప్పుడు నాకుఁ బ్రొద్దుపోకకు మిత్రుఁడుగాను, మనశ్శాంతినిచ్చు నా ప్రహితుఁడుగాను రాట్నముండును. మిత్రులకు నట్లే రాట్న ముపయోగించునని నా నమ్మిక."

"కత్తి కటారులు దుస్సాధనములు. భారతదేశము రాట్నమును జేతఁబట్టి నూలు వడుకుచున్న యెడల సైనిక వ్యయమును తగ్గించుకొనుటయే గాక; ప్రపంచ స్నేహ సౌహార్దములు పెంపొందించుకొనవచ్చునని నేను దృఢముగాఁ జెప్పఁగలను."

"పేదలయం దెచ్చట దయగలిగి యుండునో; అచ్చట భగవంతుఁ డుండును. రాట్నము నుండి తీయు ప్రతి దారపు పోగునందును భగవంతునిఁ జూచుచుందును."

"కదురు లేని స్వరాజ్యము ప్రాణములేని శరీరమువంటిది."

విశ్వకవి — రాట్నము

విశ్వకవి యని లోకవిఖ్యాతి గాంచిన రవీంద్రనాథ ఠాగూరు కవిపాదు లోక పర్యాయము రాట్నమును జప్పరించి చెప్పిన మాటలకు మహాత్ముఁ డిచ్చిన సమాధానము శరీరమును బులకరింపఁ జేయును. ఆ సమాధాన విషయ మిట సంగ్రహించి వ్రాయుచున్నాను.

"విశ్వకవి సృష్టించిన కవితా సౌందర్యమునకు లోకము ముగ్ధమగు చుండును. నేను ప్రజాహిత జీవన క్షేమమునకు — రాట్నమునకు సేవకుఁడను. విశ్వకవి తమ యపూర్వ కవితా రీతు లతో సమ్మృతము లొలికించి దేవకన్యలను సృజించి నాట్య మాడింపఁ గలఁడు. నేను నా ప్రేమ పాత్రమగు సీత యనెడి రాట్నమును వెదకుటకై వేసారు చుందును, ఉబలాటపడుదును. సీత యనెడు రాట్నమును పది తలల రాక్షసుఁడ నెడి జపాను — మాంచెస్టరు — ప్యారిసు మొదలగు దేశములనుండి — రక్షింపఁ బ్రయత్నించు చుందును. విశ్వకవి స్రష్ట. అందుచే సృష్టించు చుందురు; లయింపఁజేయుచుందురు; మరల సృష్టించుచుందురు. నేను వెదకి వేసారుచుట్టె బంటును. దొరికిన దానిని బదిలముచేసి కొనుట నా విధి. విశ్వకవి యెప్పటి కప్పుడు విశ్వమోహన కవితా సౌందర్యమును సృష్టించి ముగ్ధమోహనముగా లోక

మును ఆనందమున నోలలాడించుచుందురు. నేను ప్రాతవడిన సంస్కారములకై ప్రాఁకులాడుచుందును. అపూర్వాశ్చర్యానంద సందోహముతో మంత్రవాది లోకమును సమ్మోహింపఁ గలఁడు. ప్రాచీన వాసనలను బొందుటకై నేను మిక్కిలి శ్రమింప వలయును."

## రాట్నమహిమ

మహాత్ముని చరఖా ప్రేమను విప్పిచెప్పఁగల శక్తి యాదిశేషునకుఁ గూడ లేదేమో! కాఁగా నిఁక మన మెంతవారము? మహాత్ముఁడు రాట్నపు ధ్వని భగవంతుని ప్రబోధమనియుఁ, దన బ్రహ్మచర్య వ్రతమునకు రాట్న మెంతయో సహకారియై యున్నదనియు; ఖొరాను, బైబిలు, గీత మొదలగు పవిత్ర గ్రంథములందు రాట్నపు మహిమ చెప్పఁబడి యున్నదనియు, చేతి యందలి రాట్నపు ధ్వని యమృత ప్రవాహ గీతివోలెఁ దన నెంతయో సమ్మోహపఱచుచున్నదనియు, రాట్నమును జూచుట భగవద్దర్శనమేయనియు రాట్నపు మహిమను మహాత్ముఁడు వేవిధములఁ బొగడుచుండును.

చరఖాను గుఱించి యొకరు వ్రాసిన వ్యాసము (29-6-1921) "యంగు ఇండియా" పత్రిక యందుఁ బ్రకటింపఁ బడెను. మహాత్ముఁడా విషయమును జదువుకొని పరమానంద భరితుఁడయ్యెను. ఆ వ్యాస భావమిట్లు:—

"విదేశీయులు భారతదేశము నిట్లు కొల్లఁగొట్టుకొని పోవుచుండఁగా భారత నారీమణులేల యుపేక్షించుచున్నారు? భారత నారీమణులు చేయవలసినపనిని విదేశీయులుఁ గాఁజేసిరి.

చేతిరాట్నము భారతదేశమునకు జీవనోపాధినిగల్పించును; అన్నమిడును."

...నేను కవినై యుందునేని రాట్నమహిమను గుఱించి మహాకావ్యమే రచించియుందును. ఆ రాట్నముయొక్క మహత్తరసౌభాగ్యమునను గల్పతరువుకంటె మిన్నయని పండితలోకము 'వహ్వా'యని మెచ్చుకొనుచందమున నొక యపూర్వకవితాసృష్టిని చేసియుందును. పాపులను పవిత్రులను జేయునది రాట్నమనియు, సత్కాలక్షేపమునకు భగవన్నామ స్మరణము వంటిదనియు ఆఁకలిదప్పులను తప్పించునది చేరాట్నము, భగవదనుగ్రహమున వరప్రసాదముగా భూలోకమందావిర్భవించెననియు, నా సోదరీమణులకుఁ గావ్యపఠనమునఁ గర్తవ్యజ్ఞానముసు గలిగించియుందును. కాని నా కట్టిభాగ్యము పట్టలేదు. నా యంతరాత్మ ప్రబోధించుచున్నను కవిత్వము తెలియనప్పుడు నేనేమి చేయఁగలను? రాట్నము తనపాట పాడుచున్నప్పుడు చెవియొగ్గి శ్రమమఱచి వినుచుందును. అట్లే యితరులును దమచేతి రాట్నమును ద్రిప్పుకొనుచు నా రాట్నపుపాటను మనసారఁగ్రోలి తన్మయులగుచుఁ జరితార్థులగుచుందురుగాక! యని నా ప్రార్థన."

కదురుపాటలు మనోహరముగా నుండును.

రాట్నమును వడుకుచున్నప్పుడు మనస్సు నిశ్చలముగా నుండును. బుద్ధి రాట్నమందే లగ్నమైయుండును. ఆ యేకాగ్రత మానవుని నుత్తేజపఱచును. (పనిలేని వేళలందు) కలవారి యాఁడుపడుచుల మనస్సులు పలు విషయములమీఁదఁ బరుగులెత్తుచుండును. అందుచే వారి మనస్థైర్యము కొఱఁతయగు

చుండును. రాట్నము వడుకుచుండిన యెడల వారిమనస్సు నిశ్చలతను, ప్రశాంతిని కలిగియుండును.

వడుకునూలుతో నేయఁబడిన వస్త్రములు ధరించిన యెడల ధనము కూడఁబెట్టిన వారమగుదుము. భారతీయులందఱు వడుకునూలువస్త్రములను (ఖద్దరు వస్త్రములను) ధరించునెడల మనదేశసంపద మన దేశమందే యుండును. ఈ కారణమువలన రాట్నము దేశసంపదను బెంపొందించుట యగును. ఇట్టి దేశసంపదను బెంపొందించునట్టి రాట్నమును మనము మేనాఁడు మఱచితిమో; యానాఁడే నిర్వ్యాపారముగ నుండుటచే దేశసంపద పట్టుపోయెను; సుఖములేని జీవితమయ్యెను. మాతృభూమి తిండిలేక యల్లాడుచున్నది.

మాతృభూమి నుద్ధరించుటకై మహాత్ముఁడు పరిపరి విధములఁ బరిశ్రమించుచుండెను. దేశమాతను బాధపెట్టుచున్న యంత్రవృత్తినుండి తప్పించి చేతిరాట్నముతో వడికి చేతితో నేయఁబడిన ముదుకగుడ్డలు (ఖద్దరు) ధరించి యాదర్శ జీవితము గలవారమగుదు మేని దేశమునారాధించునట్లగుననిభారతీయులకు మహాత్ముఁడు హితవొసంగుచుండెను. అట్టి కీర్తిప్రతిష్ఠలు పెంచునని తలఁచి భారతీయులు అహమహమికతో మహాత్ముని హితోక్తులను శిరసావహించి వారియనుయాయులగుట ముదావహము.

మాతృదేశ సౌభాగ్యముగోరు ప్రతివ్యక్తియు ఖద్దరు వస్త్రములను ధరింపవలెను. అందుకెల్లరు చేతిరాట్నముతో నూలువడుకునట్టి నియమము కలిగియుండవలెను. అప్పుడు యంత్రరాక్షసము నశించును. యంత్రోత్పత్తి పెఱిగినకొలఁది

నితో నధికముగా భారతదేశము నష్టకష్టముల పాలగును. మానవుని సహజప్రేమాది గుణములు నశించును. జీవితలక్ష్యమే నెఱవేఱదు. ఇన్ని చెడుగులకు మూలమగు యంత్రబలమును బాఱద్రోలుట ప్రతిభారతీయుని విధియని భావింపవలెను. కావున విదేశవ్యామోహములకు లోంగక, భారత జాతీయతను సంరక్షించు సాధనము "చేరాట్నము" మాత్రమేయని భారతీయులు భావించి మాతృదేశారాధనా తత్పరులై భారత దేశౌన్నత్యమును గాపాడుదురుగాక!!!

యంత్రశక్తికి అధీనముగాకుండ భారతజాతీయ గౌరవమును గాపాడుటకై మహాత్ముఁడు చేరాట్నమును మనకుఁ బ్రసాదించుట మనయదృష్టము! ప్రాచీనకాలమందు మతప్రచారములు సహితము జరుగునప్పుడు హత్యలుజరుగు హింసాపద్ధతి యవలంబింపఁబడుచుండెడిది. మహాత్ముఁడు అహింసాపద్ధతిని భారతీయులకుఁ గర్తవ్యజ్ఞాన ముపదేశించుచుండెను. అట్టి పరస్పర విద్వేషపూరిత జీవితమునకు వెలుఁగుబాటగా 'చేరాట్నము' అహింసా పద్ధతిని మహాత్మునిచే మనకుఁ బ్రసాదింపఁబడెను. అట్టియెడ రాట్నముతో మనజీవితమును శక్తిమంతము నాదర్శవంతముగాఁ జేసికొనుచు ప్రాచీన భారతదేశ గౌరవ ప్రతిష్ఠలనుగాపాడుటకు గాంధిమహాత్ముఁడు మన భారతదేశమున నవతరించుట మనయదృష్టము. జాతీయ జీవితమునకు రాట్నమొకటి యుపలక్షకమనుట మఱువరాదు.

విజ్ఞాన మభివృద్ధి కాక పూర్వము ప్రపంచమందుఁ గుటీర పరిశ్రమలేముఖ్యాధారములుగా నుండెడివి. పదునేడవశతాబ్దము నుండి విజ్ఞాన మభివృద్ధి కాఁజొచ్చెను. ఈ విజ్ఞానాభివృద్ధి కాలమును యంత్రయుగమని చెప్పనగును. ఇట్టి విజ్ఞాన మభివృద్ధి

అట్టితఱి, భారతదేశము తన యభివృద్ధి కనువగు సిద్ధాంత మును జేపట్టి వర్ధిల్లుఁగాక! సిద్ధాంత మందలి మంచి చెట్టల పరిశీలన వలన యుక్తా యుక్తా పరిజ్ఞానమలవడును. తత్పరిజ్ఞాన ముచే సత్యము గోచరించును. సత్యము వలన సంతత శుభములు సమకూరును.

ఈ యంత్రముల వలన లభించు ఫలములు ప్రస్తుత కాలమున కాశను గొల్పునవిగా నుండినను, ఎల్లకాల మీా యంత్ర సాధనము లోకక్షేమమును సాధింపఁగలదని యెట్లు చెప్పఁగలము? రాఁబోవు కాలమందీ సామ్రాజ్య తత్త్వమే పీఁటవేసికొని యెల్లకాలము మనఁగలదని మనమెట్లు నిరోపింపఁ గలము? కాలము మాఱి, మానవాశయము ఫలించిన వసుధైక ప్రభుత్వమే యేర్పడు నెడల నీ యంత్రములు, మారణ సాధన ములు మొదలగు సాధన సంపత్తి యంతయు మట్టియాయము కాదా! నేఁడీ యంత్రములు ధనిక వర్గమునకుఁ గొండంత ధన రాసులను బేర్చుచు, చేతివృత్తులవారి నీసడించుచుఁ గూలి వాండ్లను జేయుచున్నది. అంతమాత్రమునఁ జేతివృత్తుల నణఁచ వలసి పనిలేదు. కారణమేమన? ప్రాఁతకాలమందలివని యీాస డింపక, వర్గరహితముగా శ్రామికులెల్లరు సంఘముగా నేర్పడి (Classless Society) యంత్రములను బరిమితము గావించి చేతివృత్తుల కాయంత్రములు ప్రతిబంధకములు గాకుండఁ జూచుచుండినచోఁ గుటీర పరిశ్రమలు అభివృద్ధి నందుననుటలో నెట్టి యాక్షేపమునుండఁ జాలదుసుమా!

గాంధితత్త్వము మనకు రాట్నమును బ్రసాదించెను. ఆ రాట్నమును జాతీయభావముతో మనము స్వీకరించితిమి. ఇట్లు రాట్నమును స్వీకరించుటలో నౌచిత్యమేమో యాలో

చింపుఁడు. రాట్నమును స్వీకరించుటవలనఁ బ్రాఁత చేతి పరిశ్రమ యను భావముమాత్రము కాదు. అయ్యది యనాదినుండి వచ్చుచుండిన భారతదేశ ప్రాచీన పరిశ్రమలకు నాందియని రాట్న పరిశ్రమను జేపట్టితిమి. రాట్న పరిశ్రమశాలలను స్థాపించి; చేతి పరిశ్రమలను, కుటీర పరిశ్రమలను నభివృద్ధి పఱచుచు, లాభము గడింపవలెనని గాంధిమహాత్ముఁడు రాట్నమును జేపట్టలేదు. ఎల్లరు తమ తమ జీవితములకు ప్రాచీన కుటీర పరిశ్రమల నుద్ధరించుటకు రాట్నము చిహ్నముగా గాంధి తత్త్వము ప్రబోధించుచున్నది. కాఁగా; గాంధి తత్త్వము ప్రాచీన పరిశ్రమలను నుద్ధరింపవలెనని ప్రబోధించుచున్నదనుట యెల్లరెఱింగిన సత్యము. ఇట మార్క్సు తత్త్వమునకు గాంధి తత్త్వమునకు నేవేని యేకీభావముకలదా? శ్రద్ధగా నాలోచించినచో నీ రెండు తత్త్వములు దేశాభివృద్ధికి మూలసూత్రములు కాఁగలవని మనకు ద్యోతకము కాఁగలదు.

'జనాభా నానాఁటికిఁ బెరుఁగుచున్నప్పుడు ప్రజాజీవికకనుకూల పరిశ్రమలు ముఖ్యముగదా!. అట్టి యెడఁ బ్రజా జీవన విధానమును సార్థకముగాఁ జక్క దిద్దుటకు సాధనము యంత్రమా? రాట్నమా? అను ప్రశ్న ముదయించును. అందులకుఁ బ్రత్యుత్తరమేమి?

విజ్ఞాన మభివృద్ధి యగుచున్న యీ కాలమందు యంత్రములు తగవనుట తగనిమాట. యంత్ర పరిశ్రమలకు, రాట్న పరిశ్రమ తక్కువ కాదు. లోకము పాదుపరితన మలవఱచుకొను నెడల రాట్న పరిశ్రమ ముఖ్యావశ్యకము కాఁగలదని

తెల్లము కాఁగలదు. రాట్న పరిశ్రమవలన జాతీయభావము పెంపొందు ననుట స్పష్టము.

మార్క్సు తత్త్వానుసారము యంత్రము లేర్పడినను, అయ్యవి పరిమితమగు నెడలఁ జేతి పరిశ్రమలుకూడ నభివృద్ధి నందఁగలవు. గాంధితత్త్వ దృష్టిని రాట్న పరిశ్రమాదికము లభివృద్ధిగాంచి యెల్లరి సుఖజీవనమునకు దోహదము కాఁగల వనుట నిశ్చయము. ఇట్టి పరిశ్రమల రెండిటిని బోషించుకొన నగును. కావున నిట్టి విషయములందు వాదములు తలయెత్తుట యసంగతము కాఁగలదు. దేశ శ్రేయస్సునకు, ఏమార్గ మనుస రించిన నేమి? అందుచే మార్క్సిజము గాంధిజములలో నేది గొప్పది యని భేద బుద్ధిని వాదించుటవలనఁ బ్రయోజనమేమి?

## స్త్రీ సాహచర్యము

గార్హస్థ్యజీవిత మనఁగా భార్యతోఁ గలసి కాఁపురము చేయుట యని యర్థము. గార్హస్థ్యజీవితము సార్థకమగుటకుఁ గృహిణి ముఖ్యము. అందుచే గృహస్థునకు గృహిణి యవస రము; జీవితలక్ష్యము చరితార్థమై యలరారుటకు భర్తతోఁ బాటుభార్యకూడ నావశ్యకము గదా మన మనుకొనినది! అందుచే భర్తకు భార్య అర్ధాంగి యగుచున్నది. గృహస్థాశ్రమముకాక; తక్కిన యాశ్రమములు జ్ఞానయోగమున కాశ్రయములు. గార్హస్థ్యాశ్రమము భక్తి – జ్ఞాన – కర్మయోగములను యోగ త్రయమున కుపాశ్రయము. కావున గార్హస్థ్యాశ్రమము తక్కిన యాశ్రమములకంటె గొప్పది. అట్టి గార్హస్థ్యాశ్రమమునందు ఆలుమగలిద్దఱు ఏకలక్ష్య సాధకులయినప్పుడు మోక్ష సామ్రా జ్యము కరతలామలకమగును. ఇట్టి గృహస్థాశ్రమ జీవితమును

పఱచును. 'సోఽహమ్, తత్త్వమసి' యను నీ వాక్యములందు మానవుని యుత్కృష్టత యిమిడియున్నది. ఈ రెండింటి వాక్యార్థములఁ దెలిసి, పరతత్త్వ జీవిత మలవఱచుకొనుటవలన భక్తి-జ్ఞాన - కర్మయోగముల ననుష్ఠించినవాఁడగును.

ఆదర్శహృదయమనుమాట కొందఱికిఁ గ్రొత్తగాఁ గానిపింపవచ్చును. 'నేను' అను నాత్మజ్ఞానముగల హృదయమే యాదర్శహృదయము. ఆ యాదర్శహృదయమే జీవితమును మేలు బంతిచేయును. 'నేను' అను నాత్మజ్ఞానము కలిగినప్పుడే మానవుఁడు లోకపూజ్యుఁ డగును. 'తనను దా నెఱుఁగుటయే మహాత్ముల లక్షణముగదా! తాను - నేను - అను పదములకు ఇతర మానవులని మహాత్ముని తలంపు. ఇందువలనఁ దన క్షేమ మనఁగా నితరుల క్షేమమని యర్థము స్ఫురించుచున్నది. తన క్షేమమును గోరు మహాత్ము లనఁగా సాటిమానవుల నుద్ధరించు వారని యర్థము. సాటి మానవులకుఁ బ్రపంచ జీవనమందు సంభవించు కష్టములనుబాపి సుఖములను గలిగించుట మహాత్ముల విధి. ఇట్టిమహాత్ముల మూలమునఁ బ్రజలు-దేశము-ప్రపంచము సుఖ సంతోషములతో సంవర్ధమానములై ప్రవర్తిల్లుచుండును. అందుచే మహాత్ముల బోధనామృతమును గ్రోలుచుఁ దననుగుణ్యముగా జీవితయాత్ర సాగించు మానవుఁడు గొప్పవాఁడు కాఁగ లఁడు. కావున, వీని కన్నిటికి మూలమంత్రమగు 'అహ మస్మి' యనునాత్మజ్ఞానమును పొందవలయును. ఆ యాత్మజ్ఞానము వెల్లి విరిసినకొలఁది చంద్రోదయమున కుత్తుంగ తరంగిత మహా సముద్రమువలె మానవుని శక్తి గంభీరమై యుత్తేజితమై వెల్లి విరియును. అట్టిచో నహంకారము నశించును. దురహంకారము నశించినఁగాని, మానవుఁ డాత్మజ్ఞానము సంపాదింప లేఁడు. నా

నాఁటి నాత్మజ్ఞానము సంపూర్ణమానమగుకొలఁది మానవుఁడు విశ్వేశాంశకై తహతహలాడుచుండును. ఇట్టి యాధ్యాత్మిక జీవితము - ఇతర సంస్కారములుగల జీవితము ఆదర్శజీవితమగును. ఈ యాదర్శజీవితముగలవాఁడు దయాసముద్రుఁ డగును. దయాసముద్రుఁడే, నాటిమానవుల నుద్ధరించుట కాదర్శజీవితము గలవాఁ డగును.

## కృతజ్ఞత

గాంధిమహాత్ముని పంచఁబొత్తిన యీ యాత్మజ్ఞాన ఫలమే దేశసేవాదీక్షకు హత్తుకొనును. అందువలన నేఁడు మనము ధన్యులమయితిమి. మహాత్ముని దేశసేవయందుఁ గలిగిన యనుభవములను కొన్నిటిని జదివిఁజూతము.

దక్షిణాఫ్రికా యందలి భారతీయుల కడగండ్లను భారతదేశమునఁ బ్రచారముచేసి భారతీయుల సహాయసంపత్తితో నా దక్షిణాఫ్రికా భారతీయులకు సహాయపడుటకై తన యాలుబిడ్డలతో మహాత్ముఁడు 1896 వ సంవత్సరము నవంబరు మాసములో దక్షిణాఫ్రికాకుఁ బయనమయి పోవునప్పుడు, తాను ప్రయాణముచేయు నోడ దక్షిణాఫ్రికాయందలి 'డర్బను' నగరమందలి రేవునందు లంగరువేయఁగానే, పసిబట్టి యా నగరమందలి తెల్లవారు రేవునకువచ్చి, మహాత్మునిజూచి 'అట్లునడువుము; ఇట్లు చూడుము'ని చెప్పి యచటికి గాంధిమహాత్ముని స్వాగతమునకై వచ్చిన భారతీయులను భయపెట్టి, మహాత్ముని బాధించుటకుఁ బూనుకొనిరి. దక్షిణాఫ్రికా భారతీయులు పలు బాధలు పడుచున్నారనియు, నా భారతీయులు మృగముల కంటె హీనులుగాఁ జూడఁబడుచున్నారనియు మహాత్ముఁడు

భారతదేశమున ప్రచారముచేసిన విషయమును మఱుంగుపఱచి, నేటాలు తెల్లవారికి దుర్భాషలాడినట్లు లేనివిదానిని కల్పించి, గోరంతలు గొండంతలుచేసి గాలిని ప్రోగుచేసి మూటగట్టి పంపిన 'రాయిటరు వార్తాసంస్థ'వార్తలు, దక్షిణాఫ్రికా తెల్లవారికిఁ గోపకారణమయ్యెను. మహాత్ముఁడు నాయనమంచి సాటి సోదరుల బాధలు తలఁపునకు రాఁగా నావేదనగలిగి కాపలావారితోఁ గలిసి దిగుచుండఁగా మూర్ఖులైన యా తెల్లవారు గొడ్డులవలె మన మహాత్ముని 'రై' పట్టుకొనిలాగి ఇటునటుగుంజి – తన్ని క్రిందఁ బడఁగొట్టిరి. మన మహాత్ముఁడు మనభాగ్యదేవత యా దెబ్బలకుఁ దాళలేక క్రిందఁబడి మూర్ఛపోయెను. చూచితిరా! ఎంతఘోరము!!! అప్పుడచట నా దృశ్యమును జూచుచుండినఁ (పోలీసు సూపరింటెంటు) అలెగ్జాండరుభార్య హృదయము ద్రవించి పరుగునవచ్చి, మహాత్ముని జేరి శీతలోపచారము చేయుచు మహాత్ముని పోయిన ప్రాణము తిరిగివచ్చువరకు నచటనే యుండెను. ఆమెచేసిన యీ మహోపచారమును దక్షిణాఫ్రికాయందు సత్యాగ్రహోద్యమమును ప్రారంభించి, విజయముగాంచి, మాతృభూమికి జయజయధ్వానములతో మఱలి వచ్చునపుడు, అచటి సముద్ర మువ్పొంగినట్లు సమావేశమయిన ప్రజాసమూహమునకు వీడ్కోలు పలుకుచు మహాత్ముఁడు అహింసా సత్యశాంత ప్రభావముల నుద్బోధించుచు శ్రీమతి అలెగ్జాండరు సతీమణిని మీరెన్నఁడు మఱువకుఁడు; మఱువకుఁడని పలువిధముల నామెను ప్రశంసించియుండెను. లోకమున నితరుల సహాయము పొందియు నెఱుఁగనట్లు దురహంకారమునఁ గొందఱుందురు. దురహంకార మతులల

త్వము నైనను లెక్క-సేసెడిది గాదనియు, ధీరవనిత యనియు నామె గొప్పతనమును బ్రశంసించుచుఁ గన్నీరు కార్చెను. ఈ ప్రశంసా వాక్యములు మహాత్ముని సహృదయమునకుఁ దార్కా-ణము. కుళ్ళులేనియుల్లము పరులను బ్రేమించుట సహజముగదా!

మా దేశమునకు విచ్ఛేయుఁడని విదేశములనుండి మహాత్మునకు మాటిమాటికి నాహ్వానములు వచ్చుచుండెడివి. ఆ యాహ్వానములకు వచ్చుట కవకాశము లేదని మహాత్ముఁడు క్షమింప వేఁడికోలును బంపుకొనుచుండెడివాఁడు. విదేశముల నుండి యాహ్వానములు వచ్చుటయన సామాన్యమా? అట్టి యాహ్వానముల కఱ్ఱులుజాచుచు, విదేశములఁ జుట్టిరావచ్చునని యెందఱు గ్రుక్కి-ళ్ళు మ్రింగుట లేదు? విదేశములందుఁ దిఱిగి వచ్చుటయే ఘనగౌరవమని భావించుదినములవి. పూజ్యభావముతో మహాత్మున కాహ్వానములు వచ్చినను, వెళ్ళుటకు సమ్మతింపలేదు. తాను చెప్పుచున్నను భారతదేశము సత్యమును గ్రహింపఁ జాలకున్నదనియు, మున్ముందు ఆ సత్యమును గ్రహింపఁగలదను నుబలాటము తనకుఁగలదనియు, నిట్టిస్థితిలో పెఱదేశములను జుట్టివచ్చుటకిది యదనుగాదనియు, మహాత్ముఁడు సమాధానము లిచ్చుచుండెడివాఁడు. మహాత్ముని వినయసంపత్తి కింతకంటె నుదాహరణమేమి కావలయును?

ప్రపంచమునఁ గొందఱు మహాత్ముని గురువనియు, అవతారపురుషుఁడనియుఁ దలఁచుచున్నారు. తాము స్వయముగా మహాత్ముని యెదుటఁ జెప్పఁజాలక పోయినను మిత్రులు పలువురు మహాత్ముని సాక్షాత్తు భగవదవతారమని తలఁచుచున్నారు.

ఈ భూమియందు లోకోద్ధరణకై జన్మించితిమని చెప్పుచు, లోకమును మోసపుచ్చి కపట వేషములతో గొప్పవారయినవారెక్కుడు గలరు. సమాధి యనుటయో, కాషాయవస్త్రములు తాల్చుటయో, యోగి యనియో, మహర్షి యనియో చెప్పుకొను కపట వేషాంధులను దాంభికులుగా భావించు శక్తి మన దేశమునకు మొదటినుండియు గలదు. మొదటినుండియు మనకొక శక్తికలదు. మంత్రమాయల యొకచేతనో, వేదాంత జ్ఞానముచేతనో మంత్రశాస్త్ర జ్ఞానముచేతనో సన్యాసులెందరో భగవదవతారములుగా బరిగణించు శక్తి నేటికిని మనదేశమున గలదు. ఈ యజ్ఞానము, ఈ మూర్ఖత లోకమందెప్పుడు నశించునో గదా! లోకము సత్యమును గ్రహించుట యెప్పుడో. భగవంతుడీ యజ్ఞానమును లోకమునుండి పాఱద్రోలుగాక! ఇట్టి యజ్ఞానము చేతనే మహాపురుషుల జీవితములుకూడ నేడు మఱుగున బడిపోవుచున్నవి.

మహాత్ముడు తన పలుకుబడితో దనను గురువనియో, సిద్ధుడనియో, అవతారపురుషుడనియో భావింపవలసినదిగా లోకమునకు జెప్పుకొనియుండలేదు. అజ్ఞానముచేతనో ప్రేమ చేతనో యితరులు దేవుడని చెప్పిన మాటలను మన గాంధి మహాత్ముడు పెడచెవిని బెట్టెడివాడు. మహాత్ముడు తన పలుకుబడి నెప్పుడు వట్లుపయోగించుకొని యెఱుగడు. మన మహాత్ముని కది నైజము కాదుగదా! ఆ మహానీయున కట్టి తలంపును లేదు. దేశము మూఢ విశ్వాసముకు బుట్టిల్లు. మహాత్ముడు 'నేను అవతారపురుషుడన'ని చెప్పుకొన్నను మూఢ ప్రజలు నమ్మియుండెడివారు. 'గతానుగతికోలోకః' గదా! మహాత్మున కట్టిబుద్ధియే యుండినయెడల మహాత్ముడు

నత్యా మెట్లు చెప్పఁగలను? గురువనియో, యవతారమనియో ప్రేమచేతఁ దనను భావించుట విని మిక్కిలి బాధపడుచు మహాత్ముఁడు పలు పర్యాయము లీ విషయమై తగదని ప్రస్తావించుటయుఁ గలదు.

కొన్ని:—

“నేనే జ్ఞాన గురువును దెలిసికొనుటకుఁ బ్రయత్నించు చుండఁగా; నే నెట్లు లోకమునకు గురువు నగుదును?

“ప్రజాసేవకుఁ డెట్టి ఘనతను బొందరాదు. అతఁడు తన సర్వస్వము ను సేవకు వినియోగింపవలెను.“ సేవను, వేదాంత జ్ఞానమును గాఁ జెప్పుచు నితరులను మోసగించి వారి పూజ లందుకొను నుబలాటము గలవాఁ డగునేని యాతఁడు భగవంతునికి ద్రోహము చేసినవాఁ డగును.”

(‘ప్రశ్నించినవారి కిచ్చిన సమాధానము.)

“తమకు నిశ్చయముగా మహాత్ములా?” అట్లు కాని యెడల ‘మహాత్మా’ యను మాటను దీసివేసికొనుఁడు.”

“అట్టి వాఁడుగా నే నుండుట కిష్టపడను. అట్టివాఁడ నగుటకు నా కిష్టము లేదు; ప్రయత్నమును లేదు. అయితే భగవంతుఁడు సృష్టించిన ప్రాణికోటిలో నే నొక సామాన్యుఁడ నని మాత్రము నాకుఁ దెలియును.

“అట్టి నేను మీ రొసఁగు మాట కర్హుఁడను గాజాలను; కాను.”

“సిరాజ్గంజ్ దేశమందు నాపేరు నుగుఱించి వచ్చిన విషయము నా కెంతయో బాధాకరముగా నున్నది. ‘మహాత్మ’

మహాత్ముఁడు శ్రీకృష్ణ జన్మస్థాన మలంకరిపఁబోవు సమయ మునఁ గొందఱు మహాత్ముని సమీపించి తనను సిద్ధులనియు, అవతార పురుషులనియుఁ బ్రజలు భావించుచున్నారని యనఁగా 'నాకట్టి యోగ్యత లేదనియు, అందులకీ కారాగార ప్రవేశమే సాక్షియనియు నొక్కి పల్కెను. మహాత్ముఁడు కారాగృహము నుండి విడుదల పొందిన పిమ్మట ప్రప్రథమముగా అహమ్మదా బాదు నగరమందు సమావేశమయిన అఖిలభారత జాతీయ మహాసభలో 'స్వరాజ్యపార్టీ' వారి వ్యతిరేకతను జూచియు, తన తీర్మానమే నెగ్గుటను నెఱిఁగియు, కొన్ని వోట్ల భేదముతో నెగ్గిన విజయము విజయము కాఁజాలదనియు, 'స్వరాజ్యపార్టీ' వారి బలము తనకిప్పుడు బోధపడినదనియు, నాదిగాఁగల నిశ్చ యములను (3-6-24) యంగు "ఇండియా" పత్రికయందు - 'అపజయము పొందితిని - అనుభవము గడించితిని' యను శీర్షి కతో వ్రాసిన వ్యాసము చదివిన యెడల నెవరి బలమును మహాత్ముఁడెంత గౌరవించునో స్పష్టము కాఁగలదు. పరబలము నంగీకరించుట మహాత్ములకు సహజముగదా! మహాసభలోఁ దన తీర్మానము నెగ్గిన విజయమును అపజయముగా భావించు మహాత్ముని యాత్మశుద్ధి యపూర్వము.

లోకము అహింసా ధర్మమూర్తియని మహాత్మునిఁ గొండాడుచున్నది. ఆ ప్రశంసలను గర్ణాకర్ణికగవిని యా స్తుతికిఁ జిన్నవోవుచు నన్ను నేను 'అవతార పురుషుఁడన'ని చెప్పుకొనుట లేదని వక్కాణించియుండెను. మహాత్ముఁడు తనను తానెట్లు భావించుకొనునోయని కొందఱు తలఁపవచ్చును. "ప్రపంచ మందు అహింసా ధర్మమును సాంగోపాంగముగా స్థాపించుటకు నేను అర్హుఁడను కాఁజాలను. నేనింకను ఆ మహాధర్మ నిర్వ

హృణమందు అర్హతను గాంచలేక పోవుచున్నాను. నా యందిం కను లోపముకలదు. నాకింకను ద్వైతభావమేకలదు" అని తన లోపమును మహాత్ముఁడు ప్రపంచమునకుఁ జాఁటిచెప్పుట ఆతని గొప్పతనము చెప్పకయే చెప్పుచున్నది.

ఇట్టి సంఘటనలవలన మహాత్ముఁడు మిగుల బాధపడిన ఘట్టములు పెక్కులుకలవు. వానినన్నిటిని గ్రంథవిస్తర భీతిచేత వివరింపఁజాలనయితిని. కాఁగా; ఆత్మస్తుతికిఁపొంగని హృదయము ఆదర్శజీవితమునకు మూలకందమనుట నిర్వివాదము. కావున మహాత్ముఁడుచేయు ప్రతికార్యము లోకహితముగోరి చేయు చున్నాఁడనుట నిక్కువము. ఇంతకు ఆత్మస్తుతి కారాటపడని జీవిత మాదర్శజీవితమనుట మఱువరాదు.

ఎట్టిచెట్ట లెదురైనను వానినధిగమించుచు నాదర్శ జీవితమునే గడుపుకొనుట మహాత్ముని సంకల్పము. ఆ సంక ల్పమును దనజీవితమందక్షరాల ఋజువుచేసికొనఁ గలిగెను. అందుచేతఁ బ్రపంచమందు మోహనదాసు కరమచందుగాంధి- గాంధిమహాత్ముఁడు-అను ప్రసిద్ధనామమున ప్రసిద్ధుఁడాయెను.

## మౌనము

అన్నిటికి నహంకారములేని జీవితము ముఖ్యము. అహంకారమును జంపుకొనుటెట్లు? ఈ యహంకార గుణము వలనఁ గలుగు చెడుగులు పెక్కులని మనగ్రంథములు వాకొను చున్నవి. ఈ యహంకార గుణమును నశింపఁజేయుటకు మహా త్ముఁడు మనకొక క్రొత్త మార్గమును గనిపెట్టియుండెను. అదియే మౌనవ్రతము. మౌనవ్రతమునుగూర్చి గ్రంథాదిని

గొంతవఱకుఁ జదువుకొని యుంటిని. మహాత్ముఁడు మౌనవ్రత పాలనముచే నహంకారమును జంపుకొనఁగల్గెను. మహాత్ముఁడు చిన్నతనమునుండియు నీ మౌనవ్రత మాచరించుచుండెడివాఁడు. మౌనవ్రతపాలనముచే సత్యదీక్ష యలవడునని పాఠకమహాశయులు గ్రహింతురుగాక! మౌనవ్రతపాలకులకు మనస్సు స్వచ్ఛమగును. మనస్సు స్వచ్ఛమగునప్పుడు సత్యము గోచరించును. అందుచే మౌనవ్రతమువలనఁ బవిత్రత, సత్యసంధత లభించును. తన్మూలమున నహంకారము నశించును.

"నేటికిని నను పదుగురు మిత్రులు కలిసినప్పుడు గాలి ప్రోగుచేసి మాటలాడుట నా చేతకాదు.

అప్పుడప్పుడు పరిహాసమునకు పాలగుట ఒకటే కాని ఈ బిడియమువలన నాకు కలిగిన కీడేమియు లేదు. అంతకు బదులు అది మేలే చేసెను. అప్పుడు దుఃఖకరమైన ఈ సంకోచము ఇపుడు సంతోషకరమాయెను. దానివలన నాకుఁ గలిగిన ఫలము మితపదోపయోగము. తలఁపులను నిరోధించుశక్తి సహజమై పోయెను. నా నోటినుండిగాని, కలమునుండిగాని అర్థములేని మాట ఒకటేనియు రాదని నాకు నేను ఉల్లాకు (సర్టిఫికేటు) నిచ్చుకొనఁగలను. నా మాటలలోఁగాని, వ్రాఁతలలోఁగాని తప్పు దిద్దుకొనవలసిన అక్కఱ కలిగినట్లు గుఱుతులేదు. ఇట్లు చాల చిక్కులును వృథాకాలవ్యయమును తప్పెను. సత్యారాధకునకు మౌనావలంబనము ఆవశ్యకమని అనుభవము నాకు బోధించెను. తెలిసిగాని తెలియకగాని అతిశయోక్తికి ప్రొగ్గుటయు, సత్యమును మఱుఁగుపఱచుటయు మానవునకు సహజదౌర్బల్యము. దాని నతిక్రమించుటకు మౌనమావశ్యకము. మితభాషి అర్థము లేని మాటలు ఉపయోగింపఁడు. అతఁడు ప్రతిమాటను తూఁచి

మాటాడును. మాటలాడుటకు మొగము వాచికొన్నవారిని మనము పలువుర నెఱుఁగుదుము మాటాడుటకు అనుజ్ఞ కావలయునని వేధింపఁబడని అధ్యక్షుఁడనుచు ఏ సభయందేని ఉండఁబోఁడు. అనుమతింపఁబడఁగనే వక్త సామాన్యముగా కాలనియతిదాటును. మరియు కాలము కావలయుననును. అనుమతిలేకున్నను ఉపన్యసించుచునే యుండును వీనివలన లోకమునకు మేలేమియు లేదు. కేవలము కాలమారణము. నా బిడియమే నాకు డాలైనది. నన్నదియే పక్వముచేసినది. సత్యారాధనమునకది మిత్రమైనది" అని మహాత్ముఁడు తన యాత్మకథయందుఁ జెప్పియుండెను.

మహాత్ముఁడు బాల్యమునుండియు మితవాఙ్మయుఁనుటకుఁ బెక్కుదాహరణములు కలవు. "తల్లిదండ్రుల యొద్ద నేనెప్పుడును మాఱుమాటాడి యెఱుఁగన"ని మహాత్ముఁడు తన యాత్మకథయందుఁ జెప్పుకొని యుండెను. బడిపిల్లలు కొందఱితోఁగూడి చేసిన చిలిపిపనులను మాతృదేవి ప్రశ్నించినప్పుడు మహాత్ముఁడు దాఁచక తల్లికిఁజెప్పు సత్యసంధతయే కాలక్రమమున నాతనిని గాఢసత్యవాక్పరిపాలకునిగ నొనర్చెను. మహాత్ముఁడు తల్లికిచ్చినబాసను ఆంగ్లదేశమునఁ గాపాడుకొనుటవలన గొప్పతనము గలవాఁడయ్యెను. మహాత్ముఁడు తన సతీసుతులనుగూడ నబద్ధము లాడకుండునట్లు కట్టుబాటుతోఁ గాపాడుకొనుచు వచ్చెను. మహాత్ముఁడు 'హరలాల్' అను తన పెద్దకుమారుఁడు దుస్సాంగత్యమువలన దొంగతనము చేసినట్లువిని "యంగు ఇండియా" పత్రికయందు దొంగతనము నే మాత్రము సహింపరాదని వ్రాయుచు బిడ్డయను ప్రేమనుగూడఁ జూపక మిక్కిలి యధిక్షే

పించెను. మహాత్ముఁడు హారల్దాలును తన కుమారుఁడని చెప్పుకొనుట...మిగుల వగచెను.

మహాత్ముఁడు బాల్యప్రాయమునఁ దమ తలిదండ్రులు మొదలగు పెద్దలయొద్ద మౌనముద్ర వహించినట్లే యితరుల యొద్దను మౌనముద్ర వహించుటను మహాత్ముని యాత్మకథ వలనఁ దెలిసికొనఁగలము. "నేను నాచిన్నతనమునను పాధ్యాయుల యొద్దనేమి; విద్యార్థుల యొద్దనేమి యబద్ధమాడినట్లు ఎఱుఁగను." అని మహాత్ముఁడు తన యాత్మకథ యందుఁ దెలిపియుండెను. సత్యమాడుట యను జ్ఞానము బడికిఁబోవులేఁ బ్రాయమందుఁ బట్టుపడుట మిగుల నాశ్చర్యకర విషయమని పాఠక మిత్రులు గ్రహించుదురుగాక! ఒక పర్యాయము పాఠశాలను పరీక్షించుటకు వచ్చిన పరీక్షాధికారి సమక్షమున; ఇతర బాలురనుజూచి యుపాధ్యాయుఁడు సమాధానములను దన కాలి వ్రేళ్ళసైఁగలచేఁ దెలుపుటను మహాత్ముఁడు గుర్తెఱిఁగి యట్లు చేయుట తనకెంతమాత్రము నచ్చలేదని కలఁత చెందెను.

మబ్బులు క్రమ్మి ప్రొద్దు తెలియక వేళమిగిలి మహాత్ముఁడొక నాఁడు ఆటల తరగతికి వెళ్ళెను. ఇది గుఱించి మఱునాఁడు ఉపాధ్యాయుఁడు నిన్న నీ వేల రాలేదని ప్రశ్నింపఁగా మహాత్ముఁడు జరిగిన విషయమును జెప్పెను. ఉపాధ్యాయుఁడామాట నమ్మక మహాత్మునకుఁ గొంత యపరాధము విధించెను. ఆ విషయమును మహాత్ముఁడు తన యాత్మకథ యందు "నేను అబద్ధాలకోరనిపించు కొంటిని. ఇది నా కెంతో వంత గలిగించెను. నేను జూటాకోరును కానని ఎటుల సమర్థించు కొనఁగలను? ఉపాయాంతరము లేదు. మిగుల దుఃఖించితిన"ని వ్రాసిన విషయమును జూడుఁడు. ఈ మాటలలో మహా

త్ముని సత్య సంధత యందలి యనురాగము సువ్యక్తమగు చున్నది.

"సత్యమనునది మహా వృక్షము. దానిని మన మెంత యధికముగ పోషింతుమో యంత యధికముగ నది ఫలముల నొసఁగును. దానికి అంతమనుచు లేదు. నీవు దీని గనిలోనికి దిగిన కొలఁది సేవారూపము లయిన రత్నములు నీచేతికి దొరకు చుండును. అని సత్యమందలి విశిష్టతను" దన యాత్మకథయందు వ్రాక్రుచ్చెను.

మహాత్ముఁడు తన జీవితయాత్ర కవలంబించిన వృత్తి యేది? బారిష్టరు వృత్తి గాదా! ఆ వృత్తి కల్లకపటములకుఁ బుట్టినిల్లనుటకు వేఱుగాఁజెప్పఁ బనిలేదు. ఆ వృత్తి కొనసాగించిన దినములందును మన మహాత్ముఁడు సత్యసంధుఁడుగానే ప్రవర్తించెను. మానవుఁడు అబద్ధముల పుంతబోక, సత్య సంధుఁడుగా గణుతికెక్కుట సామాన్యమా? పాఠక మిత్రులారా! చూడుఁడు. మన మహాత్ముఁడు సత్యసంధుఁడు సుమా!

లెక్కల చిక్కుగల దావా యొకటి దక్షిణాఫ్రికాలో జరిగెను. ఆ వ్యాజ్యమునకు మన మహాత్ముఁడు న్యాయవాది. చేవ్రాఁత (ఖాతా) వలనఁ గలిగిన తప్పులే యీ దావాకు మూలము. మహాత్ముఁడు, తప్పుల నొప్పుకొనుచు వాదించుటయే మేలని కక్షిదారులకుఁ దెలిపెను. ఈ వ్యాజ్యమునకుఁ గక్షిదారులు పెద్ద వకీళ్ళను బెట్టుకొనలేదు మహాత్ముఁడు మన తప్పులను మనమే యొప్పుకొనుటవలన మనము దావాలో జయము పొందుట కవకాశ ముండునని కక్షిదారులను బలవంత పెట్టెను. మహాత్ముఁడు న్యాయవాదిగా నుండియు సత్య

మును మఱుగుపుచ్చుటకుఁ గొంచెమైనను సమ్మతింప లేదు. ఈ మాటలు వినిన కక్షిదారులు డోలాయమాన మనస్కులై క్రిందుమీఁదులతో నాలోచించి యాలోచించి తుట్టతుదకు మహాత్ముఁడు చెప్పిన చొప్పున నడుచుకొనుటకు నిశ్చయించు కొనిరి. అందువలన గొప్ప వకీళ్ళను బెట్టుకొనలేదు. మహాత్ముఁడు న్యాయస్థానమున న్యాయమూర్తి యెదుట ఖాతాల వలనఁ గలిగిన తప్పులను దామే యొప్పుకొనుచు ఖాతాతప్పుల జాబితాను దాఖలు చేసెను. ఈ సత్యము ప్రతివాది వకీలును 'ఇఁక మాకేమియుఁ బనిలేద'న్నట్లు తలంపఁ జేసెను. దావా ప్రారంభమున న్యాయమూర్తి మహాత్ముని సత్యసంధత నెఱిఁగిన వాఁడు కాఁడు. పిమ్మట మహాత్ముని సత్యసంధత న్యాయమూర్తి కవగాహన మయ్యెను. ఆ న్యాయమూర్తి తుదకుఁ దీర్పుచెప్పెను. ఆ తీర్పు మహాత్మున కనుకూలమైనది. దావాలో న్యాయమునుబట్టి తీర్పు చెప్పుదురా? న్యాయవాది ఘనతనుబట్టి తీర్పు చెప్పుదురా? న్యాయవాద వృత్తి యందును న్యాయమార్గ మవలంబించిన మహనీయుఁడు మనమహాత్ముఁడు. 'మహాత్మాంహి సర్వ మథవాజనాఽతిగమ్' అను పండిత వాక్యము యథార్థము.

మఱొక విషయము చెప్పుకొని అసలు విషయమునకు మఱలుదమని పాఠక మహాశయులకు మనవి. 'పారసీ రుస్తుంజీ' యను ప్రసిద్ధుఁడొకఁడు దక్షిణాఫ్రికా యందు వ్యాపారము చేసికొనుచు నుండెడివాఁడు. ఆతఁడు మహాత్ముని ప్రేమాస్పద మిత్రులలో నాప్తమిత్రుఁడు. ఆతఁడన్నింటను గొప్పవాఁడేగాని యొక్క విషయమున మాత్రము కొంచెము లోపముగలవాఁడు. బొంబాయి, కలకత్తా మొదలగు దూరదేశములనుండి పలు సరు

కులు తెప్పించి వ్యాపారము చేయుచుండును. ఆశ మీఱిన లాభము గడింపక, తగు ధరలతో వ్యాపారము చేయునట్టి యుదార స్వభావుఁడు. ప్రభుత్వాధికారులు పెక్కురు పారసీ రుస్తుంజీయెడ గౌరవ ప్రపత్తులు మిక్కుటముగా నుండిన వారగుటచే నాతని యెడ నెవరికి నెట్టి సందేహ ముండెడిది కాదు. పారసీ రుస్తుంజీ చూపెడి 'పట్టిక'లనుబట్టి ప్రభుత్వాధికారులు 'పన్ను' విధించెడివారు. పెక్కు దినములనుండిచేయు గజదొంగ తైనను ఒక్కనాఁడే పట్టువడుట సహజము! పారసీరుస్తుంజీ ఒక పర్యాయము దొంగవ్యాపారము వలనఁ బట్టువడెను. పారసీరుస్తుంజీయాగొప్పవాఁడు! పేరుప్రఖ్యాతుల నార్జించిన ప్రసిద్ధపురుషుఁడు! మహా ధనవంతుఁడు! గాంధిమహాత్ముని మిత్రుఁడు! ఏమిచేయఁ గలఁడు? పారసీరుస్తుంజీ మహాత్ముని యొద్దకుఁ బరుగున వచ్చి జరిగిన విషయమును మొఱఁబెట్టుకొనెను. అప్పుడా యిద్దఱకు జరిగిన సంభాషణను మహాత్ముఁడు తన యాత్మకథ యందిట్లు వ్రాసెను.

ఆ సంభాషణను గొంతవఱకు సంగ్రహించి యిట నుదహరించు చున్నాను.

పారసీ రుస్తుంజీ:— మహాత్మా! తమయెడ నేను మోసముచేసితిని. దొంగ పద్ధతిని సరకులను దిగుమతి చేసి కొనుట నాకు మొదటినుండియు నలవాటు. కాని నేఁడు నా దొంగతనము పట్టువడెను. ఈ నా దొంగబుద్ధి తమకుఁ దెలియకుండఁగ నటించితిని. ఇప్పు డీ యపాయమును దప్పించుకొను నుపాయమేమి? లేనిచోఁ గారాగృహ ప్రాప్తియే. తప్పదు. ఈ యాపదనుండి రక్షింపఁగల సమర్థులు తమ రొక్కరే. తమరీ సమయమున నన్ను దప్పక రక్షింపవలయునని నా ప్రార్థన.

మహాత్ముఁడు:— మిమ్ములను గాపాడుటకు, గాపాడ కుండుటకు నేనెవ్వఁడను? అంతయు భగవంతుని యిష్టము. నాసంగతి మీకు స్పష్టముగాఁ దెలియునుగదా! తప్పును ఉన్నది యున్నట్లుగా నొప్పుకొనినచో వాక్సహాయ మేదైనఁ జేయ వీలగును.

పారసీ రుస్తుంజీ:— తమయొద్ద సత్యమే పలికితినిగదా! ఇది చాలదా!

మహాత్ముఁడు:— నా కేమి యపరాధము చేసితిరి? ప్రభుత్వము వారికిఁగదా మీరు అపరాధము చేసినది! కాఁగా నాయొద్దఁ జెప్పుకొనిన మాత్రాన మీ కేమి లాభము?

పారసీ రుస్తుంజీ:— తమరు చెప్పిన ప్రకారము నడుచు కొందును. అయినను నా (మొదటి) వకీలును గలిసికొని మాటాడి వచ్చెదను.

(అని చెప్పి) పారసీ రుస్తుంజీ తన ప్రాత వకీలును జేరి జరిగిన వ్యాపార విషయమును దెలియఁజెప్పెను. అందులకా న్యాయవాది జూరీలముందు కేసు విచారణ జరుపఁబడుననియు, నేటాలుజూరీలు నల్లవారిని విడిచిపెట్టుట యరుదనియు, అయినను ప్రయత్నించి చూతమనియుఁ జెప్పెను. పారసీరుస్తుంజీ "ఈ కేసులో బారిష్టరు గాంధి చెప్పిన ప్రకారము చేయుటకు నిశ్చయించుకొంటిని. వారితో మీరును కలిసికొనుఁడ"ని చెప్పి మహాత్మునియొద్దకుఁ దిఱిగివచ్చెను.

మహాత్ముఁడు:— ఈ కేసును కోర్టువఱకు పోనీయ కుండుటయే మెఱుగు. సముద్ర కరాధికారులను, అటర్నీ

జనరలును గలిసికొని తప్పును జెప్పుకొనవలయును. ఆ మీఁదట కేసును నడుపుకొనుట, నడుపుకొనకపోవుట, ఆ యధికారుల యిష్టమునుబట్టి యుండును. ఆ యధికారులు తామే యపరాధము విధించి కేసును నిలిపివేయవచ్చును. లేనిచో మీరు జైలునకు వెళ్ళవలయును. తప్పుచేయుటయే యవమానము. అందుకై జైలునకు వెళ్ళుట యవమానముకాదు. ఇది నా యభిప్రాయము. దొంగతనము పట్టువడినది. జైలునకు వెళ్ళుట దొంగతనమునకు ప్రాయశ్చిత్తమని నిశ్చయించుకొనవలెను. ఇఁకమీఁదట దొంగతనముగా సరుకులను దిగుమతి చేసికొనరాదని ప్రమాణము చేసికొనుటయే పరిహారము.

పారసీ రుస్తుంజీ:— నేను తమయొద్ద శరణుజొచ్చితిని. తమ యిష్టమువచ్చినట్లు చేయుఁడు.

తరువాత మహాత్ముఁడుసత్యపథమున నిలువఁబడి దావా వ్యవహారము నడపిరి. ఆ వ్యవహారము కోర్టువఱకు రాలేదు. కొలఁది జరిమానాతో ఆ వ్యవహార మంతటితో నాగిపోయినది. పారసీ రుస్తుంజీ 'బ్రతుకు జీవుఁడా!' యని పరమానందముతో మహాత్ముని సత్యసంధతను, సుగుణసంపత్తిని వేనోళ్ళఁ బ్రశంసించుచు నీ వ్యవహార కర్మకాండను కాగితముమీఁద వ్రాసి చట్టము కట్టించి యా కాగితపుపట మెల్లరికిఁ గానిపించులాగున తన వ్యాపార స్థలమున వ్రేలాడఁగట్టెను. పాఠకమహాశయులారా! మన గాంధిమహాత్ముఁడు న్యాయవాదవృత్తియందును సత్యసంధుఁడై యాదర్శజీవితము గడుపుట యాశ్చర్యముగదా! వృత్తికొఱకు- ధనముకొఱకు సత్యము నెప్పుడును మహాత్ముఁడు దాఁచిపెట్టువాఁడు కాఁడని మహాత్ముని ప్రతిజీవితభాగము మనకు బుజువుచేయుచున్నది. ఇందుచేత గాంధిమహాత్ముఁడు మాన

వుఁడు గదా! ఇట్టి మహాత్ముని జీవితము ప్రపంచమున కాదర్శముగదా!

మహాత్ముఁడు గుజరాతి దేశమందు వైశ్యకులమున జన్మించెను. మహాత్ముఁడు దక్షిణాఫ్రికాయందు న్యాయవాదవృత్తి చేయుచున్నప్పుడు చెన్నరాష్ట్రీయులను సమయము వచ్చినప్పుడెల్లను మెచ్చుకొనుచుండెడివాఁడు. కొందఱు న్యాయవాదులు తమ కక్షిదారులకు చేయు మంచి లవలేశమైనను ఘనముగాఁ జెప్పుకొనుచు, ప్రతివాదుల న్యాయవాదులు చేయు మంచిని నెఱుఁగనట్లు నటింతురు. ఇట్టివారు సత్యమును దాఁచి యబద్ధములను సుబద్ధములుగాఁ బ్రచారము చేయునట్టివారు. మన మహాత్ముఁడు సత్యమే నమ్మినవాఁ డగుటవలన నెవరి విషయమున నైనను యథార్థమునే బయలుపఱచు స్వభావము గలవాఁడు. మహాత్ముఁడు చెన్నరాష్ట్రీయ సోదరులు తనకుఁ దోడ్పడిన విషయమునుగూర్చి "మదరాసుసోదరులకు నేననినచో ప్రాణము. నాకు వీ రెల్లపుడు గుర్తువత్తురు. ఎచట నేని అఱవవాఁడు గాని, తెలుఁగువాఁడుగాని కానిపించినచో వారిపూనిక, శ్రద్ధ, స్వార్థత్యాగము గుర్తురాకమానవు. వారందఱు నిరక్షరులు. వారి స్త్రీలును అట్టివారే. దక్షిణ-ఆఫ్రికాలో పోరు నిరక్షరులది. అక్షరము లెఱుఁగని యోధులే అందు పోరాడిరి. ఆ పోరు బీదలకొఱకు. పోరినదియు పూర్తిగా బీదవారే." (తెలుఁగు-ఆత్మకథ) యని పలుతావుల మెచ్చుకొనియుండిరి. మహాత్ముఁడు అఱవము-తెలుఁగు భాషల నేర్వఁ బ్రయత్నించిన ప్రయత్నమును 'విద్య' యను శీర్షికాభాగమునందుఁ జూడుఁడు.

దక్షిణాఫ్రికా సత్యాగ్రహ యుద్ధ విజయమునుగూర్చి పలువురు మిత్రులు తమను ప్రశంసించు సందర్భమునందు మహాత్ముఁడు "బీదవారివలననే విజయము కలిగినది. ఆ యుద్ధాగ్రమున నిలువఁబడి ప్రాణములను పోఁగొట్టుకొనినవారే నిజమైన వీరుల"ని తమవిషయమును దప్పించి యితరులనుగూర్చి ప్రశంసావాక్యములు పలుకుటనుబట్టి మహాత్ముని ధీరోదాత్తతకు లక్ష్యమిదియే యనుట నిర్వివాద విషయము.

మహాత్మునకు భారతీయులు, పల్లీపత్తనములందు ఆబాలగోపాల మానందాతిరేకమున స్వాగతమిచ్చు సమయములందు బ్రిటిషు వారి పరిపాలనా విధానమునుగుఱించి ప్రసంగించు సందర్భములలో బ్రిటీషు వారి పరిపాలనమందలి 'నీతి మొత్తము మీఁద సుఖకరమ'ని సత్యమును దాఁచక మనసార ప్రభుత్వము వారి మంచిని మెచ్చుకొనుచుండెడివాఁడు. మహాత్ముఁడు చెప్పునది - చేయునది - తలంచునది యొక్కటియై యుండుట ప్రపంచ చరిత్రయందు సువర్ణాక్షరములతో లిఖింపఁబడుఁగాక!!!

### సాహసము - ధైర్యము

బ్రిటీషు ప్రభుత్వమందలి నీతిని మహాత్ముఁడు తన దేశీయులకు గొప్పగాఁ జెప్పుచుండెడివాఁడు. అట్లే; బ్రిటీషుప్రభుత్వమందలి యవినీతిని నిందించుచు ప్రభుత్వముతో నిర్భయముగా నెదుర్కొనుచుండెడివాఁడు; అంతఃకరణమందొకమాట బయటి కొకమాట చెప్పుట మన మహాత్ముఁ డెఱుఁగఁడు. మహాత్ముని హృదయ మెఱుఁగుటకు శ్రమశోధన లనావశ్యకము. "దుర్భర క్షామములనుండి ప్రభుత్వమువారి తాత్కాలిక నివారణోపాయములతో నీ విశాల భారతదేశమును రక్షించుకొనలేదు.

అన్నసత్రమువంటి కదురుచేతనే వీరత్వముతో నిలిచి క్షామ పిశాచమును బాఱఁద్రోలి పోలీసురాజ్యమును బోఁద్రోలవలెను. అని మహాత్ముఁడు చెప్పియుండెను. "ఇట్టి ప్రభుత్వమును బాఱఁద్రోలుటయే నా విధి" యని యథార్థమును వెలువరించు హృదయమునకు సాటి మఱేది లోకమునఁ గలదు? కఱవెచ్చుటా? కాటకమెచ్చుటా? 'కఱవు పిశాచపుచేష్ట' యని గాంధి మహాత్ముఁడు ప్రభుత్వమునుగూర్చి చెప్పెను. న్యాయస్థానమందు విచారణ జరుగు సమయమందు మహాత్ముఁడే విషయమును మఱుఁగుపఱచి మాటాడెడివాఁడు కాఁడు. "మీ చట్టముల ననుసరించి నేను చెప్పిన మాటలు – చేసిన పనులు దోషయుక్తములయినవియే యగును. ఆ చట్టములు నీతిబాహ్యములు మానహీనములగుటవలన, ఆ చట్టముల నుల్లంఘించుటయే నా విధి. నన్ను విడుదలచేసినను, తిరిగి ఆ శాసనోల్లంఘనమే చేయుదును. శాసనానుసారము పూర్తి శిక్షను విధింపుఁడ"ని గదా మన మహాత్ముఁడు చెప్పుట!

త్రికరణమందు దోషములేని సత్య సంధులకు భయమెచ్చుటా? నిర్భయముగలవారే నిబ్బరముగానున్నది యున్నట్లు చెప్ప సమర్థులు! ఆ నిండుమనసు గలవారు ఒక వ్యర్థకార్యము కూడ నెప్పుడు సహింపరుగదా!

దేశభక్తుఁడు మౌలానా మహమ్మదాలీ యొకప్పు డొక మహాసభలో నుద్రేకపూరిత హృదయముతో నాంగ్లప్రభుత్వమును విమర్శించుచు నహింసాధర్మమునకు విరుద్ధముగా దౌర్జన్యము ప్రేరించుచు నుపన్యసించెనని యప్పటి రాజప్రతినిధి తనకు ఆ యుపన్యాస నివేదిక చూపఁగా మహాత్ముఁడు

మౌలానా మహమ్మదాలీయొద్ద క్షమాపణ దీసికొని యా ప్రతిని రాజప్రతినిధి కందఁజేసెను. ఆహా! మహాత్ముని చిత్తశుద్ధిని వివరించి చెప్ప నేరికి శక్యము? ఆలీసోదరులు, ఒకచోట భారత సైనికులు సైన్యమును విడిచి రావలయు ననుచు మాటాడిన విషయమును దోషముగాఁ బ్రభుత్వ నివేదికయందుఁ జదువుటతోడనే, భారతదేశ సంపదతో సైన్యమును బోషించుట, దమననీతితో నకృత్యములను గావించుట మొదలుగాఁగల దౌష్ట్యముల నెఱపు ప్రభుత్వ సైన్యమం దుద్యోగియై కాని, మఱి యెందైనను జేరి కాని ప్రభుత్వమునకు సహాయపడుట దేశగౌరవమునకు భంగపాటని నివేదిక యొకటి వ్రాసి తానే యందు ముందు సంతకము చేసి భారతీయులందఱిచేతను జే వ్రాళ్ళు చేయించిన వీరుఁడు మన మహాత్ముఁడు. 'అలుగుటయే యెఱుంగని మహా మహితాత్ముఁడజాతశత్రువే యలఁగిననాఁడు' ......... ప్రభుత్వ మొక లెక్కయా ?

కాశీ హిందూ విశ్వ విద్యాలయమునందు దైనందినాభివృద్ధితో నొడలువంచి చక్కఁగాఁ జదువుకొను విద్యార్థులను, ఆంగ్లదేశమందుఁ బుట్టి ప్రసిద్ధురాలైన అనిబిసెంటును దేశీయోద్యమమందు నాకర్షించినది మహాత్ముని సత్యసంధతయే గదా! లాహోరునందుండిన 'లారన్సు' శిలావిగ్రహఫలకమున కలముకావలయునా? కత్తి కావలయునా? యను నాత్మగౌరవ హీనమగు వాక్యమును జూచి యా శిలా ప్రతిమ భారతదేశగౌరవమునకే భంగపాటుగా నున్నదని సత్యాగ్రహము చేసి యా శిలావిగ్రహమును యటనుండి తీసివేయునట్లు లాహోరు పౌరులను బురికొల్పినది మహాత్ముని ధైర్యము

గాదా? కేనడా రాకుమారుని రాకను - మానవేల్సు యువ రాజు రాకను నాదరింపక నిరాకరింపవలయునని దేశమును మేలు కొల్పినది మన మహాత్ముని ధైర్యముకాదా? శాసనోల్లంఘనము నకు 'సబర్మతీ - ఆశ్రమము' నుండి 'బార్డోలి' కిఁ బయనమైన ప్పుడు చౌరీ చౌరా హత్యా దురంతములను విని యీ శాస నమును నిలిపివేయవలయునని ప్రభుత్వమును ప్రాంతమూలమున శాసించినది మన మహాత్ముని ధైర్యము గాదా? బుద్ధి బలము నను భుజబలమునను తమకు మించినవారను ద్వేషమున 'మిక్యా-రిలరు' అను జర్మనుదేశీయునిఁ జావమోది కులుకుచున్న బ్రిటీషువారి దౌర్జన్యమును బాహాటముగా వెల్లడించిన ధైర్య మెవనికిఁ గలదు? మహాత్ముని ధీరత్వమునుగుఱించి వ్రాయఁ బూనిన నెంత గ్రంథమగునో!

"నేను భారతదేశము పర్యటించినప్పుడు భారతీయులు, చదువుకొనిన భారతీయులు; నిర్వ్యాపారమున - నిరుద్యోగమున బాధపడుటను జూచితిని......బాహాటముగా వారు తమ యభిప్రాయములను వెల్లడించుటకు భయముచే వెనుకాడు చుండిరి; ఏకాంతమున నే విషయమునైనను జెప్పుటకు భయ పడుటలేదు......మానముదాల్చినయెడల నే నేమియుఁ జెప్ప లేను. భగవంతునకు భయపడవలసిన మానవుఁడు - అతఁడెట్టి వాఁడైనప్పటికి - భయపడవలసిన పనిలేదు. సత్యమును మీరు ఏదో యొక విధముగాఁ జెప్పలేకపోయినయెడల, అందులకు భయమే కారణమైయుండును......భగవంతునకు భయపడి నడుచుకొనువాఁడు వేఱెద్దానికి భయపడరాదు."

"సత్యములేని స్వరాజ్యము నిష్ఫలము. సత్యమును గ్రహించుటకు దేశమునకుఁ గొంతకాలము పట్టును."

"ధైర్యమనఁగా నిశ్చితార్థమును బొందుటకు ముందు, మొదటగా భయమునకు లోఁబడకుండఁగోరుటయే యని నా యభిప్రాయము. ఇది యాత్మజ్ఞానము లేనిదే పొందుటకు సామాన్యముగాదు. (అందుచే) భగవంతునిమీఁది భయము, మానవుఁడు భయపడుటను బోఁగొట్టును"

అని మహాత్ముఁడు సత్యమును ధైర్యమును నిర్వచించి చెప్పుట వివేకోదయమునకు మార్గమగుచున్నది.

ఆత్మస్తుతి స్వార్థమును లేనప్పుడు సత్యము, ధైర్యము మానవుని యాత్మశక్తిని బెంపొందించును. ఇట్టి యాత్మశక్తియే మానవుని యాత్మశక్తి. ఇట్టి యాత్మశక్తి పరార్థపరుల జీవితములను మేలుపఱచును. స్వార్థపరులకు నీయాత్మశక్తినిప్రయోజనము. రజస్తమోగుణములను గలిగించు నాహారపదార్థములు భుజించువారు కోపతాప విరోధాది గుణములు గలవారగుదురేని కాని, యాత్మశక్తికలవారుకారు. ఇట్టివారు ఆత్మశక్తిలేని కారణమున భయావృతచేతస్కులై తమను రక్షించుకొనుటకుఁగాను ఆయుధోపకరణములు సంపాదించుకొని యితరులను హింసించుటకునుగూడ సిద్ధమగుదురు. భయముచే నాయుధమును దాల్చినవాఁడు ఆత్మశక్తి నెట్లు సంపాదించుకొనఁగలఁడు? ఆయుధమునుజూచి భయపడని యాత్మశక్తిచే నెదుర్కొనువాఁడే నిజమగు వీరుఁడు. కోపతాప విరోధాది గుణములు ఆత్మశక్తిని నణగింపఁజేయును. యుద్ధమునకైనను గావలసిన యాయుధములు సత్యము, ధైర్యమున"ని మహాత్ముఁడు పదేపదే చెప్పియుండెను సత్యము ధైర్యము ఆదర్శజీవితమునకుఁ గావలసిన ప్రధానగుణములు.

## ఆత్మజ్ఞానము

సత్యము, ధైర్యము ననుగుణములు మానవుని యహంకారమునుజంపి యాతని యందణగారియున్న యాత్మ శక్తినిఁ బ్రజ్వలింపఁజేసి మానవుని నున్నతికిఁ దెచ్చును. ఈ యాత్మజ్ఞానము సహనము, వినయము, ప్రేమ మొదలగు సద్గుణములను బెంపొందించును. తన క్షేమము నేగాక, యితరుల క్షేమమునుగూడ సంరక్షించును. ఇట్టి యాత్మజ్ఞానముగలవారు ఎల్లప్రాణులను దమ ప్రాణమట్లు భావించుకొందురు. ఆత్మజ్ఞాన సంపన్నులు ఏప్రాణికి హింసచేయఁబూనరు. ఏ కారణమున నెవరికి నెన్నఁడు హానిచేయరు. అట్టివారు లోకపూజ్యులగుదురు. ఇతరుల సుఖమే తమసుఖముగా భావింతురు. ఇట్టి యాత్మ జ్ఞాన సంపదగలిగి యుండుటయే యాదర్శ జీవితమునకు ముఖ్యము. ఆదర్శజీవితము గలవానికి అహింసాధర్మము కర తలామలకము.

సత్యస్థైర్యములు కలిగిన యెడల నాత్మజ్ఞానము కలుగును. ఆ ఆత్మజ్ఞాన మభివృద్ధి యగుటకు, రక్షింపఁబడుటకు మౌనవ్రతమవశ్యాచరణీయమని పెద్దలందురు.

నిరశనవ్రత మవలంబించినప్పుడును మౌనవ్రత మాచరింపనగును. మౌనము; శరీరమందలి నాడులను, ఆ నాడులు బుద్ధిని బ్రకాశింపజేయును.

ఇక్కారణమున మౌనము మనోవాక్కాయములకుఁ బుష్టిని, మనస్సునకుఁ దుష్టినిచ్చును. కావున మౌనము సర్వవిధ ముల శ్రేయోదాయకమని తెల్లమగుచున్నది. ఆదర్శజీవిత సౌభాగ్యమునకు ఆశయసంపత్తికి మౌనము సర్వవిధముల శక్తి

సామర్థ్యములను నిచ్చుననుట తథ్యము. కావున మౌనము సర్వ గుణ ప్రపూర్ణమైనదని తెల్లమగుచున్నది.

మన ప్రాచీనులు పెక్కండ్రు బ్రహ్మచర్యము నెఱపిన కథలు కలవు. ప్రాచీన కాలమందలి మహర్షుల జీవితచరిత్రలను బరికింతుమేని మౌనవ్రతాచరణము కావించినట్లు స్పష్టము కాఁగలదు. మహాత్ముఁడు మౌనవ్రతాచరణముచేఁ గలిగిన పెక్కు అనుభవములను తన జీవితమూలమున వెల్లడించి యుండెను. అందు నొకటిరెండు అభిప్రాయముల నిటఁ జదువు కొందము.

"మౌనమునందు నాకేర్పడిన నిశ్చయము పెంపొందు చునే యుండెను; ప్రతిదినము ప్రార్థనను నేను మౌనముతో జేయుటకద్దు.

"మౌనము లౌకిక ప్రవృత్తికి వైదిక ప్రవృత్తికిఁ గూడ నావశ్యకము."

"మొదట కార్యవ్యగ్రత నుండి విశ్రాంతినిగోరి మౌన వ్రతము పూనితిని. ఆ సమయము నాకెంతయో యానంద ముగా నుండెడిది. దినక్రమమున భగవంతుని మీఁద బుద్ధి నిలుపుటకుఁ దోడ్పడెను. నేఁటికిని నేను మౌనవ్రతమునకే పుట్టింపఁ బడితినేమో యను జ్ఞానము నాకుఁగలదు."

మహాత్ముని మౌనవ్రతమును బ్రశంసించుచు పాశ్చాత్య పండితులెందఱో ప్రశంసించిరి. అందు నొకరిద్దఱి యభిప్రాయము లను బాఠక మహాశయులకై యిట పొందుపఱచు చున్నాను.

"సోదరుఁడు కైల్సు, ఫ్రాన్సురాజు సెయింటు లూయిసూ,

ఒకసారి కలిసికొనిరి. ఒకరినొకరు పరామర్శించుకొని ముద్దిడు కొనిరి. ఆ సమయమునందున నా యిద్దఱును ఎట్టి మాటయు మాటాడు కొనలేదు. కరస్పర్శ కావించుకొనిరి. ఎట్టి మాటయు లేకయే వేఱైరి. ఈ విషయమును సోదరుఁడు కైల్సు "మేమి ద్దఱము నోరు తెఱచి మాటాడుకొనిన దానికంటె మౌనము చేతనే యెక్కువగా మాటాడుకొనుట యలవాటు" అని చెప్పెను. ఈ యనుభావమును నేను గాంధిమహాత్ముని ప్రత్యక్ష మున ననుభవించితిని."

—ఎమ్. జోన్సు.

"గాంధిమహాత్ముఁడు లండను నగరమందున్నప్పుడు మా బడికి విచ్చేసెను. బాలురు వేడుకమీఱ నెదురుకొలిచ్చిరి. నాఁడు మహాత్మునకు మౌనము. వచ్చి నేలమీఁదఁ గూర్చు నెను. కదురుతో నూలువడుకుచుండెను. మహాత్ముఁడు మౌనము, ఎల్లరు మౌనము, మాటయే లేదు."

—మాంటుస్సోరి.

మౌనవ్రతాచరణముచే ఆత్మజ్ఞానము, సహనము, విన యము, ప్రేమ మొదలగు గుణము లబ్బును. మౌనమువలన మానవుఁడు తన క్షేమముకంటె నితరుల క్షేమమునకు మక్కువ పడును.

## మౌ న ము

మౌనము వలనఁ గలుగు లాభము లనంతములు. శక్తి సహన ధైర్యాది గుణములు గలిగి సర్వవిధముల నుత్తేజపఱచి మానవుని సత్యశీలునిగాఁ జేయఁగలదు. మానవుని యభ్యున్న

తికి అహంకారము తొలుదొల్తగా నశింపవలెను? ఆ పిమ్మట మమకారము. ఈ యహంకార మమకారాది వికారములు నశించినఁగాని మానవాభ్యుదయము కలుగఁ జాలదు. ఈ విషయమై మన ప్రాచీన గ్రంథములు పెక్కు విధముల వాకొను చున్నవి. అందు మితభాషణము ముఖ్యము. ఈ విషయము గ్రంథాదిని సూక్ష్మముగాఁ జెప్పఁబడి యుండెను. మహాత్ముఁడు మౌనవ్రతాచరణముచే నహంకారాది వికారముల నణఁచు కొనఁగలిగెను. మౌనమును గుఱించి మహాత్ముఁడు,

## సత్యము — ధైర్యము

మహాత్ముఁడు బాల్యమునుండియు మితభాషి. మిత భాషణము సత్యమును వచింపఁజేయును. అందువలన ధైర్యము కలుగును. ధైర్యము సత్యమును, సత్యము ధైర్యమును గాపాడు చుండును. సత్య ధైర్యములు పరస్పరాశ్రయములు.

సత్యమననేమి? సత్యమువలన మానవత్వము రక్షింపఁ బడును. మానవత్వము వలనఁ బ్రపంచము రక్షింపఁ బడును. అందుచే శాంతి సౌఖ్యము లొనఁగూడును. సత్యమే దైవమని మహాత్ముని యభిప్రాయము. మహాత్ముఁడు,

‘ఎన్నఁటికి ఉండునది యొకటి. అది సత్. సత్ నుండి పుట్టినది సత్యము. సత్యమే దేవుఁడు.”

అనియు,

“సత్యమును శోధించుట యన భగవంతుని దెలిసికొనుట. అదియే ప్రాణులు పొందఁదగిన పరిపూర్ణదశ”.

అనియును,

"సత్యమునకు మించినదేదియు లేదు. సత్యమును సాధించుటకు మనము ప్రయత్నింపవలెను."

అనియు వ్రాకుచ్చిన మాటలు మనము మననముచేయఁదగినవని గ్రహింపుఁడు.

# అహింస

అహింసాధర్మమేది? అహింస యనఁగా హింసకానిది; లేక హింస లేనిది. దీనినిబట్టి యితర ప్రాణులను హింసింపకుండుటను అహింస యని యర్థము చెప్పెదరు. కాని అహింస యను పదమునకు విమర్శించుకొలఁది విరివిగా నర్థము కలదిగాఁ గానిపించును.

అహింస యను పదమునకు ఇతరులను హింసింపకుండుట మాత్రము కాదు; తనను ఇతరులు హింసించు నప్పుడును వారి మీఁదఁ గోపము చెందరాదు; ఆ హింసించువారిని హింసాకర్మమునుండి రక్షింపఁదలఁచి, వారిని ప్రేమించుచు కష్టముల నైన ననుభవించుట 'అహింస' యను పదమున కర్థమని చెప్పకొన వచ్చును. ఇతరులకు హానిచేయ కుండుటయును, ఇతరులు చేయు హానిని ప్రేమతో ననుభవించుటయును 'అహింస' యను నెడల అహింసా ధర్మమం దెన్నియో సుగుణములు గలిగియుండును. ఇతరులకు హింసచేయకుండుటయు, ఇతరులు చేయు హింసను సహించుటయును – అందును ప్రేమతో సహించుటయును – ఎంత యపూర్వము ! కాఁగా నది యెట్లు సాధ్యమగును ? మన మనుకొనిన యీ అహింసాధర్మ మెవరియందుఁ గాన నగును ? అట్లుండుట, లోకమందు సాధ్యమా ? ఎంతటి

మహనీయులైన నిట్టి యపూర్వమగు అహింసాధర్మ మాచరించుట, పట్టువడుట సాధ్యమా ? నరేంద్రియములను జయించిన సంయమీంద్రులు సహితము అహింసా ధర్మమును నిర్వహింపలేనప్పుడు మఱి యెవరికి సాధ్యమగును ? సమస్త జ్ఞాన ప్రపంచమున అహింసా ధర్మముకంటె నుత్తమ ధర్మ మొండు లేదని చెప్పనచ్చును.

ఈ కారణమును బట్టియే 'అహింసా పరమోధర్మః' అని మన ప్రాచీన జ్ఞానవేత్తలు బోధించి యుండిరి. సాధారణముగా అహింస యనుటకు హింస చేయకుండుట యని యర్థము చెప్పుట కలదు. హింసచేయనివారే పుణ్యులని మన మనుకొనుటయుఁ గలదు. సర్వసద్గుణ ప్రపూర్ణమును సర్వదుర్గుణ రాహిత్యమును గలది యహింసాధర్మము. మనుష్యుఁడు తన యెడఁ గల దుర్గుణములన్నిటిని బాఱఁద్రోలు స్థితి, యహింసా ధర్మ స్థితి యనబడును.

ఈస్థితి వలననే లోకమున జీవిత మేర్పడుటకుఁగారణ మగుచున్నది. ప్రపంచమందు మానవుఁడు చదువుకొనుటయు, కృషి చేయుటయు, పెండ్లాడుటయు, బిడ్డలఁ గనుటయు, ప్రేమించుటయు నేర్పడుటకుఁ గారణమేమి? తుదకు నే ప్రాణిని హింసింపక, ధర్మమున నడచుకొనుట గొప్పస్థితి యనుట కేగదా? ఇతరులను కోపించినను, చెడుగునకు చెడుగు చేయుచున్నను, ఈ స్థితి యంతమగును. హానికి హాని చేయక ప్రేమతో నా హాని ననుభవించు సహనబుద్ధి గలవాఁ డొక్కఁడే తనవలె నితరులను స్నేహబుద్ధిని జూచుటకు సమర్థుఁ డగును. మనస్సునందు హింసాబుద్ధి గలవాఁడు తనవలెనే యితరులను జూచుకొన నెట్లు సమర్థుఁడగును ? అహింసకు– అహంకారమునకు బొత్తిగా

పొత్తు కుదురదనుట నిక్కము. ఈ యహింసా ధర్మమే మానవుని సహజ ధర్మము. సహజమగు నాదర్శ జీవితమునకు మూలమైనది యీ యహింసా ధర్మమే.

ఈజ్ఞానమును బోధింపని మతము లోకమందులేదు. సర్వమతములు అహింసా ధర్మమును బోధించుచున్నవి. ఇతరులు చేయరాని చెడుగును జేయుమని యేమతమైనను బోధించునా? వివిధ నామములతోఁ బిలువఁబడు మతము లన్నిటిని అహింసా ధర్మ మను నొక పేరుతోఁ బిలువ వచ్చును. పూర్వమే యీ ధర్మమునకు పెక్కుమంది జ్ఞానవేత్తలు శ్రీకారమును జుట్టిరి. ఈ ధర్మము మానవులకు యుక్తము నాచరణీయము నగు మత ధర్మముగాఁ బోషింపఁబడుచు వచ్చుచున్నది. అశోక చక్రవర్తి ఆత్మజ్ఞానము; దయాపాత్రమై యీ భూమియందు వ్యాపించి స్థావర మేర్పఱచుకొనుటను ఎవరు కాదనఁగలరు ?

ఈ రీతిని బెరుఁగుచు వచ్చిన ధర్మము ప్రపంచమందు యంత్రములు పుట్టిననాఁటినుండి క్షీణింపఁ దొడఁగెను. ఇప్పుడు ప్రపంచమును బాలించుచున్న స్వార్థపరత్వముగల ప్రభుత్వము లన్నియు హింసాపూరితములు. ఆప్రభుత్వములకుఁ దగినట్లు దేశ మందలి జీవనపద్ధతులు హింసాపూర్వకము లగుచున్నవి. ప్రపంచము మారణ వ్యాపారమునకుఁ బడికట్టురాయిగా మాఱుచున్నది.

ఇట్టి దినములందు ప్రపంచమునఁ బ్రాచీన ధర్మము లుద్ధరించుటకు కొందఱు మహానుభావులు నచ్చటచ్చట నుద్భవించుచుందురు. వారిలో ముఖ్యముగా నిద్దఱు మహాపురుషులను బేర్కొనఁదగును. అందు, ఒకరు రష్యాదేశమం

దుద్భవించిన టాల్ స్టాయి; మఱియొకరు మన నోములపంటయై మన దేశమం దవతరించిన గాంధిమహాత్ముఁడు. టాల్ స్టాయి మనస్సులో — మాటలో — వ్రాతలో అహింసా ధర్మమును ప్రబోధించువాఁడు. మన గాంధిమహాత్ముఁడు ఆ అహింసా ధర్మమును సమగ్రముగాఁ దన యనుభవమునకుఁ దెచ్చుకొని ప్రపంచమం దా ధర్మమును వ్యాపించుటకుఁ బ్రయత్నించు వాఁడు.

గాంధిమహాత్ముని జీవితమందు అహింసాధర్మ మభివృద్ధి గాంచినదనియు, మహాత్ముఁడు లోకమం దా ధర్మమును వ్యాపింపఁజేయుట కేవిధముగాఁ బ్రయత్నించుచున్నదియు మహాత్ముని జీవితమును (ఆత్మ కథను) కనుగలిగి చదువు కొనుఁడు. ఈ గ్రంథ లక్ష్యమునకుఁ గొన్నిటి నిట నుదాహరించుచున్నాఁడను.

### మాంసము తినకుండుట

మహాత్ముఁడు జన్మించిన కులము మాంసభక్షణము చేయని కులము. 'ఆహారము ననుసరించి బుద్ధి పెంపొందున'ని పెద్ద లందురు. పెద్దల వాక్యానుసారము మాంసాహారము భుజింపకుండుట అహింసాధర్మ మనుష్ఠించుటకుఁ గారణభూతముఁ డాయెనని యొకవిధమునఁ జెప్పవచ్చును. 'మాంసాహారము విసర్జించుటయే అహింసా ధర్మ'మని కొందఱు పెద్దలందురు. అది యొక కారణము కావచ్చును. కాని యంతమాత్రముననే యహింసాధర్మ మనుష్ఠించినవా రైరనుట తలఁపరాదు. మాంసాహారము ముట్టని వారెందఱో లోకమందు హింసాకర్మ చేయుచున్నా రనుట యెల్లరెఱిఁగిన విషయమేగదా ! మాంసా

హారమునకు పారంపర్యముగా నలవాటు పడనివారును హింసా కర్మములను జేయుచుండుట మన మెఱుఁగుదుము. వారు మాంసాహారమును దినకయే యితర హింసాకర్మ రతులగు చున్నారు. మాంసాహారమును కావించినంతమాత్రముననే వారు దయార్ద్ర హృదయు లగుదురా? మాంసాహారమును భుజింప రాదనుటలో నాంతర్యమేమి? జీవహింస చేయరాదనుటయే గదా! పారంపర్యముగా మాంసాహారము సేయనొల్లనివారు సహితము ప్రాణిహింస చేయువారే యగుదురు. ప్రాణిహింస యనఁగా హత్యచేయుట మాత్రమే గాదు. హత్య చేయకయే యితరులను హింసించుట, యితరుల యూడిగముచే బ్రదుకుట, వడ్డీలతో బాధించుట, దొంగతనము చేయుట, మత్తు పానీయ ములు సేవించుట, పరకాంతలను మోహించుట, అబద్ధ మాడుట మొదలగు చేయరాని పనులు చేయుట హింసాకర్మ ములే యగును. అందుచే మాంసాహార విసర్జన మొక్కటియే మహాత్ముని యాశయమని భావింపరాదు. మాంసాహార విస ర్జనముతోఁబాటు గార్హస్థ్యము, త్యాగము, జీవితలక్ష్యము, కోపము లేకుండుట, అబద్ధ మాడకుండుట, అపకారమునకుఁ బ్రతిక్రియ చేయకుండుట, సహనము మొదలగు సత్యాగ్రహ గుణములు గలవారు జ్ఞానులు లేక అహింసా ధర్మమూర్తు లగుదురు.

## అస్పృశ్యత

మహాత్ముఁడు చిన్నతనముననే యస్పృశ్యత మానవ సంఘమునకు విద్రోహకరమని గ్రహించుట మహాత్ముని గొప్ప తనము చెప్పకయే చెప్పుచున్నది. మానవులందొకఁడు స్పృశ్యుఁడు

మఱియొకఁ డస్పృశ్యుఁడనిభావించి యారెండవవానిని బాధించు నట్టి భేదభావము మానవునకుఁ గళంకమగును. సదసద్వివేకము గల మానవుఁడు పుట్టుకనుబట్టి యెచ్చులొచ్చులు నిర్ణయించుట స్పృశ్యతా స్పృశ్యతలు నిర్ణయించుట యుక్తమా? సాటివారి నస్పృశ్యులనుగా భావించు మానవులు తమ మానవత్వమును గోల్పోవుట కాదా? అస్పృశ్యతను బాటించు మానవుఁ డెంత విజ్ఞాని యైనను మూర్ఖుఁడే యగును. 'మానవులలో నస్పృశ్యు లుందురా? ఆహా! ఎంతటి మౌర్ఖ్యమ'ని బాల్యముననే ఖేద పడు జ్ఞాన హృదయముగలవాఁడు మన గాంధిమహాత్ముఁడు. అజ్ఞానమువలన తన జీవితమందు ఏ ప్రాణికిని హింస చేయరా దను సంకల్పము గలవాఁ డగుటవలన గాంధిమహాత్ముఁడు బ్రాహ్మణుఁడు - జగమెఱిఁగిన బ్రాహ్మణుఁ డయ్యెనని చెప్ప నగును. ఈ గ్రంథమందలి 'పుట్టుక' యను ప్రకరణమం దీ యస్పృశ్యత విపులీకరించితిమి.

## తప్పులను సహించుట

మహాత్ముని దక్షిణాఫ్రికా జీవితము మహాత్ముఁ డగు టకు నాంది యని తలఁపవచ్చును. దక్షిణాఫ్రికాలో దోసిళ్ళతో ధనము సంపాదించు బారిష్టరువృత్తిని పిశాచవృత్తిగా భావించి యుద్దానిని త్యజించి పీడిత ప్రజానీకమునకు సేవచేయ సంక ల్పించి తన సర్వస్వము దేశసేవకు వినియోగించిన మహాత్ముని గొప్పతనమును గీర్తించుటకు మన మెంతవారము? దక్షిణా ఫ్రికా యందు తెల్లవారిచేతను, ఇతరులచేతను దాను దెబ్బలు తినినప్పుడును, చెఱసాలయందు నిర్బంధింపఁబడి నప్పుడును, ఇతరుల మలమూత్రాదికముల పాకీ దొడ్లను బరిశుభ్రము

చేయునప్పుడును మన మహాత్ముఁడు చలించి యెఱుఁగఁడు. ఎవరి నేప్పుడు నేమియు నని యెఱుగఁడు; పోలీసులు నడివీధి యందుఁ దనను గొట్టినను మిత్రులు బలవంతపెట్టినను ఆ పోలీసుల మీఁద కేసు పెట్టి యెఱుఁగఁడు; తనను జావమోది యిడ్చిన ఆఫ్గనీయుల నేవిధమునను బాధింపవలదని 'ఎస్కాంబీ' యను నధికారిని బ్రార్థించిన కరుణాసముద్రుఁడు మన మహాత్ముఁడు. దక్షిణాఫ్రికా తెల్లవారు మూర్ఖులై మన భారతీయులను హింసించుచుండుటను జూచి మన మహాత్ముఁ డేమి చేసెను? అట్లు బాధించుచున్న తెల్లవారిని తిరిగి బాధింపవలయుననియో, కొట్టవలయుననియో మన మహాత్ముఁడు అచటి భారతీయులను హెచ్చరిగొట్టలేదు. మహాత్ముఁడు 'అయ్యో! భగవంతునిచే సృష్టింపఁబడిన యీ తెల్లవారు మూర్ఖులై సోదరభావమునే చంపుకొను చుండిరి. మూర్ఖత లేనిచో, నీ తెల్లవారు మంచివారు కాఁగలర'ని యా తెల్లవారిని తెల్లముగాఁ బ్రేమించుచు, భారతీయులను సహనశక్తితో నెదుర్కొనుటకు సిద్ధము చేసెను. దక్షిణాఫ్రికా తెల్లవారికి సోదరభావమును గలిగించుటకు తనతోఁబాటు భారతీయులను గష్టసహిష్ణుత గలవారినిగాఁ జేసెను. భారతీయులను సత్ప్రవృత్తి గలవారినిగా దిద్దితీర్చిన మహాత్ముని గొప్పతన మెన్నఁటికి మఱువరానిది.

## నిరశనవ్రతము

అహింసాధర్మము మీఁద మహాత్మునకుఁ గల ప్రేమ యపారము. మహాత్ముఁడు తాను నిరశనవ్రతమును బూని త్రికరణశుద్ధిగా నహింసాధర్మ మాచరింపవలయునని లోకము

నకు బోధించుట యపూర్వము. పేదలను గనికరించుట న్యాయ మనియు, పేదలను బాధించువారిని బొరఁబాటుననైనను బరుషము లాడవలదనియు, వారి హృదయ పరివర్తనమునకై నేనీ నిరశనవ్రతము పూనుచున్నానని మహాత్ముఁడు మనోజ్ఞానిరై మానవాళినిఁ బ్రబోధించెను.

కు టుం బ ము

ఈ కథవలన మనకు అహింసాధర్మము స్త్రీ మూలము ననే కలుగునని బోధపడుచుండుట లేదా! కావున అహింసకు గేస్తురాలు, గార్హస్థ్యము మూలమని స్పష్టము.

మగవాఁడు మగువను గూడియుండిన కాఁపురమే క్రమ క్రమముఁగా, కుటుంబముగా నభివృద్ధి యగుచుండును. ఆలు మగలు అహింసాధర్మ పరాయణులై తమ సహజీవనమును నేర్పున నడుపుకొందురేని వారి కుటుంబముకూడ నహింసా ధర్మ పరాయణమై విలసిల్లఁగలదు. గృహమున మొలకెత్తిన యహింసాధర్మాంకురము కాలక్రమమునఁ గుటుంబమందుఁ బ్రాఁకి, మెలమెల్లగా గ్రామము, దేశము, ప్రపంచములందు వర్ధిల్లఁగలదు. లోకమొక కుటుంబముకదా!

"అహింస, కుటుంబమందుండియే పెంపు వహింపవలె" నని మహాత్ముఁడను గ్రహించిన యనుభవవాక్యములు ప్రపంచ సౌభాగ్యమునకు మూలము.

అహమ్మదాబాదు గుడ్డలమిల్లులకుఁ బ్రసిద్ధి. అచట ఆ మిల్లు పరిశ్రమవలనఁ బెక్కురు సుఖజీవనము చేసికొను చుండిరి. ఆ పరిశ్రమశాలలందు వేలకొలఁది పారిశ్రామి

కులు పనిచేయుచుండిరి. ఆ నగరమందు 1918 సెప్టెం
బరుమాసములో 'ప్లేగు' విపరీతముగా వ్యాపించుటవలన ఆ
వ్యాధికి లోనై ప్రజలు సంకటపడుచుండిరి. అందుచే నచటి
పారిశ్రామికులు భయపడి ప్రక్క పల్లెలకు దలదాఁచుకొనుటకు
బయలుదేఱఁ దలఁచిరి. ఆ సంగతి మిల్లు యజమానులు తెలిసి
కొని తమ మిల్లులు మూఁతపడునని భయపడి పారిశ్రామికులకు
నూటికి డెబ్బదివంతున సంబళము పెంచినట్లు ప్రకటించిరి.
పాపము, దారిద్ర్యముచే బాధపడుచున్న యీ పారిశ్రామికులు
ధన పిశాచమున కాశచెంది ప్రక్క గ్రామములకు వెళ్ళఁదలఁ
చినవారు తమతమ పయనములను మానుకొనిరి. వ్యాధి తీవ్రత
తగ్గినపిమ్మట మిల్లు యజమానులు తాము పెంచిన పారిశ్రామి
కుల జీతమును నిలిపివేసిరి. అందుచే మిల్లు యజమానులకు -
పారిశ్రామికులకుఁ బలువిధములుగా వివాదము కలిగెను. యజ
మానులు నూటి కిరువదివంతున జీత మధికము చేయఁగలమని
చెప్పెదరు. పారిశ్రామికులు నూటికి నేఁబదివంతునఁ బెంచవల
యునని యడుగుదురు. ఇట్టి వాదములతోఁ గాలము గడచి
పోవుచుండెను. పారిశ్రామికులు జీతములు లేక జీవనమునకుఁ
గటకటపడుచుండిరి. మిల్లు యజమానులు తమ పిడివాదమును
సడలింపరైరి. ఇటు తెగలమధ్య కలఁతలు - స్పర్థలు పెరుగఁ
జొచ్చెను.

అట్టి సమయమున 'చాంపరా' యందుండిన గాంధి
మహాత్మునకీ విషయమును 'అనసూయాబాయి' అను నామె
చెవినివేసెను. ఇఁక నేమి? "సిరికింజెప్పఁడు శంఖచక్రయుగమున్
జేదోయుసంధింపఁడేపరివారమున్ జీరక" గజేంద్రుని గాపాడుటకై
వెడలు వెన్నునివలె, మహాత్ముఁడు వెంటనే అహమ్మదాబాదుపోయి

యీచటి పరిస్థితిని స్వయముగా నాకళించుకొని పారిశ్రామికుల కోరిక న్యాయమయినదని తెలిసికొనెను. పారిశ్రామికులవాదము న్యాయయుక్తమగుటవలన వారిపక్షమునఁ జేరి యీ పారిశ్రామికులకోరికలు ఫలించుటకై ప్రయత్నము చేయఁబూనెను. నిరుపేదల న్యాయము ఫలించుట దేశకళ్యాణముగదా! నిరుపేదల బాధలువిని జాలిపడి వారికి సహాయపడకుండ మనమహాత్ముఁ డుండఁగలఁడా? మహాత్ముని యాత్మశక్తి యీ పేదలబాధల నివారింపఁజాలదా? ఆ యహమ్మదాబాదు మిల్లు యజమానులలోఁ గొందఱు మహాత్మునికి ప్రమిత్రులును గలరు. ఆ స్నేహము మహాత్ముని కార్యదీక్షకు న్యాయదక్షత కడ్డు రాలేదు. మహాత్ముఁడు, మిల్లు యజమానులకు-పారిశ్రామికులకు న్యాయము కలుగునట్లు వారివివాదములు పరిష్కరింపఁ బూనెను. మా మిల్లులలోఁ బనిచేయునట్టివారికి-మాకుఁ గలిగిన వివాదములలో నితరుల జోక్యమేల? మా యిఱుతెగల వివాదములను మేము పరిష్కరించుకొనలేమా? ఇతరులు పిలువని పేరంటముగావచ్చి యీ వివాదములందుఁ దలఁదూర్చనేల? అనవసరముగా మీమధ్యవర్తిత్వమేల మహాత్మా? యని మేల మాడుచు మహాత్ముని మధ్యవర్తిత్వమును మిల్లుయజమానులంగీకరింపరైరి. అంతట మహాత్ముఁడు ఏకారణమున్నైననేమి మూర్ఖతవహించుట మేలుకాదనియుఁ దమకిచ్చుచున్న జీతమున కిష్టపడి మిల్లులకు వెళ్ళువారి నెవరును 'వలద'ని నిర్బంధింపరాదనియు, మిల్లులకుఁ బోవకుండ పనిని నిలిపివేసిన వారెవరును దిండికై తిరిపెమెత్తుకొని పొట్టపోసికొనరాదనియు, పనిమానుట యెన్ని దినములయినను మిల్లుయజమానుల శరణు వేఁడరాదనియు, నితరముగాఁ గూలినాలిపనులు చేసికొనవచ్చునియు మొదలగు కొన్ని కట్టుబాటు లేర్పఱచి మిల్లుపనులను నిలిపి

వేయవలసినదిగాఁ బారిశ్రామికులను గోరెను. కోరినతడవుగా నా పారిశ్రామికులు మహాత్ముఁ డాజ్ఞాపించిన నియమములను దలఁదాల్చి మిల్లుపనులకుఁ బోనొల్లమని శపథములు పూనిరి.

రెండు వారములు పారిశ్రామికులు మహాత్ముని యాజ్ఞానువర్తులై, నియమబద్ధులై సమ్మె చేసిరి. మూఁడవ వారములో నా పారిశ్రామికులలోఁ గొందఱు స్వార్థపరులై మిల్లుపనులకు వెళ్ళుట కారంభించిరి. అయినను పెక్కుమంది వెనుకటియట్లు సమ్మె నిర్విఘ్నముగా జైత్రయాత్రవోలె సాగించుచునే యుండిరి. మిల్లుపనులకు వెళ్ళుచున్న వారిని సమ్మె చేయువారు బాధింపఁ బ్రయత్నించిరి. పారిశ్రామికులు పట్టిన పట్టునకై ప్రాణములనైననీయఁ దెగువగలవారని కొంతవఱకు నూహింపవచ్చును. మిల్లుపనులకు వెళ్ళువారిని బాధించు ప్రయత్నము మహాత్ముని చెవిసోకెను. మహాత్ముఁడందులకు మిగుల వగచెను. "న్యాయముగాఁ బరిష్కారమగువఱకుఁ బారిశ్రామికులు తమతమ పనులకు వెళ్ళుటను దృఢమనస్సుతో మాని వేయవలెను; లేదా మిల్లు యజమానులు చెప్పిన చొప్పున నొప్పుకొని సమ్మెను విరమించి పనులకుఁ బోవలెను." ఈ రెండింటిలో నేదియో యొకటి నెఱవేఱువఱకు నేను భుజింప న"ని మహాత్ముఁడు ప్రకటించెను. ఈ వార్తపొక్కఁగానే పారిశ్రామికులు ఆందోళిత మనస్కులై మహాత్మునిఁజేరి మా కొఱకుఁ దమకు నిరశనవ్రతము పూనవలదనియుఁ దమ నిర్ణయ ప్రకారము సమ్మె సాగింతుమనియుఁ జెప్పుకొనిరి. కాని మహాత్ముఁడు వారలకుఁ గొన్ని సదుపదేశములుచేసి నిరశనవ్రతమునుబూనెను. మిల్లు యజమానులు గాంధిగారిని మహాత్ముఁడని యా సమయముననే తెలిసికొనఁ గలిగిరి. ఆ మిల్లుయజమాను

లింతవఱకుగాంధిమహాత్ముని మాహాత్మ్య మెఱుఁగనంత మాత్ర మున యథార్థమును భగవంతుఁడు వెల్లడింపకుండునా? మనో వాక్కాయములను ప్రజాసేవకై యర్పణగావించిన వానిని గాపాడువాఁడు భగవంతుఁడు కాఁడా? భగవత్సంకల్పముచే మిల్లు యజమానులు తమకుఁ దెలియకుండఁగనే మహాత్ముని యొద్దకు వచ్చి పరిష్కారము చేసికొనిరి. ఇట్లు పరిష్కారము పారిశ్రా మికులకు లాభముగా నుండుటవలన మహాత్ముని యాదేశాను సారము సమ్మెను జాలించిరి. మహాత్ముఁడు నిరశనవ్రతమును విరమించి భుజించెను. పేదలకొఱకు - జీవకారుణ్యముకొఱకు- నిరశనవ్రతమును బూనువారు నేఁటికాలముచఁ బ్రపంచమందెంద రుందురు?

మహాత్మాగాంధి తనపేరుతో నితరులు చేసిన దుష్ట కార్యములకుఁ దాను నిరశనవ్రతమునుబూని తమను-ఇతరులను గూడ చెడుగులనుండి మఱలించుటకును ఆత్మజ్ఞానమును బెంపొందించుకొనుచు వచ్చెను.

1919 వ సంవత్సరము చట్టసభలో భారతీయుల యాత్మ గౌరవమును గూలఁద్రోయునట్టి 'రౌలటు చట్టమ'ను మేడి పండు నొకదానిని ప్రభుత్వమిచ్చుట యెల్లరికిఁ దెలియును. ఆ చట్టము నెట్లైన నోడించి తీఱవలెనని మహాత్ముఁడు సత్యా గ్రహముచేయ సంకల్పించెను. అందులకై ప్రచార నిమిత్తము పాంచాల దేశమునకుఁ బయనముకాఁగా; ప్రభుత్వమువారు 'పాంచాల దేశమున నడుగిడరాద'ని మహాత్ముని నాజ్ఞాపించిరి. ఆ యాజ్ఞను ధిక్కరించిన మహాత్ముని నధికారులు రైలునుం దెక్కించుకొని యెటకో గొంపోయిరి. "ప్రభుత్వమువారు మన మహాత్ముని నెచటికో తీసికొని వెళ్ళుచున్నారు? ఏమి చేయు

దురో" యని యన్నెము పున్నెమెఱుఁగని ప్రజానీక మెచ్చటి కచ్చట గుమిగూడి మాటాడు కొనుటతోఁ ప్రభుత్వమువారు పుండుమీఁదఁ గారము పులుముకొనిన చందమున శైవమెత్తి కోపముతో పాంచాలదేశము - బొంబాయి - అహమ్మదా బాదు - గుంటూరు మొదలగు తావులందు 'లాటీచార్జీలు' సాగించి ప్రజలను బాధించిరి. మహాత్ముఁ డా యల్లరుల వలన దేశీయులకుఁ గలిగిన కష్టనష్టములను విని మిక్కిలి ఖిన్నుఁ డయ్యెను. అహింసాధర్మ పరమార్థమును గ్రహింపనేరని దేశ నాయకు లేమిచేయఁగలరు? "ఏ మేమి ? నా కొఱకై యిట్టి యుపద్రవములు పుట్టుటయా ?" యని మహాత్ముఁడు మిక్కిలి పరితపించెను. కరుణానిధి యగు మన మహాత్ముఁడు అత్యంత పరితప్త హృదయముతో "ఇది సత్యాగ్రహమా ? దురాగ్ర హమా ?...... ఈ పాపకృత్యములు జరుగకుండ నుండుటకై మూఁడు దినములు నిరశనవ్రత మవలంబింప నిశ్చయించితిన"ని యా వ్రతమును పూని సత్యాగ్రహమును నిలిపివేసెను.

అపూర్వమయిన యీ నిరశనవ్రతము, భారత దేశము నాలుగు చెఱఁగులు విస్ఫుల్లతవలె మెఱయుచున్న సమయ ములో నింగ్లాండు రాకుమారుఁడు భారత దేశమునకు వచ్చు సందర్భములో నధికారులు మొదలగు వారందఱు పెద్ద పెద్ద స్వాగత మీయ సంసిద్ధులయిరి. అయితే, అట్టి తఱి, రాకుమా రుని స్వాగత సందర్భములోఁ బాల్గొనరాదని మన భారతీయు లను మహాత్ముఁ డాజ్ఞాపించెను. ఆ యాజ్ఞకు సమ్మతింపనివారు (పారసీకులు - క్రైస్తవులు) రాకుమారుఁడు బొంబాయి రేవు చేరఁగానే యెదురుకోలు సంబరములోఁ బాల్గొనిరి. అట్లు పాల్గొ నుట నిరసించువారిని, (హిందువులు - మహమ్మదీయులు)

పాల్గొనని వారిని, ప్రభుత్వమువారు దౌర్జన్యముతోఁ జావ మోదిరి. ఆ బీభత్స సమయమున భారత దేశ స్వాతంత్ర్య ప్రియులు విదేశ వస్త్రములను బ్రోగుచేసి నిప్పంటించి తిరిగి వచ్చుచున్న వారిని, ఆ ఘోర దృశ్యమును జూచి మిగుల కలఁత చెంది "దేశము ప్రశాంత మయినఁగాని నేను భుజింపన"ని మహాత్ముఁడు ఘోర కఠోర నిరశనవ్రతము పూనెను. అట్టి యుద్రేక వాతావరణ పరిస్థితి యందుండఁగా దేశమంతయుఁ "ప్రశాంత పరిణామము పొందుటయెట్లు? మహాత్ముఁడు నిరశనవ్రతము మానుటయెట్లు ? అని పలువిధముల భారత భూమి త్రొక్కు-లాడెను. ఎవరును ఎట్టి సందర్భమున నైనను 'గలభా' జరుగు తావులకుఁ బోరాదని భారతీయులు తమలోఁ దాము గూడఁ బలికికొనిరి. 'గలభా' జరుగు తావులకు, వెళ్ళి యచటి వారిని ప్రార్థించి యెట్టి యల్లరులు జరుగకుండునట్లు చేయుటకు భారతీయులు నిశ్చయించుకొనిరి. మహాత్ముఁడు నిరశన వ్రతము పూను లోపల దేశమునంతటను ప్రశాంతతను గలిగించి దేశ నాయకులందఱు మహాత్ముని దఱిజేరి "దేశము ప్రశాంతముగా నుండుటకుఁ గడు కట్టుదిట్టముగాఁ బనిచేయుచుంటిమి. కావునఁ దమరు భుజింపుఁడ"ని దేవతలు క్షీరాబ్ధిశయనుని శ్రీమహావిష్ణువునిబోలెఁ బ్రార్థించిరి. వారి వేఁడుకోలు మీఁదను, దేశము ప్రశాంత సముద్రమువోలె నుండుట వలనను భారతీయుల హృదయములు చల్లఁబడునట్లు మహాత్ముఁడు భోజన మారగించెను. ఆహా! దేశభద్రతకు మహాత్ముఁడనుసరించు మార్గము ప్రపంచ చరిత్రయందు నపూర్వముగదా !

అంతటితో దేశమందలి యల్లకల్లోలము లణఁగినవి. అట్లు నిరశనవ్రత మహిమచే దేశమందంతటను ప్రశాంతవాతా

వరణము పెల్లుబికినది. మహాత్ముఁడిట్లు ఎన్నియో అగ్నిపరీక్ష లకుఁదాళి యహింసా ధర్మమును సంరక్షించుచుండెను.

సంయుక్త పరగణాలయందు గోరఖ్‌పూర్ జిల్లా యందు చౌరీచౌరా యనునొక చిన్నగ్రామము గలదు. ఆ యూరి యందే కారణముననో యాకస్మికముగా నొక పెద్దవిప్లవము చెలరేగెను. ఆ విప్లవము పోలీసులకు-ఊరివారికిమధ్య ద్వేషము ప్రబలి గొప్ప విప్లవయుద్ధముగా మాఱెను. పోలీసులు తుపాకు లతో ముట్టడింపఁగా నటుచేతఁ బ్రాణముపట్టుకొని తెగించి యా యూరిప్రజలు కోపోద్రిక్తులై ఆకసము బ్రద్దలగునట్లు 'మహాత్మా గాంధికిజై' యను జయజయ నినాదములు గావించుచు పోలీసు లపైఁబడిరి. అంతట నాయుధపాణులగు పోలీసులు నిర్దయులై యా యమాయక ప్రజలను నూచకోఁతగాఁ గోసియు, ప్రజ్వ రిల్లుచున్న మంటలఁద్రోసియు ఘోరాతిఘోరముగాఁ బ్రజలను జంపి భారతదేశమును బీభత్ససముద్రమున ముంచిరి. ప్రజలు పోలీసులనుగూడ మంటలద్రోసి బూడిద గావించిరి. ఈ విధ ముగా పోలీసుల హింసాకాండ 'చౌరీచౌరా'లో పరాకాష్ట నందెను. ద్వేషముతోఁగూడిన కోపమెంతకైన దెగించును గదా! "కోపము మానవత్వమును జంపున"నిగదా పెద్దలందురు. కోపము ముదిరి యగ్నిగారేఁగి ప్రజలను గాల్చివేయును. కోపమా! నీ వెంతటికైనఁ దగుదువుగదా!

ఈ హత్యాదురంతము - ఎట్టిపరిస్థితిలో మహాత్మునకుఁ దెలిసెను? దేశముచేసిన తపమేమొ? ముప్పదికోట్ల భారతీయుల దురదృష్టము? స్త్రీలను హింసించిన పాపము-పురుషులలో నంట రానివారిని హత్యగావించిన పాపము-కట్టా! ఎట్టి చేయిదము? చేసినపాప మనుభవింపక తప్పునా? ఈ పాపము పెరిఁగి పెరిఁగి

'పన్నులీయ వద్దు' నెడు శాసనోల్లంఘనమును బురికొల్పి సబర్మతి నుండి 'బార్డోలి'కి బయలుదేఱిపోయి భారతదేశ ప్రతిష్ఠను గాపాడు సత్యవీరుఁడు-గాంధిమహాత్ముఁడు. సత్యము-ధైర్యము సను నాయుధములను జేపట్టి అహింసాధర్మ క్షేత్రసంగ్రామ రంగమున నిలువఁబడిన సమయమందు ముప్పదికోట్ల భారతీయ హృదయాంతరాళము లొక్కుమ్మడిని రాశీభూతమై యుద్ధమున నిలువఁబడిన సమయమందు ఏమగునో - ఏమగుదుమో'యని బ్రిటిషు సింహము-బ్రిటీషు ప్రభుత్వము గడగడవణకిన సమయ మందు ప్రపంచమంతయు నేమగునోయని దృష్టిసారించి చూచు చున్నసమయమందు "మహాత్మా! చౌరీచౌరాలో పోలీసులను హింసించిరి. అందుచేపోలీసులు పెక్కురుమడిసిరి"యనిమహాత్మని యెదుటదురంతదృశ్యము కానిపించెను. దేశమందలి లోపములు-కపటతంత్రములు-దేశమునకు మోక్షమిచ్చునా? అట్టిదేశమునకు శాంతిసౌఖ్యములిచ్చి కాపాడుటకు భగవంతుఁ డిష్టపడునా? ఎచ్చట నే కారణమున నే స్థితియందు హత్యలు జరిగినట్లు మహాత్ముఁడు వినెను? ఈ రహస్యము భగవంతుని రహస్య మెఱిఁగినవారికే యెఱుక! ఈశ్వరహృదయుఁడు - ఈశ్వర మిత్రుఁడు-అహింసావ్రత నైష్ఠికుఁడు-వేదాంతి-దాంతి-శాంతి యను మనమహాత్ముఁ డేమిచేసెను? మహాత్ముఁడు యుద్ధమును మఱచెను; బార్డోలిని మఱచెను; దేశమును మఱచెను. మహా త్ముని హృదయము చౌరీచౌరాకుఁ బఱుగులెత్తెను; హత్యా దురంతములకు గుఱియై, బలియై యసువులఁబాసిన శవములపై వ్రాలి మహాత్ముని మనస్సు కన్నీరు కాలువఁగట్ట ద్రవించెను. మహాత్ముని మనస్సు నిప్పుఁబడ్డ మిణుగురువలెఁ దప్తమయ్యెను. చలించెను; మహాత్ముని దయార్ద్రహృదయ మెట్లు పరితప్త మయ్యెనో యెట్లు వ్రాయుట? ఎవ్వానికిఁ దరము? మహాత్ముఁ

డేమిచేసెను? "హే భగవాన్! సర్వరక్షకా! సర్వాంతర్యామీ! కాపాడుము; కాపాడుమ"ని సర్వశక్తి సంభరితుఁడై సమరమును చాలించెను. ఆ విషయమును గుఱించి 'యంగు ఇండియా'లో మహాత్ముఁడు వ్రాసినదానిని పాఠకమిత్రులకై సంగ్రహముగాఁ దెలుపుచున్నాఁడను.

"భగవంతుఁడు నాయందుఁ బరిపూర్ణానుగ్రహము కలవాఁడు. శాసనోల్లంఘమునకుఁ దగిన సత్యమును అహింసను భారతదేశమింకను గ్రహింపలేదని భగవంతుఁడు మూఁడవపర్యాయము నాకు హెచ్చరికచేసెను. క్రమశిక్షణ, సత్యము, సహనము, ప్రేమ, హానిచేయకుండుట - యుద్ధవిముఖత మొదలగు గుణములు గలిగినదే నీతి."

"1919 వ సంవత్సరమున రౌలటుచట్టము ప్రవేశపెట్టినపుడే భగవంతుఁడు నన్ను హెచ్చరించియుండెను. అహమ్మదాబాదునందును-వీరబలియందును - అమృతసరము కుట్రకేసులందును ప్రజలు తప్పటడుగు వేసిరి. నేను ముందువేసిన పాదమును వెనకకు లాగికొంటిని. రౌలటుచట్టము నిలిపివేయుటతోఁ బాటు శాసనోల్లంఘమును నిలిపివేసితిని.

మఱొకమాఱు బొంబాయి ఉద్యమముతో భగవంతుఁడు నాకొక హెచ్చరికచేసెను. నవంబరు 17 వ తేదీన జరిగిన బొంబాయి దురంతములు కన్నులారఁ జూచుటకు నాకు భగవంతుఁ డవకాశమిచ్చెను. సహనశక్తి లేకుండుట యిట్టి చెడుగులు కలుగుటకుఁ గారణమయ్యెను. వెంటనే బార్డోలిలో శాసనోల్లంఘనమును నిలిపివేయవలసినదిగా నా కోరికను వెల్లడించితిని. 1919 లో జరిగిన ప్రాణహానికంటె నిది మిక్కిలి

దారుణమైనది. అది నాకు మేలే యొనరించెను. ఆ యుద్యమమును నిలుపుటవలన దేశము మేలు పొందఁగలిగెను. సత్యమునకు - అహింసకు భారతదేశము సహాయపడునదిగాఁ గానిపించుటలేదు."

"పిమ్మట మద్రాసు మఱియొక హెచ్చరిక చేసెను. అయితే దానిని గమనించనైతిని. భగవంతుఁడు చౌరీ చౌరా ముఖముగా నాకు గొప్ప జ్ఞానమును ప్రబోధించినవాఁడాయెను."

"హింసను అహింసచేతనే నిర్మూలింపవలెననెడి యహింసాధర్మ స్వరూప మెఱుఁగుటకుఁ జిహ్నము."

"సత్యమును - అహింసయును మాత్రమే నేను కోరునవి. దైవికమును నేను కోరుటలేదు".

"చౌరీ చౌరా దురంతములు బార్డోలీకంటె నధికమని వాదింపఁబడుచున్నవి......నా నిశ్చయమును బట్టి భారతదేశములో బార్డోలీ ప్రజలు ఒద్దికగలవారే. భారతదేశమందలి వివిధప్రదేశములలో ఒద్దిక - క్రమశిక్షణ కలుగనప్పుడు బార్డోలీ యొద్దిక ప్రయోజనమీయదు. 'గలభా'కు ఏ కొంచెపు కొంటె తనమైనను చాలదా? చౌరీ చౌరాలోఁ దలసూపిన చెడుగులే బార్డోలీని పాడుచేసెను."

శాసనోల్లంఘనము సఫలమగుటకు అహంకారమును వీడి సహనము కలిగియుండవలెననియు, ఉద్రేకము - ఆవేశములు పనికిరావనియు, ఆవేశము తగ్గుటకై శాసనోల్లంఘనోద్యమము నిలిపివేయఁబడెననియు, చౌరీ చౌరాహత్యాదురంతములు దేశసేవకులు కాని యితరులవలనఁ గలిగినప్పటికిని, తన

పేరచ్చుట నుపయోగించుటచేతను, ఆసమయమున దేశమందలి దేశసేవకులు కాని వారి సంఘముచేత నా దురంతములు జరుగ కుండఁ జేయఁబడకపోవుటచేతను, తా మేదో యొక విధముగా ఆ దురంతములు జరుగుటకు నిమిత్తమని భావించి తమను పవిత్రముకావించుకొనవలయుననియు, లోకమునఁ దనను సహాన సంపత్తిగలవానినిగాఁ జేసికొనవలయుననియును జెప్పి మహాత్ముఁడు నిరశనవ్రతమును పరిశుద్ధికై దినపంచక మాచరించెను.

హిందూ ముస్లిముల నైకమత్యము లేనప్పుడు దేశము స్వాతంత్ర్యము పొందఁగలుగుట యసంభవమని గ్రహించి గాంధి మహాత్ముఁడు అహర్నిశలు కష్టపడి హిందూ ముస్లిముల నైక మత్యమను దుర్గమును నిర్మింపఁగలిగెను. మహాత్ముఁడు చెఱసాలకుఁ బోయినప్పుడు ఆ హిందూ ముస్లిములనైకమత్య మనెడు కోట పగుళ్ళు వాఱ మొదలిడెను. హిందూ ముస్లిముల భేద భావము పలు తావులందు తగవులకుఁ దావలమై తాండవింప నుండెను. కొన్నిచోట్లఁ గొట్లాటలు బయలుదేఱెను. మహాత్ముఁడు చెఱనుండి బయటకు రాఁగానే యిఱు తెగలవారు విభేదభావములవలని నష్టములు తెలిసికొని మిగుల వగచి సంఘీభావముతో సంధిచేసికొని యీ భేదభావమును పీటఁబుచ్చి యేకత్వమున నుండుటకు సిద్ధతచూపిరి. మహాత్ముఁడు, ఒక సమయమున ఢిల్లీలో మౌలానా మహమ్మదాలి యింటియం దతిథిగా నున్నప్పుడు, గోహత్యనుగుఱించి హిందూ-ముస్లిములకు ద్వేష మంకురించి ప్రబలి యుద్ధముగాఁ బ్రజ్వరిల్లెను. అందుఁ బలువురు ప్రాణములు గోల్పోయిరి. తాళ్ళదెబ్బలు కొట్లాటలు-హత్యలు- మితిమీఱెను. ఈ దురంతములు మహాత్మునికిఁదెలిసి భారతీయులందుఁ గలిగిన యీయనైక్యభావమును

బోగొట్టుటకు మహాత్ముఁడున్న తావును వదలిపెట్ట లేద. అయితే ఏమిచేసెనని మీ రడుగవచ్చును? ఇరువదియొక్క దిన ములు నిరశన వ్రత మవలంబించెను. ఇతరులను నొప్పించుకంటెఁ దా నొప్పుట తగునని యహింసాధర్మ మూలసూత్రముచేఁ బ్రజలలోఁ జైతన్యము కలిగించి పరస్పర ప్రేమాదరములను గలిగించిన విషయమును వివరింపవలసిన పని లేదని మా పాఠక మహాశయులకు వేఁడికోలు.

## దండి

ఉప్పు సత్యాగ్రహమును బురస్కరించుకొని మహాత్ముఁడు 'దండి' గ్రామము చేరినప్పుడు, మధ్యమార్గాణమునందుఁ గొందఱు హింసాకార్యమునకుఁ గడంగిరి. అందులకుఁ బ్రభుత్వమువారు తగిన పూచీకత్తు నడిగిరి. అప్పుడుకూడ మహాత్ముఁడు హింసచేయుట తగదని చెప్పి తన యనుతాపమును బ్రభుత్వమున కెఱుకపఱచెను. ఆత్మశుద్ధిగా మహాత్ముఁడు తన మనఃక్లేశమును వెల్లడించి యుండెను.

ఆదిమవాసులు హిందువులు అను భేద మంతరించుటకు, ఆశ్రమ సేవకులెడ నెడఁజేసిన తప్పులు మొదలగు విషయము లకై మహాత్ముఁడు నిరశనవ్రతము పూనుట సర్వవిదితము.

ప్రజలు హింసా కర్మలకు దిగినప్పుడెల్లను హింసా కర్మలను మాని యేకమత్యముతో నుండుటకు అహింసా ధర్మమును బ్రబోధింపఁదలఁచి మహాత్ముఁడు పలు పర్యాయములు నిరశన వ్రత మాచరించుట గమనింపఁదగిన విశేషము. మహాత్ముని నిరశనవ్రతామృతము, ప్రజల హృదయములఁజొచ్చి వారి హృదయములను గలఁచివేసి కణకణమని ప్రజ్వరిల్లుచున్న

కోపాగ్ని నెట్లు చల్లార్చుచున్నదో యనుభవమువలన స్పష్టమయిన సత్యము. "ఒకరు చేయు చెడుగులకు మఱొకరు చేయు నిరశన వ్రతమెట్లు నివారకము కాఁగలదు? ఇమ్మూఁటికిఁగల సంబంధ మేమి?' యని యాశ్చర్యాత్తరములకుఁ దావుండును.

ఒకఁడు తన వఱకు అహింసాధర్మ మాచరించుచున్నను, తనవంటి యితరులనుగూడ నహింసాధర్మ మాచరించునట్లు చేయుటవలన తన బాధ్యతను దాను నెఱవేర్చుకొనిన వాఁడగును. ఆ ప్రయత్న మితరులకుఁ దెలియనిదిగానుండవలెను. ఇతరులు హింసా కర్మమును జేయుట చూచిగాని, వినిగాని అహింసాధర్మ వ్రతుఁడు ఉపేక్షించెనేని, అతఁడును అహింసా ధర్మ మాచరింపనివాఁడే యగును. ఒక తీరున నీతఁడును హింసా కర్మమును బ్రోత్సహించినట్లగును. హింసా కర్మమునుండి హింసా కర్ముని మఱలించుట అహింసా వ్రతుని విధియై యున్నది. హింసా కర్మములనుండి వారిని మఱలించుట యెట్లు సాధ్య పడును? అహింసాధర్మ స్వభావము ఇతరులను హింసాకర్మమును మాన్పించుటకుఁ దాము (అహింసా ధర్మపరులు) కష్టములనుభ వింపవలె ననుటయే గదా! మహాత్ముఁడు హింసాపరులను గోపింపకయే తాను నిరశనవ్రతము చేయుచుండెను. అందు వలన నితరుల మనస్సు పరిణతి పొందుటకు (తమ హింసా కర్మ ములను గుఱించి) మహాత్ముఁడు బాధ పడుచుండును. అట్లు బాధపడుటలో సంతరార్థ మేమి? ఇఁక మీఁదట హింసాకర్ములు హింసలను జేయరాదనుకొనుటయేగదా! నిరశనవ్రతావలంబులు తాము వినిన హింసా కార్యముల వలనఁ గలిగిన పాపములను తమ వ్రతముచేఁ బోఁగొట్టి పునీతము చేయువారగుదురు. ఈ

యంతరార్థము అహింసాధర్మ మందిమిడి యున్నదని తెలిసి కొందురుగాక!

"నా నిరశన వ్రతమువలన ప్రాయశ్చిత్తము, శిక్షయు, గలుగును. ప్రాయశ్చిత్తము నన్ను, బునీతుని జేయును; దండన, యితరులను (హింసాపరులను) పునీతులను జేయును"

"ప్రేమతో నితరుల మేలునకుఁ దాను బాధపడ వలెను."

"నా వ్రతము భగవంతుని గుఱించియు, నన్ను గుఱించియు." నని మహాత్ముఁడు చెప్పిన విషయమును గ్రహింతుగాక! అహింసా ధర్మమును మనఃపూర్వకముగా నాచరించువారు, తెలిసియో - తెలియకయో - తామో - తమ్మెఱింగిన యితరులో సత్యచ్యుతులగు నప్పుడు వెంటనే తాము బాధపడుటయును పరిశుద్ధతను వెదకికొనవలెను. మహాత్ముఁడీ విషయమున మిక్కిలి మెలఁకువ గలిగి యుండుట లోక ప్రసిద్ధము. ఫీనిక్సునందును - సబర్మతి యందును బాలురయందుఁ గొందఱు నదభ్యాసములనుండి దూరమగుటను గ్రహించి మహాత్ముఁడా బాలుర నేమియు ననక యా బాలుర బాగునకై తాను నిరశన వ్రతము పూనుట మిక్కిలి యాదర్శమయినది.

ఇతరుల కొఱకు నిరశన వ్రతము పూనుట వలన వారిని మంచి మార్గమునఁ ద్రిప్పగలమాయని కొందఱు అక్కజపడ వచ్చును. ఆ యితరులు సన్మార్గమునకు రాఁజాలక పోయినను, వారు సన్మార్గమునకు మఱలునట్లు చేయు ప్రయత్నము మాత్రము గొప్పది. అప్పటికి మార్పుపొందని యితరులను నిరశన వ్రతముచే మఱలింపఁ గలమనుటలో సందేహమే మాత్రము లేదు. మార్పు కలుగనివారిలోఁ గొందఱు సహృదయులు

మార్పుపొందినను పొందవచ్చును. అంతియగాక; సంశయాత్ములను గురించి మహాత్ముఁడు, (ప్రేమార్ద్ర) హృదయులను మార్పుపొందించుటకే నిరశన వ్రతము పూన వలెననియు, ఒకరి స్వాతంత్ర్యమును అన్యాయముగా మార్చుటకు నిరశన వ్రతము చేయరాదనియు, తండ్రి పేరు నిలుపుటకుఁ దనయుఁడు నిరశన వ్రతము చేయవచ్చుననియు. తాను జేయుచున్న వ్రత లక్ష్య మిట్టిదేయనియు, బొంబాయిలోను -బార్సోలీలోను దాను నిరశనవ్రతము చేయుట తనమీఁదఁ బ్రేమగల వారి కొఱకే యనియు, జనరల్ డయ్యరువంటి వారిని మంచి మార్గమున బట్టించుటకై వ్రతమును జేయుననియు, తన క్షేమమునకై యితరులను అన్యాయముగా బాధపెట్టు నాశయముతో నిరశనవ్రత మాచరించుట ధర్మ విరుద్ధమనియుఁ బలుతావులందు మాటాడియు, వ్రాసియు నుండెను.

అపకారికిఁ బ్రత్యపకారము చేయుట, నిందించుట, ఆడంబర - దుర్భాషలచే నితరుల నొవ్వఁజేయుట మొదలగునవి యెల్లను అహింసా ధర్మమునకు విరుద్ధములే యగును. ధర్మమెఱిఁగిన పెద్దలు, ఆ యధర్మమును ఖండించియే తీఱుదురు. మహాత్ముఁడు, పంజాబులో ఘోర హత్యలు గావించిన డయ్యరు మొదలగు వారికి మరణదండన విధింపరాదనియు, వారిని దమ తమ యుద్యోగములనుండి తొలఁగించుటయే చాలునని చెప్పుటయు, బొంబాయిలో నొక సభయందు ఉపన్యసించుచున్న డాక్టరుఅనిబిసెంటును జెప్పనలవికాని యల్లరిచేయుటయు, తాళ్లు ఉప్పుటయు, కఱకు మొఱకు తనముగల హింసయనియు, ఆసిగ్గుచేటు అల్లరిచేసినవారిని నిర్భయముగా బయటికి రండని పిలిచి వారిని సభావేదిక మీఁదకు రప్పించి, క్షమాపణ చెప్పించు

టయు, వంగదేశమందు 'డే' యను నాంగ్లేయాధికారిని హత్య గావించిన 'సాహూ'ను గూర్చిన తీర్మానమును దుదివఱకు కాంగ్రెసు సభయందెదిరించి నిలువఁబడుటయు, "ఆడంబరము మనబలహీనతకుఁ జిహ్నమ"నియు, "సభలందుఁ జప్పట్లు చఱచుటయుఁ, గేకలిడుటయు, విదేశీయులను నిందించుటయు, క్రొత్తగా నహింసా ధర్మమును నిర్వహింపలేనప్పుడు ప్రాఁత పద్ధతిని బోవలెన"నియు, "మూర్ఖతగల హింసా కర్మము సర్వ నాశనకారి మాత్రమేకాక, యింకెంతయో చెప్పరాని చేటులను దెచ్చి పెట్టున"ని చెప్పుటయు, శత్రువులను సోదరభావముతోఁ జూచుట మేలని చెప్పుటయు, మహాత్ముని అహింసాధర్మ సిద్ధాంతమును స్పష్టము చేయుచున్నవి." నేను జన్మించిన భారత దేశము మూర్ఖముగా నుండిన యెడల దానినైనను ఎదిరించుటకు వెనుదీయన"ని బోధించు గాంధిమహాత్ముఁడు జ్ఞాన భాస్కరుఁడని తెలియుచుండఁగా హింస యందలి జుగుప్సను, అహింస యందలి యాదరమును మహాత్ముని గాఢ కాంక్షితములుగాఁ జెప్పవలయునా? మహాత్ముఁడు తాననుష్ఠించుచున్న అహింసా ధర్మమును భారతదేశమున జగమెఱిఁగిన శాంతి సమరము – అసహాయోద్యమము – శాసనోల్లంఘనోద్యమము మొదలగు నపూర్వ కార్యములతో వెల్లడింపఁ గలుగుచుండెను. ఇట్టి యుద్యమముల కన్నింటికి అహింసా ధర్మమే ప్రాతిపదిక. వానిని గూర్చి కొంత తెలిసికొందము.

## పాపమెఱుఁగని ప్రాణులు

మానవులయెడ మాత్రము ప్రేమనుజూపి కొందఱు పశు పక్ష్యాది ప్రాణులను జంపుచుందురు. ఇదియు హింసాకర్మమగును,

ఈ సృష్టియందలి పిపీలికాది బ్రహ్మపర్యంతము సమస్త ప్రాణి సృష్టిజాలమందు నే ప్రాణికి హింసచేయ కుండుటయే జీవకారుణ్యమగును. అశోకుఁడు జీవకారుణ్యబుద్ధితో వేఁటాడరాదని శాసించెను. గాంధిమహాత్ముఁడు మనస్సుచేతనుగూడ నే ప్రాణికిని హింస చేయఁదలఁపరాని దయార్ద్రహృదయుఁడై పదేపదే బోధించుచుండెను. మహాత్ముఁడీ విషయమై బోధించిన యుపదేశము లనంతములు. ఒకసారి మహాత్ముఁడు బండిమీఁదఁ బ్రయాణము చేయుచు నా బండి యెద్దుయొక్క అత్తుపగిలి రక్తము స్రవించుటచూచి సహింపలేక దయగలవాఁడై యెద్దును బండినుండివిప్పి తానే యా బండిని వచ్చిన దారిని లాగుకొని పోయి యథాస్థానమునఁ జేర్చెనఁట ఆహా! ఎంతటి దయగల బుద్ధియోగదా!

సమస్త జీవకోటిని ప్రేమించుటయే మహాత్ముని పరమాశయము. "సమస్త జీవరాశియందు గోవు పరమ పవిత్రమైనదిగా భావింపవలెను. గోసేవచేయనివాఁడు హిందువు హిందువు కాఁజాలఁడు. మనుష్యుని హృదయము గోసేవయందు లగ్నమగున"ని మహాత్ముఁడు చెప్పుచుండును. గోహత్యలు మాన్పుటకు మూర్ఖపద్ధతితోఁ బ్రవర్తించుట తప్పనియు, ఇతరులు (అన్య మతస్థులు) ఇష్టపడునట్లు గోహత్యలు జరుగకుండఁ బ్రచారము చేయవలెననియు మహాత్ముని సంకల్పము. మహాత్ముని యహింసాధర్మప్రబోధము వలననే ఆలీ సోదరులు గోమాంసము భుజింపమని వ్రతము గైకొనిరి. ప్రభుత్వము కూడ గోహత్యా నిషేధము నకై శాసనముగావించి సహాయపడినది. అహింస, అహింసాధర్మ ప్రబోధ మూలముననే యభివృద్ధి యగును కాని యీ వ్యాసనాయాదికముచే గోహత్య నిషేధింపఁ జేయు

టకుఁ బ్రయత్నించుట యుక్తముకాదు. మహాత్ముఁడు వేఁటా డుట జీవకారుణ్యమునకు విరుద్ధమని చెప్పుచు" పశు పక్ష్యాదులు నోరు తెఱచి మాటాడఁగలిగినేని, నిర్దయుఁడై వేఁటాడువానికి ధర్మోపదేశము చేసియుండెడివ"ని చెప్పెను. ఏ ప్రాణికి నే కారణమునన్నైన హింసచేయరాదనుటయే మహా త్ముని సిద్ధాంతము.

బ లి

యజ్ఞయాగాది క్రతువులందు మేఁకలు గొఱియలు మొదలగు వానిని బలియిచ్చుటయు, దేవాలయము లందుఁ జంపుటయు మహాత్ముఁడేమాత్ర మంగీకరింపఁడు. ఈ రెండు విష యములనుగుఱించి మహాత్ముఁడు తెలిపిన యభిప్రాయములను దెలిసికొనుట యవసరము.

"యజ్ఞమ" నున దొక యపూర్వ ధర్మ విశిష్టతగల కార్యము. జ్ఞానము – అనుభవము – కాలము గడచినకొలఁది యజ్ఞముయొక్క విశిష్టతయు మారుచున్నది. యజ్ఞమను పదమునకు ఆరాధనయని యర్థము. ఆయారాధన వలనఁద్యా గము (తనయహంకారమును బలియిచ్చుట) కలుగును. యజ్ఞ మునకు సేవాత్యాగములు ఫలములు. .........

మన శ్శక్తి, యజ్ఞమను త్యాగము వలనఁగలుగును శాస్త్రములందు జెప్పఁబడిన సమస్త క్రతువులును జీవహింస నొల్లనివి. క్రతువను పేరునఁజెల్లుబడి యగుచున్న కొన్ని క్రియ లనుఁగాను విశేషించి పోట్లాడుకొనుటయుఁదగదు. నేఁడు కర్మకాండకుఁజెప్పఁబడు చున్న యర్థము వేదకాలమందును శక్తి మంతమయినదియా యని నేను సందేహింతును. సందేహమున

కాస్పదము లేదనిన యెడలఁబరిశోధించి యొక తెన్నునకుఁదెచ్చి నను చరిత్ర పరిశోధన నిలువఁజాలదు.

వేదవేత్తలైన కొందరు మన పూర్వులు నరబలి చేసి రని చెప్పుచుందురు. ఇప్పుడది సాధ్యమగునా? సత్యమగునా? అశ్వమేధయాగమనునది చేయుట మిక్కిలి యయుక్తము."

ఈ విషయము మహాత్ముని తనయాత్మ కథ యందిట్లు వివరింపఁ బడి యుండెను.

"...ఈవిషయమున నాకునాఁటికే యభిప్రాయమో నేఁటి కిని అదియే యభిప్రాయము. గొఱియ ప్రాణము వెల మనుష్య ప్రాణము వెల కంటె తగ్గదు. మనుష్య శరీరమును పోషించుటకు గొఱియను కూనీ చేయనేన్నేఁటికి సంసిద్ధుఁడగాను. జంతువెంతని స్సహాయమో మనుష్యహింసనుండి తప్పించుకొన మనుష్యుని సాయము బడయుటకు అది అంత అధికారి. కాని యెంతో యోగ్యత, యెంతో అధికారము లేక మనుజుఁడిట్టి యాశ్రయ దానము చేయఁజాలఁడు. గొఱియ నీ క్రూర హోమమునుండి తప్పింప ఇంకను నాకు చాల నాత్మశుద్ధియు, త్యాగమును ఆవ శ్యకము. ఇంకను ఈశుద్ధిని, త్యాగమును గూర్చి ఘోషిం చుచు ఘోషించుచునే ఈ దేహమును విడువనయ్యెడి నేమో యనితోఁచెడిని. మనుష్యుల నీ మహాపాతకమునుండి తొలగించు టకు నిర్దోషములగు నీజీవముల రక్షించుటకు, మఱియాయాల యమును పవిత్రము చేయుట కెన్నఁడు పరమేశ్వరుఁడే మహా పురుషుని, లేక యే మహాసతిని సృష్టించునో! నేను సదా అందు లకు ప్రార్థించుచున్నాను......" (తెలుఁగు – ఆత్మకథనుండి)

## కొన్ని సందేహములు

మహాత్ముఁడు బోధించుచున్న అహింసాధర్మమెట్టి సందేహములకుఁ దావులేనిది. అయినను గొందఱు సందేహములకులోనైన వారునుగలరు. కొన్ని సందేహములు తమ తమ నిశ్చయములను బట్టి పెద్దలు లోకమునకు ధర్మముపదేశింతురని యనుకొనెడివారు లేకపోలేదు. అహింసా ధర్మమును గుఱించి సహృదయులు కొందఱు మహాత్మునిఁబ్రశ్నించిరి; కొందరు దుర్జనులు త్రోసిపుచ్చిరి. ఆప్రశ్నములకిచ్చిన మహాత్ముని ప్రత్యుత్తరములలో నొకటి రెంటిని మాత్రము చదువుకొని ముందునకుఁబోదము.

అహింస శరీరబల మక్కఱలేని బుష్యాదుల కుపయోగించునేమోగాని భుజబలము కావలసినవారి కక్కఱపడునది కాదని కొందఱందురు. ఇట్లు చెప్పుటలో వారు అహింసాధర్మమూలము నిసుమంతేనియు నెఱుఁగరని తలఁపవచ్చును. అహింసావ్రతమునకు జ్ఞానసంపద కావలెను; ధైర్యము కావలెను; సత్యము కావలెను. ఆయుధ సాధనముచే నితరుల నెదురించువాఁడు జ్ఞానియగునో యజ్ఞానియగునో యూహింపుఁడు. ఆత్మజ్ఞానము కలవాఁడగునేని ఆతఁడు కత్తిని జూపి ఝళిపింపవలసిన పనిలేదు. కత్తులు – కటారులు ఉపయోగించుట ధైర్యమో భయమో పాఠక మిత్రులు గ్రహింతురుగాక!

"అహింస ధైర్యమునకుఁ బట్టుకొమ్మ. హింసయందాఱితేఱిన వారికి సహితము అహింసాధర్మ మహిమను జెప్పి వారిని సులభముగా ఒప్పించఁగలనని గట్టిగాఁ జెప్పఁగలను. చాల కాలము క్రిందట నేను బ్రహ్మచర్యము నెఱపు దినములలో

మూర్ఖతకలిగి యుండెడివాఁడను. నా వ్రతము భగ్నముకానున్న సమయముననే అహింసాధర్మ మాచరింప బద్ధుఁడనైతిని."

"దీనిని (అహింసను) భారతదేశమందు శరీరబలము కల వారికి లేని వారికి నాయుధముగా భావించుచున్నాను."

"బలహీనుల కీలోకమందు స్థానములేదని కొందఱు నిరూపించుచుందురు. కేవల శరీర బలమునేవారు ప్రధానమని తలపోయు చున్నారని నే ననుకొనుచున్నాను. నిజమునకు వారు చెప్పునది ఆత్మకు సంబంధించినది కాదు. మనుష్యునికంటె శరీరబలముకల ప్రాణులెన్నియో కలవు. అవి యుండుటవలన మానవుఁడు లోకమున బ్రదుక కలుగుచుండెను. ఎన్నియో జీవములు పుట్టుచు గిట్టు చున్నవి. అందుచే మనుష్యుని తరింపఁజేయు వఱకు ప్రాణమును గాపాడుకొనలేని వానికి లోకమున స్థానములేదని తలఁప వచ్చును."

"అహింస మనలను జ్ఞానులనుగాఁ జేయుదనియు, జ్ఞానులనుగాఁ జేయుననెడి యజ్ఞానమును మనము వీడినప్పుడే మనము జ్ఞానులము కాఁగలమని నా నమ్మిక."

అని చెప్పిన మహాత్ముని హితోపదేశములు మననము గావించుకొందురుగాక!

హింసయే మనుష్యునకు సహజమనియు నహింస సహజము కాదనియు, ఆంగ్లేయ వస్తువులను బహిష్కరించుట హింసయే యగుననియు తనకలవడిన యభ్యాస కార్యముల నుండి మనుష్యుఁడు మఱలింపఁబడుట కానిపనియనియు, మానవుఁడు అహింసా ధర్మమును సంపూర్ణముగా నాచరింపలేఁడ

నియు, గొందఱు మహాత్మునితో తమ భావముల వెల్లడించిరి. వారికి మహాత్ముఁడు — మానవ లోకమును బశుపక్ష్యాది లోకమును నొకే దృష్టితోఁ జూచినయెడల సృష్టిస్వభావము దెబ్బతినుననియు, ఈ రెండు వేర్వేఱు లోకములుగా భావించని యెడల సమస్త జీవ జాలము ఒకే విధ స్వభావమున నుండుట కనువు పడదనియు, ఆ స్వభావము జడములయందు లేదనియు, మానవుఁడు పశుపక్ష్యాదులవలె నాహార నిద్రా భయాదులే జీవితమని తలపోయుట లేదనియు, మానవుఁడు భగవంతుని సత్యమును గాంచుటకును, భగవత్కైంకర్యము చేయుటకును భగవంతుని సాన్నిధ్యము పొందుటకుఁ గావలసిన భక్తి ప్రపత్తు లను సంపాదించుకొనఁ గలఁడనియు, మానవుఁడు జడ పదార్థము కంటె మిన్నయయిన వాఁడనుటను మనము తెలిసికొనఁ గలిగిన యెడల మానవ సృష్టికి — జడ సృష్టికి భేదము బోధపడఁ గలదనియు, ఆ భేదమే అహింస మానవునకు సృష్టి స్వభావ మనుటను నెఱపుచున్న దనియు, మనుష్యుఁడు జడపదార్థముల కంటె భిన్నమను భావము పొందుట మనుష్య సృష్టియనియు, అట్టి వేఱుబాటు మానవ స్వభావమును వేఱుచేయ దనియు, మానవ స్వభావమే హింసయను నెడల, ఈ సృష్టియంతయు నొక్క త్రుటిలో నశించుననియు, లోకము 'రక్షకభటు'ని వంటి కట్టుబాటు లేనిదైనను స్థిరమయిన దనియు, హీనజాతివారు విద్యాగంధము లేనివారగుటవలన పని లేని వేళలందు హింసా కృత్యమునకుఁ గడంగుచున్నారనియు, హింసాకృత్యము చేసిన పిమ్మట వారు తమ సహజ దయా స్వభావము గలవారగు చున్నారనియు, వారు తమ సహజ స్వభావమును వీడుటకుఁ గారణము ఇతరుల చెడుగులనియు, ఆ చెడుగు తొలఁగిన పిమ్మట వారు మనుష్యులు కాఁగలరనియు, బ్రిటీషు దేశ వస్త్ర

ములను బహిష్కరింపవలెనని తానెప్పుడు చెప్పలేదనియు, విదేశ వస్త్రములను - వస్తువులను బహిష్కరింప వలెనని తాను జెప్పినది యథార్థమనియు, నాంగ్లేయులయెడఁ దనకు భేద భావముగాని విరోధ బుద్ధిగాని లేదనియు — అని మహాత్ముఁడు చెప్పిన సమాధానములు "యంగ్ ఇండియా" పత్రిక యందు పెక్కు గలవు.

## రాజభక్తి – అహింస

మహాత్ముఁడు అహింసాధర్మము నెంతటి దీక్షతో నాచరించుచుండెనో గ్రహించుటకు నొకటి రెండు విశేషములఁ నిట వ్రాయుచున్నాను. మహాత్ముఁడు తన యింటి పిల్లలకుఁ గూడ రాజభక్తి గల పాటను (గాడ్ సేవ్ ది కింగ్) నేర్పెను. అహింసాధర్మ ప్రాశస్త్య మెఱిఁగినకొలఁది మహాత్మునకా రాజభక్తి పాట గిట్టకుండెను. 'రాజ శత్రువులఁ జంపుము; ఆ మోస గాండ్ర మోసములఁ ద్రుంపుము' అను మాటలు ఆ పాటలో ముఖ్యము."

మహాత్మునికీపాటలోని మాటలు గిట్టలేదు.

"నా మిత్రుఁడు డాక్టరు బూథుగారికి నా యీ సంశయమును మనవిచేసితిని. ఆయనయు ఇయ్యకొని అహింసావాదియైన యెవ్వనికిని; ఈ పాట పాడుట కష్టమనెను. ఈ పాటలో శత్రువులని ఊహింపఁబడినవారు మోసగాండ్రని యెటు లనఁగలుగుదుము? శత్రువులయినంతమాత్రమున తప్పంతయు వారిదేనా? పరమేశ్వరునికడ న్యాయమును మనము భిక్షింప నొప్పు. డాక్టరు బూథుగారు నా పూర్వపక్షము సిద్ధాంతించిరి. వారి సమాజమున దీనికి బదులు మఱియొక పాట నల్లిరి."

అని మహాత్ముఁడు తన యాత్మకథయందుఁ జెప్పి యుండెను. ఈ విషయమువలన మహాత్ముని హృదయ మెంత విశాలము - ఉదారము - పవిత్రము గలదియో యూహింపుఁడు.

## నిందలు

అహింసా ధర్మమునుండి మహాత్ముఁడు చ్యుతిడైనట్లు కొన్ని కారణములవలనఁ గొందఱు భావించుట కవకాశ మేర్ప డెను. అందు ముఖ్యమైన నాలుగు విషయములను గుఱించి తెలిసికొందము.

ఒకటి :— పిచ్చికుక్కలను జంప నాదేశించుట;

రెండు :— ఆశ్రమమందు రోగముతో బాధపడుచున్న ఆవుదూడను జంపించుట.

మూడు :— కెయిరో జిల్లాలో జరిగిన ఐరోపా యుద్ధ మునకు మనుష్యులను జేర్పించుట.

నాలుగు :— అసహాయోద్యమములో విదేశ వస్త్ర దహనము కావించుట.

ఇందు సత్య మెంతకలదో కొంత పరామర్శింతము.

వీని నాధారముగాఁ దీసికొని మహాత్ముని పరిమాణ మును బ్రమాణీకరించుట తెలివిగల పనికాదు. మహాత్ముని యాశయ మేమో గ్రహింపవలయును. ఈ నాలుగు పనులను మహాత్ముఁడు పవిత్రాశయముతో (అహింసా ధర్మబుద్ధితో)

గావించెనా? లేక యకారణముగా హింసాబుద్ధితో గావించెనా యని మొదటగాఁ దెలిసికొందము.

సత్యము - కాలము - స్థితి మొదలగు పరిస్థితులను విచారింపక కేవలము తోఁచిన విధమున భ్రాంతిపడి యొకరి మీఁద నిందలు మోపుట యవిచారమూలకము. అందులకని మహాత్మునిమీఁద భక్తి పెంపునఁ బై కారణములను సత్యము లని చెప్పఁదలంచుట లేదు. 'పుట్టుక' ప్రకరణములో మహాత్ముని యభిప్రాయములకు నా యభిప్రాయములు భేదించుట గమనింపుఁడు. సత్యము చెప్పుటలో నెవరిమీఁద నెట్టి యభిప్రాయమున్న నేమి? అంతమాత్రమున సత్యమును దాఁచఁగలమా? తగునా?

మహాత్ముఁడు, తాను మానవుఁడననియు, అందుచేఁ దాను మనుష్యునకుఁ గల దుర్గుణములనుండి దూరమగుట యరిది యనియు, తనకింక నద్వైత భావము కలదనియు, పలుపర్యాయములు చెప్పియుండుటకు జ్ఞప్తియందుంచు కొనవలెను. తనంతటఁ దానో, యితరులవలననో తన తప్పును దెలిసికొనిన పిమ్మట ఆ తప్పునకుఁ బ్రాయశ్చిత్తము కావించుకొనుట మహాత్ముని నైజము. పైఁ జెప్పిన నాలుగు విషయములను గర్తవ్యములే యని తరువాతనుగూడ మహాత్ముని యభిప్రాయమై యున్నది. ఈ పై నాలుగో - అందుఁ గొన్నియో - తుదకొక్కటియో తప్పుకాదా యని తలపోయు బుద్ధిమంతులు కూడ నుండవచ్చును. ఆ విషయ మటు లుండనిండు. ప్రకృత మనుసారమః.

పిచ్చికుక్కల ప్రమాదమును, వానిని జంపుటను 'యంగు

ఇండియా' పత్రికయందు మహాత్ముఁడు వ్రాసియుండెను. వానిని జదువుకొనినయెడల గ్రొత్త విషయము లెన్నియో మనకు బోధపడఁగలవు. అందు వివిధపద్ధతులలో పిచ్చికుక్కలను గాపాడు మార్గములు వివరింపఁబడియున్నవి. పిచ్చికుక్కలను దూరముగాఁ దీసికొనిపోయి, మనుష్యులు తిరుగనట్టి తావు లందుఁ బంపవలెనని మహాత్ముని యుద్దేశ్యము.

పిచ్చికుక్కలు, కాపులేక, పోషణలేక బాధ పడుచు మనుష్యులను బాధించుటకంటె వానిని జంపుటయే మేలని మహాత్ముని జీవకారుణ్యమే – అహింసయే ఆ పిచ్చికుక్కలను జంపించినట్లు తలంచుచున్నాను. మహాత్ముని మనోభావ మెఱుఁగక, కేవల మీపిచ్చికుక్కలను జంపించుట దప్పనుటను దలపోయు నప్పుడు నా హృదయము మిక్కిలివ్యథపడుచున్నది. చిఱుతొండఁడు తన కుమారునిఁజంపి రుచ్య భోజ్య పదార్థముగా వండి యారగించుటను బాఱఁజూచినచో నప్పటి కయ్యది శిశు హత్యా దోషముగానే తోఁపవచ్చును. కొంచె మాలోచించి ఆ చిఱుతొండని యప్పటి మనస్థితిని గ్రహించి యాలోచించి నచో నందలి సత్యము గోచరింపఁగలదు. "గాంధి అహింస–అహింస యనుచు వృథామాటలు చెప్పుచుఁ దాను కుక్కలను జంపించుచుండెన'ని తెలివితక్కువతనమునఁ జెప్పుకొనెడివారి విషయమై మనమేమి చెప్పఁగలము ?

సబర్మతీ – ఆశ్రమమందు మహాత్ముఁడు, రోగముతో బాధపడుచున్న ఆవుపెయ్యను "ఇంజక్షను"తో మందు నిప్పించి చంపించిన సంగతి యెల్ల రెఱిఁగిన విషయమేగదా ! ఇది 'హింస' కాదా యని కొందఱు వాదులాడవచ్చును. పై విష యమునే చర్విత చర్వణముగా సమాధానము చెప్పుటలోఁ

ప్రయోజనమేమి? ఆవుదూడ స్థితియేమి? ఎందువలన దానిని జంపవలసివచ్చెను? దాని బాధను బోకార్చుటెట్లు? ఈ విషయము లేమియు నెఱుఁగక చిత్తమువచ్చినట్లు మాటాడువారి విషయమై మన మేమి చెప్పఁగలము? ఆవుదూడ పరిస్థితియేమి? అది బ్రదుకుట సాధ్యపడునా? ఈ విషయము లెఱుఁగక వృథా మాటాడిన ఫలమేమి? పాప మావుపెయ్య లేవలేని పరిస్థితిలో గొట్టుమిట్టాడుచుండెను. రోగముతో నా యావుపెయ్య పడుచున్న బాధ దైవమున కెఱుక! దాని శరీరము పుండ్లతో నిండి నీరు కారుచు పురుగులు లుకలుక లాడుచుండెను. అది యిఁక బ్రదుకఁజాలదు!. అయినను జేతనైనంతవఱకు మందులు-మాఁకులు పోసిరి. వైద్యులు - ఘనవైద్యులు - రాజవైద్యులు మందులు పోసి - తుదకు పెదవులు విఱిచిరి. అట్టియెడ నా యావుదూడ స్థితి జాలిగొల్పునదై యుండెను. జాలిని గొల్పిన మాత్రాన నా యావుదూడ రోగము కుదుటఁబడునా? మహాత్ముఁడా యా పెయ్యను రక్షింప నెన్నియో ప్రయత్నములు చేసెను. ప్రయత్నము చేయుటయేగాని ప్రయోజనము కానరాదయ్యెను. ఆ ఆ పెయ్య బాధమాత్రము పెరుగఁ జొచ్చెను! ఆ బాధ పోఁగొట్టుట యెట్లని మహాత్ముఁడు తహతహ లాడసాగెను. ఆ బాధ తొలఁగు మార్గమేది? ఆ బాధ చూచినయెడల హృదయము ప్రక్కలగుట నిక్కము. అసహనముచే - కష్టముచే - క్రౌర్యముచే - హృదయము ప్రక్కలగుట లేదు. ప్రేమచేత నేగదా!

తక్కిన రెండును అహింసాయుతములు గావని విజ్ఞానవేత్త అండ్రూసుమహాశయుఁ డనెను. ఆ రెంటిలో నొకటియగు ఐరోపా యుద్ధమునకు మనుష్యులను జేర్పించు విషయమై మహా

త్ముఁడు సైనిక సహాయుఁడుగా నుండెననుటను తప్పని చెప్పుట కవకాశము లేదు.

దక్షిణాఫ్రికా యందును, భారత దేశమందును యుద్ధము నకుఁ దాను సైనిక సహాయుఁడుగా నుండుటకు మహాత్ముఁడు తన యభిప్రాయములను వెల్లడించి యుండెను. యుద్ధమునకుఁ దాను సహాయపడుటవలన యుద్ధమునకు సమ్మతించుట కాద నియు, బ్రిటీషు సామ్రాజ్యమువలన భారతీయులకుఁ బ్రపంచ మందు ఉన్నతి రావలయునని తన నమ్మకమనియు, ఆ స్థితికి వేఱ గుటవలన తన యహింసా ధర్మమునకు స్థానము లేకుండఁ బోవు ననియు, అట్టి స్థితికి హాని సంభవింప కుండునట్లు సంరక్షించు కొనుట యహింసా ధర్మప్రచారమున కవకాశ ముండుననియు దలఁచి తాను సహాయ పడితినని మహాత్ముఁడు చెప్పియుండెను.

నాలుగవ ప్రశ్నమునకు మహాత్ముఁడు "ప్రజల హృద యము మిక్కిలి విరోధభావము గలిగియున్నది. అద్దానిని దొలఁగించుటకై విదేశ వస్తు - వస్త్ర బహిష్కారముమీఁద వారి మనస్సులను మఱలించితిన"ని చెప్పియుండెను. ఈ సమా ధానము అండ్రూసుమహాశయునకు - విశ్వకవి రవీంద్రనాథ ఠాగూరు పాదులకు నచ్చలేదు.

మహాత్ముఁ డేస్థితియం దుండి యీ సమాధానమిచ్చెనో తెలియుటలేదు. ఆ సమాధానము తప్పని తనకుఁ దోచినయెడల మహాత్ముఁడు వెంటనే పరిశుద్ధతకై ప్రయత్నించి యుండెడి వాఁడు. అట్టి ప్రయత్నము చేయని కారణమున మహాత్ముని మనస్సున కా సమాధానములు నచ్చినవేయని మనము తలఁప

వచ్చును. "పెద్దలు సహితము, తప్పటడుగులు వేయుదుర"ని చెప్పుకొనెడివారును గలరు.

"నా కొఱకై దేశమందు మూర్ఖత పెరిఁగి ప్రభుత్వమును హింసించినట్లు చెఱియందున్న నా చెవికెక్కనేని, నా శిరస్సును నా గదిచువ్వలతో బగులఁగొట్టుకొందున"ని తాను బయట లేనప్పుడును, అహింసా ధర్మము వర్ధిల్లవలెనను పరమాశయము గల పరిశుద్ధాత్ముఁడు మన మహాత్ముఁడు. మహాత్ముని మనో భావమెఱుఁగక యితరోహాలతో మహాత్ముని మీఁద నిందలు మోపుట తగదు. మహాత్ముని చెయిదములఁబట్టి ఆతని భావము నిశ్చయము గమనించుట శ్రేయము. కార్యము లెప్పుడును అంత రాత్మ ప్రేరితములు. సర్వసమ్మతమగు కార్యమేదియు లోక మున నెవరును జేయఁజాలరుగదా! ఎల్లరికి నచ్చునపని నెవఁడు చేయఁగలఁడు? "సతాంహి సందేహ పదేషు వస్తుషు ప్రమాణ మంతః కరణ ప్రవృత్తయః."

### అహింస — భిక్ష

అహింసా ధర్మమనుపేరున నెట్టికీడును జేయరాదని మహాత్ముని సంకల్పము. ఇందులకొక్క యుదాహరణ మిచ్చు చుంటిని. కొందఱు సోమరులు, సన్యాసులమని స్వాములమని— మహర్షులమని పేరుతో భిక్షసేయుచు సుఖభోగజీవితము గడుపు కొందురు. అట్టివారికి సాయపడుట మంచియా? చెడ్డయా?

ఈ విషయమై మహాత్ముని యభిప్రాయము సర్వజనాంగీ కార యోగ్యమైనది. "తగినంత దేహదార్ఢ్యము కలిగి కష్టపడి పనిచేసి సంపాదించుకొని తినవలసినవారికి సైతము భిక్షసేయుట అహింసా ధర్మసిద్ధాంతము కాఁజాలదు. నా కధికారమున్న

యెడల నిట్టిభిక్షసేయు పద్ధతిని నిలిపివేయుదున”ని మహాత్ముఁడు వెలిబుచ్చిన యభిప్రాయ మమూల్యముగదా!

మహాత్ముఁడు అహింసా ధర్మమును త్రికరణశుద్ధిగా నాచరించుచుండును. అందుచే మహాత్ముని యాత్మశక్తియును మిక్కిలి పెంపొందుచుండెను. అహింసా ధర్మమే జీవితపరమావధిగానెంచు జీవకారుణ్య (హృదయులను) ము గలవారిని, ఇతరములను నెట్టి కార్యములును దరిఁజేరవు. క్రూరజంతువులును దరిఁజేరక నిలుచును. ఇట్టి మహాత్ములకు విషసర్పములు సయితము వైదొలఁగిచనఁగలవు. ఫీనిక్సునందును, సబర్మతియందును ఆశ్రమనిర్మాణ సమయములందుఁ దిరుగాడుచు గాన్పించునట్టి పెనుఁబాములు మావెంటఁ దిరుగాడుచుండెడివనియు, ఆ పాములనుజూచి కొందఱు భయపడుచుండెడివారనియు, అయినను సర్పాది విషజంతువులను సహితము చంపరాదను నియమమునకు లోఁబడి మిత్రులు ఆశ్రమ జీవితమును గడుపుకొనుచుండెడివారనియుఁ, బాముకాటుతో నెవరును జావరనియు మహాత్ముఁడు తన యాత్మకథయందు వివరించియుండెను.

మహాత్ముఁడు, అహింసా సిద్ధాంతమునుగూర్చి తెలిపిన యభిప్రాయములు పెక్కుగాఁగలవు. అందుఁ గొన్నిటి నిట నుదాహరించుచుంటిమి.

హింసచేఁగాని, హత్యచేఁగాని మంచికొంచెమైనను గలుగదు. ఈ హింసాహత్యలు భారతదేశమునకు మిక్కిలి యన్యామైనవి. అవి యిచట నేమాత్రము వేళునాటుకొనలేదు. నాటుకొనవు; హింసవలన-హత్యలవలన మంచికలిగినట్లు చరిత్రలు నిరూపించుటలేదు. ఈ దేశముయొక్క మతము హిందూ

మతము. అది జీవహింస చేయఁదగినదిగాఁ జెప్పుటలేదు. అన్ని మతముల మూలసిద్ధాంతం మొక్కటియే. అపకారము చేసిన వానికి సహితము అపకారము చేయుమని హిందూమతమున చెప్పుటలేదు. అతనిని జంపుటకెవనికి అధికారములేదని హిందూ మతము తెలుపుచున్నది."

"ఈ గొప్పతనమును ఎవరిమీఁదను విరోధమును పుట్టించునది కాదని పదివేల పర్యాయములు నొక్కి చెప్పఁగలను. అయితే, అట్టి సమయమే భారతదేశ ప్రభుత్వమును నెలుపఁగల సామర్థ్యమునకుఁ దగినది కాఁజాలదు."

"నేను ఎదిరించునది ప్రభుత్వమును మాత్రమే. ఆంగ్లేయులతో నాకు విరోధములేదు."

"కత్తినో, తుపాకినో ఉపయోగించి చూచుటకంటె నా తలను బగులఁగొట్టుట యుచితము. మనుష్యునియందుఁగల దైవమును నశింపఁజేయు దౌష్ట్యమునకు లోఁబడిన నేఁటి నాగరికతనుండి బయటపడుటకంటె వేఱుప్రయోజనము లేదు.

"రాజఘనుని దేశభక్తికై యాతనిని ప్రశంసించుచుందును. దేశముకొఱకు నిర్దయతో ప్రాణములు బలిగొను నభిలాషగల యాతనిని ప్రశంసింతును. అయితే ఆతనిని హత్య చేయుట తగునాఁయని ప్రశ్నింతును. (హత్యచేయరాదని యభిప్రాయము)"

"ప్రభుత్వమునుండి యీ దినములలో దౌష్ట్యముతొలఁగి పోవునట్లుగా నేను ఎవరియొద్దను జెప్పలేదు. నా యుపదేశము (అహింసా ధర్మబోధన)ను భారతదేశము త్రోసిపుచ్చి, రక్త

పాతమును గోరునెడల, నేను వైదొలఁగుదునని నిశ్చయముగాఁ జెప్పుచున్నాను. అట్టి పద్ధతిని నేను సహింపను. ఏలయనఁగా, అందువలన ఇండియాకో లోకమునకో మేలుకలుగునని నేను నమ్మకుండుటయే యగును."

"సత్యము దయ అహింసాధర్మమునకుఁ బ్రాతిపదికలు."

"అహింసకు ఆత్మశక్తి యావశ్యకము. అదియే వీర త్వము కంటె వీరత్వముకలది.

"ప్రేమలేనివాఁడు మహావీరునో, బుద్ధునో, వేదములనో అనుసరించుటకు అనర్హుఁడు...మహావీరుఁడును బుద్ధుఁడును యుద్ధవీరులు. టాల్‌స్టాయియు అట్టి కోవలోనివాఁడే."

"ఈ వారము పవిత్రతకు, ఆత్మపరిశోధనకు-త్యాగము నకు-సత్ప్రవర్తనకుఁ దగినట్లు దేశమంతయు సత్యాగ్రహ వార ముగా నుండవలెను. చెడుమనస్సుతో నేమియుఁ జెప్పకుండ నుండవలెను....సత్యము అహింసయు నమ్ముచున్నవారికి ఈ వారము సత్యాగ్రహవారము!"

"మనోవాక్కాయ శుద్ధిగా హింస తలపూపరాదు."

"దౌష్ట్యమును మూర్ఖ శక్తితో నివారింపఁ బ్రయత్నిం చుట మనకుఁ దగనిది. దౌష్ట్యమునుండి మనము దూరమయి దౌష్ట్యమును ఎదుర్కొనవలెను. ఒకఁడు తన దౌష్ట్యమును దెలిసికొని పశ్చాత్తాప పడునేని వానిని బ్రేమతో నాదరింప వలెను. ఇతరులు కొట్టినను వారిమీఁదఁ బ్రేమ చూపవలెను."

"ఆంగ్లేయులకు భారతీయులకు ద్వేషమును బురికొల్ప నట్టి యెద్దిక, పవిత్రతగల పద్ధతిలో న్యాయము పొందవచ్చును."

"తాను చిన్నవాఁడుగా నుండియుఁ దన యొద్దఁగల ఆయుధములచే తన ప్రాణమును రక్షించుకొనఁ జూచుట తగదనియు, తమలోనుండి విడిపోయి యుద్ధము చేయువారికి భారత దేశమునకును హింసచేయు విధానము మానినచో తాను ప్రాణ రక్షణము పొందుటకుగాను ఆంగ్లేయులు తెలిసికొనునట్టి సమయమున భారత దేశమును గూర్చి వారికట్టి మార్పు కలుగుననియు, అప్పుడు భారత దేశ మందున్న ఆయుధములన్నియుఁ ద్రుప్పుపట్టుననియుఁ జెప్పవలయునా ?"

"అహింసా విషయములో నా యభిప్రాయ మేమియు మాఱలేదని సర్ నారాయణన్‌కు నిశ్చయ పఱచితిని. జీవ సృష్టి కనుకూలింపని మనుష్యుఁడు,......ఏ చిన్న పక్షినైనను జంపుటకుఁ దగినవాఁడుకాఁడు. ...... అహింస యనఁగా ఇతరులకుఁ గీడుచేయకుండుట మాత్రము కాదనియు, కీడుచేసిన వారికిని మేలుచేయునట్టి ప్రేమను గలిగియుండుట యని నేను తలఁచుచున్నాను. కీడుచేసిన వానికి మేలుచేయుట యనఁగా నతనిని అట్టి పనినుండి మఱలించుటకు సహాయము చేయుట గాదు. అహింస నాచరించువాఁడు ప్రేమ గలిగి యాతనితోఁ గలిసి యాతని చెడుగులు మానుకొనునట్లు చేయవలెను. అట్టి సహాయము చేయునప్పు డెట్టి కష్టములు వచ్చినను వచ్చుగాక ! నా కుమారుఁడు గౌరవహీనముగా సంచరించువాఁ డా మేనేని, ఆతని నడవడిని నిర్బంధముగా మాన్పించుటకుఁ బ్రయత్నము చేయకుందును. (అహింసా పద్ధతి కాఁజాలదు.) ఆతనిమీఁదఁ గల నా ప్రేమ యాతనికి నేనుచేయు సహాయము మఱొక విధముగాఁ బరిణమించఁగలదు. అందుచే మరణము సంభవించినను సంభవించుగాక! ఆతని మనస్సును మార్చి నాదారికిఁ

ద్రిప్పఁగలిగినచో ఆ ప్రేమయే ఆతనిని ఆ చెడుత్రోవనుండి మఱలింపఁజేయును. మూర్ఖశక్తిచే నా కుమారుని మఱలించుటక్కు నేను బ్రయత్నింపను.

హింసనుండి అహింసయే జనించును. దండించుటకంటె మన్నించుట గొప్పతనము; మన్నింపు వీరునిగాఁ జేయును. దండించు నధికార మున్నప్పుడు మన్నించుటయే మన్నన యగును. .........మన్నింపు అనఁగా మిక్కిలి సామర్థ్యమైనది.”

“నేను కలలు గనువాఁడనుగాను......అహింసాధర్మము ఋషులకు మహాత్ములకే తగుననుట సరిగాదు. అది సర్వ సాధారణముగా నెల్లరు నాచరింపఁ దగినది.”

“హింసయందు అహింసను జూచిన మహర్షి ‘నియోడన్ పార్కినున్’ మహాశయుఁడు. ఆ మహాశయుఁడు ‘వెల్లింగ్టను’ కంటెను గొప్ప వీరుఁడు. ఆ మహాశయుఁడు ఆయుధ సంపత్తి కలవాఁడైనను వాని నిష్ప్రయోజనమును దెలిసికొని, ప్రాణి హింస లేని యహింసను లోకమునకు వెల్లడించెను.”

“ఇండియా కత్తితో సంపాదించిన స్వాతంత్ర్యము కలది యగుచో అది అస్థిరమైన విజయము పొందవచ్చును. అయితే అప్పుడు ఇండియా ఆధ్యాత్మిక శక్తిని బడయఁ జాలదు. నేను ఇండియాతో బంధింపఁబడితిని. నాకుఁగల సర్వము భారతదేశ మొక్కటియే. లోకమునకు బోధింపఁదగిన బోధలు భారత దేశమునకుఁ దెలియును. అంతేకాని ఐరోపాదేశమునుండి పొంద వలసిన దొక్కటియు లేదు. భారత దేశమునకు నైజమగు నైతిక మార్గమున యుద్ధము ప్రారంభించుటను నేను

పరిశోధింపవలెను. ధర్మమైన భారతదేశము మీఁదఁ గల నా ప్రేమ అధర్మమగు భారత దేశముమీఁద యుద్ధము చేయఁ బురికొల్పును. హిందూమత గౌరవము వలననే నేను విశ్వసించుచున్న అహింసా ధర్మముచే భారతదేశమునకు సేవచేయుటకు నా జీవితము అర్పణము చేయఁబడినది."

"అహింస సహనశక్తిని వృద్ధిపొందించును. అహింస భగవంతుని చేరికను సంపాదించును. సహనముచేఁగాని, అసహనముచేఁగాని భగవంతునిఁ జేరవలెను."

"సహజముగాఁ జేరుటకుఁ దగిన దైన్యప్పటికిని, ఆ చేరిక వలనఁ బ్రయోజనము లేదు. సత్ప్రేమ సహజమయినది. సేవా గుణము మాత్రమే మానవజీవితమునకు సరిపోదు, తన స్వభావము, పరస్వభావమును గించపఱచును. విడివిడిగా మనుష్యుల యందుఁ బరస్పర ప్రేమ సౌహార్దములు ఉన్నయెడల దేశము లందు ఐక్యము స్థిరమైయుండఁ గలదు. కుటుంబ ధర్మము దేశ ధర్మమగునట్లే దేశ ధర్మమును లోకధర్మముగాఁ బచరింపఁ బ్రయత్నింపవలెను. అట్టి దేశధర్మముగా భారతదేశమును భగవంతుఁడు సృష్టించి యుండెను."

"మూర్ఖ్యము వీడినప్పుడే భారతదేశము స్వతంత్ర దేశము కాఁగలదు."

"రానురాను భారతదేశము బలాత్కారము వంటి మూర్ఖతయే కలిగియున్నది. హింసకంటే అహింసయే స్వభావ ధర్మముగాఁ గలవారు అగుదురేని భారతీయుల యాత్మశక్తి పెంపొందఁగలదు."

"అహింసా ధర్మము గలవాఁడుగా నుండఁ దలంచెనేని, అతఁడు తనకపకారము చేసినవానిమీఁదఁ గూడఁ గోపము కలుగకుండునట్లు విధిగా నడుచుకొనవలెను. ఆతఁ డీ తనికిఁ బ్రత్యపకారము చేయరాదు; ఉపకారమే చేయవలెను."

"అహింస యనఁగాఁ గోపము లేకుండ నుండుట. పరిపూర్ణమగు అహింసయనఁగా లోకమందెల్ల యెడల – విష జంతువుల యెడను సహితము విరోధము చూపకుండుట – చంపకుండుట."

"అహింస యనఁగా, సర్వప్రాణులయెడఁ బ్రేమకలిగి యుండుట."

ఇట్టి యహింసా ధర్మావలంబియగు వాని జీవితభాగ్యమే భాగ్యము. ఇట్టి వాని కితరులు కీడుచేయఁ దలంతురా? తలంపరు. ఇది ప్రత్యక్ష సత్యము. ఇట్టివాఁడు ఇతరులకు హానిచేయఁ దలంచునా? చేయఁ దలఁచినచో నాతని జీవితము సర్వనాశనము కాదా? తనవంటివారే పెఱవారని తలంచుటయే మానవుని ధర్మము. ఇట్టి మహాత్ములే భగవత్సమానులు కాఁగలరు.

"అహింస" యను ధర్మ మాచరించుట వలన విరోధము కోపము –భయము మొదలగు సర్వ దుర్గుణములు నశించు నని మన మహాత్ముఁడు పదేపదే బోధించు చుండెను.

అహింసా ధర్మమునుగూర్చి మన పూర్వులు పెక్కు గ్రంథములు గొప్పగా వెలయించిరేకాని, తామాచరించునట్లు కానము. మహాత్ముఁడు తలఁచినది చెప్పి చేసి చూపిన మహనీయుఁడు. ఇట్టి చిత్తశుద్ధిగల పరమ పవిత్రుని మన మెన్ని

గ్రంథములు తిరుగవేసినను గానరాఁడనుట నిక్కువము. ఇట్టి మనోవాక్కాయ శుద్ధిగల పవిత్రులు పెక్కురుండినచోఁ బ్రపంచ చరిత్రయే మాఱియుండెడిది సుమా!

ఆదికాలమునఁ బ్రజ్వరిల్లిన యుద్ధజ్వాలలకు నేఁటికిని బ్రపంచ జీవిత మాహుతి యగుచున్నదనుటలో నెట్టి విప్రతిపత్తియు లేదనుట యత్యుక్తి కాఁజాలదేమో!

మహాత్ముఁ డవతరించి విశ్వశ్రేయ మభిలషించి మానవుని మనుగడను జరితార్థము గావించుటకై సేవచేయుట యపూర్వము గదా!

## మహాత్ముని స్థితి

పూర్వ చరిత్రలందిట్టి మహాత్ముని నొక్కనిఁ గనఁగలమా? ప్రాచీను లెల్లఱు ధర్మములు పలికిన వారైనను, ఆచరించినట్లు చదివితిమా?

పాఠకమహాశయా! ఇట్లంటినని కన్నుఁ లెఱ్ఱఁజేయకుఁడు. ఆలోచించిన యెడల నామాట సత్యమని మీరును సమ్మతింతురు.

అహింసా ధర్మమును జ్ఞాన సంపదచే శోధించి సాధించి తన జీవిత మందాచరించిన మహనీయుఁడు మన మహాత్ముఁడు. భారతాది యుద్ధములు, ప్రపంచ సంగ్రామములు హింసాగ్నిచే మారణ హోమముగావించి జయమును సాధించెను. మహాత్ముఁడు, అహింసావ్రత దీక్షతో సమస్త ప్రపంచమును జయించి సర్వ మానవాళికి ఆదర్శనీయుఁడై - ఆరాధ్యుఁడై వెలుఁగొందుట ప్రపంచప్రవృత్తికి వెలుఁగుబాట. సత్యాఽహింసల

కోసము మహాత్ముఁడు తనజీవిత మంకితము గావించుట ప్రపంచ చరిత్ర యందపూర్వము గదా!

ప్ర భు త్వ ప రి శో ధ న

ఈ యహింసా ధర్మసాగరమును మథింపగాఁ గలిగిన సారమే సత్యాగ్రహము. ఈ సత్యాగ్రహమును ప్రారంభించిన మొదటి యదృష్టము దక్షిణాఫ్రికా దేశమునకు లభించెను. భారతదేశమందుఁ బ్రారంభించిన సత్యాగ్రహములలో ముఖ్యముగా రెండు పేర్కొనఁ దగినవి. ప్రభుత్వము పంజాబు హత్యలు జరిపినపుడు చేసిన సత్యాగ్రహ మొకటి; ఉప్పు సత్యాగ్రహము మఱి యొకటి. ఈ రెండు సత్యాగ్రహములలోఁ బాల్గొని భారతీయులు వేలకొలఁది చెఱసాలల కేగిరి. ఇట్లు చెఱల కేగిన వారెల్లరు నహింసా ధర్మసూత్రమునకుఁ గట్టుబడిన వారని పాఠక మిత్రులు తలఁపకుందురుగాక! మహాత్ముఁడే, యొకటి రెండు పర్యాయములు "మున్నూరు మంది అహింసా ధర్మమందు స్థిరచిత్తముకలవారై చెఱసాల కేగినచో స్వరాజ్యము వచ్చియే యుండెడిద"ని వెల్లడించి యుండెను.

రెండవ ప్రపంచ మహాయుద్ధము జరుగుచున్న సమయమందు అహింసా ధర్మము నిరువాగుల వారికి మహాత్ముఁడు ప్రబోధించెను. కాని యే దేశముగూడ నా ధర్మమును జెవి కెక్కించుకొనఁ జాలక పోయెను. అహింసా ధర్మయుద్ధముతో నాంగ్ల దేశమునకు సహాయము చేయుటకై తాము సంసిద్ధముగా నున్నామని మహాత్ముఁడు రాజ ప్రతినిధి మూలమున నాంగ్ల ప్రభుత్వమునకుఁ దెలియఁ జేసెను. అందులకు సరియగు సమాధానము గానరాలేదు.

ప్రపంచ సంగ్రామముతోఁ దలదూర్చిన దేశములకు, చేరని దేశములకు మహాత్ముఁడుచేసిన హితబోధలలోఁ గొన్నింటి నిటఁ జనుపు కొందము.

"శత్రువు నన్ను ఎదుర్కొనినప్పుడు తిరిగి నేను ఆ శత్రువును మార్కొనను. అట్లు మార్కొనుట హింసాపద్ధతి యగును. శత్రువు నన్ను ఎదుర్కొనినను, నేను ఆతనిని ప్రేమించుచుందును. ఇదియే అహింస."

"సామ్రాజ్యవాదులు తమను ప్రజానాయకులమని భావించుకొందురు. అట్లు భావించు సామ్రాజ్యవాదులు ఆయుధ విసర్జనము చేసిరా? అట్లు ఆయుధవిసర్జనము చేయుచో హిట్లరు గూడ కన్నులు తెఱచి యుండెడివాఁడు...ఆతఁడుకూడ నిరాయుధ హస్తుఁడయ్యెడివాఁడు. స్వచ్ఛమైన లోహకాంతి యెట్లు ప్రకాశించునో అట్లే ఎంతటిచెడుగైనను అహింస పోకడించును. ఇట్టిశక్తి అహింసకుఁ గలదు. ...అహింసవలన నేను నష్టపడినదే లేదు. 'అహింసా ధర్మము నన్ను నట్టేటముంచినదే' యని వాపోయిన యునికి నా జీవితమందుఁ జూచినదిలేదు."

"సామ్రాజ్యాధిపతులను సంస్కరింపఁజాలమని మీరు భావింపరాదు. ఎల్లరి మానసత్వ మొకటియే. ఆ అధికారులు ఇప్పటికి హత్యాకుహత్య కావించుచునే యుండిరి. వారు సహనము మాపుటలేదు. సహనము చూపిన యెడల మారణయుద్ధము కంటె సహనయుద్ధము మహాశక్తిసంపన్నమైనదని గ్రహింపఁగలరు."

"సామ్రాజ్యములు ఆయుధములను వదలనిండు, అట్లు చేసినయెడల ప్రపంచమందు శాంతి యేర్పడును. అహింసా

ధర్మమందు నాకు ఏఁబదేండ్ల అనుభవము కలదు. అనుభవము వలన మనశ్శక్తిని కాపాడఁగలది అహింసయని నేను పొందిన అనుభవము వలన గ్రహించితిని.

"పూర్వము పఠాను లెట్లుండిరి? ఇప్పుడెట్లుండిరి? అప్పుడు హింసారతులై కుటుంబములందు సైతము పోట్లాటలు పెట్టుకొనినవారుగా, వేటతమకము గలవారుగా, తుపాకి, కత్తి మొదలగు నాయుధములు ధరించియు నధికారులనుజూచి భయపడి పాఱిపోవువారుగా నుండెడివారు. ఇప్పుడు వారియం దెంతయో ప్రేమ తొణికిసలాడుచున్నది. ఆ పఠానులు గోవు వంటి సహనముకలవారై యున్నారు. వారు తమ హృదయములందు ధైర్యమును స్థిరము చేసికొనిరి. అబ్దుల్ గఫూర్‌ఖాను అహింసా ప్రబోధము పఠానుల స్వభావమునే మార్చివేసెను. ఆహా! అహింసా ధర్మవిజయ మెంతదొడ్డదియోగదా!"

"కత్తినిదాల్చి మీఁదకు దుముకువాని కత్తిని దింపఁగలదు. ఎందువలన ననఁగా, కత్తితోఁ దిఱుగఁబడుటవలనగాదు అహింసచే-ఆత్మశక్తిచే."

తద్దయుఁ బెద్దకాలమహింసా ధర్మస్వరూపములు మఱచి మౌర్ఖ్యముతో యుద్ధోన్మాదమగు పాశ్చాత్య దేశీయపద్ధతికి మన మాశ్చర్యపడవలసినదిలేదు. అహింసా ధర్మము పుట్టి పెరిఁగి ప్రబోధించిన భారతావని యందు జన్మించి, యించుమించుగా నిరువదియైదేండ్లనుండి గాంధి తత్త్వమును జవిచూచుచుఁ గొండఱు అహింసా ధర్మము నలక్ష్యముచేయుట యాశ్చర్యముగా నున్నది. హింసాకర్మము నమ్మినవారు అహింసకు దూరముగా నుండుటమేలు. 'అహింస' 'అహింస'

యని యెలుఁగెత్తిచాఁటుచు, సమయమువచ్చినపుడు అహింసను మఱచి హింసారతుఁడగుట యుక్తముకాఁజాలదు. అట్లు చేయఁ దలఁచుట మోసము నాత్మవంచనము నగును.

## మహాత్ముని వజ్రసంకల్పము

గాంధేయ మనుసరించుచుండినట్లు కపటబుద్ధితో నాటక మాడుచున్న కొందఱు ద్వితీయ ప్రపంచ సంగ్రామము సమీపించినతఱి నిదియ సమయమని భారతదేశ మాంగ్ల ప్రభుత్వముతోఁ దలపడి సత్యాగ్రహ సమరము చేయవలయునని చెవి నిల్లుగట్టుకొని మహాత్ముని బలవంతపెట్టిరి. అహింసా ధర్మ తత్త్వ రహస్యమును సాంగోపాంగముగా నెఱిఁగిన ధర్మమూర్తి కలనైన కపటమెఱుఁగని యకలంక పవిత్రమూర్తి, జకత్కళ్యాణము గాంక్షించు జగదుద్ధారకుఁడు గాంధి మహాత్ముఁడు ఆత్మజ్ఞానముననో, సూక్ష్మగ్రాహకత్వముననో మఱేకారణముననో వారి మాటకుఁ జెవియొగ్గక, ధైర్యస్థైర్యములు లోఁగొనిన యకుంఠిత చిత్తశుద్ధితో సత్యోపాసకుఁడై "ఇట్టి సమయమున సత్యాగ్రహ సమరము తలపెట్టుట యహింసాధర్మము కాద"ని బుద్ధి చెప్పెను. అంతటి కపటబుద్ధితో, అహింసా ధర్మ వేషముతోఁ బులితోలు ధరించిన నక్కవోలె నటనమాడుచున్న వారి యాట కట్టెను.

## మహాత్ముని మాహాత్మ్యము

ప్రపంచ యుద్ధము ముమ్మరముగా విజృంభించు చుండిన సమయమందు ఢిల్లీ నగరమందు జాతీయ మహాసభా కార్య నిర్వాహక సంఘము సమావేశమయ్యెను. ఆ సమావేశమున

మహాత్ముఁడహింసా ధర్మమును విరించివోలె వివరించి చెప్పెను. కాని మహాత్ముని యభిప్రాయమును గార్యవర్గము సమ్మతింప లేదు. ఇట్టి యవాంతరము లెన్ని వచ్చినను, మిన్ను విఱిగి మీఁదఁ బడుచున్నను; మేరునగ ధీరుఁడై మహాత్ముఁడా కార్యవరాభిప్రాయమునకుఁ దలయొగ్గక, యహింసా ధర్మమును విడువను, విడువను, అని విజయుఁడై నొక్కి చెప్పెను. అయినను, మహాత్ముని యుపదేశమును గార్యవర్గము చెవికెక్కించుకొనఁ జాలక పోయెను. మహాత్ముని సహచరులై, బుద్ధిని బృహస్పతినిమించిన వారు సైతము మహాత్మునిమాటను దిరస్కరించిరి. అందుచే మహాత్ముని యహింసా ధర్మము మహాత్మునివఱకే పరిమితమైన దనియు, మహాత్ముని నిత్య సాహచర్య మనుభవించుచు వచ్చిన మహాత్ముని యనుయాయులు సైతము అహింసా ధర్మస్వరూప మెఱుఁగఁజాలక పోయిరనియు, వారందఱు నేఁటిదనుక గాంధేయులమని యనుచు నాటక మాడుచుండిరనియుఁ దెల్లమయ్యెను. ఇట్టివారి హృదయములు స్వచ్ఛములగునట్లు పరమేశ్వరుఁ డనుగ్రహించుఁగాత ! ! !

ప్రపంచ సంగ్రామము ముగిసినపిమ్మట, భారతదేశ మందు 1942 వ సంవత్సరమున మహాత్ముని ముఖమునుండి యొక దివ్యవాణి వెలువడెను. "ఇండియాను విడిచిపెట్టి పొమ్ము" అను నీ దివ్యవాణికి భారత జాతీయ మహాసభవారు ముగ్ధులై 'వహ్వా' యని మెచ్చుకొనుచు నా దివ్యవాణిని నాదర్శ ముగాఁ గైకొని తీర్మానము గావించిరి. ఆ దివ్యవాణియందలి యంతరార్థము "ఓ తెల్లదొరా! పాఱిపో" అని మాత్రముకాదు, "తెల్లదొరతనము వద్దు"ని మాత్రమే గ్రహింపుఁడు.

అందులకా తెల్లదొరతనము గ్రుడ్డెత్తిఁజేసి మహాత్ముని నిర్బంధించి శ్రీకృష్ణ జన్మస్థానమునకుఁ బంపెను. అట్టి సమయమున మహాత్మునిమీఁదఁగల యపార భక్త్యావేశముచేఁ బరవశ్శు త్రొక్కుచు భారతీయులు ఆవేశవశులై మహాత్ముని యాశయ విరుద్ధముగా దేశమును కకావికలు కావించిరి. ఆ బీభత్సము, జాతీయమహాసభ పేరున, మహాత్ముని నామమునఁ జేయరాని చెట్టచేసి భారతదేశ జాతీయ చరిత్రకు మచ్చను గల్పించిరి. పొగబండ్లను దగులఁబెట్టుట, ప్రభుత్వ కార్యాలయములను దగ్ధము కావించుట, తంతి తీఁగెలను ద్రెంచుట, తంతి - తపాలా - పోలీసు కార్యాలయములనుమంటపాలు కావించుట, కొందఱి ప్రాణములు బలియగుట మొదలగు నిట్టి యనరాని తలఁపరాని చెట్టలుపుట్టి, వికటాట్టహాసముతోఁ దాండవ మాడుచు బీభత్సము కావించెను.

అట్టి చెయిదములకుఁ ప్రపంచము చిన్నవోయెను. మాతృభూమి మాఁగుడువాఱెను. అయ్యయ్యో! మహాత్ముని పేరిట నిట్టి విషబీజము తులసివనమున గంజాయిమొక్కవోలె మొలకెత్తుటయా' యని యెల్లరు నిట్టూర్చిరి. అట్టి సమయమందే మహాత్ముఁడు మన భాగ్యవశమునఁ జెఱనుండి విడుదల యయ్యెను. వెంటనే మహాత్ముఁడు ఇట్టి చెట్ట చెయిదములకు, కాంగ్రెసునకు - తనకు నెట్టి సంబంధము లేదని ఖండితముగాఁ జెప్పెను. అందులకు జాతీయ మహాసభవారు అవనత వదనులై కలకత్తాయందు జరిగిన యఖిలభారత జాతీయ మహాసభయందు 1942 వ సంవత్సరమున జరిగిన బీభత్సమునకు మిగులఁ జింతించుచు అహింసా ధర్మము నేకరువుపెట్టిరి. ఎట్టి పిడుగుపాటు వాటిల్లినను మహాత్ముఁ డహింసాధర్మమును వీడలేదు. అహిం

సయే మహాత్ముని తపస్సు, అహింసాధర్మమే మహాత్ముని మనస్సు.

"నేఁటి భారతదేశమును పలుబాములు పెనవేసికొనెను. వీనిని దొలఁగించుటకు అహింసయే మార్గము. ఇందులకై భగవంతుఁడు నన్నొక సాధనముగా సృష్టించెను. అహింసా ధర్మమందు నాకు అచంచలమగు నమ్మక కలదు. దేశమునకు వలసిన సహాయమును అహింసామూలముననే పొందవలెను; సాధింపవలెను. భారతదేశము అహింసాధర్మముచేఁ గాపాడఁ బడవలెను; రక్తపాతమునకు గుఱియగు పాశ్చాత్యదేశములను గూడఁ గాపాడనగును."

ఇట్టి 'సుధారసంబుపైఁ జల్లెడువాఁడు' మహాత్ముఁ డహింస నెట్లు విడనాడఁగలఁడు? ఈ కుటిలలోకము, మహాత్ములను సైతమొక్కొక్క తఱి సందేహించు చుండునుగదా! అయ్యయ్యో! ఎంతటి యజ్ఞానము. కాంగ్రెసు - కాంగ్రెసునేతలు తుదకు దేశమో ప్రపంచమో యేకమై హింసాకర్మము పూనినను మహాత్ముఁ డేకాకియయ్యుఁ జీఁకటిని బాపుటకై మింట వెలుఁగు నొక్క వేవెలుఁగువోలెఁ బ్రకాశించుచు చిత్తస్థైర్యముతో హింసా కర్మమును బాఱఁ ద్రోలి యహింసా ధర్మమును వెలయింపఁ జేయఁగలఁడు. అహింసా తేజఃపుంజముచే నేల నాలుగు చెఱఁగులఁ బ్రసరింపఁ జేయఁగలఁడు. మహాత్ముల కసాధ్య మెద్దికలదు?

ప్రపంచయుద్ధము పరిసమాప్త మగునా? అది యెట్లు సాధ్యము? ప్రభుత్వములు - సామ్రాజ్యములు మహాత్ముని హితబోధ ననుసరించినప్పుడే యుద్ధములు

నిరర్థకములని గ్రహింపఁగలవు. అట్లు గ్రహింపఁగలిగిన నాఁడే కోట్లకొలఁది ప్రజలు యుద్ధభయముమాని నిశ్చింతతో నుండఁగలరు. అపార ధనప్రవాహమును యుద్ధమునకై పాఱించుటను గూడ మానఁగలవు. విశ్వసౌభ్రాత్రము వెలయఁగలదు, విశ్వశాంతి విలసిల్లఁగలదు.

ఆంగ్లప్రభుత్వము, యుద్ధసమయమందు మహాత్ముని జెఱయం దుంచుటయే తెలివిమాలినపని చేసెను. ఇప్పటికైనను మహాత్ముని సచ్ఛాంతిని గ్రహింపఁగలిగెనేని ప్రపంచము మహా ధన్యము కాఁగలదు.

మన మహాత్ముఁ డెప్పుడు నహింసాధర్మమును వీడలేదు. అహింసయే మహాత్ముని జీవితము. విరోధియుద్ధముగాని, మిత్రుల బలవంతముగాని, మహాత్ముని నహింసా ధర్మమునుండి మఱలింపఁజాలదు. అవును; ధర్మమునెడ మహాత్ముని మనస్సు వజ్రముకంటెఁ గఠోరమైనది, కుసుమముకంటెఁ గోమలమైనదిగదా! మహాత్ముఁ డహింసాధర్మమూర్తియై వెలుఁగొందు చుండఁగలఁడు.

## నవఖాళీ

పశ్చిమ వంగదేశమున హిందూ – ముసల్మానులు మతవిద్వేషాగ్నితోఁ గసిమసంగి యొకరి కుత్తుక నొకరు త్తరించుకొను చుండిరి. 'నవఖాళీ' ప్రాంతమున (1946) నగ్నిపర్వతము బ్రద్దలయ్యెనో యను చందమున మతవిద్వేషాగ్ని రేఁగి హాహాకారములు చెలరేఁగునట్లు స్త్రీ బాల వృద్ధు లనుభేద మావంతయు లేక యెల్లరు నా మతద్వేషయుద్ధమందు గ్రుందుచుండిరి. మృగయుఁడు మృగములను వేఁటాడుపగిది హిందూ ముస

ల్మానులు కడు రౌద్రాకారులై మతావేశవివశులై దుశ్శరభలు పలుకుచు నొకరి తలలు నొకరు తెగవేసికొనుచుండిరి. ఈ చండప్రచండ మతద్వేషాగ్నికిఁ హింసామారుతము తోడై స్త్రీలను జెఱచుచు, బాలురను వధించుచు, ఇళ్ళు వాకిళ్ళు కొల్లఁగొట్టఁబడుచుండెను. గుళ్ళు, గోపురములు, మసీదులు పడగొట్టఁబడుచుండెను. వీధులు పీనుఁగుపెంటలై నెత్తురు కాలువలగుచుండెను. అట్టి పాటునకు విశ్వంభర విహ్వలయై దైన్యముతోఁప దిక్కులవంకఁ జూడసాగెను. అట్టి విన్నఁబాటు విన్న మహాత్ముని మనస్సు, ఖిన్నమై మత క్రూర విషసర్పము, వేయికోఱలతోఁ గఱచినట్లు ఛిన్నాభిన్న మయ్యెను. అయినను, మహాత్ముఁ డూరుకొనునా? తటాలున నేకాకియై నవఖాళీకిఁ బయనమై యాపల్లిపట్టనములను బాదచారియై సంచరించుచు, హృదయవిదారక ఘాతుక కృత్యములకు వగచుచుఁ; గొండంత దుఃఖమునఁ గ్రుంగుచు, ప్రభుత్వ రక్షకభట సహాయ మపేక్షింపక యా ప్రదేశము తడబడు నడకలతో సడువ మొదలిడెను. ఇఁక నేమి? మహాత్ముఁడు వచ్చెనను వార్త పాకినంతనే క్షీరసాగర మథనమున హాలాహల ముప్పతిల్లఁగా దేవ దానవులు శ్రీమన్నారాయణునిఁ జేరినట్లు మహమ్మదీయులు - హిందువులు మహాత్ముని యండఁ జేరిరి. మహాత్ముని బాట మాననీయముగదా! ఎల్లరు నేకమనస్కులై మహాత్ముని మ్రోల నిలిచిరి. ఆహా! మహాత్ముని పాదధూళి మహిమ! ఎల్లెడలఁ బ్రశాంతత వెల్లివిరిసినది. మతక్రౌర్యము నెయ్యమయ్యెను. ఆహా! మహాత్ముని మహత్త్వము!

నవఖాళీ దురంతములు బీహారు రాష్ట్రమునందలి హిందువులకుఁ గారము చల్లినట్లైయ్యెను గాఁబోలు! ఢిల్లీ

హిందువులుగూడ శివమెత్తినట్లైరి. మహాత్ముని యాత్మశక్తి బీహారును ప్రశాంతతకుఁ దెచ్చెను. మహాత్ముఁడు పరుగున ఢిల్లీ చేరెను. నవఖాలీలోవలె ఢిల్లీయందును మతవైషమ్యములు చెలరేఁగి దారుణ దురంతములకు దారితీసెను. హిందువులేమి? మహమ్మదీయులేమి? ఎల్లరు నొక్క దేవుని బిడ్డలు కారా! అట్టి సోదరులిట్లు జగడమాడుటలు తగునాయని మహాత్ముఁడు ప్రబోధించెను. కాని, మహాత్ముని యా ప్రబోధములు ఢిల్లీ హిందువులకుఁ జెవిటికి శంఖ మూఁదినట్లు నిష్ప్రయోజన మాయెను. మహాత్ముఁ డొక సభలో నుపన్యసించుచుండఁగా, 'మదనలాల్'చే విసరఁబడిన చేతిబాంబొకటి ప్రక్కగాఁ బ్రేలెను. అయినను మహాత్ముని మనస్సు చలింపలేదు. ధీరుల మనస్సు చలించునా? మహాత్మునిఁ జంప నుంకించుట మూర్ఖుని లక్షణము.

అహింసాధర్మ రక్షణార్థమువలన మానవుని పుట్టుక సార్థకమగును. హింసాకర్మరతుఁ డయ్యెనేని మానవుని జన్మము నిరర్థకము కాఁగలదు. మానవుఁడు తనను శరీరమని భావించుట భ్రాంతి యగును. తాను శరీరము కాదనియు, ప్రాణము అనఁగా నాత్మయని భావించినప్పుడే మానవుఁడు సార్థక జీవుఁడు కాఁగలఁడు. తనను శరీరమాత్రముగా భావించి బ్రదుకుట మానవత్వము కాఁజాలదు. అట్టియెడ మానవ జీవితలక్ష్యమే మటుమాయ మగును. కావున; మానవుఁడు తా నాత్మనని భావించుట బ్రదుకు ఫలమునకు బాట యగును.

గాంధిమహాత్ముఁడు, కేవల శరీరముగా మానవుని భావించుట లేదు. ఎల్ల శరీరములను ఆత్మస్వరూపులుగా భావించుచుండెను. ఆత్మకు శరీర మొక యాచ్ఛాదనము మాత్రమని

తలపోయుఁడు. ఆత్మసంరక్షణమునకు శరీర మొక సాధనము. ఇట్టి యాత్మజ్ఞానము అహింసా ధర్మమూలముననే గ్రహింప సమర్థ మగును. మహాత్మునకీ యాశయ మహింసా ధర్మ జ్ఞానము వలననే కలిగెను. తన్మూలమున యథార్థజ్ఞాన మల వడెను. అహింసా ధర్మమునకు సత్యము మూలమని మహాత్ముఁడు బోధించిన బోధనలు మనకు శిరోధార్యములు కాఁగలవు. అందుఁ గొన్నింటి నిటఁ బాఠక మిత్రులు చదువు కొందురుగాక !

"శరీరమును మానవునిగాఁ దలంచుచుంటిమా ? లేదు, ఆతనిని ఆత్మగానే భావించుచుంటిమి. ఆత్మజ్యోతికి శరీర మొక సాధనముగా నుపయోగించునది శరీరము."

"ఆత్మశక్తిని గ్రహింపుఁడు. దానిని దేహశక్తిచేఁ గాపాడనగునా ? కాపాడనగునను జ్ఞానము కలంతవఱకు ఆత్మశక్తి సామర్థ్య మెఱుఁగుట సాధ్యపడదు.

"మానవుఁడు హింసామార్గ మనుసరింపరాదు. ఆతని జీవిత లక్ష్యము అహింసా ధర్మమని గ్రహింపవలెను. లక్ష్య సిద్ధిని బడయుటకై ప్రయత్నించునెడల మానవత్వసిద్ధి బోధ పడఁ గలదు. మానవుని లక్ష్యము అహింస; హింస కాదు."

"ఎవఁడు సత్యజ్ఞాన దర్శనము కలవాఁడు కాఁగలఁడో, ఆతఁడు హింసనుగాక యహింసను గాంచఁగలఁడు. అట్టివానికి హింస యనిత్యమనియు, అహింస నిత్యమనియు బోధపడఁ గలదు.

"సత్యమునకుఁ బ్రాణము అహింస."

అహింసా ధర్మపవిత్రతను శోధించి సాధించుటకు లోకము కలదు; కాలమునుగలదు. అట్టియెడ, జ్ఞానము కలిగి యుండుటయే మానవుని లక్ష్యము. అట్లు కానివాఁడు, నిరర్థకుఁడు. కావున, అహింసా ధర్మ ప్రభావమును లోక మెంత త్వరలో గ్రహించునో యంత త్వరలో లోకమునకు మోక్షము కలదు.

మన మహాత్ముఁడు నరకమనఁ దగిన హింసయందుఁ దగులుకొని బాధ పడుచున్న లోకమును సంరక్షింపఁబూని అహింసా ధర్మమూర్తిగా నవతరించిన మహాపురుషుఁడు "ఆత్మవత్సర్వభూతానియః పశ్యతి స పండితః" అను ఆర్యోక్తి కాదర్శమైనవాఁడు మన గాంధిమహాత్ముఁడు. మహాత్ముని మనోవాక్కాయములు అహింసా ధర్మమునే సదా బోధించు చుండును. అహింసా ధర్మమే మానవుని జీవితమును జరితార్థము చేయఁగలదు. ఇట్టి యపూర్వమగు అహింసా ధర్మ మాచరించు మహాత్ముని యడుగుజాడల నడుచుకొని మనము చరితార్థుల మగుదుముగాక ! ! !

# జాతీయము - స్వదేశీయము

మానవుఁడు ప్రకృతి సిద్ధమగు జీవితముగలవాఁడై యుండవలయునని యింతకుముందుఁ జదువుకొని యున్నారముగదా! ప్రకృతిసహజతకుఁ గారణము వేఱెద్దియైనను, తత్కార్యమునకు మాత్రము స్వస్థానమునకుఁ దగినదని యెల్లరెఱిఁగిన విషయమే! అట్లు 'స్వస్థాన వేషభాషాభిమతు' లగుచు స్వీయ నాగరికతాదిక సంస్కృత జీవిత మవలంబించుట దేశ ధర్మ సంరక్షకమగు విధ్యుక్తధర్మమని తలంపుఁడు. అట్టి ధర్మములు దేశములనుబట్టి భేదించుచుండును. ఆయా దేశముల కనుగుణ ధర్మములగు వేషభాషా నాగరికతాది గుణ సంస్కృతుల నవలంబించి దేశ సంప్రదాయాను రూపమగు నన్నపానీయములు గైకొనుచు దేశీయములగు దుస్తులు ధరించుచు, దేశ పరిపాలనము సరిదిద్దుకొనుచు జ్ఞానము సంపాదించుట మానవుని కర్తవ్యము. దేశ ధర్మమునకు విరుద్ధములగు నాచార వ్యవహారాదికము లలవఱుచుకొని మాతృదేశానురూప జీవిత మవలంబింపనివాఁడు, జన్మసార్థక్యము విఫలమొనర్చుకొనునట్టి దేశద్రోహియు పాపియు నగును. కావున జాతీయతను బోషించు మాతృదేశ ధర్మమున కర్థమగు జీవిత మవలంబించుట సంప్రదాయ సిద్ధమగు

పరమధర్మ మని భావింపవలెను. మాతృదేశ గౌరవార్థమైన జీవితమే జాతీయమనఁబడును.

## జాతీయము ముఖ్యము

జాతీయము సమస్తదేశ ధర్మములను సంరక్షించునది. ఒక దేశమునకు ప్రకృతి సహజముగా సముద్భవించిన వేష భాషలు, పరిపాలనా ధర్మములు, జ్ఞానము మొదలగు సద్గుణము లన్నియు ముమ్మాటికి జాతీయభావము పెంపొందించును' అందుచే నెల్లరు తమ తమ మాతృదేశానురూప జాతీయ భావోద్దీపితులై యుండవలెను. అట్టిదేశము స్వరాజ్యమున కర్హమై రాణింపఁగలదు. స్వరాజ్యమునకు జాతీయతకుఁ గార్య కారణ సంబంధము కలదు. అందుచే స్వరాజ్యమును, జాతీయ తయును, భిన్నములని భావింపరాదు. స్వరాజ్యము కార్యము జాతీయత కారణము. అనఁగా స్వరాజ్యము జాతీయత వలన లభ్యమగునని యర్థము.

ఇట్లు జీవనపద్ధతులు పలు తెఱఁగులగలిగి పలురూపములు జీవితవిధానము లేర్పడి పలు దేశములుగాఁ బ్రపంచమును వేఱుచే యుట యెందులకని కొందఱు ప్రశ్నింపవచ్చును. ప్రకృతిసహజమై ధర్మబద్ధమై ప్రపంచము భిన్న భిన్న దేశములుగా విలసిల్లుటకుఁ బెక్కు కారణములు గలవు. ప్రపంచమందు జన్మములు, మత ములు రాజ్యములు వివిధభేదములుగా విలసిల్లనేల? అని కొందఱు భావింతురు. కాని యది సరికాదు. ఈయనేకత్వ మూలముననే యేకత్వమందలి విశిష్టత వెల్లడి కాఁగలదు. అజ్ఞానముచే, ఆయనేకత్వమువలన భిన్నత్వబుద్ధిగలిగి ప్రకృతి తత్త్వ మారయఁజాలక మానవుఁడు ప్రపంచమును నాశము

చేయుచున్నాఁడు. మజ్జనభోజనములు, ఆచారవ్యవహారములు
శరీరాద్యవయవచ్ఛాయాదులు భిన్నప్రకృతిగలవియైనను, సృష్టి
స్థితికిమూలకారణములై యేకత్వమును బోధించుచుండును.
ఇట్లు; దేశములను బట్టి వేషభాషాదికములు తమ దేశ జాతీయ
జీవనగౌరవమును గాపాడునట్టివై యుండవలెను. అంతియగాని
విజాతీయవేషభాషాదికము లలవఱకొనుట ప్రకృతి ధర్మమునకు
దేశధర్మమునకు విరుద్ధమగును. అట్టి విరుద్ధ విదేశీయజీవిత మవలం
బించుట దేశద్రోహమగును. ఈ విజాతీయతా వ్యామోహము
కలంతవఱకు ఏకత్వ మెట్లుకలుగును? దేశములు, జన్మములు,
జీవితమును తమతమ దేశీయములగు నాచార వ్యవహారములు
వేషభాషలును గలిగియుండినయెడల దేశ విదేశములకు విభేదము
లేలకలుగును? విరోధము లెట్లు పొసఁగును? సమత్వమేల నశిం
చును? జాతీయభావము విరోధముగా నెట్లు పరిణమించును?
దేశ విదేశముల స్నేహ సౌహార్ద్రము లెట్లు విచ్ఛిత్తియగును?
విజాతీయ వ్యామోహబుద్ధియే దేశ విదేశములకు విరోధము
లుత్పత్తిల్లుటకుఁ గారణమగును. స్వచ్ఛందమగు జాతీయభావము
నశించుటచేతను, జీవిత పరమార్థము గ్రహింపనేరకపోవుటచేతను
ప్రపంచము విరోధభావములకు నిలయమై విలయమును
గోరుచుండును.

## ఏకత్వము–భిన్నత్వము

ప్రపంచమందలి మానవులెల్లరు భగవంతునిబిడ్డలేగదా!
మానవులు భూమియందుఁబుట్టి దేశభేదముల ననుసరించి
ప్రకృతిసిద్ధమగు విభిన్న సంస్కృతులు కలవారగుచుందురు.
ప్రకృతిసిద్ధమగు నీ సహజభిన్నత్వమువలన మానవుని జీవిత
పద్ధతులును బలువిధముల భేదించుచుండును. అంతమాత్రమున

మానవుని యాత్మీయభావము వేఱగునా? అజ్ఞానముచే మానవుఁడీ ప్రకృతి సహజభిన్నభావము గ్రహింపనేరక, సృష్టి పరమార్థమును దెలియనేరక మానవసంఘమందలి సౌహార్ద్రమును విచ్ఛిత్తిగావించుచుండెను. ఇది యెంతటి మౌర్ఖ్యమో యూహింపుఁడు! ఇట్టి యజ్ఞానసంజనితమగు భిన్నదృక్పథము పాఱఁద్రోలుటకు ఆత్మజ్ఞాన మావశ్యకమగును. ఈ భిన్నభావము ప్రకృతసిద్ధమని గ్రహించి, తన్మూలమున లోకసృష్టి పరమార్థ మొక్కటియని భావించి మెలఁగుట లోకప్రవృత్తికిఁ దగిన ధర్మము గ్రహించుటయగును. అట్లు; ఆత్మపరిశోధనగావించి ఆత్మజ్ఞానమును సాధించిన మానవుఁడు విశ్వసౌదర్యమును ప్రబోధింపఁగలఁడు. ఇట్టి యాత్మజ్ఞానము, ఆత్మీయభావము నశించి, కేవల భిన్నభావబుద్ధి మాత్రమునఁ గలిగియుండుట వలనఁ బ్రపంచము స్వార్థబుద్ధి పెరుఁగుటవలన నసూయాద్వేషములు, విరోధములు, యుద్ధములు ప్రబలుటకుఁ గారణమగుచుండెను. ఇది యజ్ఞానవిలసితము. మానవునియందుఁ బ్రకాశించు నాత్మజ్ఞానమూలమున లోకమందు భిన్నత్వము నశించి యేకత్వము సిద్ధింపఁగలదు. ఈ విషయము వివరించి చెప్పుట మన ప్రస్తుత విషయముకాదు. కావునఁ, బ్రస్తుత విషయమును జదువుకొందమని మా పాఠకమిత్రులకు మనవి.

## జాతీయములేనందునఁ గలుగుకీడు

భగవత్కృపా విశేషముచే నా యా దేశములందు జన్మించిన వారెల్లరు తమతమ దేశములను మాతృదేశములుగా భావించి దేశ సంప్రదాయసిద్ధములగు దేశీయపద్ధతు లవలంబించి జాతీయ భావములతో జీవితయాత్ర సాగించుట దేశ

ధర్మమును గాపాడుటయగును. ఇదియే భగవత్సృష్టికి లక్ష్యము. ఈ మహాలక్ష్యమునకు సాక్షిభూతమని భావించి భగవత్సంకల్పమును ప్రకృతి ధర్మముగా నెఱిఁగి ప్రవర్తిల్లు మానవుఁడు ధన్యజీవనుఁడు కాఁగలఁడు. అట్టిధర్మము బుద్ధికిఁ బొడకట్టనప్పుడు సృష్టికర్తయగు సర్వేశ్వరుని మఱచుటయగాక లోకప్రవృత్తికి భారమైనవాఁడగును. కాఁగా; ఇఁక నట్టి మానవజీవితము వ్యర్థమగుననుట తథ్యమని యర్థము. అట్టి వ్యర్థజీవనులు భూమికి భారమగుదురనుటలో నబ్బురమేమికలదు? కావున; దేశీయులు తమ మాతృదేశమున కనుసరణీయములగు జాతీయభావములతో జీవితాశయములు కలిగి మెలఁగనివారు వ్యాధిగ్రస్త జీవితములు గలట్టివారై జీవచ్ఛవములగుదురు. అట్టివారి జీవితములకుఁ బెఱవారి పెత్తనమువచ్చి పైఁబడును. ఇఁక నట్టివారు పుట్టినదేశమేమగునో యూహింపుడు! బొట్టు కాటుకపెట్టి పిలుపని పేరంటమునకుఁ దగుదునని తనంతఁ దావచ్చి పరప్రభుత్వము పెత్తనము వహించును. అట్లు; పరప్రభుత్వము పెత్తనము వహించుటకు దేశీయులు తమ జాతీయతను విస్మరించుటయే మూలకారణమగును. ఇంతకు జాతీయతను విస్మరించుట వలన దేశీయులు తమంతటఁదాము చెడుటయగాక, తమ మాతృదేశముమీఁద మోహముగొని కాలమునకుఁ గాచుకొని యున్న విదేశీయులకుఁ బ్రభుత్వమును గట్టఁబెట్టుట యగును. జాతీయతను విస్మరించినవారు తమ దేశమును విదేశపరిపాలనకుఁ గైవసమొనర్చి "దాసోఽహమ్మ"ను దాస్యబుద్ధితోఁ దాముజీవించుటవలన నా జాతీయ జీవనదూరులు భగవత్కృపా పాత్రులెట్లు కాఁగలరు? అట్లు విధ్యుక్త ధర్మమును మఱచిన మానవుఁడు మానవుఁడగునా? వెట్టికి, దాస్యముపాసించు మానవునకు భేదమేమి? తనని గనిపెంచి పెద్దఁజేసిన

మాతృదేవినిమఱచి, మాతృదేవి పాదారవిందములను బూజింప నొల్లక యజ్ఞానినై యన్యులకప్పగించుద్రోహముకంటె నీచగుణ మేమికలదు? అజ్ఞానముచే జాతీయతను మఱచి దేశమాతను అన్యదేశీయులకై వసము కావించి యా యన్యదేశమువారియల వాటు లలవఱచుకొనుటకై యఱ్ఱులుచాఁచుచు, మేము విజ్ఞానుల మని లోలోన మురిసియుచుండుట దేశద్రోహము కాదా? 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసీ' యను నార్యోక్తిని మఱచిన వాఁడు వెఱ్ఱివాఁడగునుగాని వివేకవంతుఁడగునా? ఒక దేశము మీఁద మఱియొక దేశమువారు అధికారము నెఱపుటవలన దేశ ధర్మము నశింపదా? ఇంతకు భవ్యమగు సంభావ్యమువలదా? మానవుఁడై పుట్టినపిమ్మట వికల్పము లేని సత్సంకల్పమువలదా ?

జాతీయాభ్యుదయ కరమగు స్వదేశ పరిపాలన వలన జ్ఞానము, ప్రేమ, దయ మొదలగు ఆత్మగౌరవ ప్రదములగు గుణములు దేశీయుల జీవితములతోఁబాటు పెంపొందును. జాతీయ భావము నశించినప్పుడు సర్వదుర్గుణములు సర్వానర్థ కములును రాశీభూతమై దేశగౌరవమునే మంటఁగలుపును. స్వపరిపాలనాధర్మము వలన సమస్త జ్ఞాన విజ్ఞానములకు నిలయ మగు నాత్మీయత యభివృద్ధి యగుట యథార్థము. మన దేశ మందు 'రామరాజ్యము'నియు, 'అశోకుని పరిపాలనము'నియు ఆనాఁటి పరిపాలనా ధర్మములు నేఁటికిని జేజేలందుకొనుటకు ఆ పరిపాలనా కాలమందలి ప్రజలు జాతీయ భావము గలిగి యుండుటయే కారణముగదా! స్వదేశ ధర్మ సంరక్షణకుఁగావ లసిన ప్రజాసంఘము ఆత్మభావము గలిగియుండుటయే విధ్యుక్త ధర్మమని గుఱుతెఱుఁగ వలయును.

## స్వపరిపాలనము

స్వపరిపాలనా మూలమగు జాతీయ ధర్మము భ్రష్టమగు నప్పుడు మాతృదేశము మఱియొక దేశమునకు దాస్యముకలది యగును. అట్లు దాస్యమయిన దేశము తిరిగి స్వాతంత్ర్యము పొంద వలయుననిన నెంతటి దుస్సాధమో తలపోయుఁడు. అట్టి దేశము స్వాతంత్ర్యము పొందుట కప్పటి పరప్రభుత్వమువారి యడుగులకు మడుగులొత్తుచు 'ఓదొరా! నీవు దొడ్డవాఁడవ'ని వంది మాగధ పాఠములు ప్రవచించిన మాత్రాన నావిదేశీయులు తమపెత్తనములువదలుకొని వచ్చిన దారిని దమ దేశమునకు మఱలి పోవుదురా? అట్లు మెత్తని మాటలతో బ్రతిమాలుకొనిన మాత్రాన పెత్తనము వదలుకొనిపోవుటకుఁ దినమఱిగినవారి మనస్సులు మెత్తపడునా? అట్లు తప్పు తలంపు గలిగియుండుట తెలివి తక్కువ తనముగదా? కాఁగా; ఇఁక నాపరప్రభుత్వ పీడవదలించు కొనుట యెట్లను ప్రశ్న పొడమును. అగుచోఁ గర్తవ్యమేమి? అదియెట్లు నిర్వహించుట? ఇట్టి ప్రశ్న పరంపరలు మన మనస్సును గలవరపఱచు చుండును. అయిననేమి? మన మెల్లర మేకమై మఱుఁగుపడిన జాతీయ భావమును వెలికిఁదీసి "స్వారాజ్యము నాజన్మహక్కు" అనుభావమును బ్రజాసంఘహృదయమందుఁ బాదుకొల్పి, తదనుగుణ్యమగు శక్తిసహాసములను, ఆత్మగౌరవమును బురికొల్పి, దేశమాతకు నీరాజనములిచ్చుసద్బుద్ధిని, సంకల్పమును బ్రజాసంఘమునకుద్బోధించి, దేశీయుల నెల్లరిని నొక్కమాట మీఁద నొక్కయాశయము మీఁదఁ బ్రవర్తిల్లునట్లు ఏకభావముగ బ్రజాసంఘము నేకముచేసిన యెడలఁబరప్రభుత్వము కాలికి బుదిచెప్పకొనుననుట యతిశయోక్తి కానేరదు. అట్టిదీక్షాకంకణ బద్ధు

లగుటకు దేశీయులు తమ వేషభాషలు, అహార విహార ములు, ఆచార వ్యవహారములు మొదలగు నన్నియు జాతీయ భావకలితములగు మాతృదేశ సంప్రదాయ సిద్ధములుగాఁ స్వీక రించి, దేశమందెల్లెడల వ్యాపించిన విదేశనాగరికతా పిశాచ ములను బాఱఁద్రోల వలయును. అట్లు స్వదేశాభిమాన నిరతి, సర్వత్ర సమాదరణీయ ధర్మముగా భావించి ప్రవర్తిల్లుట వలన దేశము స్వరాజ్యము సంపాదించుకోఁ గలదనుట తథ్యము.

ఒక దేశము మఱియొక దేశమును బరిపాలించు చుండఁగా, నాపరిపాలనము నంతమొందించుటకై తత్పరిపాలనా నిర్వాహకులగు పరిపాలకులను వెడలఁగొట్టి నుంకించుట ధర్మ మగునాయని తలపంకించుచుఁ బ్రశ్నించువారు కొందఱుందురు. పాపము; అట్లుప్రశ్నించువారుధర్మమననేమో బొత్తిగాఁదెలియని వారని తలఁపనగును. ఒకదేశము మఱియొక దేశముమీఁద నధికారము నెఱపుననుటలో నాంతర్యమేమి ? అయ్యో! ఈ దేశీయులు పరిపాలనకుఁ బనికిమాలినవారని యన్యదేశీయులు దయార్ద్ర హృదయముతో ధర్మాధికారము నెఱపుచుందు రందుమా ? అది తగనిమాటగదా! ఒక దేశీయులు సమర్థులు, మఱియొక దేశీయు లసమర్థులని చెప్పుట తెలివిమాలిన మాట గాదా ! తమ దేశముయొక్క చదువు సంధ్యలు, వేష భాషలు, ఆహార విహారములు, ఆచార వ్యవహారములు మొదలగువాని నాయధీన దేశముమీఁద నెగఁద్రోసి యా దేశజాతీయతను రూపుమాపి దేశసంపదను కొల్లఁగొట్టుట యగును. ఇట్టి లక్ష్య ముతో నొక దేశమును మఱియొక దేశమువారు పరిపాలన సాగింతురు. ఇట్టిస్వార్థబుద్ధి పెరిఁగిన కొలఁది యాదాస్యమునుభ

వించు దేశమం దెల్లడల దార్రిద్ర్యము, దుఃఖము మొదలగు ననర్థము లనంతమ్ములై పుట్టగొడుగులవలె మొలకెత్తి దేశము క్రుంగి, కృశించి, యసహనము ద్వేషము అసూయ మొదలగు విరోధ గుణములు పెంపొందును. అట్టి దేశము పర ప్రభుత్వము వలన సర్వవిధముల సంక్షోభమునకును గురి యగును. ఇట్టి పాటులు పెరిగినకొలది పరస్పర విరోధభావ ములు ప్రబలి హత్యాది ఘోరకార్యములు పిశాచరూపమున విహరించుటకుఁ గారణమగును. కాఁగా నిట్టి చెడుగులవలన నిరు దేశములకు శాంతి సమకూడదు. పర ప్రభుత్వము స్వదేశ గౌరవమునకు భంగకరమని తెలిసికొని నప్పటికిని ఆవిదేశీయ పాలకులమీఁద సోదర భావముతో మెలఁగుచు స్వదేశ గౌరవమును బెంపొందించు కొనుట లెస్స. పరప్రభుత్వము పనికిరాదనుకొనినప్పు డావిదేశీయులను ప్రేమించుచుఁ దమ దేశమునకుఁ దగిన జాతీయ భావములు కలిగి తమ దేశీయు లనుగూడఁ ప్రేమించుచు స్వరాజ్యము సంపాదించుకొనుట సంస్తవనీయమై, ప్రపంచమున కాదర్శమై యొప్పును. దేశగౌ రవము, జాతి గౌరవము పెంపొందవలయునినిన నిట్టి ప్రేమ భావమే యెల్ల దేశములకు గణనీయమై మాననీయమై యొప్పును. స్వపరిపాలన యనఁగా నిట్టి జ్ఞానము కలిగియుండుట యని యర్థము. ఈ వివరములు సత్యాగ్రహ ప్రకరణమందుఁ జదువుకొందమని మాపాఠక మహాశయులను వేఁడుకొను చుంటిమి.

## భా ర త దే శ ము

ప్రపంచమందు, స్వపరిపాలన శూన్యమై పరిపాలనకు లోనై కటకట పడుచున్న దేశమెచట గలదాయను పరిశోధింప

వలసిన పనిలేదు. మనము పుట్టిన మన మాతృభూమియగు భారతదేశమే యిందులకు లక్ష్యముగానున్నది. భారతీయులు దేశాభిమానము మఱచి యాత్మగౌరవమునకు దూరమై జీవించు చుండినట్లు మఱి యేదేశప్రజలును జీవించుటలేదు. భారతీయుల మనోవీథియందు విదేశ జాతీయ వ్యామోహము పరవళ్లు త్రొక్కు చుండుటచేత భారతీయుల జీవితమే కలుషితమగు చుండెను. అద్దాన విదేశీయుల పెత్తనమున కిచ్చట స్థానమేర్ప డెను. పరప్రభుత్వము ప్రాక్తన జన్మపాపము వంటిది. పూర్వ జన్మపాపము మఱుజన్మమందును జీవుని నెట్లు బాధించు చుండునో; యట్లే పర ప్రభుత్వము దేశమును పట్టి పల్లార్చు చుండును. భారతీయులు విదేశ నాగరికతా వ్యామోహులై విదేశీయులట్లు మాఱుచుండిరి. అందుచే భారతీయులు 'దాస్య' మను వ్యాధిగ్రస్తులై నోట మాటపడిపోయినవారై క్రుగ్గుచుండిరి. తమ జాతీయతను మఱచిపోవుట వలన భారతీయులు స్వరా జ్యము లేక యలమటించుట నేమని వ్రాయఁగలము? అట్లు అల మటించుచున్నను, స్వరాజ్యమునకు జాతీయభావము ముఖ్యమని తెలిసికొనరైరి! భారతీయులలోఁ గొందఱు స్వరాజ్యసముపార్జ నమునకై ప్రయత్నించుచుండిరి. కాని, భారతీయులు స్వరా జ్యము పొందుటకు ముందు జాతీయభావము ముఖ్యమని యెఱిఁగి జాతీయధర్మమును వృద్ధిపొందించు కొందురేని, స్వరాజ్య సంపాదన కంతగాఁ గష్టపడనక్కఱలేదు. జాతీయతను మఱచి 'స్వరాజ్యము స్వరాజ్యము' అని కేకలిడుట వలన నేమి ప్రయోజనము? అది గాలిమేడలు కట్టునట్టి గాథగా మాఱదా? జాతీయ ధర్మసూత్రమెఱుఁగనప్పుడు స్వరాజ్యమునకుఁ బ్రయత్నించుట పర ప్రభుత్వమును బలపఱ చుటయే యగునని చెప్పవచ్చును. భారతదేశ దాస్య

విమోచనము జాతీయ ధర్మమాచరించుటలోఁ గలదని యెఱిఁగి మహాపురుషులు దేశనాయకులు కొందఱు దేశసేవ చేయుచుండిరి. అట్టి మహాపురుషులలో మన గాంధి మహాత్ముఁడు మున్ముదటివాఁడు.

## మహాత్ముఁడు జాతీయత

మనభారత దేశమందు దేశ స్వాతంత్ర్యసము పార్జనకుఁ బాటుపడుమహా పురుషులలో నెవరును జాతీయధర్మ మాహాత్మ్యమును గాంధి మహాత్మునివలె నెఱిఁగినవారు లేరనుట యత్యుక్తి కాఁజాలదు. మహాత్ముఁడు ప్రపథమనుగాఁగరమున నలంకరించుకొనిన గ్రంథము, ప్రాచీనకాలమున లోకరక్షణకవతారములు మానవరూపముగా నుండెడివనియు, నిప్పుడా యవతారములు జాతీయరూపముగాఁ బరిణమించుననియుఁ జెప్పుచున్నది. జాతీయధర్మ పరమార్థమెఱిఁగిన మహాత్ముని మహిమను విప్పిచెప్పఁగల వాఁడు లోకమందెవఁడుగలఁడు? అట్టి యెడ నావంటి వాఁడు చెప్పఁ బూనుట దివ్వెతో సూర్యునిఁ జూపుట వంటిదగునని మనవి. మహాత్ముఁడు జాతీయతను దనప్రాణమనియుఁదన జీవిత లక్ష్యమనియుఁ దనమతమనియు మనోవాక్కాయములఁ బ్రశంసించుచుండెను. మహాత్ముఁడు జాతీయ జీవిత మారంభించినది మొదలు భారత దేశమేగాక సమస్త ప్రపంచము గాంధి మార్గమనుసరింపఁ బ్రయత్నించుచుండెను. జాతీయోద్ధరణకుఁ బ్రపంచ కళ్యాణమునకు నవతరించిన దేవునిగా మహాత్ముని సమస్త ప్రపంచము సంభావించుచుండెను. గాంధిమహాత్ముఁడను నీ మహాపురుషుఁ డవతరింపక పోయినయెడల, అయ్యో! పరప్రభుత్వము భారత దేశమును పిప్పి చేసియుండెడిదిగదా! మహాత్ముఁడే, యవతరింపక పోయిన

యెడల మనభారతీయుల బ్రదుకేమయ్యెడిదియో! పెక్కుమాట లేల? భారతదేశమునకు స్వాతంత్ర్య భిక్షపెట్టిన యవతారపురుషుఁడు గాంధిమహాత్ముఁడే యని లోకమందుఁ జాఁటిచెప్పఁగల మాట యిది యొక్కటియే!

"పరిత్రాణాయ సాధూనామ్ వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మ సంస్థాపనార్థాయసంభవామియుగే యుగే"

అనుగీతోక్తిముమ్మాటికి సత్యమై గాంధి మహాత్ముని నవతారపురుషునిగా నిరూపించుచున్నది.

గాంధిమహాత్ముఁడు దేశభాష, జీవనము, ప్రభుత్వము, జాతీయ భావము మొదలగు వానిని స్థిరీకరించుటకు నేయేమార్గములఁబ్రయత్నించుచుండెనో, మహాత్ముని జీవితము మననము గావించిన వారికవగతముకాఁగలదు. విదేశీయ నాగరికతనశించి జాతీయ భావమభివృద్ధి గాంచి దేశము సర్వసౌభాగ్యములతో వర్ధిల్లుటకు మహాత్ముఁ డొక్కఁడు దేశసేవకుఁగడంగుట జగత్ప్రాజ్యమైన విషయము. గాంధిమహాత్ముఁ డవలంబించిన జాతీయపద్ధతులందు దేశభాష, చేతిరాట్నము, ఆదర్శజీవితము మొదలగునవి ముఖ్యమని యింతకు ముందుఁజదువు కొంటిమి. సర్వగుణాతీతమైయొప్పు జాతీయత యననేమో కొంత చదువుకొందము. మహాత్ముఁడు జాతీయతను గూర్చి వెల్లడించిన యభిప్రాయములు కొన్నిటిని నిట నుదహరించుచుంటిని.

"జాతీయభావము లేనంతవఱకు స్వరాజ్యము లేదు"

"జాతీయతయనునది గొప్పదేవాంశము గలదిగా నాకుఁ దోఁచుచున్నది. అది మన మత జీవితమందు, ప్రభుత్వజీవితమందుఁ

బరిపూర్ణతగలదిగా నుండవలయునని చెప్పుచుంటిని. అప్పు డప్పుడు స్వదేశవస్త్రములను ధరించినంతమాత్రముననే జాతీయత కాఁజాలదు."

"వ్యాపార పూర్వకముగా విదేశములనుండి భారతదేశమునకు వస్తువులు రాకుండెనేని భారతదేశము పాలుపొంగిన దేశము కాఁగలదు. అయితే, అట్లు జరుగుటకు సాధ్యపడదేమో! మనకు పేరాసమెండు. ఇంగ్లాండున కంతకంటెఁ బదిరెట్లు పేరాస హెచ్చు. ఇంగ్లాండునకు ఇండియాకు ఏర్పడిన సంబంధము తప్పు దారిత్రొక్కి మతిభ్రమతోఁ గాలూని నిలువఁబడుచున్నది. అందువలన, ఆ మతిభ్రమణవలన, నింగ్లాండు గొప్పది గాఁజాలదు. భారతీయులకొఱకు ఇంగ్లాండున కీదేశము ఋణపడియున్నదని యా దేశముయొక్క నిశ్చయము. ఇది యథార్థమగు నెడల లంకాషైరు వ్యాపారమున నిలుపవలెను. అట్టియెడఁ గొలఁది భయము కలిగినను లంకాషైరున కాబాధ కలుగకపోవచ్చును. జాతీయత, వైరాగ్యబుద్ధిచే నవలంబించిన యొక విధమగు బహిష్కారపద్ధతి కాదని నేను నిశ్చయించుకొనుచుంటిని. కాలానుకూలముగా నెల్లరు నద్దానిని జ్ఞాపక ముంచుకొని నడచుకోవలయునని నా నిశ్చయము,"

"చెన్నపురమునందే పుట్టి చెన్ననగరమునందే పెరిఁగి మీ యింటి సమీపముననే యుండి యొకఁడు వ్యాపారము చేయుచున్నప్పుడు, బొంబాయినుండి యొకఁడువచ్చి యచట వ్యాపారము చేయుచున్నప్పుడు, ఆ బొంబాయి వ్యాపారస్థుని యొద్ద మీరు కొనుగోలుచేయుట న్యాయము కాదు. స్వదేశీయతనుగూర్చి నా నిశ్చయ మిట్టిదే. ఆటితేటిన మంగలి యొకఁడు చెన్ననగరమునుండి మీ యూరు వచ్చినను, మీరు మీ

యూరి మంగలినే యాదరింపవలయును. చెన్నపగరమునుండి వచ్చిన మంగలివలె మీ యూరి మంగలిని ఆ వృత్తియం దాఱితేఱిన వానినిగాఁ జేయఁదలఁతురేని, ఆతనిని జెన్న నగరమునకుఁ బంపి యచట ఆ వృత్తియందు ఆఱితేఱునట్లుగాఁ జేయుఁడు. అట్లు చేయువఱకు మీరు వాఱి యొక్క మంగలిని నాదరించుట న్యాయముకాదు. ఇదియే స్వదేశీయము."

"నేను దేశీయవస్త్రములనే ధరించుచుందును. ఎందుల కనఁగా నయ్యది సహజమగుటయే భారతీయుఁడగుటకుఁజిహ్నము. ఐరోపావారి ననుసరించి వారి దుస్తులను ధరించుట మనయొక్క హైన్యమునకును, మానహానికిని, ఇంకను పలు కొఱఁతలకును జిహ్నమగును. ఆడంబరమునకును, ధర తగ్గువలకును, అందము నకును, విదేశ వస్త్రములను గొనుట మహా దేశద్రోహము."

"1918 - లో విదేశ వస్త్రములకు అరువదికోట్ల రూపా యలు మన దేశమునుండి పంపితిమి. అట్లు విదేశ వస్త్రము లను గొనుచుండినయెడల, ఆ విదేశవస్త్రములను రాకుండ నాటంకపఱచునంతవఱకు, భారతదేశమందలి నేత పారిశ్రామిక లకు నూలు కొఱఁతను గల్పించినవార మగుచుందుము. ఆ నేత పనివారలకు మఱేదైన వృత్తినిఁ జూపఁ గలుగుచున్నామా ? అదియును లేదు. భారతదేశ ప్రజలలో పదింట నొక భాగము అర్థాకలితోఁ గృశించుచుండిరి. మధ్యతరగతి ప్రజలు మితా హారమును భుజించుచుండిరి. పసిబిడ్డలకుఁ గావలసిన పాలు లభించుటలేదు. కన్నులు గలవారికి ఇది తెల్లము కాఁగలదు. అలవాటుపడిన యీ దొంగతన మెంతవఱకు ధారాళముగా గొనసాగుచుండునో, అంతవఱకు అది అందుబాటులో మన

కష్టములను బోగొట్టునది కాదు. అందుచే స్వదేశీయత అట్టి కష్టములను బాపఁగలదు."

"దేహికిఁ బ్రాక్తనజన్మసంచిత పాపమెట్టిదియో యట్టిదియే యిండియాకు విదేశ వస్త్రములును."

"స్వదేశాభిమానము గట్టిపడుకొలఁది స్వదేశవస్తువులు అభివృద్ధికి రాఁగలవు. తత్ఫలితముగా స్వరాజ్యమును సంపాదించిపెట్టును."

"విదేశవస్త్రముల మీఁదఁగల వ్యామోహము విదేశ ప్రభుత్వమును బలపఱచును. దేశమందుఁ గఱవును వృద్ధిపఱచును. అంతియేగాదు, మఱియొక భయంకరమగు హానియు వాటిల్లఁగలదు. అది యేదియన, పెక్కుగృహములలో మానమమ్ముకొనుట. దుర్భరదారిద్ర్యమునకు గుఱియై నేఁతపనివారైన వందలకొలఁది పంచములు బొంబాయి మునిసిపాలిటీ వీథుల నూడ్చువారైరి."

ఈ యుపదేశ ప్రసంగములనుబట్టి గాంధిమహాత్ముని స్వదేశాభిమానమునుగూర్చి యర్థమేమో మనకు సుబోధితమగుచున్నదిగదా! మహాత్ముఁడు ప్రబోధించుచున్నట్టి యీ జాతీయోద్యమము (స్వదేశీయోద్యమము) నందలి యర్థము పరమార్థమై యొప్పుచుండఁగా; అయ్యది ప్రజాభిప్రాయము నొక్కటిగా బంధించుచున్నదనియు, అందుచే దేశమందలి ప్రజలను జెఱయందుఁబెట్టి నిర్బంధించుట యగుచుండెననియు, కొందఱు మఱియొక యర్థముగాఁ జెప్పుచుండిరి.

భగవత్సంకల్పానుసారము సృష్టి జరుగుచుండును. సృష్టి ననుసరించి మానవులు పలుదేశములందు జన్మింపు

చుందురు. ఆయా దేశములందలి భాషలు, జీవితములు ఆయా దేశీయుల కేర్పడుచుండును. అట్టివానికి భిన్నముగా నడచుకొనువారు సృష్టికి భిన్నముగా నడుచు కొనుట యగును. అట్టివారికి సృష్టిలక్ష్యమెట్లు బోధపడఁగలదు? ఎన్నఁటికి బోధపడదుగదా? ఇది కన్నులుండియు గ్రుడ్డివాఁడుగా నుండుటగదా! ఆయా దేశీయులు తమతమ దేశముల కనురూప జీవితములు గలవారుగా నుండవలయునని గాంధిమహాత్ముని సంకల్పము. అంతమాత్రముచేతనే, ఆయా దేశములవారు, మఱి యొకదేశమునకుఁ బోరాదనియు, ఆ యన్యదేశీయులతో మైత్రినెఱపరాదనియు మనమహాత్ముఁడు బోధించుటలేదు. ఒక దేశమువారు మఱియొక దేశముమీఁద నధికారము వహింప రాదనియు, తమదేశ వస్తువులను మఱియొక దేశమందు నింపి తన్మూలమున దేశసంపదను కొల్లఁగొట్టరాదనియు మహాత్ముని పరమాశయము. భగవంతునిచే సృష్టింపఁబడిన మానవులు ఆత్మీయభావము వ్యక్తిత్వము కలిగి యెచ్చటకుఁబోయిన నేమి? ఎచ్చటకు వచ్చిననేమి? గాంధిమహాత్ముని మనోభావము గ్రహింపనేరక మన మహాత్మునిమీఁద నిందలుమోపుట యజ్ఞానమగును.

గాంధిమహాత్ముఁడు గొప్పనో, కీర్తినోకోరి స్వదేశీయోద్యమ మావశ్యకమని భారతీయులకు బోధించుచుండుటలేదు. తన మాతృదేశీయులకు జాతీయభావము కలిగించి మాతృదేశము స్వాతంత్ర్యము కలదియై ప్రపంచమందన్ని దేశములట్లు వర్థిల్లవలయుననెడి మహాసంకల్పముతో, పవిత్రాశయముతో భారతదేశ సముద్ధరణకై యహర్నిశలు మహాత్ముఁడు సేవచేయుచుండెను. మహాత్ముఁడు ప్రబోధించుచుండిన హిందూ—మహా

మ్మదీయుల ఐక్యము, అస్పృశ్యతా నివారణ, వేశ్యల దాస్య విమోచనము మొదలగునవి యన్నియు స్వదేశీయోద్యమము నకుఁ బ్రధానములగును.

ఒక దేశమందలి ప్రజలెల్లరు నొక్క మనుష్యునివలె జీవింపవలెను. పుట్టుకనుబట్టియో వేషమును బట్టియో మఱెట్టి కారణమును బట్టియో భేదములు పుట్టుట వలన దేశమునాశ మగును. కావున దేశీయులెల్లరును నేకమనస్కులై యుండుట జాతీయ భావము నకు దేశసౌభాగ్యమునకుఁ బ్రాణము వంటిది. అట్టి యైక్యభావము లేని దేశమందు స్వదేశాభిమానము అనఁగా జాతీయభావము పెంపొందుట కల్ల. స్వరాజ్యమును బడయుట సున్న.

జాతీయ భావము, ప్రాణరక్షణము మొదలు వస్తు రక్షణము వఱకు నుండవలయునని మహాత్ముని సంకల్పము. ప్రజలలో ఏకీభావము లేనప్పుడు జాతీయ భావము వలన నేమి ప్రయోజనము ? ప్రజాభిప్రాయ మేక మైనప్పుడే జాతీయ భావము సత్ఫలము నిచ్చును. ఇట్టి ఫలప్రదమగు జాతీయ భావముగల జీవితము కలవారై యెల్లరు నుండవలయును. జాతీయభావమను నది స్వతస్సిద్ధమగునదే కాని తెచ్చుకోలు కాదుగదా ! అట్టి సహజ సిద్ధమగు జాతీయ జీవితమే మానవునకు సుఖప్రదమగు జీవితమగును. గాంధి మహాత్ముఁడట్టి జాతీయ జీవితమున కాదర్శమై యలరారుచుండుట జగత్ప్రసిద్ధముగదా !,

# స్వరాజ్యము

స్వదేశీయముయొక్క కార్యము స్వరాజ్యమగునప్పుడు స్వరాజ్యము మానవుని జీవితఫలమగుననుట నిర్వివాద విషయముగదా! అందుచే; మానవ జీవితము సఫలమగునట్టి స్వరాజ్యమననేమో కొంతం బరామర్శింతము.

స్వరాజ్యము మానవుని జన్మహక్కు. అట్టి జన్మహక్కు లేని పుట్టుక నిరర్థకము. జన్మసాఫల్యము లేనివాఁడు జీవచ్ఛవము. జన్మ సాఫల్యమునకుమూలము స్వరాజ్యముగదా! స్వరాజ్యము జన్మహక్కు అని ఇంతకుముందే అనుకొంటిమి గదా! అట్టిజన్మ హక్కులేనిజీవితము నిరర్థక జీవితమగుట నిక్కము. జీవితమును మేల్పడఁ జేయునది జన్మహక్కు. "స్వరాజ్యము నాజన్మహక్కు" అని లోకమాన్య బాలగంగాధర తిలకు మహాశయుఁడు ఎల్లపైఁ గాలు గ్రుచ్చి లోకమునకుఁ జాటిచెప్పెను.

స్వరాజ్యము వలన నాత్మగౌరవము గలుగును. ఆత్మ గౌరము లేనివాఁడు పలుచేటుల కాస్పదుఁడగును. లోక మందెందఱో అసత్యము, అసమానము, ఈర్ష్య, కోపము మొదలగు దుర్గుణములకు లోనై తమ యమూల్యమగు జీవితములను

వ్యర్థపఱచుకొనుచుండిరనుట యెల్లరెఱిగిన విషయము. ఇట్టి చెడుగుణములను దరిజేరనీయక దూరముగా నుండుటయే శ్రేష్ఠమైన ఆత్మ స్వారాజ్యము. అట్టి స్వారాజ్యము పొందుటయే సృష్టి ధర్మము.

## సృష్టి లక్ష్యము

భగవంతుఁడు మానవునకుఁ గరచరణాద్యవయవము లిచ్చుటలో నాశయమేమి ? ఆ యవయవ సౌష్ఠవమును సాధనముగాఁ జేసికొని స్వాతంత్ర్య జీవితము సంపాదించుకొని మానవుఁడు దుర్గుణములకు దూరముగా నుండవలయుననిగదా ! మాయాకార్యమగు కరచరణా ద్యవయవములు మానవుని నెట్లు పవిత్రముచేయును ? వ్యక్తిత్వము నెట్లు సార్థక పఱచునని కొందఱు ప్రశింపవచ్చును. మానవుని యజ్ఞానము నశింపఁ జేయుటకు మాయాకార్యములుగా శరీరాద్యవయవములను జ్ఞానోపకరణములుగా భగవంతుఁడు ప్రసాదించెనని తలపోయుఁడు; అజ్ఞానముచే మానవత్వము మఱచి "సోఽహం" మనుట నెఱుఁగక తనను దా నెఱుఁగనివానికి భగవంతుఁ డెట్లు సాయమగును ? శరీరాదికముల యుపయోగముతోఁ గష్టించి, జ్ఞాన మార్జించి యాత్మజ్ఞానియై 'సోఽహం' మ్మను యథార్థతత్త్వ మెఱుంగుటకు భగవదనుగ్రహసంపత్తియే కారణమగును. భగవదనుగ్రహ సంపత్తిచే జన్మించిన మానవుఁడు లోకసుఖము ననుభవించుచుఁ బ్రాక్తనజన్మసంచితము ననుభవించుచు, నద్దాని నెఱుఁగకపోయినను, భగవత్సహాయమును మఱచుటమాత్ర మజ్ఞానమగును. అట్టి యజ్ఞానమూలమునఁ దన జీవితము దుఃఖభాజనమగును. ఎవఁడు భగవత్సహాయమును ధ్యానించుచు నాస ర్వేశ్వరుని లీలా విలాసములను గీర్తించుచు నుండునో; ఆతఁడు మానవ

సేవచేయుజ్ఞానిరైయె విరాజిల్లఁగలఁడు. భగవత్సంకల్పానుసారము జీవించువానికిఁ గరచరణా ద్యవయవములు, అనుభవములు అను మాయ జ్ఞానజ్యోతిగాఁ బరిణమించును. అట్లు; భగవత్సంక ల్పాను సారము జీవింపనివానికి మాయ యజ్ఞానాంధకార మగును. కరచరణాద్యవయవములు, లోకవాసనలును భగ వంతునిచేఁ బ్రసాదింపఁబడిన ప్రకృతి సంపదయని తలపోయఁడు. ఈ విషయ మింతటితో నిలిపి ప్రస్తుత విషయమునకు మఱలుద మని పాఠక మిత్రులకు మనవి.

భగవంతుఁ డేప్రాణి కెట్లు కరచరణా ద్యవయవములు ప్రసాదించునో; అట్లే లోకవాసనలనుగూడఁ బ్రసాదించును.

అందువలనఁ బ్రాణికిఁ గరచరణా ద్యవయవములు ముఖ్య మైనట్లు లోకవాసనలుగూడఁ బ్రాణికి ముఖ్యములని యెఱుంగ వలెను.

## శరీరము — దేశము

మానవుఁడు తన యాత్మప్రకాశమునకుఁ గారణభూత మగు శరీరమునకుఁ గీడు కలుగకుండఁ గాపాడుకొనుచుండునట్లే తాను జన్మించిన దేశమునకుఁ గీడు కలుగకుండునట్లు కాపాడు కొనవలయును. మానవుడు తన శరీర మట్లు మాతృదేశమునని భావింపవలెను. అంతియకాదు శరీర, భద్రతకంటె దేశభద్రతయే జీవిత పరమార్థమని భావించుట పరమధర్మము. తన దేశము దాస్యమను పెనుభూతముచేఁ బీడింపఁబడుచుండ, శరీరక్షేమము మీఁది మోహముకంటె దేశక్షేమ మభిలషించుట ధర్మము కర్తవ్యముననని తలపోయవలెను. దేశమాత దాస్యబద్ధయై దైన్యావస్థయ దుండినప్పుడు శరీసౌఖ్య మెట్లు తద్దేశ మాతృ

గర్భమునఁ బుట్టినమానవుఁడు కాపాడుకొనఁగలఁడు? కరచరణాద్యవయవములకు లోకవాసనలకు సంబంధము కలదనుటను బరిశోధించి తజ్ఞులు చెప్పఁదగిన విషయము.

## పవిత్రత – దేశము

మానవుఁడు తన యాత్మను అబద్ధము అసహనము మొదలగు దుర్గుణములకుఁ దావులేకుండఁగ జీవించుటకుఁ బ్రయత్నించునట్లు; మాతృదేశము, అబద్ధము, అసహనము మొదలగు దుర్గుణములకు దూరీకృతముచేసి సుఖ సంతోషములతో నలరారునట్లు పాటుపడవలెను. దేశీయులెల్లరు సంయములై, ధర్మగుణ గరిష్ఠులై తమ జీవితయాత్రలు నల్పుచుండినయెడల దేశము దాస్య విముక్తి పొందుట నిర్వివాద విషయము. అట్టి పరమాశయముగలవారై దేశీయు లెల్లరు దేశౌన్నత్యము గాపాడుటకు శక్తివంచనలేని సేవ చేయవలెను. అట్లు దేశీయులందఱు దీక్షాదక్షతలుగల శక్తి సంపన్నులుగల వారు కాకపోవచ్చును. అట్టితఱిఁ దాము తమ శక్తికొలఁది పరమాశయముతో, పవిత్రాదర్శముతో దేశ పవిత్రతను గాపాడుటకు నుత్సహించి పాటుపడవలెను. అందుచే నెల్లరు తమ తమ శక్తికొలఁది దేశసేవ చేయుటకుఁ గడంగవలయును. అందువలన హెచ్చుతగ్గులనుబట్టి దేశసేవ చేయుటలేదని యెవరును దలఁపరాదు. ఒక్కొక్కఁ డట్టి యుత్సాహపూరితుఁడై దేశ సేవకుఁ గడంగినప్పు డయ్యది యెల్లరి పవిత్రతగాఁ బరిణమించును. ఆదర్శశోభితము గలవారై శక్త్యనుసారము దేశ పవిత్రతను గాపాడుటవలన దేశమునకు మేలు కలుగఁ గలదు. ఆదర్శజీవితమును దేశ గౌరవమునకుఁ గారణమగు పవిత్ర

మార్గమున నడుపుకొనుటవలన దేశమును దాస్యమునుండి విముక్తి చేయుట యగునని భావింపుఁడు.

దేశమందుఁగల భాగ్యవంతులు తమ భాగ్యగర్వముచేఁ బేదలను బాధింపరాదు; పేదలు నిరుపేదలను బీడింపరాదు; విద్యాధికులు విద్యావిహీనులను హేళనచేయరాదు; పురుషులు స్త్రీలను నేవగించుకొనరాదు; గురువులు శిష్యులను మోసగింప రాదు. ఎల్లరును దాము సుఖసంతోషము లనుభవించునట్లే, యితరులుగూడ ననుభవింపవలయునను నుదారమనస్కులు కావలయును. మానవుఁడు తనకుఁదానై కీడుచేసికొననియట్లు; దేశీయులు తమవలె జన్మించిన సోదర ప్రజానీకమునకు హాని చేయుటకుఁ గలనైనఁ దలఁపరాదు.

## స్వాతంత్ర్యము

ఒక సంఘజీవన విధానమునకు మఱియొక సంఘజీవన విధానము వేఱైనంత మాత్రాన రెండవ సంఘజీవన విధానమును హేళనచేయరాదు; ఈసడింపరాదు. తమ సంఘజీవన విధానమున కనుకూలము కావించుకొనుట కా రెండవ సంఘ జీవన విధానమును మార్చుటకు బలవంతము చేయరాదు; బాధింపరాదు. ప్రేమ స్నిగ్ధహృదయముతో జ్ఞానబుద్ధితో వారి మనస్సులను మఱల్చుటకుఁ బ్రయత్నించుట వివేకమగును. ప్రతి మానవుఁడు చెప్పుటకు, చేయుటకు, తలంచుటకు స్వాతంత్ర్యము కలిగియుండవలెను. తమ యాశయములకు భిన్నములైనంత మాత్రమున నెదుటివాని మనోభావములను వెలువరించుకొనుట కెట్టి యాతంకము కలుగనీయరాదు. ఎదిరిపక్షమువారి భావ ప్రకటనమున కంతరాయము కలిగించుట నాగరికతా ప్రపంచ

మునకే సిగ్గుచేటు కాఁగలదు. ఎదిరిపక్షమువారి భావప్రకట నమునకు స్వాతంత్ర్య మీయఁజాలని దేశమెట్లు తన స్వాతంత్ర్య గౌరవమును సంరక్షించుకొనఁగలదు?

దేశక్షేమమును మఱచి జాతి మత కుల భేదములందు మనస్సును జొప్పించి యమూల్యమగు జీవిత సౌభాగ్యమును వృథాపుచ్చుట జీవితలక్ష్యమును వమ్ముచేసి వ్యక్తిస్వాతంత్ర్య మును మంటగలిపి దేశనాశమును వెదకుటయగును. తమ దేశ క్షేమమునకు విరుద్ధముగాఁ బ్రవర్తించునట్టి యవకాశము గల్పింపక, ఆదర్శభావముతో నెల్లరు నొక్కటియను భావముతో నుండునట్లు ప్రయత్నింపవలెను. అట్లు ప్రతిదేశము పవిత్ర సంక ల్పము కలిగియుండిన యెడల భగవంతుని సంకల్పము సార్థకమై విశ్వమానవ సౌభ్రాత్రము వెల్లివిరియును. ఎల్లరు తనవలెఁ మాతృదేశమును, దమ దేశమువలె నితరదేశములను బ్రేమించు చుండిన యెడల భగవత్సంకల్పము సఫలమగుననుటలో నావం తయు సందేహము లేదు.

కాలవైపరీత్యముచే జీవితము — సంఘము — దేశము స్వాతంత్ర్యము కోల్పోవుట సంభవించునప్పుడు హాత్యా ప్రయ త్నమవలంబించి స్వాతంత్ర్యము సంపాదింపఁ దలంచుటయు వివేకము. స్వాతంత్ర్యము సంపాదించుట కట్టిపద్ధతియే పనికి రాదు. అట్టి దౌర్జన్యపద్ధతి కసిబోక మసిపూసికొనిన చంద మగును. కాని స్వాతంత్ర్య సంపాదనా పద్ధతి కాఁజాలదు. దౌర్జ న్యముచే నెట్టిమేలును గలుగఁజాలదు. సౌజన్యముచే నెట్టి కష్టములనైన ననుభవించి సుఖములు పడయవచ్చును. ప్రేమచే దుఃఖములను దిగమ్రింగుచుఁ బ్రజల హృదయపద్మము నుండి వెల్లివిరియు ప్రేమామృతముచే నట్టిచెట్టల నరికట్టుచు స్వాతం

త్ర్యమును భగవదనుగ్రహమునఁ సత్కార్యాచరణ పూర్వక ముగాఁ బడయుటకుఁ బ్రయత్నింపవలెను.

పరస్పర సౌహార్దముతో, సోదరభావముతో మెలఁగు దేశమేనాఁటికిఁ బతనముకాదు. స్వాతంత్ర్య మనుభవించు దేశీయులు తమదేశ స్వాతంత్ర్య గౌరవము నినుమడించునట్లు దేశీయాహారము భుజించుచు, దేశీయమగు దుస్తులు ధరించుచు, ప్రపంచక్షేమము కాంక్షించుచు నవకాశముగోలఁది లోకజీవనము భగవల్లీలా విలాసమని యెంచుచు, ప్రపంచము–జీవుఁడు–భగవంతుఁడు మొదలగు విషయములమీఁద బుద్ధిని బోనిచ్చి భగవత్సృష్టి రహస్యములను బరిశోధించుచు జీవితములు గడుపుకొనవలెను. మానవుని ఆత్మపరిశోధనకు సుఖజీవనమునకు దేశస్వాతంత్ర్యము సాధనమగుననుట యెల్లరెఱిఁగిన సత్యము. అందుచే మానవుఁడు తనకు భగవంతుఁ డిచ్చిన శరీరమును శ్రద్ధతోఁ బోషించుకొనునట్లు దేవదేవుఁ డిచ్చిన యీ భూమినిగూడ నట్లే సంరక్షించుట విధ్యుక్తధర్మముగా నెఱుంగవలయును. అట్లు కానిచో నాతఁడు బుద్ధిపూర్వకముగా భగవదాజ్ఞను నుల్లంఘించిన దేశద్రోహి, మహాపాపియు నగును.

## భారతదేశము – స్వాతంత్ర్యము

ప్రపంచమందే దేశమైనను దన యజ్ఞానముచేఁ బైన నుదాహరించినట్లు దోసములు చేయుచుండునెడల, ఆ దేశము స్వారాజ్యమున కనర్హమై నశించును. ఇందులకుఁ బ్రపంచచరిత్ర పెక్కుదాహరణ లీయఁగలదు. అంతయేల? మనము జన్మించిన యీ మన భారతదేశమునే యుదాహరణగాఁ గైకొందము.

మన మాతృదేశము రత్నగర్భయనిగదా ప్రసిద్ధి! మన మాతృదేశము ప్రకృతిసంపద నెల్లను గలిగియున్నది; కర్మభూమియని నుతిగన్నదిగదా! మానవజీవితమునకుఁ గావలసిన సుఖజీవనాధారమగు వ్యవసాయము మన భారతభూమిని సస్యశ్యామల మొనర్చుచున్నది. జ్ఞానవిజ్ఞానములు మనదేశమాతకుఁ బెట్టని సొమ్ములు. ఇట్లు అన్నింటను గడుంగడు దొడ్డదియై యుండుట వలననేగదా మన భారతదేశము ఆత్మకుఁ బరమాత్మకుఁగల సంబంధమును దెల్పుదేశమని పేరుగాంచినది! ఆ ప్రసిద్ధితోఁ బ్రకృతిసిద్ధమగు మానవజీవితమునకు లక్ష్యమైనదను సత్యమును వెల్లడించిన దేశముగదా! పాఠకమిత్రులారా! మనప్రాచీన మహర్షుల జీవితముల నారయుఁడు. వేదములు, ఉపనిషత్తులు, మొదలగు మహాగ్రంథములమీఁద మీ బుద్ధిని బ్రసరింపఁ జేయుఁడు. అప్పుడు మీకు బోధపడు విషయమేమో యాలోచింపుఁడు? ఆదర్శజీవితము, జ్ఞానమార్గమునని మీకు బోధపడఁగలదు. జీవితపరమార్థమును గనుగొనిన యీ మన మాతృభూమి—ఈ మనభారతదేశము నేఁడు స్వాతంత్ర్యము లేనిదై యిడుమలఁ బడుటకుఁ గారణమేమి?

భారతదేశము స్వాతంత్ర్యము గోల్పోవుటకుఁ గారణము లనేకములు. భారతదేశము ఆధ్యాత్మిక జీవితమును—ఆదర్శజీవితమును—జ్ఞానమార్గము నవలంబించుటయే యనఁగా అహింసా ధర్మమును భారతజీవిత పరమార్థముగా గ్రహించుటయే, భారతదేశము స్వాతంత్ర్యము గోల్పోవుటకుఁ గారణమని కొందఱందురు. ఈ కారణము హేతుబద్ధమైనదని యీ నా మంద బుద్ధికిఁ దోఁచుటలేదు. మానవజన్మ సాఫల్యమునకు హేతువగు పరమసత్యమును భారతీయు లాచరించుట యధర్మ మెట్లు

కాఁగలదు? ఆ సత్యమును నాచరించుటకును సాగిరానీయకుండ మన ప్రాచీన శాస్త్రజ్ఞులు కొందఱు చేసిన యపచారముచేఁ గలిగిన చేడ్పాటును మనదేశమిప్పు డనుభవించుచున్నది. అవును; చేసిన పాపకర్మ మనుభవింపక తప్పునా?

## ప్రాచీనకాలమందలి దుశ్చర్యలు

భారతదేశము పూర్వౌన్నత్యము నశించి పతనమగు హేతువులలో స్త్రీలకు స్వాతంత్ర్యము లేకుండఁ జేయుట, జన్మముచేతనే జాతిమత కులభేదములను సృష్టించుట, మనుష్యులలో నస్పృశ్యులుగా నొక తెగవారిని వేఱుచేసి వెలివేయుట, ధర్మమును బోధించుచువచ్చిన బౌద్ధ జైన మతాచార్యులను జంపుట మొదలగునవియని చెప్పవలయును మాటిమాటికీ విషయములను జెప్పుచుండుటచే బాఠకమిత్రులు మన్నింతురు గాక! చేసిన తప్పులను బలువిధములుగా వెలువరించుట వివేకోదయమగునని నా మనవి. పూర్వము మనపూర్వులు ప్రకృతితత్త్వముమీఁద దమబుద్ధిని బోనీయక వేదాంత మనుపేరుతో నతిఛాందసమార్గమును ద్రొక్కిరి. అంతటితోఁబోక పలుమతములు కల్పించిరి. అందుచేఁ దలకొకమతము; తలకొక దేవుఁడుగా వైదికమతము మాఱిపోచ్చెను. నిజమునకు నేఁటి వైదికమతమందు దేవుళ్లు పెక్కురైరి. ఇట్టి దేవుళ్ళకు మ్రొక్కులుపెట్టుట హైందవునకుఁ దలప్రాణము తోఁకకు వచ్చుచున్నది. ఇట్లే మతములపేరిట జాతి,కుల భేదములను సృష్టించి మానవ సంఘమునుజీల్చి దేశమును ఛిన్నాభిన్నము చేసిరి. ఆమీఁదట నామతము గొప్పది నాదేవుఁడు గొప్పయని వాదులాటలుప్రారంభమై "వెఱ్ఱిదీఱె ఱోఁకలితలఁ జుట్టుమ"న్నట్లు మత యుద్ధములు ప్రబలి దేశము సర్వనాశనమైనది. మతావేశముతో

కులములనెడి తూట్లుపొడిచి వైదిక జ్ఞానభాండమునే పగులఁ గొట్టుకొంటిమి. కట్టా! ఎంతటి యవివేకము!

బౌద్ధజైన మతాచార్యులను దూలనాడిన మన శైవ వైష్ణవ మతాచార్యులు తమలోఁదాము తలపట్లు పట్టుకొనిరి. యుద్ధములు ప్రేరేపించిరి. మతయుద్ధములమూలమున నెన్నియో ఘోరహత్యలు జరిగినవి. ఈ మతవైషమ్యములు ప్రబలి యసూయాద్వేషములతో నెన్నియో గ్రంథములు వెలికి రాకుండఁ గాలగర్భమున నణఁగఁద్రొక్కఁబడెను. ఎన్నియో దేవాలయములు మతవిద్వేషమువలన ధ్వంసము కావింపఁ బడెను. ఇట్టి మతావేశముతో, మూఢ్యవిశ్వాసములతో దేశమును మొదలంట నాశనము గావించిరి. నాఁటి మనపూర్వులు వ్రాసిన మతఖండన గ్రంథములను, పరస్పర విరుద్ధాభిప్రాయములుగల శ్రుతిస్మృత్యాది నిబంధన గ్రంథములను నేఁడు చదివిచూచినచో మనపూర్వులు, వంచనను, అసహనమును దేవునిగా భావించిరో; లేక తత్త్వాతీతము, ప్రత్యేకమునైన తనను దానే దేవునిగా భావించి ప్రేమించుకొనిరేమోయని బోధపడును. రాజులును, తమతమ మతములమీఁది యావేశములచే నితర మతస్థులను హింసించిన ఘోరము లనంతములు. మత సహనమనునది దేశమందుఁ గఱవైపోయెను.

### మతైక్యమునకు గౌరవమిచ్చుట

ఇట్టి మతయుద్ధము లితరదేశములందు జరుగలేదా? ఒక్క మన దేశమే మతయుద్ధములను ప్రేరేపించెనా? యని కొందఱు ప్రశ్నింపవచ్చును. ఇతరదేశములందును మత యుద్ధములు జరిగినవి. ఆ యుద్ధములవలనఁ గలిగిన ఫలితములు ఆ

దేశము లనుభవించి వెంటనే బుద్ధి దెచ్చుకొనినవి. ఇతర దేశములవారు ఒక్క మతమునకో, ఒక్కని యభిమతమునకో గౌరవమిచ్చుటకుఁ జక్కఁగా నాలోచింతురు. మతవిద్వేషములు దేశపురోభివృద్ధికి-అశాంతికి కారణమగునట్లు ఇతర దేశములవారు ప్రవర్తింపలేదు. మన దేశమందు నేఁటికిని మతభేదములతో నొకరి నొకరు తలపట్లు పట్టుకొను దుశ్చర్యలను మనవారు వదలిపెట్టియుండిరా ? లేదే !

నాఁటి జాతి మత కుల ద్వేషములు, శాస్త్రముల పరస్పర విరుద్ధాభిప్రాయములు నేఁడు రాజ్యాంగమునందు ముఠా యుద్ధములుగా, పత్రికా యుద్ధములుగా రూపభేదము నొందుట దేశ భవిష్యత్తున కెంతయో యంతరాయము కలుగఁగలదు. అన్యమతముల నాదరించుట, జాతి మత కులభేదము లంతరించుట, అస్పృశ్యత రూపణుట, స్త్రీ స్వాతంత్ర్యము, అన్యదేశీయులను దమవలె భావించుట, అన్యులకు హానిచేయకుండుట మొదలగు సద్గుణములు కలిగి దేశము శాంతితో వర్థిల్ల నంతవఱకు స్వారాజ్యము గగన కుసుమ మనుట నిశ్చయము. పూర్వకాలమున మన దేశమందుఁ బ్రబలిన దుశ్చర్యలు నేఁటికి ముండ్లపీకలవలె మొలకలెత్తుచున్నవి. ఆ దుర్గుణములను మొదలంట నాశముచేసి మహర్షు లాచరించిన యాదర్శ జీవితమును, ఏ ప్రాణికి నూహామాత్రముగా నైనను హాని చేయు తలంపు గలుగనట్టి ధర్మగుణము గలిగి సమరస భావముతో నుండుటకు మన దేశీయులు బద్ధకంకణులు కావలెను. అందులకు జాతీయభావ మావశ్యకమని భావించుట లెస్స యగును.

స్వదేశీయాభిమానము కలిగియుండిన మాత్రానఁ బ్రయోజనము లేదు. తమ తమ మనస్సులందు జాతీయ జ్యోతి ప్రకాశించునట్లు భారతీయులెల్లరు ఏకోన్ముఖముగాఁ బాటుపడ వలయును. అందులకుఁ బ్రప్రథమముగా భారతీయులందు ఐక్య భావము రాశీభూతమై ప్రేమ తొణికిసలాడు జాతీయభావము పెంపొందవలయును. సోదర మానవులను విశ్వసింపక, మీఁదు మిక్కిలి వారిని ద్వేషించు కార్యము లాచరించుచుండిన యెడల దేశము స్వాతంత్ర్య మెట్లు పొందఁగలదు? దేశమందు వివిధ మతము లెన్ని యుండిన నేమి? అడవియం దెన్ని పూవులు పూచుటలేదు? అనేకత్వమం దేకత్వము గాంచుటయే జ్ఞాన తత్త్వము. పూర్వకాలమున దేశ జీవనమునకు విపాతము కలిగించిన దుష్కృత్యములు - దురాచారములు మతపిశాచచేష్టలు దేశము విచ్ఛిత్తి యగుటకుఁ గారణమని నొక్కి చెప్పఁగలను. ఇవియే దేశము దాస్య మనుభవించుటకు మూలకారణములు. ఇది దేశమునకుఁ దీరని మచ్చ. జాతి మత వర్ణాది భేదములు మొదలంట నశింపవలెను. అప్పుడుగాని దేశము సర్వసమున్నతిని బడయఁజాలదు.

## దే శ సే వ

మానవుఁడు తన జీవితమందుఁ దన స్వాతంత్ర్యమునకై పాటుపడినట్లే, తనవంటి దేశీయుల స్వాతంత్ర్యమునకుఁగూడఁ బాటుపడవలయును. మానవుఁడు తన జీవితమం దాచరింపఁ దగిన యాదర్శములలో నిదియొకటి; మహాధర్మములలో నియ్యది పరమధర్మమని భావింపనగును. తాను జన్మించిన దేశము దాస్య శృంఖలాబద్ధమై యిడుమలు పడుచున్నప్పుడు, దేశ స్వాతంత్ర్య

విషయము పట్టించుకొనక, తనస్వాతంత్ర్యమునుగూర్చిమాత్రమే పాటుపడువానిపని, ఎండపొడ ప్రసరింపని నీడయందు మొక్కనుఁ బాదుచేసి యెరువు నీరులు పోయువాని పనివంటి దగును. అయ్యది తెలివిమాలినపనిగాదా! దేశమునకు సేవచేయుట మానవ జీవితమం దొకభాగముగా భావించుట యొప్పనిమాట. సర్వవిధముల సంపూర్ణముగాఁ ద్రికరణశుద్ధిగా దేశసేవచేయుట మానవుని విధ్యుక్తధర్మ మనుట లెస్స. తన మంచిని సైతము లెక్కగొనక దేశసేవ చేయుటయందు భగవత్సేవతప్ప వేఱొకటి కాదని సత్యమగు పరమార్థము కలదని తెలిసికొనుఁడు.

## గాంధిమహాత్ముఁడు స్వరాజ్యము

ఈ గ్రంథమందు మానవ జీవితమునకు లక్ష్యముగా నేను రచించుచున్న మన జాతి పిత గాంధిమహాత్ముని జీవితము సకు దేశసేవ పరమాశయమని జగమెఱిఁగిన విషయము. గాంధిమహాత్ముఁడు దక్షిణాఫ్రికాయందు మానవకళ్యాణమునకై సేవచేయుట కారంభించినది మొదలు నేఁటివఱకు దేశసేవ చేయుచుండుట జగదాశ్చర్యకరమగు నాదర్శమై యొప్పుచుం డెను. దేశసేవకు ముఖ్యాశయమగు దేశ స్వాతంత్ర్య మూలా ధారమగు నాదర్శజీవితము కలిగియుండుట, ఆత్మపరిశోధన, జీవ కారుణ్యము మొదలగువానిని మహాత్ముఁడు తన జీవితమందు లక్ష్యముగా గ్రహించి యాచరించుట నీ గ్రంథాదిని బలు తావులందుఁ జదువుకొనియుంటిమి. అహింసాధర్మముకొఱకుఁ బ్రాణమును సహితము లెక్కగొనక నిరశనవ్రతము పూనిన మహాత్ముఁడపరబుద్ధుఁ డని చెప్ప నొప్పును. మహాత్ముఁడు తలఁచు తలఁపులందును, వ్రాయు వ్రాఁతలందును, చేయు సేవ లందును అహింసయే మహాత్ముని హృదయమందు హత్తుకొని

పోయెను. ఆతఁడు త్రికరణశుద్ధిగా, గుణాతీతమగు నహింసా వ్రత మాచరించు పరమపూజ్యుఁడు. అవాఙ్మానస గోచరమగు ననంత సత్య దయాధర్మ శక్తి గుణసంపన్నుఁడగు గాంధి మహాత్ముఁ డొక్కఁడే స్వాతంత్ర్య మహిమ నెఱిఁగినవాఁడు. మహాత్ముఁడు స్వాతంత్ర్య సముపార్జనా దీక్షితుఁడై దేశసేవ చేయుటకు స్థిత ప్రజ్ఞుఁడని చెప్పఁగలము. మహాత్ముని సేవావ్రతమునకు ప్రేమ - సహనము - సత్యము - ధైర్యము అను సద్గుణములు వ్రత సంకల్ప సూత్రములు. ఆ మహనీయుఁ డభిలషించినట్లు దేశమం తయు నా నాలుగు గుణముల నాదరించుచుండని కారణమున స్వరాజ్యఫలము అనఁగా ఆగామి కర్మము ఫలింపకపోయెను. విరోధము, అసహనము, అబద్ధము, భయము మొదలగు గుణ ములతోఁ గూడిన సేవలు ఆగామి కర్మమును అనఁగా స్వరాజ్య ఫలమును గాంక్షించుట వెఱ్ఱితనము కాఁగలదు. "జ్ఞానయుక్త మగు అహింస భారతదేశమునకు విధ్యుక్త ధర్మమగునేని స్వరా జ్యము దూరములో లేదని నాకుఁ దెలియును" అని మహాత్ముఁడు చెప్పిన మాటలు భారతీయులకు శిరోధార్యము కాఁగలవు.

గాంధిమహాత్ముఁడు పరహృదయ మెఱిఁగి ప్రవర్తించు టలోఁ బండితుఁడనుట మహాత్ముని జీవిత మెఱిఁగినవారికిఁ దెలియును. "ఎల్లరికి స్వాతంత్ర్యము కలదు. అందుచే నెవ రేమి చెప్పినను జెవి యొగ్గి వినుట మంచిది" యని, 'శత్రువుల'ని భావించి యెదరిపక్షమువారు ప్రసంగించునప్పుడు కేకలు వేయుట, ఈలు ఊదుట, మొదలగు సల్లరిపనులు చేయుటయు, ప్రసం గములు వినకుండుటయు నజ్ఞానము. అట్టిపనులు స్వాతంత్ర్యము గోరువారు చేయుపనులు కావు" అని మహాత్ముఁడు పలుతావులఁ దన నిశ్చితాభిప్రాయములను వెల్లడించియుండెను. శ్రీమతి అని

బిసెంటు, ఒక పర్యాయము బొంబాయినగరమందు నుపన్యసించి నప్పుడు విద్యార్థులు చేసిన యల్లరిని మహాత్ముఁడు 'మూర్ఖులు చేసిన యల్లరి' యని చెప్పుటను నింతకుముందును జదువుకొని యుంటిమి. "తననుగుఱించి విమర్శించుట కెట్టివారికైనను హక్కు గలద"ని చెప్పునట్టి గొప్పతనము మన గాంధిమహాత్ముని కొక్కనికి మాత్రమే యుండుటనుబట్టి యజాతశత్రునిగా, మహా పవిత్రునిగా భావించి పూజించుచుంటిమి. ఇట్టి పరప్రకర్ష సహ్యమగుట లోకమందుఁ గానము. ఆహా! మహాత్ముని మాహాత్మ్యము వివరింప నేరికిఁ దరమౌను? తానుస్వాతంత్ర్యాభిరుచి ననుభవించుచున్నట్లే తనదేశముగూడ ననఁగా, నితరులు కూడ ననుభవింపవలయు ననెడి మాట తపోవంతునికే చెల్లును!

మహాత్ముఁడు జాతీయ ధర్మ సంరక్షణార్థము నిరంతర సేవాతత్పరుఁడై సంకల్పబద్ధుఁడై యకుంఠితదీక్షతోఁ దన జీవితమును నడుపుకొనుచుండెను. తన దేశీయులందుఁ బ్రేమ స్థిరమై యుండుటకు స్త్రీ స్వాతంత్ర్యమునకు, అస్పృశ్యతా నివారణకు, హిందూమహమ్మదీయుల యైక్యమునకు మహాత్ముఁడు తన జీవితమును ధారవోయుచుండుట లోక ప్రసిద్ధముగదా! ధనజీవితములను లెక్కగొనక దేశసేవచేయుట మహాత్ముల లక్షణము. ఎల్లరియెడ సమభావము గలిగియుండుట స్వరాజ్య సంపాదనకు ముఖ్యమని మహాత్ముఁడు మాటిమాటికిఁ బ్రబోధించుచుండెను.

స్వరాజ్యమన నొకరిచ్చునది మఱియొకరు పుచ్చుకొనునదికాదనియు, భారతీయుల సత్సంకల్పము వలనఁ బ్రయత్నించినఁ దనంతటనది లభించుననియు నొకరి దయా ధర్మము

లతో భిక్షించునది కాదనియు గాంధిమహాత్ముని యట్లు మన కెవరు తెలియఁ జెప్పఁగలిగిరి? దేశస్వాతంత్ర్య సంపాదన కంతరాయములు కలుగకుండఁ బెక్కు నియమములు మహాత్ముఁడు భారతీయులకుఁ దెలియఁజెప్పి యొక్క నియమిత మార్గమను సరింప భారతీయులను హెచ్చరించు చుండెను. భారత దేశమును భారత దేశముగాఁ ద్రికరణశుద్ధితో భావింపవలయునని ప్రబోధించుచుండెను. అట్లు భారత దేశమును భారత దేశముగా భావించుట, చెప్పుట, చేయుటయే స్వరాజ్యమని మహాత్ముని యభిప్రాయము. అనఁగా మనోవాక్కాయములందు భారతజాతీయత యుట్టిపడవలయునన్న మాట. స్వరాజ్యమునుగూర్చి మహాత్ముఁడు వెలువరించిన యమూల్యములగు నభిప్రాయములందుఁ గొన్నిటినైనఁ జదువుకొనుట మనవిధి.

"హిందూ - ముస్లిముల యైకమత్యము, ఖద్దరు, అస్పృశ్యతా నివారణ అను నీమూఁడును నాయొక్క స్వరాజ్యమునకు ముఖ్యాంగములు."

"ప్రభుత్వమునకు వ్యతిరేకముగా ప్రజాసంఘ ప్రతినిధులులమై మనము ప్రభుత్వమును బాలింపఁగలమని చెప్పఁబడుచున్నది. ఇదియొక్కటి యుండినఁ బ్రయోజనము లేదు. ఆ ప్రజా ప్రతినిధులమని తలంచువారు చరితార్థులగుటకుముందు వారు దేశసేవానిరతులై యుండినఁగాని వారిని మనము మన ప్రతినిధులనుగా నంగీకరింపము."

"మనభారతీయులలో పతితులగు పంచములు స్వాతంత్ర్యము పొందుటయే స్వరాజ్యమను పదమున కర్థమని నేను భావించు చున్నాను."

"అస్పృశ్యతను రూపు మాపవలెను. అది స్వరాజ్యము నకు వేఱుపురుగు వంటిది. నాకు స్వరాజ్యము కావలెను."

"మన యభివృద్ధి విదేశీయ పద్ధతులకు లోనైయున్నది. అందుచే, ఇప్పుడు మన మభిలషించు స్వరాజ్యము విదేశీయుల స్వాతంత్ర్య లాభమువంటి దగును. వారియూహాలకుఁ దగినట్లు ఇండియా, విదేశములతో పోటీ పడవలయును. అంతకంటె వేఱు మార్గము లేదని పలువురభిప్రాయ పడుచుండిరి. నేనట్లు తలంచుట లేదు. ఇండియా యిరోపా కాదు ; జపానుకాదు ; చైనా కాదని నేను మఱచుట సాధ్యపడను. ఇండియా 'కర్మభూమి' అనియు, ఇతర దేశములు భోగ్య భూములనియు దైవికమగు వాక్కు. భారతదేశ లక్ష్యము ఇతర దేశములకంటె భిన్నమని నేను భావించు చుంటిని."

"స్వరాజ్యమనఁగా ప్రతి వ్యక్తియు స్వాతంత్ర్యమును గలిగియుండుట."

"అహింసయే స్వరాజ్యమనుట వలన నేఁటి కలహాము లకు, అరాజకములకుఁ దావులేదని యర్థము. అహింసాపూర్వక మగు స్వరాజ్యమనునది శ్రద్ధగాఁ బెంచఁబడిన చెట్టునుండి స్వయముగా పూచి, కాచి, ముదిరి పండినపండువోలెఁ బ్రజా ప్రతినిధులనుండి నైకమత్యభావముచేఁ దప్పక లభించును."

"స్వరాజ్యము భగవంతునిచేత నీయఁబడునట్టిదియుఁ గాదు. దానిని మనకు మనమే (ప్రయత్నించి) సంపాదించుకొన వలయును. స్వరాజ్య మనునది స్వార్జిత మగునుకాని యితరుల దయవలన లభించునదికాదు."

"కాంగ్రెసు కోరినట్టి స్వరాజ్యము ఇంగ్లాండు ఇష్టమును బట్టి యీయఁబడునదికాదు. అది దేశీయులు కోరినది సంపూర్ణమైనట్టిదియు, దక్షిణాఫ్రికా పొందినట్టిదియు—పొందవలయును.

"మృత్యు భయమునుండి విడుదల పొందుట వంటిది స్వరాజ్యము. మరణమునకు భయపడు దేశము స్వరాజ్యము పొందదు."

భారతదేశ లక్ష్యముతో భారతాశయములతో భారత దేశము స్వాతంత్ర్యము పొందవలయుననియు, "సర్వమ్ పరవశమ్‌దుఃఖమ్, సర్వమాత్మవశమ్ సుఖమ్మ"నునది భారతదేశ లక్ష్యమనియు, స్వాతంత్ర్యము సంపాదించుటకు విదేశపద్ధతిని మహాసభలు మొదలగునవి సమావేశ మగుటవలనఁ బ్రయోజనము లేదనియు, 'మానవ సేవయే మాధవసేవ' యని భారత దేశ పరమాశయమనియు, ఈ యాశయమునకుఁ దగినట్లు భారతదేశ స్వరాజ్య లాభము, ఇంగ్లాండు స్వరాజ్యలాభముగా, ప్రపంచ స్వరాజ్య లాభముగా నుండవలయుననియు, ఆంగ్లేయులను బీడించి సంపాదించు స్వరాజ్యము భారతదేశమున కాత్మగౌరవముగల స్వరాజ్యము కాదనియు, మహాత్ముఁడు వెలువరించిన యాశయ పరమార్థమును భారత మిత్రులు గ్రహించి యానందతుందిల హృదయులగుదురుఁగాక !

# సత్యాగ్రహము

జీవితమునకు స్వరాజ్యము మిక్కిలి యావశ్యకమైనది. స్వరాజ్యములేని జీవితము, జీవితము కాఁజాలదు. అట్టి స్వరాజ్యము సంపాదించుటకుఁ దగినమార్గమేది? సత్యాగ్రహమే! సత్యాగ్రహ సంబంధమగు నే పద్ధతియైనను స్వరాజ్యము సంపాదించుటకు రాచబాట యగును. అట్టి సత్యాగ్రహమునకు మన దృష్టిని మఱలించుదము.

ప్రకృతి సంబంధమగు జీవితమందు అజ్ఞానమూలమున గొన్ని సమయములందిక్కట్టులు కలుగుట లోకసహజము. తండ్రికిఁ గొడుకునకు, గురువునకును శిష్యునకు, యజమానునకు సేవకునకు అట్లే యితరుల కితరులకును, కుటుంబములందును దేశములందు నేర్పడియున్న ప్రకృతి సంబంధముగా నొక్కారణముననో వివాదములు కలుగుచుండును. అట్టి తగవులు తల యెత్తకుండ మొదటనే త్రుంచివేయుటకు మార్గమెద్ది? అట్టి మార్గము ప్రకృతికి విరుద్ధముగా నుండరాదు. విరుద్ధపద్ధతిని బోవుటవలనఁ గష్టము లధికమగును. అవును; పెడదారిని ద్రొక్కుటవలనఁ జెట్టలు మిక్కుటమగునుగదా! ప్రకృతి సహజమగు జీవితమును మనకనుగ్రహించిన భగవంతుఁడు తద్రక్షణము

నకుఁ బ్రకృతిసిద్ధమగు ధర్మమార్గ మొక్కటి మనకుఁ బ్రసాదించి యుండెను. అదియే సత్యాగ్రహము!!!

సత్యాగ్రహ మనఁగా సత్యమునకై యాగ్రహము గలిగి యుండుటయని యర్థము. అనఁగా దేటతెలుఁగున సత్యమును నిశ్చయముగా సాధించుటయనియు విజ్ఞుల యభిప్రాయమని గ్రంథారంభమునఁ బ్రసంగవశముగాఁ జదువుకొని యుంటిమి.

కాలము

సత్యాగ్రహము మహాత్మునిచేఁ గనుగొనఁబడినదని కొందఱు భావించుచుందురు. అది యథార్థముకాదు. అనాది నుండియు సత్యాగ్రహముకలదు. 'సత్' అను సత్పదార్థ మెప్పుడు కలదో, యిప్పటినుండియు సత్యము-సత్యాగ్రహము కలదు. అందుచే సత్యాగ్రహ మనునది యనాదినుండియుఁ గలదని విజ్ఞులు చెప్పుచుందురు.

పూర్వమే ప్రహ్లాదాది భక్తుల చేతనే సత్యాగ్రహ మాచరింపఁబడి పెంపొందిన యొక మహాధర్మమని గ్రహింపవలెను. గాంధిమహాత్ముఁడును ఆ మహాధర్మమును గ్రహించి, లోకమును తద్ధర్మపథము ననుసరించుటకుఁ బ్రబోధించుచుండెను. ధర్మమార్గ మొక్కటేయైనను దత్ప్రకాశము ఆచరణయందొక్కొక్క కాలమందొక్కొక్క విధమునఁ బేరుగలుగుచు వచ్చుచుండెను.

ప్రపంచమందలి సమస్త మతములు సత్యాగ్రహ మతములే యగును. సత్యము, ధైర్యము, ప్రేమ, దయ మొదలగు

సద్గుణములుగల వారందఱును సత్యాగ్రహులే యగుదురు. ఆ గుణములు గలవారిని సత్యాగ్రహులని మహాత్ముఁడును భావించుచుండును. మన భారతీయులు సత్యాగ్రహమును స్వర్గాధిపత్యమనియు, లక్ష్మీసంప త్తియనియు జ్ఞానమార్గమనియు, సన్మార్గమనియుఁ బలు పేరులు పెట్టిరి. గాంధిమహాత్ముఁడా పదమునకు సత్యాగ్రహమను సన్వర్థకమగు పేరిడెను.

విద్యార్థికులకుఁ గలిగిన యర్థము

దక్షిణాఫ్రికాలో గాంధిమహాత్ముఁడు శాంతియుద్ధమారంభించినప్పుడు, ఆ యుద్ధమునకు సాత్వికయుద్ధమను నర్థముగల పాసివ్ రెసిస్టెన్స్ (Passive Resitance) అను నాంగ్లనామమిడెను. అట్టి పేరుపెట్టిన మహాత్ముని బుద్ధివైశద్యమును గ్రహింపఁజాలక విద్యార్థికులమని పిల్లువీగు విజ్ఞులుకొందఱు పలు విధములగు నర్థము లాపదమునకుఁ జెప్పమొదలిడిరి. గాంధి మహాత్ముఁ డారంభించిన యుద్ధము, బలాత్కారములేని భయముతోఁ గూడినదనియును, అంతర్యమందా పదమునందు విరోధభావము కలదనియు, అట్లనుటవలన నయ్యది హార్ద్యముగాఁ బరిణమించుననియు నర్థము చెప్పఁదొడంగిరి. ఆ యర్థము తన చెవికెక్కిన గాంధిమహాత్ముఁడు తన మనోనిశ్చయము స్పష్టమగునట్లుగా నుండెడి పదమునకై మాతృభాషావేత్తలను సంప్రతింపఁ దలంచెను. ఆ యపూర్వయుద్ధమునకు సార్థకమగు పేరు పెట్టిన పండితులకు బహుమాన మిత్తుమని 'ఇండియన్ ఒపీనియన్' అను పత్రికా రాజమందు బ్రకటించెను. మగన్‌లాల్ గాంధి 'సదాగ్రహము' అను పేరుపెట్టి బహుమతిపొందఁగలిగెను. ఆ విద్యార్థికుఁడు తెలిపిన యర్థము 'సత్' అను పదమును మార్చి గాంధిమహాత్ముఁడు సత్యాగ్రహము చేసెను. సత్యా

గ్రహశబ్దమునకుఁ జెప్పిన యీ యర్థము పీఠికవంటిది. ఈ యర్థముతో 'సత్యాగ్రహము' ప్రపంచమందుఁ బ్రసిద్ధిగాంచు చుండెను.

వెలుఁగు

'సత్' అనునది యెన్నఁటికి నాశములేని పరాశక్తి స్వరూపమువంటిది. ఆ పదమును సత్యమని దేశభాషలనును, సత్యమన నెన్నఁటి కుండునదని యర్థము. 'సత్' అను పదార్థము సర్వవ్యాప్తమైనది. అట్టి శాశ్వతమగు సత్పదార్థమును మఱచి జీవించు మానవుని యజ్ఞానమేమో!

మానవునియందుఁ గల యజ్ఞాన మాతనిని 'అసత్' పదార్థమునకు లాగి మానవత్వమును నశింపఁజేయుచుండును. అందువలన మానవుఁడు కష్టముల పాలగుచుండెను. ఆ యజ్ఞానమువలనఁ గలిగిన ద్వేషాదిక దుర్గుణములు మానవుని హృదయమునకుఁ గుటుంబమునకు దేశమునకుఁ బ్రపంచమునకు నుపద్రవములు కలిగించి, సహజముగానేర్పడియున్న సోదర భావమును నశింపఁజేయుచుండెను. ఒక సంఘము మఱియొక సంఘమును, ఒక మతము మఱియొక మతమును, ఒక దేశము మఱియొక దేశమును శత్రువుగా భావించి కయ్యమునకుఁ గాలు దువ్వనట్టి దురాగ్రహమును (దౌర్జన్యమును) తప్పుట నేమని చెప్పఁగలము? ప్రపంచము అసత్తును గ్రహించి నశించుచున్నది! అయ్యో! 'సత్' అను భగవత్పదార్థమును నేఁటికిఁగూడ నెఱుఁగక సహోదరులు తమ స్థితిని గానక, తమలోఁ దాము గలహించుకొనుచుందురే! అయ్యో! ప్రకృతి స్వభావము నిర్లక్ష్యము చేయుచుండిరే! ఎంత యవివేకము! సత్తు అను మహా

పదార్థముతోఁ బ్రాణికోటిని సమీకరించి, ప్రేమించి, పోషించి, రక్షించు ప్రకృతి ధర్మమును మఱచి ప్రాణికోటిని హింసించుటయే యుద్ధమునకుఁ గారణమగుచుండెను. (అనఁగా స్వాతంత్ర్యమునుండి పతనమగు చుండెనని యర్థము) అట్లు; అజ్ఞానముచేఁ బతితమగుచుండిన ప్రాణి లోకమును గాపాడుట ప్రకృతి ధర్మమగుటచే, ఆ ప్రాణి లోకమునకు సత్పదార్థముమీఁద భక్తిని గలిగించి సత్యాగ్రహమునకు సంయుక్తమగునట్లు చేయుట మహా పురుషుల ధర్మము. సత్తును గూడినది సత్యము. సత్యమును ఆగ్రహించి (చేఁబట్టి) యుండుట సత్యాగ్రహము. సత్యమునందలి ఆగ్రహము అనఁగా గట్టి పట్టుదలయే సత్యాగ్రహము యథార్థమైన పట్టుదల సత్యాగ్రహము. అదియు సత్యమునకు దూరముకాదు.

సత్యాగ్రహమునకు మూలము సత్యము. సత్యప్రియుఁడు దేనికి నెవరికిని భయపడఁడు. సత్యము ధైర్యము గలవాఁ డితరులకు హానిచేయ నొల్లఁడు. అట్లు హానిగావించినచో నాతఁడు 'సత్' అను సత్యమునుండి పతితుఁ డగును. తనను, ఇతరులను వెలుఁగునకుఁ దెచ్చు సత్తు అను మూలపదార్థ మెఱిఁగినవాఁడు లోకమందలి ప్రాణుల కెట్లు హాని చేయఁగలఁడు? అట్లు హాని తలంచు సజ్ఞాని తనకుఁ దానే హాని చేసికొనువాఁడు కాఁగలఁడు. ఒక తోఁటయందు దిద్దఱు కూడి యుండిరను కొందము. ఆ యిద్దఱికి మనస్సులు కలియక మాట పట్టింపుచే నొకరిమీఁద నొకరికి ద్వేషము కలిగి తా ముండిన తోఁటను మూలచ్ఛేదము చేసి, నాశము చేసిన నేమి ప్రయోజనము? 'సత్తు' అను సత్యమును మఱచుట వివేక మగునా? కావున, ప్రేమతో దీక్షతో నిర్విఘ్నముగా సత్యమును సంరక్షించుట వివేక

మగును. ప్రతి కార్యమందును మంచి చెట్టలు బెరసి యుండును. ఆ విషయమును మఱచి దురాగ్రహమును గౌఁగిలించుకొనుట వలన నేమి ప్రయోజనము? ఎంతటి యవివేకము ?

దురాగ్రహమునకు గురియై నశించెడి మానవునో, కుటుంబమునో, ప్రభుత్వమునో మఱెద్దానినో సంరక్షించుటకు మార్గమేమి? అబద్ధమున కబద్ధమును, ఈర్ష్య కీర్ష్యను, హత్యకు హత్యను జేయు ప్రతిక్రియా బుద్ధి ప్రకృతి ధర్మము కాదు. అట్లగుటవలన మీఁదుమిక్కిలి యీ చెట్టలను బెంచుట యగును. సత్యము, ధైర్యము, ప్రేమ, దయ గలిగిన సత్యాగ్రహముచేనా చెడుగులను బాఱఁద్రోలుటకుఁ బ్రయత్నింపవలయును. దురాగ్రహమును బాఱఁద్రోలుటకు సత్యాగ్రహము సత్సాధనము. అట్టి సత్సాధనమగు సత్యాగ్రహము చేయు నతఁడు పెక్కు విధములఁ దన యంతరాత్మను బరిశోధించుకొనవలెను. తాను అంతరాత్మ ప్రేరితుఁడై పవిత్ర ధర్మ గుణ యుతుఁడై శమ దమాది గుణసంపన్నుఁడై దౌర్జన్యపరులు చేయు దుష్కృత్యములను ప్రేమ స్నిగ్ధహృదయముతో నెదుర్కొను సహన శక్తి సంపద సత్యాగ్రహి కలవాఁడు కావలెను. అట్లు సహన శక్తి కలిగియున్నను గష్టము లేకారణమున నైనఁ గలుగఁ గలవు. అట్టితఱి మిన్ను విఱిగి మీఁదఁబడుచున్నను సత్యాగ్రహి ఇతరులకు ఇంచుకైన హానియుఁ దన మనస్సునందుఁ గూడఁ దలఁపరాదు. ఎట్టి చెడుగులు దన బుద్ధికి రానీయరాదు. సత్యాగ్రహ మహిమను ఇచటనే కాపాడవలెను.

ఒకఁ డొకనిని గొట్టెనాఁ డనుకొందము. దెబ్బ తినిన వాఁడు తిరిగి యీ కొట్టినవానికిఁ బ్రతీకారము చేయఁదలఁచు నెడల ద్వేషము ప్రబలుచు విరోధము వృద్ధియగుచుఁ బరస్పర

నాశనమునకు దారితీయును. దెబ్బలుఁ దినినవాఁడు సహనభావమున దెబ్బలను సహించి, ద్వేషమును దిగమ్రింగి, కొట్టినవానిని బ్రేముడి భావమున గాంచుచుండినయెడల, దౌర్జన్యము గావించిన వాని హృదయము పశ్చాత్తాపము పొంది క్రమక్రమముగా విరోధము ప్రేమగా మాఱదా? అట్లు ప్రేముడితనముచే దౌర్జన్యము నశించును. ద్వేషము, కోపము, విరోధము మొదలగు దుర్గుణము లెన్నఁటికిని మేలును గలిగింపవనుట యనుభవసిద్ధము. ఒకఁడొకనిని గొట్టఁబోవుతఱి, రెండవవాఁడు తన హృదయమందు సహనము లేక, ప్రేమ లేక, ప్రతీకారము చేయు శక్తి లేక మిన్నకుండిన మాత్రన నయ్యది సత్యాగ్రహము కాదు. అది చేతగానితన మగును. ఈ విషయము గ్రంథాదిని సత్యాగ్రహ ప్రకరణమునఁ జదువుకొనుఁడు.

## సత్యాగ్రహ పద్ధతులు

సత్యాగ్రహమును బలువిధములుగా గ్రహింపవచ్చును. ఆయాచోట్లఁ దలయెత్తిన దౌర్జన్యము ననుసరించి సత్యాగ్రహ స్వరూపము మాఱుచుండును. ఒకచో సహాయము చేయకుండుట, ఒకచో శాసనోల్లంఘనము చేయుట, మఱియొకచో నిరశనవ్రతము పూనుట, ఇట్లు పలువిధముగా నాయా సందర్భముల ననుసరించి పలు పద్ధతులతో సత్యాగ్రహము చేయఁదగును. సత్యాగ్రహ మేరీతి నాచరించినను సత్యాగ్రహ ధర్మమును బరిత్యజింపక విరోధ ద్వేషాదులకుఁ దావిచ్చుట తగదను మహాధర్మమును మాత్రము మఱువరాదు.

## సత్యాగ్రహి యెవఁడు ?

సత్యాగ్రహము, ఇతరుల దౌష్ట్యమును నశింపఁజేయుటకు మాత్రమే చేయునది కాదు. తనయందు దాఁగియున్న దౌష్ట్యము గూడ నశింపఁజేయుటకై యితరులచేతఁగూడ సత్యాగ్రహము చేయించుకొనవలెను. ఇతరుల మేలునకై సత్యాగ్రహ మాచరించువాఁడు ప్రప్రథమముగాఁ దాను బరిపూర్ణ సత్యాగ్రహ గుణములు గలవాఁడుగా నుండవలెను. సత్యాగ్రహ లక్షణములు లేనివాఁడు సత్యాగ్రహమునకుఁ బాల్గొనరాదు. తనయందుఁగల దుర్గుణములను దూరీకృతము చేయలేనివాఁడు, ఇతరుల దుర్గుణములు నెట్లు పోఁగొట్టఁగలఁడు ? అందుచే, సత్యాగ్రహి శమదమాది గుణగరిష్ఠుఁడై, అరిషడ్వర్గమును జయించి, పంచేంద్రియములను వశము గావించుకొని సంయమియై యుండవలెను. అట్టివాని సత్యాగ్రహము చరితార్థమై, సర్వజన క్షేమంకరమై, జగత్పూజ్యమై, సత్ఫలదాయియై యొప్పఁగలదు.

మానవజన్మ మెత్తిన యెల్లరియందును సత్య సహన ప్రేమ దయాగుణము లెట్లుండునో; అట్లే తద్వ్యతిరిక్త గుణము లుండుటయు సహజము. మానవజన్మము పరమాత్మ జీవితాత్మ సంబంధము కలది యగుటవలన మానవునియందు పరమాత్మ జీవాత్మ గుణములు గలిగియుండుట ప్రకృతి సహజము. కావున నెల్లరియందును మంచి చెడుగు లుండుట నైజము. ఎవని కేయేగుణము లలవడునో యాతఁ డట్టివాఁ డగును. పైన నుదహరించిన సుగుణములు, విద్య, జ్ఞానము, ప్రవర్తన, ఆహారము, స్నేహము, సేవ మొదలగువానివలన వృద్ధి క్షయములు పొందుచుండును. అందుచేఁ బ్రతి మానవునియందును సత్యా

గ్రహ - దురాగ్రహ లక్షణము లుండుట సహజము. ఒకఁడొకప్పుడు సత్యాగ్రహిగా, మఱియొకప్పుడు దురాగ్రహిగా (దుర్జనుఁడుగా) నుండుటకుఁ గారణమేమి? ఒకని మనస్సునందే సత్యాగ్రహ- దురాగ్రహ లక్షణములు కూడియుండుటయేగదా కారణము! అనఁగా నొక్కనియందే యీ ద్విరూప గుణములు గలిగియుండునని భావము. మానవుఁడు విజిగీషువై యుద్ధమునఁ దలపడి సత్యాగ్రహిగా విజయము గాంచి దేవత్వము పొందుటకుఁ బ్రయత్నింపవలయును. దౌర్జన్యమును జయింపలేక యోటమి గలిగినయెడల నా యోటమివలన నాతని పుట్టుక నిష్ఫలమగును. ఆ దౌర్జన్యమునుండి యీ దుర్జనుని మఱలింపవలసిన భారము సత్యాగ్రహధర్మ మెఱిఁగినవాని కర్తవ్యము, ధర్మము నగును.

### లోటుపాటులు

ప్రపంచమందుఁ బరిపూర్ణ సత్యాగ్రహము సాధించినవారు మహాత్ములు. సత్యాగ్రహులు ఆత్మశక్తి సంపన్నులై సంయములై జగత్పూజ్యులగుదురు. కాని ఎంతటి సత్యాగ్రహియైనను సత్యాగ్రహ ధర్మమాచరించుటయందుఁ దప్పటడుగులు వేయఁగలఁడు. సత్యాగ్రహవ్రతము అసిధారావ్రతము వంటిది. అట్టి వ్రతధర్మమును బరిరక్షించుటలో, నాచరించుటలో స్థితప్రతిజ్ఞతతోఁ బ్రయత్నించి చ్యుతిగాఁగూడదు. అట్లు ప్రయత్నపూర్వకముగాఁగూడ సత్యాగ్రహ ధర్మము నైజవసము కావించుకొనలేక డాతఁడాచరింపఁదగిన మార్గమేది?

### ధర్మపద్ధతి క్రమశిక్షణ

తాఁజేసిన తప్పును దెలిసికొని యనుతాపరీత మానసుఁడై చేసిన తప్పును మన్నించునట్లు భగవంతునిఁ బ్రార్థించుచు

మున్ముందట్టి లోపములు కలుగకుండుటకుఁ బ్రయత్నింపవలెను. తన తప్పులను మన్నించునట్లు భగవంతునిఁ బ్రార్థించువాఁడు, ఇతరుల తప్పులనుగూడ మన్నించునట్టి క్షమాగుణ సహిత మగు నుదారబుద్ధికలిగి యుండవలెను. పశ్చాత్తప్త హృద యుఁడు సత్పథగామి యగును. సత్యాగ్రహి, తెలిసి తెలియము లచేఁ దప్పులకులోనైనప్పుడు పశ్చాత్తాపము, వ్రతము, భగవ త్ప్రార్థన మొదలగువానిచేఁ బవిత్రత సంపాదించుకొని యిఁక మీఁదట నట్టి చెడుగులుచేయని మార్గమనుసరింపవలెను.

కేవలదుష్టుఁడు సహితము తన దౌష్ట్యమును తెలిసికొని పరితప్తహృదయుఁడై ముందట్టిచెట్టలను జేయనొల్లని యుల్లము గలవాఁడై యుండవలెను. అందువలన దుష్టుని దుష్టబుద్ధియు నశించునట్లు సత్యాగ్రహి ప్రయత్నింపవలెను. దుష్టుఁడు చేయు చెడుగులను సహనభావమున సహించి యాతనిని మంచిమార్గ మున మఱలించుట సత్యాగ్రహికిఁ బరమధర్మము. సత్యా గ్రహికి సహనము ప్రేమయు, దుర్జనుని దౌర్జన్యమను వ్యాధికిఁ దగిన చికిత్స. ఆ చికిత్సా విధానమే మానవుని జరామరణ వ్యాధిని మాన్పఁగలదు.

శరీరమునకుఁ బ్రాణమెట్లో, అట్లే జీవితమునకు సత్యా గ్రహము. ఎల్లవారు నిట్టి సత్యాగ్రహ జీవితముగల వారగుదు రేని నిఁక సత్యాగ్రహము చేయు నావశ్యకత యేమిగలదు? అయితే, యొకఁడు దురాగ్రహి యగునప్పుడు సత్యాగ్రహి యుపేక్షింపరాదు. అట్లు ఉపేక్షించుట దౌర్జన్యమునకు దోహద మిచ్చుట యగును. అట్టి యుపేక్షాభావము సత్యాగ్రహమునకు మాఱుగా దురాగ్రహమునకుదారియగును. కావున, దౌర్జన్యము

తలయెత్తకుండునట్టి కోరికతప్ప మఱియెట్టికోరికయు సత్యాగ్రహికి నుండరాదు.

దౌర్జన్యము (దురాగ్రహము) రూపుమాపఁబడినప్పుడు వెంటనే సత్యాగ్రహము నిలిపివేయవలెను. దౌర్జన్యమును న్యాయమార్గముతో నణఁచివేయుటకుఁ దుదివఱకుఁ బ్రయత్నింపవలెను. న్యాయైక మార్గమున నెట్టిప్రయత్నము చేసినను బ్రయోజనము కానరానప్పుడు సత్యాగ్రహము చేయవలెను. అనఁగా క్షమాసహితబుద్ధి యవలంబించి దౌర్జన్యమును రూపుమాపుటకుఁ బ్రయత్నింపవలెనని యర్థము. అప్పటికి నది సాధ్యము కానప్పుడు సత్యాగ్రహము చేయవలయును. సత్యాగ్రహ సమరము చేయుటకు సత్యాగ్రహులెల్లరు ఐక్యభావము కలిగి శాంతగుణప్రధానులై, యచంచల మనస్కులై మెలఁగవలెను. ఎదిరిపక్షమువారు యుద్ధసాధనములతో సత్యాగ్రహుల మీఁదఁ దలపడినను జలింపక సత్యము, ధైర్యము, ప్రేమ దయ మొదలగు ధర్మగుణములు కలవారై సహనము, త్యాగము, ధర్మము మొదలగు నాయుధసంపత్తితో సత్యాగ్రహ యుద్ధమునకుఁ గడంగవలెను. సత్యాగ్రహ ప్రాణమునకు, సత్ప్రవర్తన శరీరము వంటిది.

ఆదర్శమహనీయుఁడై, జగదేకారాధ్యుఁడై యొప్పు గాంధిమహాత్ముని జీవితమందు సత్యాగ్రహమెట్లు స్తవనీయమై యొప్పుచున్నదో, మహాత్ముఁడు సత్యాగ్రహము ప్రారంభించి ప్రపంచమును సత్యాగ్రహధర్మము నాచరింపవలయునని యెట్లు ప్రయత్నించుచుండెనో మొదలగు విషయములను గొలఁదిగానైనను దెలిసికొనుట మనజీవిత మహాభాగ్యమని యెంచి యా విషయములను బరిచూఁతము.

## సత్యాగ్రహమూ మహాత్ముఁడు

గాంధిమహాత్ముని బాల్యమందలి మాతృప్రేమ అస్పృశ్యతయందలి జుగుప్స, మానము, సత్ప్రవర్తన మొదలగు గుణములు మహాత్ముని సత్యాగ్రహ జీవితమునకు మూలబీజములు. గాంధిమహాత్మునకు సత్యాగ్రహజ్ఞానము పరిఢవిల్లుటకు దక్షిణాఫ్రికా కదన రంగమయ్యెను. అందులకుఁ గారణమచటి తెల్లవారి దౌర్జన్యము! మహాత్మునకు సత్యాగ్రహ సంపద బాల్యమునందే యలవడెను. అంతియకాని జీవిత మధ్యభాగమందలవడలేదు. బాల్యమందలి ప్రేమయే మహాత్ముని హృదయమును సత్యాగ్రహగుణము గలదిగా రూపొందించెను. పిమ్మట మహాత్ముఁడు దక్షిణాఫ్రికాకుఁ బయనమగువఱకు మహాత్ముని జీవితమందెన్ని కష్టములు-మార్పులు కలిగినను సత్యాగ్రహ గుణమునకు మాత్రము నష్టము వాటిల్లకుండుట ప్రపంచమహాభాగ్యము. భగవంతుఁడే యీ సత్యాగ్రహ బీజమును మహాత్ముని హృదయక్షేత్రముననాటి పెంచి పోషించుచుండెను. ఆ బీజము కాలక్రమమున మన యదృష్ట విశేషముచే మొలకయై పెరుఁగుచుండెను. ఈ సత్యాగ్రహ బీజమెట్లు తన హృదయక్షేత్రమందు నాటుకొనెనో; మహాత్ముఁడు తన యాత్మకథ యందు ఈ... భగవానుఁడు దక్షిణ-ఆఫ్రికాలో నా జీవితమునకుఁ బునాదివైచి ఆత్మ సమ్మానసంగ్రామమునకు బీజావాపము చేసెన"ని చెప్పియుండెను.

మహాత్ముని జీవితమును మొట్టమొదటగా నాంగ్లమందు వ్రాయ మొదలిడిన "జోసఫ్‌టోకు" అను నాతఁడు గాంధిమహాత్మునిఁ జేరి "సత్యాగ్రహ జ్ఞానము మీ కెట్లు కలిగినద"ని పశ్నించినప్పుడు మహాత్ముఁడు:—

"నేను చిన్నఁవాఁడనుగా నున్నప్పుడు, పాఠశాలయందుఁ జదువుకొను దినములలో "నొక గుజరాతీపద్యము నా హృదయమున అంకితమైపోయెను. అందలి "అపకారికి నుపకారము చేయుట" అనునది నాకు జీవనసూత్ర మాయెను. ... ఇచట ఆ చమత్కార పద్యముల నుదాహరింతును.

"సీ. జలమును నీ కీయఁ గలవాని కెందేని
నొసఁగుమీ కడుపార నోగిరంబు
వందనంబును జేయువానికిఁ జేయుమీ
భక్తిమై సాష్టాంగ వందనంబు
దమ్మిడి నీకిచ్చు ధన్యాత్మునకుమాఱు
గా, నిమ్ము మేల్మి బంగారు కాసు
కష్టంబులందు నక్కఱ వచ్చువానికి
నిమ్ము నీ నెమ్మేని నేనికోసి

యొకటి యొసఁగినఁ బదిరెట్లు లొసఁగవలయు
చెట్ట చేసిన మేలును చేయవలయు
ప్రాఁత కాలమునాఁటి యీ చేఁతలెల్ల
అను పూర్విగ సత్య రహస్య మరయ.

గుజరాతీ మూలము:

'పాణీ అపనేపాయ, భలుంభోజ నతో దీజే
ఆవీన మావేశిశ. దండవత కోడే కీజే;
ఆపణఘూసేదామ, కామమహోరోనుఁ కరీయే,
ఆపడగారేప్రాణ, తేతణా దుఃఖమాం మరీయే:
అవగుణ కేడేజే గుణకరే, తేజగమాం జీత్యోనహీ."

ఈ నీతిపద పద్యము, నా చిన్ననాఁటినుండి నన్ను తన్మయపఱచుచున్నది. పిమ్మట ఏసుప్రభువు గిరి ప్రవచనము నా కెంతయో సంతోషము కలిగించెను."

(తెలుగు ఆత్మకథనుండి)

అని యీ విధముగా మహాత్ముఁడు సమాధాన మీయఁగా మిత్రుఁడు "భగవద్గీత కాదా మొదట పవిత్రునిజేసి యుండుట" యని యడిగెను. అందులకు మహాత్ముఁడు,

"కాదు. సత్యాగ్రహము యొక్క శక్తిని, మహిమను దెలియఁజెప్పి నన్ను గాఢపఱిచినది బైబిలుక్రొత్త నిబంధనయే. నేను ఏసు గిరి ప్రవచనము చదువునప్పుడు, అందుఁగల "దుష్టుని ఎదిరింపక నిన్ను కుడిచెంపమీద కొట్టువాని వైపుకు ఎడమచెంప కూడ త్రిప్పుము. "(మత్తయి 5-39) అనునదియు," మీరు పరలోకమందున్న మీ తండ్రికి కుమారులై యుండునట్లు మీ శత్రువులను ప్రేమింపుఁడి. మిమ్మును హింసించువారి కొరకు ప్రార్థన చేయుఁడి. (మత్తయి 5-44-) అనునదియును జదువు సమయమున, నేను మితిలేని యానంద మనుభవించితిని. ఈ ప్రవచనము నా మనస్సునందు పిమ్మట భగవద్గీతను జదివించి నది; ఆ పిమ్మట టాల్‌స్టాయి రచించిన 'వైకుంఠము నీ హృదయము లోనే (The Kingdom of god is with in you) 'దికింగ్‌డమ్ ఆఫ్‌గాడ్ ఈజ్ విథిన్‌యు' అను గ్రంథము నన్ను ముగ్ధునిఁ జేసెను. ఆ గ్రంథము నా మానసమున అంకితమైపోయెను." (తెలుఁగు- ఆత్మకథనుండి) అని సమాధాన మిచ్చెను.

మహాత్ముని జీవితమునకు శోభ నిచ్చిన ఏసుప్రభువు కొండమీఁదనుండి కావించిన బోధామృతము మన కెల్లరకుఁ బరమ పవిత్రమై యలరారుచున్నది. ఈ గిరి ప్రవచనము ఒక్క గాంధి మహాత్మునినే పునీతము చేయుటలేదు. ఆ గిరి ప్రవచన మెంత తెందఱనో గాంధిమహాత్ములను కావించుట లేదు! ప్రపంచమందలి మానవులను మానవులనుగాఁ జేయుటకు బోధించిన మహోపదేశము గాదా ఆ యేసునాథుని బోధ!!! సమస్తమతముల సిద్ధాంతముల కదియే మూలము గదా! జీవితమందా యేసునాథుని బోధామృతము నాకుఁ గలిగించిన సహాయ మమూల్య మైనదని మనవిచేయుచుంటిని. మానసికశక్తిని, ఆత్మజ్ఞానమును పెంపొందింపఁగలఁ యీ యేసుప్రభుని బోధను 'బైబిలు – మత్తయి సువార్త' 5–6–7 అధ్యాయములు చదువుకొందురుగాక యని మా పాఠక మిత్రులకు వేఁడికోలు.

ఏసుప్రభువుయొక్క యీ బోధామృతము మానవుని నుత్తేజపఱచునుగదా! గాంధి మహాత్ముని జీవితమును బవిత్రము గావించిన యీ బోధామృతము నన్నును బవిత్రముచేయును గాక! నా మిత్రులను, పాఠకమిత్రులను–నా దేశీయులను–ప్రపంచమును పవిత్రముచేయుగాక! నా హృదయమందున్న యో జీవుఁడా! ఈనా కోర్కెను సఫలీకృతము చేయుదువుగాక! యని నాప్రార్థన.

దక్షిణ–ఆఫ్రికాయందుఁ గలిగిన సేవాజ్ఞానము మహాత్ముని జీవితమందు హత్తుకొనెను. సత్యాగ్రహమందలి పవిత్రత లోకమంతయుఁ దెలిసికొనవలయునని మహాత్ముఁడు తపస్సు చేయుచుండెను. మహాత్ముఁడు సత్యాగ్రహ ధర్మరహస్యమును

ప్రపంచమునకు బోధింపవలయునని ప్రత్యూహము ఉబలాటపడు చుండెను. అట్టి యుబలాటమునుబట్టియే సబర్మతీ నదీతీరమం దొక యాశ్రమమును స్థాపించెను. అప్పటినుండి యా యాశ్రమ నామము, ఆశ్రమ నియమములు ప్రపంచము నలుఁగడలు వ్యాప్తిగాంచెను. ఆశ్రమనియమములు పాలించుటవలన జీవితము శక్తిమంతమై యాదర్శమై వన్నె కెక్కఁగలదనుట తథ్యము. నేఁడు మనము మన గాంధి మహాత్ముని ననుసరించుటయే మహాభాగ్యముగా భావింపవలెను. అట్లు; జీవిత సౌభాగ్యమగు నాత్మజ్ఞానమును సంపాదించుటకు మహాత్ముఁడు చెప్పిన చొప్పున ఆశ్రమము నియమిత ధర్మపథమున నాదర్శముగా నడుపఁబడు చుండెను. అందుచే, ఆ యాశ్రమ నియమములు ప్రపంచమందలి వారికి – భారతీయులకుఁ దెలిసియుండుట యత్యావశ్యకము గదా! కాఁగా నట్టియెడ నాయాశ్రమ నియమము లాంధ్రులకుఁ దెలియుటకై యీ గ్రంథమందు వెలువరించుట యత్యావశ్యకమని భావించి యిట నుదాహరించుచుంటిని. ఆ యాశ్రమ పరిపాలనా పద్ధతులు గ్రహించి, స్వీకరించి యాచరించిన యెడల నందఱము సత్యాగ్రహులము కాఁగలము. అట్టి సత్యాగ్రహ జీవిత మలవడుట కుపయుక్తములగు కొన్ని పద్ధతులు బోధపడఁ గలవు. ఆ యాశ్రమ నియమము లిట్లుగలవు.

దక్షిణాఫ్రికాయందలి యనుభవములు మహాత్ముని నెంతయో యుత్తేజింపఁజేసినవి. తన విధ్యుక్తధర్మమును సత్యాగ్రహ మూలమున సాధించుటకు సాటిలేని తపస్సును మహాత్ముఁడు చేయుచుండెను. సత్యాగ్రహము ప్రపంచమందెల్లరికి నుపయోగపడునట్లు మిక్కిలిగాఁ బరిశ్రమించుచుండెను. అట్టి పరిశ్రమ సాధనముగా భారత దేశమందు సబర్మతీ నదీతీరమునఁ

ప్రశాంత ప్రదేశమున నొక యాశ్రమమును సత్యాగ్రహ నామమున నెలకొల్పెను. ఆ యాశ్రమమందెల్లరికిఁ బ్రవేశము కలదు. ఆ యాశ్రమ నియమముల ననుసరించి యెల్లరునందుఁజేరి ప్రపంచ కళ్యాణమునకు – దేశసేవకు – నిర్మాణాత్మకమగు కృషిని నభ్యసింపనగును. మహాత్ముని దివ్యసందేశమును సత్యాగ్రహమూలమున సత్యాగ్రహులు సముపార్జించి సదాచారాది సద్వృత్తిగలవారై మెలఁగుదురుగాక! ఆధ్యాత్మిక జీవిత సంపదకు ఆశ్రమములు పెన్నిధానములుగదా! ఆశ్రమ నియమములు పాలించుచు నెల్లరు తమ జీవితములను సుఖమయము గావించుకొనుట కవకాశము సత్యాగ్రహాశ్రమమందెంతయోకలదు. సత్యాగ్రహ జీవితమునకు సత్యము మూలముగదా! ఆ సత్యాగ్రహ జీవితమునకు వలయు నాశ్రమ నియమములు చదువుకొందము.

### ఆశయము

మాతృదేశమునకు సేవచేయుట యీ యాశ్రమాశయము.

### విభాగము

ఈ యాశ్రమమందు మూఁడు విభాగములు కలవు.

1. కర్మయోగులు 2. అభిమానులు 3. విద్యార్థులు.

### (1) కార్యనిర్వాహకులు

మాతృదేశమున సేవచేయుచు నీ దిగువ లక్షణములను– ఆశయములను దమ జీవితలక్ష్యములుగా నలవఱచుకొని

యాశయసిద్ధికిఁ బ్రయత్నించువారు కార్యనిర్వాహకు లనఁ బడుదురు.

## స త్య ము

సత్యము పలుకుట, దేశ క్షేమమునకు మనోవాక్కాయ శుద్ధిగా మెలఁగుట, తల్లిదండ్రులు - ఆ ప్తులు ధర్మ విరుద్ధముగా నడుచు కొనునప్పుడు వారిని నెదిరించుట. ఇందులకు ప్రహ్లాదుఁడు నిదర్శనము.

## (2) అ హిం స

జీవహింస చేయకుండుట. ఇతరులు తన కపకారము చేసినను వారిని ద్వేషింపక ప్రేమించుచుండ వలెను. ఇట్లు, తల్లి దండ్రులుగాని, యితరులుగాని, ప్రభుత్వమువారుగాని తనకుఁ గీడు చేసినప్పుడు వారిని నెదిరించుటకు సంసిద్ధత చూపవలెను. అపకారికిఁ బ్రత్యపకారము చేయరాదు;తలఁపరాదు. సత్యమును, అహింసా ధర్మములను ఆచరించువాఁడు అపకారము చేసిన వానికిఁ దిరిగి ప్రేమతో నుపకారము చేయవలెను. అపకారికి భయముచే లొంగక, ధర్మపథమున నిలువఁబడి ప్రాణమును సహితము లెక్కగొనక, అపకారి చేయు నపకారము లన్నిటిని ననుభవించుచు ఆ యపకారికి సద్బుద్ధి కలుగునట్లు ప్రయత్నింప వలెను.

## (3) బ్రహ్మచర్యము

సత్యము - అహింస యను నీ రెండును లేనిచో బ్రహ్మచర్య మాచరించుట కష్టము. బ్రహ్మచర్య మనగాఁ

కామ వికారముతో స్త్రీని జూడకుండుట మాత్రమే కాదు. మనస్సునందును కామవికారము కలుగకుండ నుండునట్లు కామక్రోధాది దుర్గుణములను జయింప వలెను. వివాహితుఁడు తన భార్యను ధూర్తభావముతోఁ జూడక, సహధర్మచారిణిగా భావించి యాదరించుచుండ వలెను. ఆమెతోఁ గలసి యింద్రియ వశులుగాక, బ్రహ్మచర్యవ్రత మనుష్ఠింప వలెను.

(4) ఆహార నియమము

ఆహార నియమము ముఖ్యము, సత్యము — అహింసా ధర్మముల నాచరించుటకు, బ్రహ్మచర్య వ్రతానుష్ఠానమునకు, ఆహార నియమము ముఖ్యావశ్యకము. అందువలన ఆహార నియమ మొక వ్రతముగా భావింపవలెను. దేశసేవకు శరీరారోగ్యము ముఖ్యము. ఆరోగ్యమునకు ఆహారము మూలము. ఆహార నియమ మెఱిఁగి నాలుకను గట్టికొని యుండవలెను.

(5) దొంగతనము చేయకుండుట

ఇతరుల వస్తువులను దొంగిలింపరాదు. అంతేగాక, జీవితమున కావశ్యములకు మించిన వస్తువుల నుంచుకొనినను దొంగతనమే యగును. మనకుఁ గావలసిన వస్తుసామగ్రిని మాత్రమే యుపయోగించు కొనవలెను. అంతకు మించి యే మాత్రము నుండరాదు.

సంఘసేవ

పైవానితోఁ బాటు నీ రెండును ముఖ్యావశ్యకములని గమనింప వలెను. ఒకటి ఖద్దరు, రెండు స్థైర్యము.

## ఖద్దరు

సంపాదనాపరులు అబద్ధమాడి గడించి కూడఁబెట్టుట యసత్యమగును; దొంగతనమగును. అందుచే మాంచెష్టరు, జర్మనీ, లేక భారతదేశమందలి మిల్లుగుడ్డలు ధరింపరాదు. యంత్రశాలలు అనర్థకములు. అందుచే యంత్రశాలలందుఁ బనిచేయు పారిశ్రామికులు ఆఁకలిచే మిక్కిలి బాధపడుచుండిరి. వారు అకాల మరణమునకు గురియగు చుండిరి. విదేశవస్తువులు – యంత్రమున నుత్పత్తి యగు వస్తువులు – వస్త్రములు వాడుట యహింసా ధర్మమునకు విరుద్ధమగును. ఈ వస్తువులను ఈ వస్త్రములను ఉపయోగించుట దొంగతనము చేయుటవంటి దగును. చేతితో వడికి నేసిన వస్త్రములను, చేతితోఁ జేసిన వస్తువులను వాడుకొనవలెను. ఖద్దరు వస్త్రములను ధరింపవలెను. బ్రహ్మచారి ఖద్దరు వస్త్రములను ధరింప వలెను. అట్లే ప్రతి జీవితావశ్యక వస్తువును స్వదేశీయమునే వాడవలెను.

## 2. ధైర్యము

ధైర్యము లేనివాఁడెప్పుడు నెట్టి మంచి పనియుఁ జేయఁ జాలఁడు. రాజు – ప్రజలు జాతి కుటుంబము దొంగలు పెద్దలు మున్నగువారి భయమునకు – పులి మొదలగు క్రూరజంతువుల భయమునకు – మరణ భయమునకు లొంగరాదు. యథార్థమునకు ధైర్యవంతుని నాతని సత్యశక్తి లేక యాత్మశక్తి సమస్త దుష్టశక్తులనుండి కాపాడఁగలదు.

## దేశభాషలు

మాతృభాషయే దేశాభివృద్ధికి మూలము. అందుచే నాశ్రమవాసులెల్లరు తమ తమ మాతృభాషలనే మాటాడుట

చదువుట వ్రాయుట నేర్చియుండవలెను. హిందీభాష నెల్లరు నభ్యసింపవలెను. సంస్కృత భాషయు నేర్వవలెను.

### చేతి పరిశ్రమ

చేతి పరిశ్రమ లాశ్రమవాసులెల్లరు నేర్చుకొనవలెను. మనోవాక్కాయములతో నితరులకు సేవ చేయవలెను. తమ తీఱికవేళలందు వ్యవసాయము లేక యితర చేతి పరిశ్రమలు నేర్చుకొనవలెను.

### రాట్నము

రాట్నము వడుకుట యాశ్రమవాసుల విధి. అందుచే ఆశ్రమవాసులందఱు నిత్యము రాట్నము వడుకుచుండవలెను.

### ఆంగ్లము

ఆంగ్లభాష ఆశ్రమ విద్యలందుఁ జేర్చఁబడదు. అందుచే ఆంగ్లభాష, మత సంబంధ విద్యలు అవకాశమునుబట్టి నేర్పఁబడును.

### 2. అభిమానులు

పైనఁజెప్పిన వానిని నాచరింపఁగోరువా రభిమానులుగా నెంచఁబడుదురు. వారు ఆశ్రమమందున్నప్పుడు పైనచెప్పిన విధులను నియమములను ఆచరింపకపోయినను; వాని ననుసరించి యుండవలెను. ఈ నియమములను బుద్ధిపూర్వకముగా నాచరించువారు ఆశ్రమ కార్యనిర్వాహకులగుదురు.

## 3. శిక్షార్థులు

1. నాలుగు సంవత్సరములు వయస్సుదాటిన బాల - బాలికలు చేర్చుకొనఁబడుదురు.

2. తల్లిదండ్రులు లేక సంరక్షకులు, తమ బిడ్డలయోగ క్షేమములను ఆశ్రమమునకు వదలివేయవలెను.

3. విద్యాభ్యాసకాలము ముగియు వఱకు విద్యార్థులు తమ తల్లిదండ్రుల - సంరక్షకులయొద్దకుఁ బంపఁబడరు.

4. కార్యనిర్వాహకు లనుష్ఠించు వ్రతములన్నియు విద్యార్థులకు బోధింపఁబడును.

5. మత సామరస్యము - వ్యవసాయము - నూలువడుకుట విద్యార్థులకు బోధింపఁబడును.

6. విద్యార్థులకుఁ దమ మాతృభాషయందే విద్య బోధింపఁబడును. చరిత్ర - భూగోళము - గణితము మొదలగు విషయములు బోధింపఁబడును. సంస్కృతము హిందీ ద్రావిడ భాషలు వీనిలో నొకటి విధిగా నేర్వవలయును.

7. ఆంగ్లభాష అప్రధానముగా బోధింపఁబడును.

8. విద్యార్థులకు ఉరుదు - బెంగాలీ - అఱవము - తెలుఁగు - దేవనాగరలిపి బోధింపఁబడును.

9. ఇవి పదిసంవత్సరముల పిల్లలకని కార్యనిర్వాహకుల యభిప్రాయము. విద్యార్థులకుఁ దగిన వయస్సు రాఁగానే మొదటి తరగతికిఁ దగిన నియమములు గఱపఁబడును. అట్లు

నేర్చుకొనుట కిష్టములేని విద్యార్థులు ఆశ్రమమునుండి పంపి వేయఁబడుదురు.

10. తల్లిదండ్రులు లేక సంరక్షకులమీఁద నాధార పడనప్పుడే యీ క్రింది నియమముల ననుసరింపఁదగును.

11. "నేను వయస్సు రాఁగానే జీవన విధానమున కావశ్యక మగు ఆశ్రమ నియమములకు లోఁబడి సర్వవిధముల ఆశ్రమ జీవితము గడుపఁగలను.

12. వయస్సు వచ్చినవారుగూడ విద్యార్థులుగాఁ జేర్చుకొనఁ బడుదురు.

13. నియమానుసారము ఆశ్రమమునకుఁ దగిన దుస్తులు ధరింపవలెను.

14. ఆహార నియమము ముఖ్యము. మిరపకాయ బొత్తిగా వాడఁబడదు. ఉప్పు — కారము — పసుపు తప్ప తక్కిన మసాలా దినుసులు వాడఁబడవు. పాలు — పెరుఁగు మొదలగు బ్రహ్మచర్యమునకు సరిపడనివి యైనను అవసరముకొలఁది (వ్యాధులు వచ్చినపుడు) అరుదుగా నుపయోగింపఁబడును. ఆశ్రమవాసు లందఱికి సుఖజీవన పద్ధతులు బోధింపఁబడును.

15. ఆశ్రమవాసులకు ఆటవిడుపులు (సెలవులు) ఉండవు. విద్యార్థులు తమ సొంత పనులను జూచుకొనుటకు వారమున కొకపూట సెలవీయఁబడును.

16. సంవత్సరమునకు మూఁడు మాసములు వయస్సుగల విద్యార్థులు భారతదేశ ప్రాంతములను గాలి నడకతోఁ జూచి వచ్చుటకు అనుమతింపఁ బడుదురు.

17. విద్యార్థులకు-అభిమానులకు జీతములేదు. అయితే వారి తల్లిదండ్రులు - సంరక్షకులు తమ శక్త్యనుసారము ధన సహాయము చేయవచ్చును.

నిర్వహణ

ఆశ్రమ నిర్వహణ మంతయుఁ గార్య నిర్వాహకులు చూచుచుందురు. విద్యార్థులను జేర్చుకొనుట మొదలగునవి కార్యనిర్వాహాధికారిది. కానుకగా నిచ్చిన ధనముచేతను— ఆశ్రమమిత్రు లిచ్చిన ధనముచేతను ఆశ్రమము నడుపఁబడును.

విజ్ఞాపన

ఆశ్రమమునకుఁ జూడవచ్చినవారు ఆశ్రమ నియమములకు లోఁబడి యుండవలెను. వచ్చినవారికి తగు వసతులు చూపుటకుఁ బ్రయత్నింపఁబడును. ఆ యతిథులు వగుండుటకు - వంట చేసికొనుటకుఁ గావలసినసామగ్రిని తామే తెచ్చుకొనుట మంచిది. బిడ్డలను ఆశ్రమమునకుఁ బంపునట్టి తల్లిదండ్రులు - సంరక్షకులు వచ్చి ఆశ్రమమును జూచి పోవుటకుఁ గోరఁబడుచున్నారు. విద్యార్థి నడవడి - జ్ఞానము మొదలగు వానిని దెలిసికొనిన పిమ్మటనే యాశ్రమ మందుఁ జేర్చుకొనఁబడుదురు.

ఈ నియమములు సత్యాగ్రహ ధర్మము నభివృద్ధి పఱచునట్టి పద్ధతుల నొక విధముగాఁ దెలుపుచున్నవి. సబర్మతీ-ఆశ్రమమందలి శిష్యులు తమ జీవితము లాదర్శ జీవితములుగా గడుప నెంచువా రనుటలో నెట్టి సందేహము లేదు.

"సత్యాగ్రహ" ఆశ్రమమువలెఁ బ్రతి భారతీయుని గృహము రాణింపవలయునని నా కోరిక. మానవులను జరితా

ర్థులనుగా జేయుటకుఁ నేఁటి. నాగరికతా వ్యామోహము - మతిహీనత - అజ్ఞానము భారత దేశమును విడిచిపెట్టినయెడల, గాంధిమహాత్ముని సత్యాగ్రహ పద్ధతు లెల్లరు నాచరింప సమర్థు లగుదురు. సత్యాగ్రహధర్మ మనుసరించు జీవితము గలవా రందఱు గాంధిమహాత్ములు కాఁగలరనుట సత్యమునకు మిగులఁ జేరువ. అప్పుడుగాని నేఁటి భారత దేశము - అనఁగా నామ మాత్ర భారత దేశము నశించి, ప్రాచీన భారత దేశము - అనగా సత్య భారత దేశము తిరిగి యావిర్భవించుగాక !

సత్యాగ్రహ - ఆశ్రమమువంటి ఆశ్రమములు భారత దేశమందెల్లయెడల నుండవలెను. దేశభక్తు లెల్లరును, జ్ఞానము గోరువారెల్లరును, సత్యాగ్రహ ధర్మము లింటింటను వ్యాపిల్లు టకుఁ బ్రయత్నము చేయవలయును. భారత దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యమును సత్యాగ్రహ మూలముననే సంపాదింపఁ గలము. ఇతర మార్గములు - ఇతర పద్ధతులును భారత దేశము నకు సంపూర్ణ స్వాతంత్ర్యమును సంపాదించి పెట్టునవి కావని నిశ్చయించి చెప్పవచ్చును. భారత దేశ భావికాలస్థితిని గమనించి సంపూర్ణ స్వాతంత్ర్యమును సత్యాగ్రహ పూర్వకముగా సాధించి మానవత్వమును నిలువఁ బెట్టుకొన వలయునని నిశ్చయముతో శపథములు గావించుచు యువకులందఱును సత్యాగ్రహ-ఆశ్రమ మందుఁ జేరి యాత్మశక్తిని సంపాదించుకొనుటకు ముందునకు రావలయును.

ఈ సత్యమును బోధించు పాఠశాలలే అనఁగా జాతీయ భావమును బోధించు జాతీయ పాఠశాలలే భారత దేశమందంత టను నెలకొల్పు చుండినయెడలఁ బ్రపంచ పరిస్థితియే పరిణతి నంది పరిజ్ఞానము గలది యగుననుట కబ్బురమేమి కలదు? భారత

దేశమందుఁగల పాఠశాలలన్నియు, ప్రపంచమందలి పాఠశాలలన్నియు సత్యాగ్రహ - ఆశ్రమములుగా నెంత త్వరలో మాఱిన, నంత త్వరలో భారతదేశమునకు - ప్రపంచమునకు శ్రేయోదాయకమగునని వేఱుగాఁ జెప్పవలసిన పనిలేదు.

గాంధి మహాత్ముఁడు సత్యాగ్రహ పరీక్షయందుఁ గృతార్థుఁడగుట వలననే సత్యాగ్రహ మారంభించి నప్పుడు, అనఁగా శాసనోల్లంఘనము — సహాయ నిరాకరణము - శిస్తుల నీయకుండుట కారాగృహ ప్రవేశము ఏదియో యొక సత్యాగ్రహము చేయునప్పుడు ధర్మయుద్ధ వీరుఁడుగా, శాంతిసమర వీరుఁడుగా సాక్షాత్కరించుట మనమందఱ మెఱిఁగిన విషయమే గదా! మహాత్ముని జీవితమందు సత్యాగ్రహము పలుముఖముల వ్యాపించి మనోబుద్ధుల కుత్తేజము కలిగించి ప్రపంచమును ఆశ్చర్య చకితము గావించుచుండెను; అందుఁగొన్ని పాఠకమహాశయుల హృదయముల కుత్తేజముగా నుండునని తలంచి యిట నుదహరించు చుంటిని.

## దక్షిణ — ఆఫ్రికా సత్యాగ్రహము

ప్రప్రథమముగా శాంతిసమరము దక్షిణాఫ్రికా యందుఁ బ్రారంభ మగుట ప్రపంచ ప్రసిద్ధము. ఈ విషయ మింతకు ముందుఁగూడఁ జదువుకొంటిమి. దక్షిణాఫ్రికా తెల్లవారు తమ పలుకుబడి చెల్లుచున్నదిగదా యని యా దేశమందుఁగల మన భారతీయుల స్వాతంత్ర్యమును భంగపఱచుచుండిరి. అమాయకులగు దక్షిణాఫ్రికా భారతీయు లా తెల్లవారు పెట్టుచుండిన బాధలకుఁ దాళజాలక కోపోద్రిక్తులై స్వాతంత్ర్యమును సంరక్షించుకొనుట కుద్యుక్తులై రి. ఆ సమయ మందచ్చట నుండిన గాంధి

మహాత్ముఁడు హృదయ పద్మమందుఁ బరిణతి నందుచున్న పవిత్రాశయముతో బుద్ధియను నౌకనుండి సత్యాగ్రహాయుధమును వెలికిఁ దీసెను. ఆ సత్యాగ్రహాయుధముతో మహాత్ముఁడు "ఇదేమి యన్యాయము? ఈ యిఱు తెగలవారు రంగు భేదము గల్పించుకొని దురాగ్రహ పీడితులగుచు ననూయా ద్వేషములతో నుద్రిక్తులగు చుండిరే! ఒక వర్గమువారు తమకుఁ జెల్లుబడి కలదుగదాయని యధర్మ మార్గమునఁ బ్రవర్తించుచుండిరి. ఆ చెల్లుఁబడిచే రెండవ వర్గమువారు తమకు జరుగుచుండిన యత్యాచారములను నపచార బుద్ధితో నెదుర్కొనఁ బ్రయత్నింపఁ దొడంగిరి. అది తప్పుదారి గదా! అచటి తెల్లవారు దక్షిణాఫ్రికా భారతీయులను నల్లవారందురు. నల్లవారి సహన బుద్ధితోఁ దెల్లవారికి సద్బుద్ధి గలుగుటయే యిరుతెగల వారికి క్షేమ మార్గమ"ని తలఁచి తెల్లవారి తప్పులను నచటి తెల్ల యధికారులకు విన్నపములు పంపియు, లండను నగరమునకుఁ బోయి యచటి ప్రభుత్వాధినేతలను గలసికొని విన్నవించియు, వేఱువిధముగాఁ బలు విధములగు చట్టముల ననుసరించి ప్రయత్నములు చేసియుఁ బ్రయోజనము పొందరైరి. అడవిగాసిన వెన్నెలవలె దక్షిణాఫ్రికా భారతీయుల ప్రయత్నములు నిష్ప్రయోజనములయ్యెను. అట్టియెడ గత్యంతరములేక తుదకు శాసనోల్లంఘనముచేసి కారాగృహములను బ్రవేశించుటకుఁగూడ వెఱవక మహాత్ముని యాదేశానుసారము శాంతిసమరముచేయ సమకట్టిరి. భారతీయుల నెల్లరిని ఆ యుద్ధమునకుఁ జేసునట్లు గాంధిమహాత్ముఁడు ప్రబోధించెను. గాంధిమహాత్ముని యడుగుజాడల నడచి యచటి భారతీయులు పెక్కురు కారాగృహము లలంకరించిరి. సత్యాగ్రహమను ధర్మమార్గమును మహాత్ముఁడు

బోధించి 1907 - వ సంవత్సరమందు స్వాతంత్ర్యమునకు జయము గూర్చెను. అప్పటినుండియే గాంధిమహాత్ముని సత్యాగ్రహశక్తి ప్రపంచమందుఁ బ్రసిద్ధికెక్కి సర్వతోవ్యాప్తి గాంచుట సర్వవిదితము గదా!

భారతీయులు కూలిచేసికొని జీవింప వలెననియు, లేనిచో దేశమునుండి వెడలఁగొట్ట బడుదురనియు, మొదలగు నీతి దూరములగు చట్టములను రద్దుపఱచుటకై ప్రప్రథమముగాఁ బ్రారంభింపఁబడిన శాంతిసమర సత్యాగ్రహము చేసినందువలన నిర్బంధింపఁబడి న్యాయస్థానమునకు మహాత్ముఁడు తీసికొనిరాఁ బడెను. ఆ న్యాయస్థానమునందు న్యాయమూర్తికి - న్యాయాధిపతికి జరిగిన సంభాషణయందు సత్యాగ్రహ లక్ష్యముగాన నగును.

గాంధిమహాత్ముఁడు:— నేను అపరాధిని. సాక్షులక్కఱ లేదు. దీని కింత విచారణయు ననావశ్యకము. ఒక విన్నపము చేయఁదలఁచితిని.

మాజిస్ట్రేటు :- అందులకు నేను సమ్మతింపను. శాసనమునుమీఱి మీరు ప్రవర్తించితిరి. అందుచే నిచట ప్రభుత్వమును విమర్శించుట తగదు.

గాంధిమహాత్ముఁడు :- నేను ప్రభుత్వమును విమర్శింపఁ దలఁచుటలేదు.

మా :- ఇదియే ప్రశ్న. మీరు అపరాధము చేసితిరా? లేదా? అపరాధము చేయలేదనిన నచట జరిగిన విషయము మిక్కిలి సాక్ష్యముగా నున్నది. 'ట్రాన్సువాలు' ప్రభుత్వముచే

నంగీకరింపఁబడి పరిపాలకునిచే శాసింపఁబడిన చట్టముగలదు. ఆ చట్టమునకు బద్ధుఁడనై నడుచుకొనుట నా విధ్యుక్త ధర్మము...

గాం :- చట్టమునకు లోఁబడి సాక్ష్యమేమియుఁ జెప్పఁ బోవుటలేదు.

మా :- సాక్ష్యమనుసరించి చట్టసమ్మతముగా నడుచుటయే నావని. మీరేమి విన్నపము చేయఁబోవు చుంటిరి? 'చట్టము న్యాయమైనదని నేను ఒప్పుకొనుటలేదు. మనస్సాక్షిగా నేను చట్టము నుల్లంఘించితిని.' ఇదియేగదా మీరు చెప్పఁ బోవునది?

గాం :- అవును. అది ముమ్మాటికి సత్యము.

తరువాత గాంధిమహాత్ముఁడు కోరినట్లు విన్నపము చేయ నిరాకరింపఁబడుటచే "చెప్పుట కేమియుఁ లేద"నెను. మాజస్ట్రేటు, నలుబదియెనిమిది గంటలలో దేశమును విడిచిపెట్టి పోవలయున"ని గాంధిమహాత్ముని నాజ్ఞాపించెను. చట్టమున్యాయమైనదని తలఁచిన మహాత్ముఁడా చట్టము ననుసరించి 'జారీ' అయిన ఆజ్ఞను బాలించునా ? ఆ యాజ్ఞను మహాత్ముఁడు పాలింప నిరాకరించెను. పిమ్మట మాజిస్ట్రేటు నెదుటకు మహాత్ముఁడు తీసికొని రాఁబడెను. మహాత్ముఁడు మాజిస్ట్రేటు దగ్గఱఁ జెప్పిన విషయమును గమనింపుఁడు.

"పిరిటోరియాలో నా దేశీయులు పలువురకు మూఁడు మాసముల కఠినశిక్షను, పెద్దమొత్తము 'జరిమానా'యును విధింపఁబడెననువార్త నాకిపుడే చేరినది. 'జరిమానా' చెల్లింపని

పక్షమున మూఁడుమాసములు శిక్ష. వారు నేరము చేసియుందు రేని, అంతకంటె నధికమగు నేరము నేను చేసితిని. అందుచే నాకు పూర్తిశిక్ష విధింపవలెను."

మా :- పూర్తిశిక్షను మీరు కోరుచుంటిరా?

గాం :- అవును; అయ్యా!

మా :- మీరు అభిలషించినట్లు పూర్తిశిక్షను-అనఁగా ఆరుమాసముల కఠినశిక్షను, ఐదువందలపౌనులు 'జరిమానా'ను విధింపఁదిఁచితిని... మీ నేరము (28-12-1907) న్యాయ స్థానమువారి యాజ్ఞను ఉల్లంఘించినదే. అందుచే రెండుమాస ముల శిక్షను విధించుచుంటిని". మహాత్ముఁడు శిక్షను సమ్మ తించి కారాగృహ మలంకరించెను. అవును; లోకహితార్థ మవతరించినవారికిఁ గడగండ్లు కలుగుట సహజమేగదా! లోక హితమునకై యిడుములు పడుట మహాత్ముల లక్షణము గాదా !

తరువాత 1913-వ సంవత్సరము మూఁడుపౌనుల పన్ను చెల్లింప నిరాకరించినందునను, ఆ చట్టము రద్దగువఱకు పనులు చేయకుండ నిలిపివేసినందునను, భారతీయులను సత్యాగ్రహో ద్యమమునకుఁ బురికొల్పెననియు మహాత్మునిమీఁద నేర మొకటి నారోపింపఁబడెను. ఆ నేరమందు గాంధిమహాత్ముఁడు తాను 'వకీలు' వృత్తిచేయుట మానుకొంటిననియు, చట్టము న్యాయ విరుద్ధమైనందువలన, ఆ చట్టమును ప్రభుత్వము దొలఁగించు వఱకు మనమందఱము ప్రయత్నింపవలయునని యచటి భార తీయ వ్యాపారస్థులకుఁ బ్రబోధించుట వలనను, ఆ చట్టము మీఁదఁ దమకుఁగల యనిష్టతను జూపుటకై పనులను జేయ

కుండ నిలిపివేయుఁడని పనివాండ్రకు కుద్బోధించుటయును, అట్లు చేయుట ప్రజలకు న్యాయమనియును, అనుభవింపనిదే కష్టములు గట్టెక్కఁజాలవనియు; దాను వారికి బోధించునట్లును జెప్పియుండెను.

మహాత్మునివంటి లోకైకపూజ్యులకు దండన విధించుట దుఃఖమును గలిగించుచున్నదనియు, గాంధియే నేరమని యొప్పుకొనుటవలన చట్టమునుసరించి శిక్ష విధించుటతప్ప వేఱుమార్గము లేదనియు మాజిస్ట్రేటు చెప్పి, మూఁడు నేరములకు మూఁడుమాసముల చొప్పునఁ గఠినశిక్ష విధించుచు, నొకదానిపిమ్మట నొకటిగా శిక్ష యనుభవింపవలయుననియుఁ దీర్పు చెప్పెను.

మహాత్ముఁడు "నేను చెఱఁబడుటకే యొప్పుకొనుచుంటి"నని కారాగృహమున కేఁగ నిశ్చయించుకొని "మూఁడు పౌనులపన్ను రద్దగువఱకు మీరు పనులు నిలిపివేయుటను విరమింపరాదు. ప్రభుత్వము నన్ను చెఱసాలయందు బంధించినను, ఆ పన్నును ఈయవలద"ను సందేశమును ఇతరుల మూలమునఁ దన దేశీయులకుఁబంపి తాను చెఱసాల కేఁగెను.

## చట్టము — సత్యాగ్రహము

చట్ట ముల్లంఘించుట న్యాయమా యని చట్టము ననుసరించువారు ప్రశ్నించుట సహజము. అయితే, చట్ట మన నేమి? చట్టము; ప్రజలకు ప్రేమ, దయ, ఐక్యము, స్వాతంత్ర్యము కలిగించుటకును, అబద్ధము, కామము, చౌర్యము, హత్య మొదలగు చెడుగులు దేశమందుఁ గలుగకుండ నుండుటకును, న్యాయము గలిగించుటకును, శాంతి భద్రతలు వర్ధిల్లుటకును

ప్రభుత్వమువారిచేఁ జేయఁబడునట్టిదిగదా! ప్రభుత్వము ప్రకృతి సహజమగు న్యాయధర్మములకు విరుద్ధముగాఁ బ్రజల స్వాతంత్ర్యము నరికట్టునట్టి చట్టములను సృష్టించినయెడల, ఆ చట్టములకు సమ్మతించి నడచుకొనుట సత్యమునకు విరుద్ధముగా నడచుకొనుట యగును. విజ్ఞానులు ఆ చట్టములను రద్దుపఱచుటకై న్యాయైక మార్గ మనుసరింపక తప్పదుగదా! న్యాయము లేని హానికరమగు చట్టము నుల్లంఘించుట న్యాయమును గాపాడుట యగును. న్యాయవిరుద్ధములగు చట్టము లుల్లఘించి ప్రభుత్వమును వ్యతిరేకించినంతమాత్రమున న్యాయ విరుద్ధమగునా? ప్రజాభ్యుదయమునకై దేశక్షేమమునకై చట్టల పుట్టినిల్లగు చట్టముల ధిక్కరించుట ప్రభుత్వమును ధిక్కరించుటయెట్లగును? ప్రభుత్వము దేశాభ్యుదయమునకు భంగకరములగు చట్టము లేల సృష్టింపవలెను? అట్లు ప్రభుత్వము బుద్ధిపూర్వకముగా సృష్టించు ధర్మ విరుద్ధ శాసనములను దిరస్కరించుటలో నధర్మ మేమి కలదు? ప్రభుత్వము తప్పుదారిని బడి ప్రజాక్షేమమునకు దేశాభ్యుదయమునకు విరుద్ధముగాఁ బ్రవర్తించుచుండఁ బ్రాజ్ఞులు మిన్నకుందురా? అట్లు; ఉపేక్షించుట వలనఁ దన కర్తవ్య ధర్మమును నిర్వహింపఁజాలనివాఁడు కాఁడా? కర్తవ్య ధర్మము నిర్వహింపనియెడల జన్మ నిరర్థకముగదా! కావున విజ్ఞులు తమ విధ్యుక్తధర్మ నిర్వహణమందు ముందును వెనుక లెట్లు చూడఁగలరు? అందును, మానవాభ్యుదయముకై యవతరించిన మన గాంధి మహాత్ముఁడు ధర్మ విరుద్ధ శాసనములను దిరస్కరించుట ధర్మమేగదా!. కన్నతండ్రి బిడ్డను దొంగతనము చేయవలయునని యాజ్ఞాపించినయెడ “పితౄజ్ఞ పరిత్యాజ్యమ”ని నిశ్చయించుకొని యా బిడ్డఁడు దొంగ

తనము చేయ నియ్యకొనఁడు. అట్టి సమయమున పితృ పుత్ర న్యాయ మాలోచించుట న్యాయమా? అట్టి తండ్రిమాట మీఱియే నడుచుకొనుట తనయుని ధర్మముగదా! తండ్రియైనను, తల్లియైనను, రాజైనను, ఎవరైనప్పటికి న్యాయవిరుద్ధముగా నడువ గోరినప్పుడు విజ్ఞులు తాము కష్టపడియైనను ఆ న్యాయ విరోధకు లను సరిదిద్ది సన్మార్గమునఁ ద్రిప్పుటకై దురోద్బోధకములగు నాజ్ఞ లను మీఱుటయే మేలగును. విరోధము, అసహనము మొదలు గాఁగల దుర్గుణముల కాలవాలమైన మనస్సుతోఁ గాక; ప్రేమ సహనము మొదలుగాఁగల సద్గుణముల కాకరమైన మనస్సుతో నా దుష్ట శాసములను నభిభవించుటయే యభిఖ్యాన మగును. ఇట్టి దేశగు మఱియొక సంఘటనను జదువుకొందము.

## చాంపరాను

బీహారు దేశమందలి 'చాంపరాను' నగరమందు నేత పారిశ్రామికులు విదేశ వ్యాపారస్థులవలన బాధపడుచున్నారని కరుణాలవాలుఁడు గాంధిమహాత్ముఁడు విని యథార్థ మేమో యారయుదమని యచటికిఁ బరుగిడెను. గాంధిమహాత్ముని సత్య సంధత నెఱుఁగని యా జిల్లా మాజిస్ట్రేటు, మహాత్ముని రాక వలన 'చాంపరాను' ప్రశాంత పరిస్థితి తాఱుమాఱగునని తల పోసి, తిరుగుబండిలోనే (Train) బయలుదేఱి పోవలసినదిగా మహాత్మున కొక 'నోటీసు'ను జారీ చేసెను. మహాత్ముల రాక వలన మహీవలయమే మహితమగుచుండ, మాజిస్ట్రేటునకు మహాత్ముని రాకవలని మహిమ మెఱుఁగజాలఁడయ్యెను. ఆ 'నోటీసు' ను జదువుకొని, శ్రద్ధగాఁ బరిశీలించి "నే నిచట పని చేయుటకు (సేవసేయుటకు) మిక్కిలి కుతూహల పడుచుంటిని.

కాన నేనీ యూకు విడిచిపోవను; మాజిస్ట్రేటు ఆజ్ఞను ధిక్కరించుటవలనఁ గలుగు నెట్టి శిక్షనైన ననుభవించుటకు సంసిద్ధుఁడన”ని కర్తవ్య ధర్మ నిర్వహణపరుఁడగు మహాత్ముఁడు సమాధాన మిచ్చెను. మహాత్ముఁ డాత్మజ్ఞాన ప్రపూర్ణుఁ డనుట కిది యొక తార్కాణ. ఇతరుల మేలుకొఱకు జీవించుటయే జీవిత పరమార్థమని యథార్థజ్ఞానము గల మహాత్ముఁ డకారణముగాఁ గల్పింపఁ బడిన యాజ్ఞకు లోఁగినచో భగవదాజ్ఞను మీఱుట గాదా? భగవదాజ్ఞ పేదలు పడుచున్న కష్టములను జూచి, సహింపలేక యా కష్టములనుండి వారిని గాపాడుటకై మహాత్మునిఁ బ్రేరేపించినది. అధికారి యాజ్ఞ భగవదాజ్ఞను ద్రోసి పుచ్చఁగలదా? మహాత్ముఁ డిప్పు డెవరియాజ్ఞను ధిక్కరింప వలెను? ఎవరి యాజ్ఞను స్వీకరింపవలెను?

భగవదంశ సంభూతుఁడైన గాంధి మహాత్ముఁడు భగవదాజ్ఞను వలఁదాల్చెను. ఆత్మజ్ఞాన పరిపూర్ణులు ధర్మమునకు విరుద్ధముగా నెవ రే యాజ్ఞ నిచ్చినను భయపడి స్వీకరింతురా? ఎట్టి కష్టములు కలిగినను ధర్మజ్ఞులు ధర్మవిరుద్ధ విషయము సహింపరుగదా! మన పూజ్య బాపుజీ పేదల పెన్నిధి, యా మాజిస్ట్రేటు ఆజ్ఞను తృణప్రాయముగాఁ ద్రోసివైచెను. ఇయ్యది మానవ జీవిత స్వాతంత్ర్యమున కమూల్యముగదా! ఒక యధికారి యాజ్ఞకు భయపడి లోఁగిన మొషల బీదలకు మోసము చేయుట యను పాపముగాదా! బీదల కొఱకెట్టి యిక్కట్టులనైన ననుభవింప సంసిద్ధుఁడగుట దీనజన రక్షకుని పౌరుషేయముగాదా! ఇట్లుచేయుట భగవత్ప్రేమను జూఱఁ గొనుటయగదా! ధర్మమునకు సత్యమునకుఁ గట్టువడి చెఱఁ బడుట స్వర్గమునకు సోపానమే గదా! అధికార యాజ్ఞలకు

భయపడి నీతి దూరమగుట, భగవత్సంకల్పమును మఱచుట దేశద్రోహము, పాపము నగునుగదా!

'చాంపరాను' మాజస్ట్రేటు తన యాజ్ఞను ధిక్కరించిన కారణమున గాంధి మహాత్మునిమీఁద నేరమారోపించి విచారణచేయ నారంభించెను. మహాత్ముఁడు 'కేసు'ను నడుపఁదలఁచు కొనలేదు; ప్లీడరును బెట్టఁదలఁచలేదు; తనకుఁ దమంతటఁదామే సాయముచేయుటకై వచ్చిన ప్లీడరులను దన 'కేసు'లో వాదింప వలదని వారించెను. మాజిస్ట్రేటు నెదుట, శాంతిదేవత, జగన్నుతిగాంచిన గాంధి మహాత్ముఁడు, నిలువఁబడి "నేను నా ధర్మము నెఱవేర్చుకొనుట కిచటకు వచ్చితిని. అట్లు రాఁగూడదని తమరు 'ఆర్డరు' 'జారీ' చేయించితిరి. ప్రజారక్షణ బుద్ధితోఁ గావించిన తమ యాజ్ఞను నేను ధిక్కరించుట నేరమేయగున"ని వ్రాక్రుచ్చెను. మహాత్ముని నోటినుండి వెలువడిన మాటలను జెవియొగ్గి మాజిస్ట్రేటు వినెను; తీర్పును జెప్పక వాయిదా వేసెను. కొన్నాళ్ళు జరిగిన పిమ్మట ప్రభుత్వమువారి యొద్దనుండి, గాంధి మహాత్మునిమీఁద నారోపింపఁబడిన నేరము నుపసంహరించు కొనవలసినదిగా మాజిస్ట్రేటునకు 'తాకీదు' వచ్చెను. మాజిస్ట్రేటు ఏమిచేయఁగలఁడు? శాంతి దేవుని ముందు వ్యతిరేకశక్తు లేమిచేయఁగలవు? ఆమీఁదట మహాత్ముఁడు 'చాంపరాను' నేత పారిశ్రామికుల కష్టములను గనుగొనుటకై విచారణచేయు స్వాతంత్ర్యమునుబొంది వారి కష్టముల నొక తీరుగాఁ దీర్పఁగలిగెను.

గాంధి మహాత్ముఁడు జిల్లా యధికారి యాజ్ఞకు భయపడి 'చాంపరాను' ప్రవేశింపక వచ్చినదారినే తిరిగిపోయిన యెడల, నచటి పారిశ్రామికుల కష్టములు తొలఁగియుండెడివా?

సర్వేశ్వరుని సంకల్పమునకు వికల్పముగా నడచుకొనుట మహాత్ముల లక్షణమా? సర్వేశ్వరుని సంకల్పము సిద్ధించుటయునంగా, ఫలమాసింపక యితరులకు సేవచేయుట గదా!

## ఖే రా

ఇట్టి దొకటి మఱియొక సమయమున గుజరాతునందలి 'ఖేరా' జిల్లాయందు జరిగియుండెను. అది ప్రభుత్వమునకు పన్నుల నీయకుండునట్టి యుద్యమము. బొంబాయి రాష్ట్రమందు 'ఖేరా' యను పేరున నొక జిల్లా కలదు. 1918 ఆగష్టు మాసమందు ఆజిల్లాలో ఋతు ధర్మములు తప్పి, వానలు లేక పంటలు పాడై పోయెను. ప్రకృతి కోపమునకు గుఱియై పంటలు ఫలింపక పోవుటను గమనింపక, క్షామదేవత తాండవించుటను గమనింపక, ప్రభుత్వమువారు ఎప్పటియట్లు 'శిస్తు' వసూలు చేయ నారంభించిరి. పాపము పేదరైతు లేమిచేయఁ గలరు? ఆకాఁపుల కడగండ్ల కాఁపురము కాపాడ నెంచి కారుణ్యమూర్తి గాంధి మహాత్ముఁడు 'ఖేరా' జిల్లాలకుఁ బఱుగనవచ్చి, పాకగేహములు పాకములు లేక పస్తులుండు పేద రైతుల పాటులు కన్నులారఁగాంచి, యథార్థము గ్రహించి, పంటకుఁ దగినట్లు పన్నులు వసూలు చేయుట పాడియని ప్రభుత్వముతో వాదించెను. పాడి యెఱుఁగని పాలకులు మహాత్ముని మాటలను చెవిని బెట్టిరి. అప్పుడు మహాత్ముఁడు తన యాత్మశక్తిని జిల్లా యందంతటను బ్రసరింపఁ జేసెను. ఇఁకనేమి? పర్జన్యుఁడు తన మేఘ సముదాయము నాకాశమండలమునఁ బర్వి భూమండలము సంతోషారావములు చేయుచున్నదో యనునట్లు పర్జన్యములు నమృతధారలతో వర్షించునట్లు; ప్రజాసంఘ మంతయు నేకమై మహాత్ముని మాట చొప్పున ఖేరా మండలమంతయు నొక్క పెట్టున

శాంతి సమరము సాగించెను. స్త్రీలు సహితము శాంతి దేవుని మహాత్ముని శాంతి సమరమునకుఁ బసుపు కుంకుమలు తాల్చి సంసిద్ధతఁ జూపిరి. ప్రభుత్వమువారు భూములను, గృహములను, గొడ్లను, దొడ్లను, గాదెలను సమస్తము వేలమువేసి తమ చిత్తము వచ్చినటు నడుపుకొనిరి. ఎట్టి పాటునకును 'ఖేరా' ప్రజలు వెఱవక, మేరునగధీరులై నిలువఁబడిరి. తుదకు "ఈయఁ గలవారే పన్నులీయుఁడు. ఈయలేనివారు పన్ను లీయవలసిన పనిలేద"ని ప్రభుత్వము ప్రజలను బ్రతిమాలుకొనెను. గాంధి మహాత్ముని యాత్మశక్తి జిల్లానంతను గట్టుఁబాటు గావించి ప్రభుత్వమునే లొంగఁదీసికొనెను. సత్యము, ధైర్యము వ్రతముగా గ్రహించినవారు సాధింపరానిదేదియు లోకమందుఁ గానముగదా!

మహాత్ముఁ డిట్లు ప్రవర్తించుట ప్రభుత్వమునకు అడ్డుపాటు అని తలఁచుట యవివేకము. ప్రభుత్వము తప్పుదారిని బట్టినప్పుడు, యథార్థముచెప్పి, ప్రభుత్వమును జక్కఁబెట్టుట పెద్దఱికముగదా! ప్రభుత్వమునకు లొంగి బట్టులై జేజేలు పెట్టుట చిన్నఱికముకాదా! నిజమున కట్టివారే రాజభక్తిశూన్యులు. ధర్మమన నేమో మహాత్మునకుఁ దెలిసినట్లు మఱి యేరికిఁ దెలియదనుట నిర్వివాద సత్యము. ఎప్పుడేయేధర్మము లాచరింపవలయునో, ఆయా కాలములం దాయా ధర్మము లాచరించు జగత్కల్యాణ పురుషుఁడని మహాత్ముని జగ మెఱుఁగుగాక!!!

రౌలటు చట్టము

1919-వ సంవత్సరము రౌలటు చట్టమను నొక చట్టము భారత కేంద్ర శాసన సభయందు రూపు కట్టించుకొనెను,

విప్లవకారులను, అనుమానితులను, ప్రత్యేక న్యాయస్థానములు నెలకొల్పి, యందు రహస్యముగా విచారణ జరిపి శిక్షించుట, ఆమీఁదట న్యాయము పొందుట (అప్పీలు) కవకాశము లేక పోవుట మొదలగు గుట్టులతోఁ గూడిన చట్టమది. అట్టి చట్టల నన్నిటిని బ్రోగుపెట్టి కట్టలుకట్టి చట్టము గావించిరి. ఎచ్చట నైన నిట్టి చట్టుబండల చట్టము కలదా? సత్యాగ్రహులా క్రూరమగు చట్టమును గూర్చి యూరకుందురా? మన గాంధిమహాత్ముఁ డా సమయమున రాజ ప్రతినిధిగా నుండిన 'లార్డు చెమ్సుఫర్డు'ను జూచి యా చట్టము వట్టి బూటకమని హెచ్చరిక చేసెను. శరీర బలసంపన్నుఁడు బుద్ధి బలసంపన్నుని మాటలతోఁ లోఁబఱచుకొనుట సాధ్యమా? తఱువాత గాంధి మహాత్ముఁ డా శాసనము రద్దుపఱచుటకై అనవద్యము, అకలంకమునగు గొప్ప సత్యాగ్రహ సమరమును బ్రారంభించెను.

రౌలటు శాసనము రద్దుపఱచుటకు భారత దేశము నేకోన్ముఖముగా, నుత్సాహముతో నచంచల దీక్షతో నాయత్త పఱచి, ఖండ ఖండాంతరములందు జేజే లందుకొనునట్లుగా, జగదాశ్చర్యముగా సత్యాగ్రహసమరము సాగించి, యిట్టి యుద్ధము 'నభూతో నభవిష్యతి' యనునట్లు కీర్తి కలిగించెను. మహాత్ముఁ డా సమయమున బక్కచిక్కిన శరీరము గలవాఁడై, జ్వరముచేఁ బీడింపఁబడువాఁ డగుచు, తన విధ్యుక్త ధర్మమును బాలింపనెంచి, భారత దేశమందలి పల్లీ పట్టణములు పర్యటించి యచ్చటి దేశ నాయకులను గలసికొని మాటాడి యా యా తావుల సత్యాగ్రహ సంఘములను నెలకొల్పెను. "ఆత్మ గౌరవముగలవాఁడు తన విధ్యుక్త ధర్మమును బరిపాలించును"నుట సత్యము. అప్పుడు మహాత్ముఁడు రౌలటుచట్టము రద్దగువఱకు,

అదిగాని, అట్టిదిగాని సత్యాగ్రహ సంఘములచే నామోదింపఁబడిన మఱికొన్ని శాసనముల నుల్లంఘింపవలయుననియు, సత్యమును విడనాడరాదనియు, సమస్త ప్రాణులను దనయట్లు భావింపవలెననియు, నెట్టి వస్తువునుగూడ దృణీకరింపరాదనియు, నెట్టి పట్టునైనను హింసామార్గ మనుసరింపరాదనియు, మహాత్ముఁడు దేశీయుల కొక విజ్ఞప్తి గావించెను. అద్భుతమై అనంతమై యొప్పు నిట్టి సత్యాగ్రహ సమరము భారతదేశమందు—ప్రపంచమందు – ముందెన్నఁడు లేనట్టి యుద్ధ మొకటి మొట్ట మొదటగాఁ బ్రారంభింపఁబడిన దగుటచే గాంధిమహాత్ముఁడు హింస తగదనియు, అహింసయే ఫలము నిచ్చునదియు, వ్రాసిన వ్యాసములు, చేసిన యుపదేశములు ప్రపంచమునకే వెలుఁగు బాట నిచ్చునవియై యొప్పెను. ఈ విశాల ప్రపంచములో నొక ఖండమువంటిదైన దేశమును, ఆత్మ శక్తితో యుద్ధమందు ఆయత్త పఱచుట యెంతటి యపూర్వమో యూహింపుఁడు! చరిత్రకెక్కని యిట్టి ఘటన కూర్పఁగల సమర్థుఁడు మహాత్ముఁడుగాక మఱి యెవ్వఁడీలోకమందుఁ గలఁడు? గాంధిమహాత్ముఁడు శాసనోల్లంఘనోద్యమము ప్రారంభించుటకు ముందు; దేశమును బరిశుద్ధము చేయుటకుఁ బ్రయత్నించెను.

రౌలటుచట్టమునుగూర్చి వ్రాసిన యొక సత్యాగ్రహ నివేదికయందు "రౌలటు విచారణ సంఘమువారి నివేదికను జదివిచూచితిని. భారతదేశమందు పరమమూర్ఖులు కొందఱు ఒకచిన్న సంఘముగా నేర్పడిరని తెలియుచున్నది. ఆ సంఘము దేశమునకు వేఱుపురుగువంటిది. అందుకొఱకు సంపూర్ణ భారతదేశము సంతోషింపఁదగని శాసమును సమ్మతించుటయను నాపదకంటె నొకగొప్ప యాపద తెచ్చిపెట్టుటయగును. ప్రపంచ

మందుఁగల యందఱికంటె భారతదేశమందుఁగల కోట్లకొలఁది ప్రజలు సజ్జనులని దేశచరిత్రలు ఋజువుచేయుచున్నవి. ఆ విచారణ సంఘమువారు మిక్కిలి వివేకము మాలినవారు” అని మహాత్ముఁడు నిర్భయముగఁ జెప్పియుండుటనుబట్టి యెంతటి సత్యముకలదో పాఠకమిత్రులు గ్రహింతురుగాక! మఱియొక నివేదికయందు శాంతిభద్రతలు కాపాడునట్టి మూలశాసనముల నుల్లంఘించుట సత్యాగ్రహము కాదనియు, ప్రజాస్వామ్య స్వాతంత్రమును వమ్ముచేయునట్టి రౌలటుచట్టమువంటి చట్టముల నుల్లంఘింపవలయుననియుఁ బ్రత్యేకించి యాదేశించిన మహాత్ముని యాశయమెంత యుదాత్తమైనదో యూహింపుఁడు.

సత్యాగ్రహుల సంఘములగూర్చి కొన్ని హెచ్చరికలు ఆయా సమయములందు మహాత్మునిచే వెలువరింపఁబడెను. అందు–చప్పట్లు చఱచుట, కేకలువేయుట, ‘సిగ్గుసిగ్గు’ అని యఱచుట, ‘దిగుదిగు’ అని యవమానవాక్యములు పలుకుట, ఇతరులనుగూర్చి కొఱఁతలు పలుకుట, దూషించుట మొదలగునవి కూడనివని మహాత్ముఁడు నొక్కిచెప్పుట మహాత్ముని స్వభావము. సమావేశములందును, సంఘములందును మర్యాదగా మెలఁగుట, వ్యతిరేకభావములు గలవారు తమ యభిప్రాయములను బాహాటముగా వెలువరించుకొనుటకు దేశమందు కొలఁది యవకాశమైనను లభించుటకుఁ గారణము మహాత్ముని యుపదేశములే.

గాంధిమహాత్ముఁడు దేశమంతయుఁ బర్యటించి యొకవిధ చైతన్యమును గలిగించి, దేశమంతయు నొకేహృదయముతో సత్యాగ్రహమును త్రికరణశుద్ధిగా నాచరించునట్లు చేయఁగోరి నిర్దేశించిన దినమును సత్యాగ్రహ దినమనఁగాఁ బరి

గణించునట్లు ప్రజలను ఆజ్ఞాపించెను. దేశము మహాత్ముని యాజ్ఞకు బద్ధమై యుండెను. నాఁటి విషయమును గురించి మహాత్ముఁడు వెలువరించిన హెచ్చరిక యిట్లు గలదు:—

"పలు సమావేశములలో నేను స్పష్టీకరించినట్లు సత్యాగ్రహము ఒక మతసంబంధముగా గొప్పది. అది పవిత్రతకు దయకుఁ దగిన సాధనమగును. తనకుఁదానే, బాధపడు బాధలను పోఁగొట్టుకొనుటకు లేక దుఃఖనివృత్తికి సమర్థమైనది. అందుచే రాజప్రతినిధి (1919-వ సంవత్సరము ఏప్రిల్-6) స్వాతంత్ర్యము నిచ్చుటకును ఏప్రిల్ 6 వ తేదీ ఆదివారము మనను అవమానించిన దినముగాను, అందులకై భగవంతుని ధ్యానించుదినము గాను బరిగణించుటకు నిర్ణయింపఁబడినదని చెప్పుటకు నుత్సహించుచుంటిని. మన మనోనిశ్చయము స్థిరపడుటకు ప్రకటించుకొను పద్ధతిని ఆనాఁడు సత్ప్రవర్తన దినముగా బరిగణించుటకుఁ గొన్ని నియమములను ఇచట తెల్పుచుంటిని.

1. మతాభిమానము కారణముగాఁ గలవారు; అనారోగ్యముగలవారునుగాక, వయస్సు వచ్చిన వారందఱును ముందుదినము రాత్రి భుజించిన సమయమునుండి యిఱువది గంటల కాలము నిరశనవ్రత మాచరింపవలెను. ప్రభుత్వమును బాధించు నుద్దేశ్యముతో నీ యుపవాసవ్రతము చేయరాదు. అట్టి యుద్దేశ్యమే యీ నిరశవ్రత భావముకాదు. సత్యాగ్రహ పత్రమునందు చేవ్రాలుచేసిన సత్యాగ్రహులు శాసనోల్లంఘనమునకుఁ దగినవారినిగాఁ బవిత్రులనుగాఁజేయు నాదర్శముతో నీ నిరశనవ్రతమవలంబింపవలెను. ఇతరులు తమ మనోదౌర్బల్యము పోఁగొట్టుకొను తలంపుతో నీ వ్రతమాచరింపవలెను.

౭. సాధారణముగా నిత్యావశ్యకములగు పనులుతప్ప నితరములగు పనులన్నియు మానుకొనవలెను. సంతలు, వ్యాపారసంస్థలు; బేరసారములుచేయు దుకాణములు మూసి వేయవలెను. ఆదివారములందుఁగూడఁ బనిచేయువారు అంతకు ముందుదినమే సమస్త కార్యములు ముగించుకొనవలెను. ఆనాఁ డెట్టిపనులును జేయరాదు.

ఈ రెండు కార్యములును ప్రభుత్వపు సిబ్బందిచేతను గూడ జేయఁబడవలెనని మిక్కిల కోరుచుంటిని. ప్రభుత్వోద్యో గులు సభలందు, సమావేశములందుఁ బాల్గొనఁజాలక పోయి నను, ముఖ్యములగు కార్యకలాపములందుఁ బాల్గొని తమ యభిలాషను బ్రకటింపఁదగునని యభిలషించుచుంటిని.

౮. ఆనాఁడు భారతదేశమందలి పల్లెపట్టనములన్నియు సభలుచేసి శాసనములు రద్దుచేయవలెనని యేకగ్రీవముగాఁ దీర్మానింపవలెను.

ఈ నియమము లంగీకృతములగునెడల మీా మీా సమీా పములందుఁగల సత్యాగ్రహ సంఘములువచ్చి మీాకుఁ దగిన యేర్పాటులు చేయఁగలవు. ఇతర సంఘముల వారుగూడ నిందుఁ బాల్గొని సహాకరింపఁగలరని నమ్ముచుంటిని.

భారతీయులెల్లరు నీ మహావ్రతమాచరించుటయు, సంఘ ములు స్థాపించుటయు, తీర్మానములు చేయుటయు దేశస్వాతం త్ర్యమునకు మూలకారణములు. ఈ ప్రతివిధానములందు గౌరవ భంగకరమగునట్టి పద్ధతి యొక్కటియు లేదు. ప్రజలెల్ల రేక హృదయముతో వర్తిల్లవలయుననిన ప్రజారాజ్యమే అసలగు స్వరాజ్యమే కావలెను. స్వరాజ్యము లేనప్పుడు ప్రజలపాట్లు

దేవుని కెఱుక! అట్టి స్వరాజ్యము కావలయునని భారతీయులు కోరుట నేరమా? శాసనము నుల్లంఘించుట యపరాధమా? పరప్రభుత్వము పనికిరాదు; ప్రజా ప్రభుత్వమే కావలయునని ప్రయత్నించుట ద్రోహమా? గాంధి మహాత్ముఁడు ధర్మము తప్పిన పథమును అనాలోచితముగా నాకస్మికముగా ననుసరింప లేదని రూఢిపఱచుట యొకటి యిట నిర్ణయింపఁదగినది. జప తపములు, పూజా పురస్కారములు ప్రభుత్వమును సంస్కరింపఁ జాలకపోయినను, ఆ గుణములందలి సత్యపదార్థమగు భగవంతుఁ డైనను ప్రభుత్వ హృదయమును మార్చునని మహాత్ముని సంకల్పము. సత్యముగా, సత్యాగ్రహముచే సాధ్యముగాని దేదియు లోకమందులేదు. ధనముగోరియో గౌరవముగోరియో స్వార్థమపేక్షించియో చేయు తపస్సు ఏనాఁటికి ఫలింపదనుట ముమ్మాటికి సత్యము. తపస్సనునది ప్రాచీన భారత దేశమునకుఁ గొంగు బంగారము. కొంగు బంగారమైయొప్పునట్టి యా తప స్సును అద్యతన భారత దేశమునకు లభింపఁజేయవలయునని గాంధి మహాత్ముఁడు ప్రయత్నించుచుండుట కన్నులుగలవారందఱికిఁ గాన్పించునట్టి యథార్థము.

"సత్యాగ్రహము స్వార్థమునకు మాత్రము ఉపయో గించుకొనరాదు. పరహితార్థమునకు మాత్రమే యుపయో గింపవలెను. సత్యాగ్రహి, సమస్త కష్టనష్టముల కెప్పుడును సిద్ధమైయుండవలెను." అని మహాత్ముఁడు సత్యాగ్రహమును గుఱించి చెప్పినమాటలు బంగారమందుఁ బొదివిన రత్నములు గదా!

గాంధి మహాత్ముఁడు సత్యాగ్రహ వ్రతముచేయు దినమునందును "సభలందుఁ గోపముతో మాటాడరాదు;

అంగళ్ళను మూయవలసిదిగా' నెవరిని నిర్బంధింపరాదు; మన యాదర్శము పవిత్రమైనది; భగవత్సహాయము గలది; శాంతముతో ప్రేమతో నుండవలెను." అని సూటికి సూటికి భారతీయులకు హెచ్చరికలు చేయుచునేయుండెను. సత్యాగ్రహము జరుపు దినమున వివిధ ప్రాంతములకుఁ బంపిన సందేశములందు సత్యాగ్రహ పవిత్రతనుగూర్చియే చెప్పియుండెను. లోకోత్తరమగు గాంధి మహాత్ముని శాంత గుణమును వివరముగా మనము చెప్ప నుంకించుట యాకసమందలి చుక్కలను లెక్కించుట యగును.

## ఆత్మశక్తి ప్రభావము

గాంధి మహాత్ముని ప్రబోధమునకు భారత భూమి పులకితయయ్యెను. 1919-వ సంవత్సరము, ఏప్రిలు 6వ దినము ఆదివారమునాఁడు ఆసేతు హిమాచలము అలలు అణఁగిన యంబుధి చందమున మహాప్రశాంతముగా నుండెను. సేనయు మహాత్ముని ప్రేమాజ్ఞను గవచముగా ధరించి యుద్ధమునకు సిద్ధమయ్యెను. ముప్పది కోట్ల బిడ్డలనుగన్న భారతాంబ గాంధి తిరుపాదముల నీడఁ నిలువఁబడినది! భారతీయులెల్లరు అంగళ్లు మూసియు, పనులు మానియు, ఉపవాసములు పూనియు, ప్రశాంతముగా సభలు జరిపి తీర్మానములు చేసియుండుటవలన ఆనందతుందిల హృదయముతో భారతమాత యుప్పొంగెనని విన్న యెవ్వని హృదయము సంతోషతృప్తి తరంగితము కాదు! పెద్దకాలము భగవంతునిమఱచియుండిన భారతదేశము, నాఁడు భగవంతుని సాక్షాత్కరించుకొన్నదనిన నాశ్చర్యమేమి కలదు? భారత భూమియందుఁగల హైందవులు, మహమ్మదీయులు నితరులును – ఎల్లరును కింబహునా? ఎల్ల మతములవారును

సమస్త మానవులును ఒక్క వ్యక్తివలెఁ బ్రకాశించిన యానాఁటి దృశ్యమును దన విశ్వరూప ప్రదర్శనముగా మహాత్ముఁడు మనకుఁ జూపఁగలిగెనేమోయని భావింపక తప్పదు. ఆహా! ఇట్టి యెల్లలుమీఱి నైకమత్యమను 'మహాసముద్రము ప్రశాంత పరిణామముతో' భారత దేశమందు తన చల్లని వన్నెల పచరించిన యా దృశ్యము మహాత్ముని విశ్వరూప ప్రదర్శనా దృశ్యము కాఁబోలని ప్రపంచమంతయు నానందమునఁ బులకిత మయ్యెను. నాఁటి దృశ్యమును గాంచిన కన్నులే కన్నులుగదా! నాఁటి వ్రతానుష్ఠానమునఁ బాల్గొనిన భారతీయులు అజరామరులై యలరారుచుందురు గాక!! ఓ గాంధిదేవా! స్వాతంత్ర్య దేవా! నీ మహిమలు వర్ణింపఁదరమా? ఓ దేవా! నిన్నుఁ గనిన భారతమాత ధన్యురాలుగదా! ఆహా! అట్టి తల్లి కడుపునఁ బుట్టిన మేమందఱము ధన్యులము!!! ధన్యులము!!! మహాత్మా! నీ యాత్మశక్తి యనంతకాంతి ప్రభాపుంజభాసురమై భారత భూమియందు – ప్రపంచమందు – నేల నాలుగు చెఱఁగులఁ బ్రసరించి 'సర్వేజనాస్సుఖినోభవంతు' అని యాశీర్వదించు చుండును గాక !!!

భారతదేశము నలుఁగడలను బ్రశాంతముగా సత్యాగ్రహవ్రత దీక్ష ప్రశంసఁబడుటను, మహాత్ముని సత్యాగ్రహ ప్రబోధమునకుఁ బగపట్టిన ప్రభుత్వము లొంగక పోవుటను మహాత్ముఁడు సహించి, శాసనోల్లంఘ నోద్యమము మారంభింప నెంచి, ప్రభుత్వానుమతి పొందని 'సత్యాగ్రహి' యను పత్రికను బ్రకటించు చుండెను. దేశ దేశములందలి నాయకు లెల్లరు మహాత్ముని యడుగు జాడల మెలఁగుచు మహాత్ముని యాజ్ఞా బద్ధులై దీక్షాదక్షతలతో దేశసేవా బద్ధకంకణులై తదు

ద్యమమును నిర్విఘ్నముగా నచంచల దీక్షతతో నారంభింపఁ దలపడిరి. సమరాయత్త చిత్తుఁడైన మహాత్ముఁడు "ఎప్పుడైనను నా శరీరము చెఱసాలఁ బడును" అని శ్రీకృష్ణ జన్మస్థానమున కెదురు చూచుచుండెను.

## పాంచాల భంగపాటు

ఉద్యమము ఉద్ధృతముగాఁ జెలరేఁగు చుండఁ బాంచాల దేశ నాయకుల నుండి మహాత్మునకుఁ బిలుపు వచ్చెను. అచటి ప్రజలస్థితి యఱగొఱలై ప్రాణములు పిడికిటఁ బట్టుకొని భయ విహ్వాలగుచుండుట పిలుపునకుఁ గారణ మయ్యెను. అప్పుడచట గవర్నరుగా నుండిన 'ఓడ్వాయర్' అనువాని దుండగములే యందులకుఁ గారణము.

పాంచాల దేశము ఏప్రిల్ ఆఱవ దినమున సత్యాగ్రహ దినముగాఁ గొండాడిన యా గొప్పతనమును జెప్పుటకు వాఙ్మయమే చాలదేమో! ఆనాఁడు హిందూ మహమ్మదీయు లేకమై యేకమాతృ గర్భసంజనిత సోదరులవలె మెలఁగిరని చెప్ప నగును. ఆనాఁడు శ్రీరామ నవమి. ఆ నవమి యుత్సవములందు మహమ్మదీయులును బాల్గొని వేఁడుకగా నుత్సవము జరుపుకొని తీర్థ ప్రసాదములు గైకొని రనిన వేఱేమిఁ గొప్ప చెప్పవలెను. ప్రపంచ మందిట్టి ఘటన చరిత్రాత్మకముగా నెక్కాల మందైన జరిగెనేమో చరిత్రలు తిరుగవేసినను గానరాని యపూర్వ సంఘటన గదా! అట్లు మతముల పరమార్థము గ్రహించి యెల్ల మతములవారు దేవుని బిడ్డలే, యేకోదరు లేయను భావము మనస్సులను బల్లవింపఁ జేయఁగా, అట్టి యైక్యభావము, పరమార్థచింత భారతీయుల కేలయని కాఁబోలు 'ఓడ్వాయరు' ఉల్లమును

కల్లోలపెట్టెను. పాప మాతఁడా. శుచికాఁగలే నందున శరీరమంత టను నిప్పులు పోసినట్లయ్యెను. పాంచాల నాయకుల పిలుపు నందుకొని యట్లే మహాత్ముఁడు పాంచాలమునకుఁ బయలుదెత్త మనస్సు తపింప.

స్థిరికిం జెప్పఁడు శంఖచక్ర యుగముం జేదోయి సంధిపఁడే
పరివారమ్మును జీరఁ డభ్రగ పతిం బన్నింపఁడా కర్ణికాం
తర ధమ్మిల్లము చక్క నొత్తఁడు వివాద ప్రోద్ధిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజ ప్రాణావనోత్సాహియై ॥.

మహా విష్ణువువలె నేతెంచుచుండ నచటకు రావలదని ప్రభుత్వము తత్తఱముచెంది యుత్తరు విచ్చెను. పాంచాలమును తరింపఁ జేయుట కేతెంచిన మహాత్ముని నా యుత్తర వేమిచేయును? మహాత్ముఁడు ప్రభుత్వాజ్ఞనుల్లంఘించి దేశమందుఁ బ్రవేశించుట గాంచి యధికారులు మహాత్ముని బట్టుకొని బండితోఁ ద్రిప్పివంపిరి." మహాత్ముఁడు 'నిర్బంధింపఁ బడి యెచటకో గొంపోవఁ బడుచుండెన"ను వార్త భారతదేశ మందెల్లెడలఁ బ్రాఁకెను. ఆవార్త ఢిల్లీ, అమృతసరు, బొంబాయి వీరగాము, అహమ్మదాబాదు మొదలగు నగరములందు దురా గ్రహము రేపెను. దౌర్జన్య పిశాచము తలవిరియఁ బోసికొని విచ్చలవిడి వికటాట్టహాసమునఁ జిందులు ద్రొక్కెను.

సత్యాగ్రహమును బ్రశాంతముగా స్థిరబుద్ధితో భక్తి శ్రద్ధలతోఁ బ్రశంసించిన పాంచాల మండలములకు దురాగ్రహము తలయెత్తవలసి వచ్చెను? అచట దురాగ్రహము తలయెత్తక పోయినచో, మహాత్ముఁడు క్రమక్రమముగా సత్యాగ్రహ సమర

మారంభించి భారతమాతకే విజయమాలను ధరింపఁజేసి యుండెడివాఁడు గదా! ఆ భాగ్యము కలుగు అదృష్ట మప్పటికా మాతృదేవికి లేదు కాఁబోలు! అప్పటి కా యదృష్టమునకుఁ దగిన భారతమాత తపఃఫలముపండలేదు. "కలకంఠకంఠి కన్నీరు, పంచముల పరితాపము, బౌద్ధ సన్యాసుల వధా విధానము మున్నగు ఘోర పాపకృత్యములకుఁ బ్రాయశ్చిత్త మనుభవింపని దేశము స్వాతంత్ర్యము పొందుటకు సర్వేశ్వరుఁడు సమ్మతించునా? చెప్పనలవికాని సత్యాగ్రహ సమరము ప్రారంభ మయ్యెను! ఆ యుద్ధము నడుపుటకు బుద్ధునివంటి మహాజ్ఞాని మహాత్ముఁడు అని మొన నిలువఁబడెను! ప్రారంభింపఁబడియు నిలువఁబడియు ఫలమేమి కలిగెను? ప్రారంభించుటయందుఁ బొరపొచ్చెము లేదు; నాయకునియందు లోపము గానరాదు; కాని దేశము పూర్వము చేసిన పాపమే కార్యము ఫలింపని కారణము.

పాంచాల దేశమందుఁ దలపడిన దురాగ్రహము, సత్యాగ్రహ మహిమము పనికిరాదని యూసడించుట గాదా? దురాగ్రహము కూడిన సత్యాగ్రహము విషము కూడిన పాలువంటిది కాదా? అట్టి తగని దురాగ్రహముగల సత్యాగ్రహమును మహాత్ముఁడు దేశమున కిచ్చునా? గాంధిమహాత్ముఁడు దేశ పరిస్థితిని గ్రహించి సత్యాగ్రహ మహిమను మన కనుగ్రహించెను. అట్టి సమయమందు సత్యాగ్రహ సంఘ కార్యకర్తలకు మహాత్ముఁడు వ్రాసిన కమ్మ, కన్నుల కద్దుకొనఁ దగినది. ఆ జాబునందు మహాత్ముఁడు, అహమ్మదాబాదు, వీరగాము, పంజాబు మొదలగు తావులందు పేద ప్రజలు, తనమీఁద నుంచిన ప్రేమ కారణముగా వీటిడి తనముతో దురాగ్రహ ధూర్తతను నెఱపియుండు

రనియు, ప్రభుత్వమువారు తనను ఢిల్లీని బ్రవేశింపనీయక యడ్డు వచ్చుటయే యీ ఘోర కృత్యములు జరుగుటకుఁ గారణ మయ్యెననియు, దురాగ్రహమునకు – సత్యాగ్రహమునకు సంబంధముగాని సామరస్యముగాని లేదనియు, ఉన్నను, సత్యాగ్రహారంభసమయమందు దేశమందు శాంతిని నెలకొల్ప వలయుననియు, శాంతిని గాపాడుటకుఁ బ్రభుత్వమున కవకాశ మీయ వలయుననియు, రౌలటు చట్టమునుగూర్చి తన నిశ్చయ మేమాత్రము మాఱ లేదనియు, ప్రస్తుతమునకు సత్యాగ్రహము నాపుటయే సముచితమనియు వ్రాసి, యీ యుత్తరమందొక చోట,

"సత్యాగ్రహము, పక్షిజాతుల కాలవాలమైన మఱ్ఱి చెట్టు వంటిది. ఆ పక్షులందొక పక్షి వంటిది శాసన ధిక్కారమనునది. సత్యాహింసలు గలిసినరూపమే ఆ మ్రాను మొదలు. ఆ మ్రానునుండియే కొమ్మలు, ఆకులు పుట్టుచుండును. సత్యాహింసలను నొకతావునుండియే శాసన ధిక్కారము గలుగును. మనము భయపడక సత్యాహింసల ధర్మమును బఱపిన (వ్యాపింపఁ జేసిన) పిమ్మటనే మనము సత్యాగ్రహ యుద్ధము ప్రారంభించుటకు సమర్థుల మగుదము."

అని సత్యాగ్రహ ధర్మ రహస్యమును దేఁటతెల్లముగాఁ దెలియఁ జెప్పెను.

## పంజాబు దురంతములు

పంజాబు నందొక మూల కొలఁది దురాగ్రహము కలిగిన కారణముగా నధికార వర్గముయొక్క సంపూర్ణ రాక్షస దురాగ్రహము విచ్చలవిడి విజృంభించెను. జనరల్ డయ్యరు, జాన్సన్, స్మిత్తు మొదలగు క్రూరులు చేసిన రాక్షస కృత్య

ములను వినిన ఱాలుగూడ ద్రవించి యేడ్చును. జనరలు డయ్యెరు అనునాతఁడు 'జలియన్ వాలాబాగ్' అను నాలుగు మూలలు గలిసిన యొక ప్రదేశమందు, దేశ నాయకుల యుపన్యాసములు వినుటకై నేల యీనిన చందముగాఁ జేరిన యమాయక ప్రజా సమూహమును నసయొద్దనుండి తుపాకి గుండ్లతో 'టపటప' మని ప్రేల్చి నేల కూల్చెను. ఆ ఘోరాతి ఘోర కిరాత కృత్యములు దలఁచుకొనిన గుండెలవిసి పోవును. ఆదురంత ఘోర కిరాత కృత్యములు భారత దేశ మెన్నటికి మఱచును? ఆ నీచులు, మహానాయకులను మెడఁబట్టి త్రోసి వీధుల వెంటఁ బఱుగు లెత్తునట్లు కొట్టినదియు, నొక యింటినుండి మఱియొక యింటికిఁ బోవుచున్న వారినిఁ గాళ్ళతోఁ బోరాదని యడ్డగించి, ఱొమ్ములతోఁ బాములవలెఁ బ్రాకిపోవునట్లు నిర్బంధించియు కావించిన రాక్షస దుష్కృత్యములను మనమెట్లు మఱచి పోఁగలము? చావమోది శరీరమునకు సున్నము రాచి నవ్వుకొనుటయు, మానవతులను మానభంగము కావించుటయుఁ, జెట్లనెక్కి యుపన్యాసములు వినుచుండిన బాలురను బక్షుల వలెఁ దుపాకిగుండ్లతో నేలఁ గూల్చుటయు మున్నగు హృదయ విదారక పాప కృత్యములను భారతభూమి యెట్లు మోయఁగలదు? అడవి యందలి పక్షులను నేలఁగూల్చినట్లు ప్రజా సమూహమును దుపాకి గుండ్లతోఁ గాల్చిన యీ పంజాబు దురంత పాపములు భారత హృదయ సీమనుండి యెట్లు మాసి పోవును? ఇట్టి యంతులేని ప్రజానాశము గావించిన ఘోర భయంకర కృత్యములను భారతావని మఱచుట యెట్లు? ఈ భయంకర రాక్షస కృత్యములు తలఁచు కొనినంతనే హృదయము ఎదా యెదలగును! అయ్యయ్యో! మానవ ప్రపంచము

నకే కళంకమగు నీఘోరాతి ఘోర కృత్యములను భావికాలమున జదువుకొను మానవుఁడేమి కాఁగలఁడో దైవముననకే యెఱుక! ముందు ముందుఁ జదువుకొను భారతదేశ బాలుని హృదయ మెంత ద్రవ్యమై పోవునో గదా! కట్టా! ఇట్టి చెయదము ప్రపంచమునకే ప్రళయ తాండవము గదా! తలఁచుకొనిన కొలఁది మనస్సు వైకల్యము పొందుటతప్ప నూఱడిల్లుట యెట్లు? పాఠక మహాశయులారా! పంజాబు దురంతములు చదువుకొనఁ దలఁచినయెడలఁ దత్సంబంధ గ్రంథములను జదువు కొనుఁడని ప్రార్థన.

ఇట్టి హత్యాకాండ జరుగుట కేవగించుకొనక, యెప్పు డెట్లు జరిగినో యని తెలిసికొనుటకై 'హంటర్' అను నాతని నాయకత్వమున నొక విచారణ సంఘమును ప్రభుత్వము నియ మించుట మఱింత విడ్డూరముగా నున్నది. ఆ విచారణ సంఘ మాంగ్ల దేశమునుండి మనదేశమునకు దిగెను. విచారణ సంఘ మును మన భారతదేశ నాయకులు పలువురు బహిష్కరించిరి. కాని, శాంతమూర్తి గాంధి మహాత్ముఁడు ఇందువలననైనను న్యాయము కలుగునేమో" యని తలంచి, యీ విచారణ సంఘము నెదుట సాక్ష్యమిచ్చెను. ఆ విచారణ సంఘము వలన న్యాయము కలుగదని తలఁచి భారత జాతీయ మహాసభవారు (కాంగ్రెసు) వేఱొక జాతీయ విచారణ సంఘము నేర్పఱచి విచారణ సలిపి యొక నివేదిక వెలువరించిరి. అందును మహా త్ముఁడు పెద్దగా నాహ్వానింపఁబడెను. హంటరు విచారణ సంఘ నివేదిక వలనను, ఇతర నివేదికల వలనను, ఇసుమంతేనియుఁ, బ్రయోజనము కలుగలేదు. హత్యాదురంతములకుఁ గారకులగు 'ఓడ్వయ్యరు,' 'డయ్యరు' మొదలగు వారు 'పెన్షన్' జీతము

మీఁద తమ దేశములకుఁ గొంపోవఁబడిరి. ఆ యాంగ్లదేశమందు, వారు ఆంగ్ల పరిపాలనమును గాపాడిన దైవములుగా గౌరవింపఁబడిరి. 'డయ్యరు' అను పెనువానికి నొక వీరఖడ్గము కూడ బహుమతిగా నీయఁబడెను. వారికి మిత్రులారా ! న్యాయ మెచ్చటగలదో యూహింపుఁడు. లోకమాన్య బాలగంగాధర తిలకు మొదలగు భారతదేశ మహానాయకులు 'కొందఱు 'డయ్యరు' మొదలగు వారెచ్చట భారతీయులను గాల్చిచంపిరో, అచ్చోటనే యా ఘోర పాపులను గూడ బలి యీయవలెనని యా సంవత్సరము అమృతసరమునగు జరిగిన జాతీయ మహాసభా మండపమున నెలుఁగెత్తి పలికిరి. గాంధి మహాత్ముఁడు; 'హత్యకుఁ బ్రతిహత్య' చేయరాదనియుఁ దలఁపరాదనియు, 'హంతకుల నుద్యోగము నుండి యూడఁబెఱుకుటయే చాలు ననియుఁ జెప్పెను. మహాత్ముని కోరిక ననుసరించియే జాతీయ సంఘ నివేదికయు వెలువరింపఁ బడెను. లోకమాన్య బాల గంగాధర తిలకు మొదలగు మహా నాయకుల మాటలను మహాత్ముఁడొప్పు కొన లేదు.

ఒరులే యవి యొనరించిన,
నరవర ! యప్రియము దనమనంబునకగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మపథముల కెల్లన్.

'హత్యకుఁ బ్రతిహత్య కూడద'ని సత్యాగ్రహ ధర్మము నుండియు చ్యుతికాని యచ్యుతుఁడు మహాత్ముఁడు. ఎట్టి పరిస్థితి యందైనను విరోధులయెడఁ గృపచూపు దయాసముద్రుఁడు మహాత్ముఁడు. మిత్రులారా! చూడుఁడు. దేశమంతయు

'జయ్యరా! ఓడ్వయ్యరా! పాఱుఁబోతులారా! చచ్చెదరుగాక' యని గర్జించుచు భారత వీర కిశోరములు కాలు దువ్వుచుండ, శాంతి దేవుఁడు గాంధి మహాత్ముఁడు హాత్యాబుద్ధి తగదని హితవులు పలికి మాన్పించెను. మహాత్ముని జ్ఞానమునకు సముమైనది దయా మూలధర్మము కాదా! మానవ జీవితమందుఁ బొందఁదగినదదియే. ఆ ధర్మమును, ఎట్టియిక్కట్టులు కలుగునప్పుడైనను భయమునఁగాని నయమునఁగాని. మఱియేకారణమునఁగానిత్యజింపరానిది. గాంధిమహాత్ముఁడు అట్టి మూల ధర్మమును ఎట్టి పరిస్థితులు విూఁదఁబడినను ఎట్టి సమయములందుఁ గూడ విడనాడక కాపాడిన విషయము మిక్కిలి గమనింపఁదగినది. ఆ ధర్మమును మహాత్ముని యొద్ద నుండియు గ్రహించుటకు లోకమాన్యునకుఁ గూడ సాధ్యము కాకపోయెనన, నిఁక మహాత్ముని మహిమాతిశయము వేఱ చెప్పవలయునా ?

### హత్యయు - దయయు

ఆ హంతకుఁడు ఉద్యోగమునుండి తొలఁగించుటకుఁ జెప్పుట మాత్రము దయాగుణముగు నా యనియు, అట్లుచెప్పుట యందుఁ గూడ విరోధభావము లేదా యనియుఁ గొందఱు ప్రశ్నింప వచ్చును. ఆ హత్యకును, ఉద్యోగమునుండి తొలఁగించుటకును భేదము కలదు. ఉద్యోగమునుండి తొలఁగించుట వలనఁ గ్రూరకృత్యములు గావించినవారికి సద్బుద్ధి యనుజ్ఞానము కలిగించుట యగును. నీచులు సహితము, సద్బుద్ధి కలిగి మనస్సును మంచి మార్గమునకుఁ ద్రిప్పుకొని తాము చేసిన తప్పులకుఁ బరితప్త హృదయులగుటయుఁ గలుగవచ్చునుగదా! శత్రువునకైనను, మనస్సు మార్చుకొని పశ్చాత్తాప పడుట కవకాశ

మీాయవలెను. ఆ దుర్బుద్ధి నుండి మనస్సు మార్చఁజాలక పోయినను, అయ్యది భగవంతుని సృష్టికి సన్మతము కాకపోయినను, హత్యకుఁ బ్రతిహత్య చేయుట తగదు. లోకములో హత్యలు చేసినవారిని హత్య గావించుట యభిలషింపఁ దగినది కాదు. హంతకుల హత్యాబుద్ధిని, మనస్సును మార్పుజేయు పద్ధతియే వివేకవంతము. ఇఁక నీ విషయమింతటితో చాలించి ముందునకుఁ బోవుదమని నా పాఠక మిత్రులకు మనవి.

## సహాయ నిరాకరణ—సత్యాగ్రహము

ఘోరహత్యలు చేసినవారిని పనినుండి తొలఁగించుట యెంత యత్యల్పమగు దండన? ఈ దండనను గూడ విధించుటకుఁ బ్రభుత్వమువారు సమ్మతింపరైరి. అందులకు మారుగా హంతకులు బ్రిటనులో నగ్గలముగా నుగ్గడింపఁబడిరి. అట్లు చేయుట ధర్మమా? అది యగ్నియై భారత దేశమంతయు భగ్గుఁ బ్రజ్వరిల్లఁ జొచ్చెను. ఆ యగ్నిలో నాజ్యము పోసినట్లు ఐరోపాయుద్ధ కాలమందు బ్రిటీషు మొదటి ప్రభువు 'ఖిలాఫత్తు'న కిచ్చిన వాగ్దానములకు భంగముగా నడుచుకొనినట్లు భారత దేశమునకుఁ దెలియవచ్చెను. గాంధి మహాత్ముఁడు పంజాబు దురంతములకును, ఖిలాఫత్తునకును న్యాయము కలుగని కారణముగా సహాయ నిరాకరణోద్యమము ప్రారంభింపఁదలఁచి యందులకు దేశము నాయత్తముచేసెను. మహాత్ముఁ డాయత్తముచేసిన యుద్ధమునకు కాంగ్రెసుకూడ సంసిద్ధత చూపెను.

పంజాబు హత్యలవంటి హత్యలు ఖిలాఫతునందు జరిగినందులకును, అందునుగూడ న్యాయము కలుగనందులకును దేశమునకు స్వరాజ్యము లేకపోవుటయే కారణమనియు, అం

దుచే సహాయ నిరాకరణోద్యమము స్వరాజ్య యుద్ధముగా భావింపవలెననియు, కాంగ్రెసు నిశ్చయించెను. అందులకు గాంధి మహాత్ముఁడు సమ్మతించెను. స్వరాజ్యము లభించుట స్వదేశీయ పద్ధతిమీఁద (జాతీయ పద్ధతి) మిక్కిలి యాధారపడి యున్నదని ముందే చదువుకొనియుంటిమి. జాతీయ లక్ష్యముతో గాంధి మహాత్ముఁడు సహాయ నిరాకరణ యుద్ధమను ప్రేమ యుద్ధమును, జాతీయ భావమును గాఢముగా భారతీయుల మనఃఫలకములందు నాటుకొనునట్లు ప్రబోధించుచు, నభివృద్ధి గాంచుటకుఁ గృషి చేసెను. ఆ వివరములీ క్రింద వివరింపఁబడు సహాయ నిరాకరణమందుఁ దెలియఁగలవు.

సహాయ నిరాకరణ మనునదియు గాంధి మహాత్మునిచేఁ గ్రొత్తగాఁ గనిపెట్టఁబడినదనిన, కాదని చెప్పలేము. సహాయా సహాయము లనాదినుండియుఁ గలవు. సృష్టి ప్రారంభదినమెట్లు చెప్పఁజాలమో, అట్లే సహాయా సహాయములుకూడ నేర్పడిన దినమునుగూడఁ జెప్పలేము. ప్రకృతి తత్త్వమందు భేద భావము, సంఘీభావమును గలవు. ఈ భిన్నైక్యభావము లేకతత్త్వసంజనితములు. అందుచే, లోకమందుఁ, గర్తవ్యము నెయ్యములు, కీడు మేలులనునవి యొక జీవియందే గలుగుటను గాంచుచుంటిమి. భేదాభేదములు సృష్ట్యాదినుండియుఁ బ్రకృతి తత్త్వమందుఁగలవని రూఢియగుచున్నది. మహాత్ముఁడు ప్రారంభించిన యసహాయోద్యమము ప్రకృతి తత్త్వమునకు భిన్నమైనది కాదనియే యిచట గమనింపవలయును.

సృష్టియందలి ప్రతి పదార్థము తన యుపయోగము తీఱిన పిమ్మట నశించుచుండుటయు, మఱియొక పదార్థము ఉపయోగింపఁబడుటయు సహజము. అయ్యది మన కనుభవమందుఁ

గానిపించు విషయము. మన మొక వస్తువును సంపాదించుకొని యుపయోగించుకొనుచున్నప్పుడా వస్తువు దినక్రమముగఁ బ్రాఁతవడి తుదకు జీర్ణించి నశించుచుండును. పిమ్మట నట్టి మఱియొక వస్తువును సంపాదించుకొందుము. అట్టే సృష్టి తత్త్వము. శరీరమునకనారోగ్యము కలిగినప్పుడు వైద్యుఁడు చేయు చికిత్సా విధానముగూడ నట్టిదేయగును. గోడకుఁ గొట్టిన సున్నము ప్రాఁతవడిన కారణమునఁ దిరిగి యాగోడకుఁ గ్రొత్త సున్నమును గొట్టించుదుము. అట్లు ప్రాఁత-క్రొత్తలకు భేదముండుటకుఁ గారణమేమి? ఇల్లు మనుష్యునికెంతో సందనముగా నుండవలయుననిగదా యిల్లాలి యుల్లాసము! అట్టే నూతజీవన పద్ధతియునని యెఱుంగునది. ఈ భిన్న భావము ప్రకృతి తత్త్వ మగునప్పుడు జీవన విధానమందుఁ బ్రేమ కంతరాయ మెట్లు కలుగఁగలదు? భేదమనునది విరోధమువలనఁ గలుగనేరదు. భేదము ప్రేమ పరిణతి ననుసరించి కలుగుచుండును. వివరము లారయఁగోరువారా యాగ్రంథము లారయుఁడని మనవి.

మహాత్ముఁడు ప్రారంభించిన సహాయ నిరాకరణోద్యమమునకుఁ బ్రేమయే యాదర్శమని భావింపవలెను. ఆ కారణముచేతనే సహాయ నిరాకరణోద్యమమునుగూర్చి పదే పదే మహాత్ముఁడు అహింసా ధర్మమే సహాయ నిరాకరణమని చెప్పుచుండెను. ప్రభుత్వమునెడ ద్వేషము కలిగింపవలెనని విరోధ భావముతో మహాత్ముఁడు సహాయ నిరాకరణోద్యమమును బ్రారంభింపలేదనుట యథార్థము. ఆ ద్వేషభావము సహాయ నిరాకరణోద్యమమునకు లక్షణముగాదు. మహాత్ముని సహాయ నిరాకరణోద్యమము ప్రేమ తత్త్వమునుండి కలిగిన రూపమని స్పష్టమగుచున్నది. "మనకు శత్రువులులేరు. ఈ ప్రపంచమం

దెవరిని మనము ద్వేషింపరాదు. ప్రేమ తత్త్వముచే వ్యతిరేక భావమును స్వాధీనము చేసికొనవలయున”ని మహాత్ముఁడు వ్రాసియిచ్చిన విషయమును మఱువకుఁడు.

భారతదేశమందు, ప్రభుత్వ పరిపాలనా విధానముచే దేశాభిమానము నశించుటను గ్రహించి దేశాభిమానమును నశింపఁజేయు మనః ప్రవృత్తికి సహాయపడకుండ నుండుటకై సహాయ నిరాకరణోద్యమము ప్రారంభింపఁబడెనని దేశీయుల నుద్బోధించు చుండెను. ఈ సహాయ నిరాకరణోద్యమము దేశాభిమానము మీఁదఁగల ప్రేమ కారణముగా నారంభింపఁ బడినదియే కాని యాంగ్లేయులమీఁద ద్వేష భావముతో మాత్రముగాదు. విరోధ భావముచే నసహాయోద్యము ప్రారంభింపఁ బడినదని తలఁచుట యవివేకము. విరోధభావము వ్యక్తిత్వమును నశింపఁజేయును. అది యహింసా ధర్మము కాదు. హత్యల వలనఁ గలుగు హాని పరంపరయు, ద్వేషము వలనఁ గలుగు ననర్థములు పెక్కులని మన మీ గ్రంథమందుఁ బలు పర్యాయములు చదువు కొంటిమి.

## బహిష్కారము

మన స్వదేశీయము అనఁగా జాతీయత శతాబ్దముల తరబడి విదేశ వ్యామోహముమీఁద నాధారపడి యుండుటను మహాత్ముఁడు గ్రహించి, యసహాయోద్యమము దలపెట్టెను. ఆ యుద్యమము బహిష్కారము – నిషేధమునను రెండు పద్ధతులు గలిగి యున్నది.

మొదటిది:— “స్వదేశ్యము నశించుటకుఁ గారణమేమి? అన్యదేశ్యము ప్రబలుటకుఁ గారణమేమి ?” అని యాలోచింప

వలెను. అట్లు పరిశీలించిన యెడల ప్రభుత్వ విద్యా విధానము జాతీయ భావము నశించుటకుఁ గారణమని తెలియఁ గలదు. కావున ప్రభుత్వ విద్యాలయములను బహిష్కరించుట ముఖ్యమని దేశీయులకు మహాత్ముఁ డాజ్ఞాపించెను.

రెండవది:— దేశ మభివృద్ధి కాకుండ నుండుటకుఁ గారణమేమని యాలోచింపవలెను? అట్లు ఆలోచించిన యెడల స్వార్థబుద్ధితోఁ బ్రభుత్వము పరిపాలించుట కారణమని స్పష్టమగుచున్నది. అందుచే గాంధి మహాత్ముఁడు న్యాయస్థానములను నిషేధింపవలెనని దేశీయులను మహాత్ముఁ డాజ్ఞాపించెను. దేశక్షేమమును గోరి శాసనములు గావింపఁ బడని కారణమున శాసన సభలను నిషేధింపవలెనని మహాత్ముఁడు చాఁటి చెప్పెను. ఈ త్రివిధ బహిష్కారములతో దేశీయ విద్యాలయములు, దేశీయ పంచాయతీలు, కాంగ్రెసుసభ - అను ఈ మూఁటిని భారత దేశమందుఁ బ్రత్యామ్నాయముగ నెలకొల్పవలయునని భారతీయులకు బోధించెను. భారత దేశార్థిక సంపదను సంరక్షింపఁదలఁచి యన్య దేశీయ వస్త్రములను బహిష్కరించుటకును స్వదేశవస్త్రములను అనఁగా ఖద్దరువస్త్రములు ధరింపవలయు భారత దేశమును ప్రబోధించెను. పరప్రభుత్వ పరిపాలన, దేశమునకుఁ బ్రయోజనము కలుగదని నిశ్చయించి తమతమ విశ్వవిద్యాలయ పట్టములను త్యాగబుద్ధితోఁ ద్యజింపవలయునని భారతీయ విద్యార్థులను గోరెను. ఇట్టి యపూర్వమగు సహాయనిరాకరణోద్యమమునకుఁ దృప్తి, త్యాగము, శాంతము మొదలగు గుణము లావశ్యకమని వేఱుగాఁ జెప్పవలసిన పనిలేదు. ఇట్టి యసహాయ యోగమును సహకరించుటకు భారతీయులు నూటి కిఱువదిమంది సిద్ధమగునెడల నయ్యది సాటిలేని యసహాయో

ద్యమమై యొప్పఁగలదు. అట్టియసహాయోద్యమును గత్తికటారులతోఁ బాలించు ప్రభుత్వము లేమిచేయఁగలవు? కత్తులు త్రిప్పవచ్చును. కటారులతోఁ బొడువవచ్చును. తుపాకులు ప్రేల్చవచ్చును. అయిన నేమి? అట్టివానికవజ్రసంకల్పయుగల ధీరులు వెఱతురా? తృప్తి-త్యాగము - శాంతము మొదలగు నపూర్వాయుధములతో నొప్పెడు యసహాయోద్యమము నెవరేమిచేయ సమర్థులగుదురు? ఇట్టి యపూర్వమార్గము మనకుఁజూపిన గాంధి మహాత్ముని నెట్టిమాటలతో నుగ్గడింపఁగలము? మనోవాక్కాయములతో మహాత్మునకు నమస్కరించుచుంటిని. త్రికరణ శుద్ధిగా హృదయపవిత్రతతో నా మహనీయునకు జేజేలు పెట్టుదము. మహాత్ముని ధర్మప్రబోధమగు నసహాయోద్యమము ఫలించిన యెడల మన భారత మాతముఖకమలము వికసించి స్వదేశ ప్రభుత్వమను స్వరాజ్యము మనకుఁ బ్రాప్తించి యుండెడి.

## ఐక్యత

అసహాయోద్యమమునకు సత్ప్రవర్తన-ఐక్యత మిక్కిలి యావశ్యకము. అసహాయోద్యమమునకు ఐక్యభావము పెట్టని కోట. ఐక్యములేని యసహాయయోగము వ్యర్థప్రసంగము వంటిది. అసహాయయోగమున కైక్యము ప్రాణము. ఆ కారణముచేత మహాత్ముఁడు 'ఐక్యము, ఐక్యము' అని యెలుఁగెత్తి చాఁటుచుండెను. మహాత్ముఁడు ప్రబోధించుచుండిన హిందూ ముస్లిముల సౌఖ్యము, అస్పృశ్యతా నివారణ, స్త్రీ స్వాతంత్ర్యము భారతదేశము కలిగియుండిన యెడల, ఐక్యముస్థిరపడి యసహాయోద్యమమువలన దేశము సమస్త శాంతిసౌఖ్యము

లతో నలరారి యుండెడిది. భారతీయులు అస్పృశ్యతను, స్త్రీల యస్వాతంత్ర్యమును బాల్యదోల సంతవలను దేశమభివృద్ధి గాంచుటకల్ల. ఏమిచేయుట?

గాంధిమహాత్ముఁడు తనవలనఁ గానియాదర్శమును లోకమునకుఁ జెప్పఁడని లోక మెఱిఁగిన సత్యాతిసత్యము. గాంధి మహాత్ముని తృప్తి-శాంతము-త్యాగము మొదలగు గుణములు మహాత్ముని జీవితమునకుఁ బెట్టని యాభరణములు. మహా త్ముఁడు తన 'బారిష్టరు' పట్టమును, ప్రభుత్వమిచ్చిన 'కేజరు హింద్' పతకమును త్యజించి దేశాభివృద్ధి కనరూపమగు నసహాయయుద్ధమునకుఁ దన నాహుతిచేసికొనుట మహాత్ముని జీవితము లోకమున కాదర్శముగదా!

ఈ యసహాయోద్యమంబుఁ జేరఁదలఁచినవారు త్రికరణ శుద్ధిగా ద్వేషాసూయ మాత్సర్యాదికమగు నరిషడ్వర్గమును విసర్జించవలయును. ఈ విషయమును మహాత్ముఁడు పలు పర్యాయములు భారతీయుల కుపదేశించెను. ప్రభుత్వమునకు మన నిశ్చయమను, ఆశయమును దెలుపవలయుననియు, నాంగ్లే యులమీఁద మన మేకారణముచేతైనను బగపూనరాదనియు గాంధిమహాత్ముఁడు చేసిన యుపదేశములకు, వ్రాసిన వ్యాసము లకు నొక యవధిలేదు. సహాయనిరాకరణోద్యమము జరుగు చుండిన దినములలో నాంగ్లేయులకు మహాత్ముఁడు వ్రాసిన బహిరంగలేఖలో 'నా ప్రియమైన మిత్రులారా!' యని సంబో ధించుట మహాత్ముని యాదర్శము ప్రపంచమున కాదర్శమై పరిఢవించుగాక !

గాంధిమహాత్ముఁడు అసహాయోద్యమమును గుఱించి యెన్నియో యుపదేశములు చేసెను. ఉదాహరణలు పెక్కులు చూపెను. అందున గొన్నింటినిట నుదాహరించుచుంటిని.

"ప్రజలు తమకుఁదామే పరిశుద్ధత గలిగియుందురుగాక!" ప్రభుత్వ పరిపాలనా దౌష్ట్యమును ప్రజలనుసరింపకుందురుగాక! ప్రజలెల్లరు నట్టి సచ్ఛీలవంతులగునెడలఁ బ్రభుత్వము తనంతటఁ దానే మటుమాయమగును."

"ఏదిమందు ? ఒంటరిగా నుండుటయా? సత్ప్రవర్తన గలిగి యుండుటయా? తనను బరిశుద్ధము గావించుకొనుటయా? తనకుఁదాను బరిశుద్ధము గావించుకొనుటయన ప్రభుత్వ విధానమునకు దూరముగా వైదొలఁగుటయే యసహాయోద్యమమునకుమందు."

"అసహాయోగమనునది యరాచకముగాదు; గౌరవహీనమును గాదు. ప్రభుత్వముతో నసహాయయోగము చేయుట యనఁగాఁ బ్రజలందఱు సంఘటితులై యేకముగలిగి యుండుట. అందుచే, అసహాయయోగము ఆత్మగౌరవమునకుఁ (Evolution) దగినది. హృదయపవిత్రత కదియొక లక్షణమని సామాన్యముగాఁ జెప్పఁబడుచున్నది."

మన యంతరాత్మకు – క్షేమమునకు వ్యతిరేకముగా పరిపాలన నెఱపు ప్రభుత్వమందుఁ గల మన యుపకరణముచే, పలు బాధలను లోనగుచు మనంతట మనమే యా బాధలను దొలగించుకొనవలెను. అధర్మముగాఁ బ్రవర్తించు ప్రభుత్వమునందు అధికారమునో, ఆర్థికసంపదనో ఆధిపత్యమునో పొందుట

యధర్మమనియు, అట్టియెడ దరిద్ర మనుభవించుటయే సద్ధర్మ మనియు 'థోరో' యను మహాశయుఁడు చెప్పియుండెను.

"తండ్రి యధర్మము చేయునప్పుడు, ఇల్లు వెడలుట బిడ్డల ధర్మము. ప్రధానోపాధ్యాయుఁడు తన పాఠశాలను గ్రమ శిక్షణతో నడుపఁజాలనప్పుడు, విద్యార్థు లా పాఠశాలను మానుకొనుట మేలు. పురపాలక సంఘాధ్యక్షుఁడు మోసగాఁడైనప్పుడు, సభ్యులు పరిశుద్ధతఁగోరి యాసభనుండి వెలికివచ్చుట మేలు. అట్లే, ప్రభుత్వము మాటదప్పి పరిపాలన సాగించుచుండి నప్పుడు, ప్రజలు, రైతులు నా ప్రభుత్వమునకు కొలఁదిగానో గొప్పగానో పరిపాలకులు తమ తప్పు తెలిసికొని సరియగు దారికి వచ్చువఱకు సహాయపడరాదు. నేను చెప్పిన పద్ధతు లాచరించు టలో నాఁకలిబాధయో, శరీరబాధయో కలుగును. ఆబాధ లనుభవింపకయే స్వాతంత్ర్యము పొందుట సాధ్యముగాదు."

"అసహాయయోగము మంత్రముగాదు; తంత్రముగాదు, అబద్ధమును గాదు. అది మన సత్యమును శోధించునట్టిది. అందు లకు కర్తవ్య పరాయణతగల త్యాగము శరణ్యము. దేశసేవకు వలయు నేర్పు, ఓర్పులు మనకుఁ గలవా యని యీ యుద్య మము తెలుపఁగలదు. ఆ యుద్యమము, మన యాశయము నాచరణయందుఁ జూపుటకు శక్తి కలది."

"యథార్థమునకు, భగవంతునకు భయపడువాఁడే యస హాయోద్యమ సేవకుఁడు గాఁగలఁడని నా నమ్మకము."

"అసహాయోద్యమము ప్రజలమీఁదఁ జేయుట గాదు; ప్రభుత్వముమీఁద...... గవర్నమెంటుమీఁదఁగూడఁ బ్రయో

గింపరాదు. వారు పరిపాలించుచున్న పరిపాలనా పద్ధతిమీఁదనే యసహాయోద్యమము చేయఁబడును."

"మన యసహాయ యోగము ఆంగ్లేయుల యెడఁగాదు; విదేశీయులయెడను గాదు. ఆంగ్లేయులు మన దేశము నందుఁ జేయుచున్న ప్రభుత్వవిధానముతో - పిచ్చి నాగరికతతో - పేదల ధనమును దోఁచుకొనుచున్న నిస్పృహతో - మనము అసహాయ యోగము చేయుచుంటిమి," "చెడుగును మూర్ఖశక్తితో నెదిరించుట మనకుఁ దగినదికాదు. ఆ చెడుగునకు మనకును సంబంధము లేకుండ మనము వైదొలఁగి యుండవలెను. ఎపుఁడు తన దుష్కృత్యమును దెలిసికొని పశ్చాత్తాప పడునో, వానితోఁ బ్రేమ గలిగి యుండవలెను. విరోధమందును బ్రేమ వహింపవలెను."

## విశ్వకవి వ్యతిరేకత

విశ్వకవి రవీంద్రనాథఠాకూరు అసహాయోద్యమమును గూర్చి పలువిధములుగా వ్యతిరేకభావమును గనఁబఱిచియుండిరి. టాగూరు కవిచంద్రుఁడు ప్రభుత్వకోపమును వెలువరించుచు, లోకమును కట్టుబాటుగా నున్న మార్గమును అసహాయోద్యమము నాశనము చేయుననియు, అది యొకరికి విరోధమును, వ్యతిరేకతను, విభేదమును గలిగించు ననియు, ఆ పదము యొక్క భావమే (ధ్వనియే) తనకు నచ్చుటలేదనియు, దన యభిప్రాయము వెల్లడించెను. అందులకు మహాత్ముఁ డిచ్చిన సమాధానములోఁ గొంతది భాగము నిట నుదాహరించుచుంటిని.

"......యుద్ధము జరుగు సమయమందు గాయకుఁడు తన వీణెను, శాసన నిర్మాత తన శాసన నివేదికలను, బడిపిల్లలు తమ పుస్తకములను దూరమునఁ బెట్టుదురు. యుద్ధము ముగియఁగానే గాయకుఁడు తన వీణెను జేతఁ బట్టుకొని మీటుచు పాటలు పాడుకొనుచుండును. ప్రజలలో కలహములు జరుగుచుండునప్పుడు న్యాయమూర్తికి న్యాయ శాస్త్ర గ్రంథము తెఱచు నావశ్యకత కలుగును. ఇల్లు తగులఁబడుచున్నప్పుడు అగ్నిని జల్లార్చుట కచటికిఁ జేరినవారెల్లరు కుండలతో నీరు గ్రుమ్మరింతురు. నన్ను నమ్మియున్న ప్రజలు తిండిలేక చచ్చుచున్నప్పుడు, ఆఁకలిబాధ చల్లారుటకు అన్నము పెట్టుట నా ధర్మము. భారతదేశము అగ్ని కాహుతియైన గృహమువలె నున్నది. భారతదేశము తన యాత్మశక్తితోఁ బయిఁకు లెత్తుచు వచ్చుచున్నది. భారతప్రజలు, ఆహారము ధనము పొందఁదగిన పనులు లేక బాధపడుచుండిరి......భారతదేశము నానాఁటికి దారిద్ర్య పిశాచముచేఁ బీడింపఁబడుచున్నదని నా యనుభవము వలనఁ దెలిసికొనిన యథార్థము. భారతమాత రక్తప్రవాహము ఇంచుమించుగా నడుగు లోతున, మోకాలిబంటి ప్రవహించుచున్నది. మనము ఆమెమీఁద దయ చూపకపోవుదుమేని ఆమె చనిపోవఁగలదు."

"......విశ్వకవి 'శాంతితోనుండుఁడని మధురగీతము పాడుచుండుట మెచ్చఁదగినది కాదు. యుద్ధము ప్రారంభమయ్యెను. వారు వీణెను గ్రిందఁ బెట్టి యుద్ధమునకు సిద్ధమగుదురుగాక! తరువాతఁ బాడుకోవచ్చును."

"విశ్వకవి 'తేపటికి' అను పాటను బాడుదురు; అట్లే మననుగూడ నడచుకొనుఁడని యందురు. ఇది విశ్వకవికిఁ

ప్రకృతిసిద్ధ సంపద యనుట తథ్యము. క్షణకాలము ఆకాశ గంగతో ననుకరించు మధురగీతములు పాడుకొనునప్పుడు అందమైన గంగాలహరియం దీఁదులాడు హంసల దృశ్యము మన కన్నులకుఁ గట్టినట్లు వారు (పాటలలో) లాహిరియగుచుందురు. ఆ గంగాలహరియందు విహరించు హంసలు ప్రతిదినము చక్కఁగాఁ దామరతూండ్లు ఆహారము గైకొని, క్రిందటి రాత్రి గలిగిన నరముల బలహీనతను బోఁగొట్టుకొని క్రొత్త శక్తిని జేకూర్చుకొని పటుతర పక్షములతో నెగురుచుండును. అయితే, యీ గీతములకు ఱెక్కలు కదలింప శక్తి లేని పక్షులను జూచువాఁడను నేను. భారతదేశమను నాకాశ గంగ యందు మానవులుఅను పక్షులువిహరించు నెడల పరమానందము గలుగును. కోట్లకొలఁది ప్రజలు పేదతనముచే (ఆఁకలి పిశాచముచే) పోయిన శక్తిని సంపాదించుకొనలేక, ఆహారము లేక అలమటించుచుండిరి. ఆఁకలి పిశాచముచే నలమటించువారిని కబీరుదాసైనను దన పాటచేఁ దృప్తిపఱుపఁగలఁడా యని సందేహము పొడముచున్నది. అట్లు తృప్తి కనఁబఱుపఁ గలుగుట యపూర్వముగదా! ఆఁకలిచే నలమటించు కోట్లకొలఁది భారతీయులు ఒక పాటనుమాత్రము పాడఁగోరు చుంటిని. సత్య మనునదియే యీ పాట."

### మహాత్ముఁడు — ప్రకృతి కవి

ఈ సమాధానమును బరిశీలించి చూచినచో, గాంధి మహాత్ముఁడు సహజకవి యని బోధపడుచున్నది. విశ్వకవి ఠాగూరు ప్రకృతి సౌందర్యమును గాంచి ముగ్ధుఁడగుచు వాని యందము నుపలక్షించి అనిర్వచనీయమైన కవితారీతులతో మధురాతి మధురముగాఁ దియ్యని గీతములు వ్రాయుదురు.

మహాత్ముఁడో పక్షులహృదయ మెఱిఁగి వాని స్థితిని గాంచఁ గలఁడు. ఈ యిద్దరియందె వరు సహజ కవులు? ఆనందాతిరేకమునఁ గవిత్వము జాల్వారును. పంచేంద్రియ పారవశ్యమున సంతోష ముదయించును. పంచేంద్రియ పారవశ్యము కామ్యభోగానుభవమున సిద్ధించును. కామ్యభోగములు కలవానికిఁ సిద్ధించును. కాని; తిండిలేక యలమటించు పేద లెట్లు సంతోష పడుదురు? ఆ పేదలనోట పాటయా పాడునది? వీణయా మీటునది? ప్రజల సంతోషమే శ్రావ్య సంగీతమగును. ఆఁకలి పిశాచముచే, ఉపవాస రాక్షసముచే సంతోషము నశించుచుండ నింక నెట్లు ప్రజలు పాడఁగలుగుదురు? పాటయు నశించిపోవుచుండదా! ఆ పాటలోని సౌందర్య మెవరికిఁ దెలియును? ప్రకృతితోఁగూడి జీవితము గడుపుకొనుచు, ప్రకృతి తత్త్వము గ్రహించు ప్రకృతి సిద్ధులకుఁ గవితా సౌందర్యముతో నేమిపని? సంగీత సారస్యముతో నేమిలాభము? ప్రకృతి తత్త్వము బోధపడుటకే మహాత్ములు ప్రయత్నింతురు. ప్రజలు సహానశక్తి తిరిగి పొందుటకై ఆఁకలి పిశాచమును పాఱఁద్రోలునట్టి రాట్నమను వీణను మీటుచుఁ బాడుకొనుచుండినయెడల నా గీతా మాధుర్యము భారత భూమిని పరవశము గావించునుగదా! అట్టి రాట్నపు పాటలోని మాధుర్యమును దెలియఁజెప్పఁ గలవారెవరు? అయ్యది యనుభవైకవేద్యమేగదా! అట్టి రాట్నములపాట సొగసును గాంచి యానందించువాఁడు మన మహాత్ముఁడు. విశ్వకవి ఠాగూరు నరముల వీణను చేత ధరించి పాడి పాడి యలయుచుందురు. మన మహాత్ముఁడు రాట్నమను వీణను దీసికొని త్రిప్పుచు శ్రవణపేయ రాగాలాపములను విని విని యానందించు

పరవశుఁడగుచుండును ప్రకృతి దైవస్వరూపులగు ప్రజలు ఆఁకలిచేఁ గృశించి మెలిదిరిగి యల్లాడుచుండుటకుఁ గారణమగు ప్రభుత్వమునకుఁ దోడగుట జ్ఞానమగునా? ప్రేమ యగునా? అట్లు ప్రజల యాఁకలి బాధలను బాపుటకుఁ బ్రకృతి మార్గానుసారి యేమి చేయవలెను? ప్రకృతి సహజమగు అసహాయ యోగ మనెడు న్యాయము చేతనే యాఁకలిబాధలు పాయును. ఆ యసహాయ యోగమున కట్టి శక్తి యుక్తులు ప్రకృతి తత్త్వమే కూడఁబెట్టును. అందుచే, గాంధి మహాత్ముఁడు ప్రారంభించిన యసహాయోద్యమము శరీరాదికములను పాడు చేయునదియుఁ గాదు, ప్రకృతి తత్త్వమునకు విరోధ మయి నదియుఁ గాదు.

## సత్యాగ్రహ వ్రతము

ఇట్టి జ్ఞానప్రదమగు అసహాయోద్యమమను యుద్ధ పద్ధతికి దేశము నాయత్తము చేయు సమయమందు గాంధిమహాత్ముఁడు పంజాబు హత్యా దురంతములు మఱచిపోలేదు. ప్రతి సంవత్సరము పంజాబు హత్యా దురంతములు నిరసించుటకై ఏప్రిల్ ఆఱవ దినము మొదలుకొని పదుమూఁడవ దినమువఱకు సత్యాగ్రహ వారమును భారతీయులు జరుపుటకు మహాత్ముఁడాదేశించెను. సత్యాగ్రహ వారముగాఁ బరిగణించి దేశమును బవిత్రీకరించుటకు మన పూజ్య బాపూజీ మనకొక చక్కని రాచబాటను జూపెను. మన మహాత్ముఁడు భారతీయులు సత్యాగ్రహ జీవితముఁ గలవారై యలరారుచుండవలయునని దయతో ననుగ్రహించుచుఁ, బ్రబోధించు చుండెను. మహాత్ముఁడు సత్యాగ్రహ వారమును గుఱించి వెలువరించిన యభి

ప్రాయములను జనవరులకు విజ్ఞాన ప్రపదములని యిటనుటంకించి తెల్పుచుంటిని.

(10—3—1920)

"రౌలటు చట్టమను క్రూరశాసనము పుట్టిన దినము ఏప్రిల్ ఆఱవ దినము. ఏప్రిల్ పదుమూఁడవ దినమున భయంకరమగు హత్యలు జరిగినదియు, హిందూ మున్లిముల రక్తము ఏఱులై పాఱినదియు, గ్రహించి యెల్లరు ఐకమత్యముగా నుండుటకై ప్రమాణము చేయుటకు నిర్ణయింపఁ బడిన దినము."

"ఈరెండు సంఘటలను ఎట్లు సంస్మరించుట? అందు ఏప్రిలు ఆఱవ దినమున నిరువది నాలుగు గంటల కాలము ఉపవాసముండి సాయంకాలము ఏడు గంటలకు ప్రతి గ్రామమందును సభలుజరిపి, రౌలటు చట్టమున్నంత వఱకు దేశమందు శాంతి యేర్పడుట యసంభవమనియు, ఆ చట్టము రద్దుపఱచవలెననియు, తీర్మానములు చేయవలెను. రౌలటు చట్టము శాసనమైనను – ఆ చట్టము రద్దుపఱచి తీరవలయును."

"ఈవారమంతయు అనఁగా పదుమూఁడవ దినము వఱకు 'జలియన్‌వాలాబాగు'ను సంస్మరించుటకై ధనము (నిధిని) ప్రోగుచేయవలెను. ఇది పన్రెండవ దినము లోపల పూర్తి చేయవలెను."

"పదుమూఁడవ దినము – అన్ని దినములకంటె శ్రేష్ఠమైన దినము. ఆనాఁడు వ్రతములచేతను జపములచేతను గడుపవలెను. ఆనాఁడు ప్రజలు తమ మనస్సులందు విరోధము, కోపము కలుగనీయరాదు. ఆ దినమున, ప్రాణత్యాగము కావించి పవి

త్రుత్రులైన మన వీరులను సంస్మరించుచు శాంతిని గోరవలెను. ఆనాఁడు, జరిగిన హత్యాకార్యములను దలఁపరాదు. ఆ దినము త్యాగమునకు సిద్ధమగుటయే కాని విరోధము చూపి ప్రతిక్రియ చేయునట్టి యెట్టి యేర్పాటు చేయరాదు. ఆనాఁడు సభలు జరిపి పంజాబు హత్యాకురంతముల వంటివి యిఁకమీఁద సంభవింపకుండునట్లు నడుచుకొనుటకు భారత ప్రభుత్వమును, సార్వభౌమునిని ప్రార్థింపవలెను"

"హిందూ – ముస్లిముల యైకమత్యము స్థిరపఱచుట కొఱకు – అభివృద్ధిపఱచుట కొఱకు ఏప్రిల్ పంద్రెండవ దినము శుక్రవారము సాయంకాలము ఏడు గంటలకు నిరు తెగలవారును గలిసి సభలు జరిపి మహమ్మదీయుల కోరిక ననుసరించి ఖిలాపత్తునకు న్యాయము కలిగించుటకై ప్రార్థనలు చేయవలసినదిగాఁ గోరుచున్నాను."

"ఇట్లు సత్యాగ్రహ వారము పరిశుద్ధతకు, ఆత్మ పరిశోధనకు, త్యాగమునకు, సంపూర్ణ స్వాతంత్ర్యమునకు, దేశ గౌరవమునకుఁ దగిన వారమని గ్రహింపవలయును. విరోధము, ద్వేషము మొదలగునవి యే మాత్రము పొడచూపనీయరాదు. అయితే, ధైర్యస్థైర్యములు మూర్తీభవించి యుండవలెను.

(23—3—1921)

"ఏప్రిలు ఆఱు – పదుమూఁడును రాఁబోవుచున్నవి.

ఏప్రిల్ ఆఱవ దినము :— ప్రభుత్వము, భారత దేశమును రౌలటు చట్టము మూలమున నవమాన పఱచిన దినము.

పదుమూఁడవ దినము:—ఘోర హత్యల ననుభవించిన దినము.

ఈ రెండు దినములను గత సంవత్సరము భారత దేశము నిరసన, ప్రశంసలుచేసి యుండెను. మన భారతీయుల రక్తము చిందిన ప్రదేశమును విలుచుటకై నిధిని ప్రోగుచేయుటయందు గత సంవత్సరము శ్రద్ధ వహించి యుంటిమి. తరువాత ఖిలాఫత్తునందు మఱియొక విషాద సంఘటన జరిగెను. ఇప్పుడు ఖిలాఫత్తునకుఁ పంజాబునకును న్యాయము కలుగుటకును, స్వారాజ్యము సంపాదించుటకును దేశము సంసిద్ధమయ్యెను. డిసెంబరులో జరిగిన జాతీయ మహాసభ యొక సంవత్సరము లోపల స్వారాజ్యము రావలెన"ని తీర్మానించి యున్నది......(ఈపద్ధతి) ఆఱు నియమములు మన మెల్లరము పాలింపవలయును.

(౧) మనలను మనము జాగ్రత్త పఱచుకొనునట్టి దిట్టతనము కలిగియుండవలెను; శాంతము, వినయము, దయ గలిగియుండ వలెను. మనము, ఇతరులను ప్రేమతోఁ జూడవలయును. మన మాటలచే నితరులకు కోపము కలిగిన యెడల వెంటనే వారిని క్షమాపణ వేఁడుకొనవలయును.

(౨) మనమింకను మనస్సులను మిక్కిలి పరిశుద్ధముచేసి కొనవలయును. హిందూ – ముస్లిములమైన మనము, ఒకరి నొకరనుమానించుకొనరాదు. మనలో మనము, ఒకరి నొకరు నిందించుకొనరాదనియు, అనుమానింపరాదనియు దృఢము సంకల్పము కలిగియుండవలెను.

(3) హిందువులమైన మనము, మనకంటె పవిత్రతలేని వాఁడు, లేక తక్కువవాఁడు, లేక తఱుగువాఁడని యెవరినిగూడ

భావింపరాదు. మన సోదరులను అస్పృశ్యులని తలఁచుట పాప మని తలపవలెను.

ఈ మూఁడు నియమములు ఆత్మశుద్ధికి మూలములు. వీని ప్రయోజనము మన దైనందిన జీవితమందుఁ జూడఁ గలము.

(౪) త్రాగుడు మాన్పుటకు ఎల్లరును ఈ వారమందు 'పికెటింగు' చేయవలెను....... దేనికి మూర్ఖత చూపరాదు. స్థిరమైన సత్ప్రవృత్తితోఁ జేయు కార్యము ఫలించును.

(౫) ఇంటింటను రాట్నముతో నూలు వడుకుటను, ఖద్దరు నేయుటను, ధరించుటను, విదేశ వస్త్రములను బహిష్క-రించుటను చేయవలెను.

(౬) నిర్విరామముగా లోకమాన్యుని స్వరాజ్య నిధికి ధనమును సేకరింపవలెను.

విరోధమును ప్రేమచే జయించుట

ప్రియ పాఠక సోదరులారా! గాంధిమహాత్ముఁడు సత్యాగ్రహ ధర్మమును బోధించుటకు, ఆచరింపఁ జేయుటకు నే యే పద్ధతు లవలంబించి దేశమును సమాయత్తము చేయుట కెట్లు ప్రత్యహము పాటుపడుచుండెనో గ్రహింపుఁడు; గ్రహించి యట్లు నడుచుకొనుటకు నిశ్చయించు కొనుఁడు. మానవ జన్మ మెత్తిన మనము మన జీవితమందుఁ బడయఁ దగినదేమి? సత్యాగ్రహమే కదా! ఆ సత్య మెఱిఁగిన కొందఱు తాము మాత్రము తద్ధర్మాను సారము నడచుకొనుచుండిరి. మన మహాత్ముఁడో, యీసత్యా గ్రహమును నెల్లరు నాచరింపవలయునని పలువిధములఁ బ్రచారము

చేయుచుండెను; ఆశ్రమరూపమున, రాజ్యాంగరూపమున, ప్రభుత్వమునకు, రైతులకు మధ్యగల వివాదములను బరిష్కరించు రూపమున సత్యాగ్రహ ధర్మమును మన జాతిపిత ప్రచారము చేయుచుండెను. పంజాబు హత్యాదురంతములు జరిగినప్పుడు భారతీయుల హృదయమెట్లు పరవళ్ళు త్రొక్కెను? విరోధము, ద్వేషము, హత్యకుఁ బ్రతి హత్యచేయు సంకల్పమును గలిగి ప్రతిక్రియ చేయుటకై భారతీయుల హృదయములు పఱుగులు వాఱదా? అట్టి దుస్సంఘటన జరుగనీయక 'సత్యమేవజయతే' 'ధర్మమేవజయతే' యను వాక్యములతో భారతీయులను మహాత్ముఁడు శాంతపఱచెను. పంజాబు హత్యావారము సత్యాగ్రహ వారముగా మార్చిన మహాత్ముని ధర్మసూక్ష్మతను, స్థితప్రజ్ఞను మాటలు చాలని మనమెట్లు ప్రశంసింపఁగలము? ప్రజలయెడఁగల దయాబుద్ధితో నేఁటి భారతావని నుద్ధరింప నవతరించిన మహాత్ముఁడు మన మోహనదాసు కరమ్‌చందు గాంధి. విరోధభావములు పొంగులువాఱుచు మిన్నంటుచున్న భారత హృదయములు ద్వేషాగ్నితో భూమ్యాకాశములును దగ్ధము చేయువలయు నావేశమగు దినమును, పరవళ్ళు త్రొక్కి యుప్పొంగు ప్రేమ తొణికిసలాడు దినముగా మార్చి శాంతిని సమకూర్చుట యేయుగమందైనను గలదా? ఏచరిత్రయందైనఁ జదివితిమా? కనరాని, వినరాని, తలఁపరాని మహాత్ముని మహిమాతిశయ మాదిశేషువు సహితు మెట్లు చెప్పఁగలఁడు? అట్లు దురాగ్రహ దినమును, సత్యాగ్రహ దినముగాఁ బరిణమింపఁజేయుట తప్పుచేసిన ప్రభుత్వమును బవిత్రీకరించుటకాదా! దెబ్బకు దెబ్బతీయుటకు అనఁగాఁ బ్రతిక్రియ చేయుటకు దేశమాయుత్తమగుచో ప్రభుత్వమేమి చేసెడిది?

ఇంకేమిచేయును? తన యాయుధబలము ప్రయోగించి భారత దేశమును నిర్మానుష్యము గావించుటఁ బ్రయత్నించెడిదేమో! ఇరుపక్షములవారు గట్టుతెగిన నదీప్రవాహమువలెఁ జిందఱ వందఱ అయ్యెడివారు. అట్లు ఇరుపక్షములందును దురాగ్రహ శక్తి వికటాట్టహాసముతో వీరవిహారము జరుగకుండ నరికట్టఁ గల మహిమము మన మహాత్మునికే కలదు. అట్లు సత్యాగ్రహ ధర్మముచే పాలకులను పాలితులను సన్మార్గమునఁ బాలించిన మహాదేవుఁడు మన మహాత్ముఁడుండఁగా లోకమందెట్లు దురాగ్రహము తలయెత్తఁగలదు? ప్రభుత్వముతోఁ గావించు పోరాటములో సత్యాగ్రహమును బ్రవేశపెట్టిన మొదటి మహాత్ముఁడు మన గాంధియే. అట్లు, సత్యాగ్రహ ధర్మపథమునఁ దనను నితరులను బవిత్ర హృదయముగల వారినిగాఁ బవిత్రీకరించునట్టి మహాత్ముని జీవితమే మహాభాగ్య జీవితము. మహాత్ముని జీవితము మానవ జీవితమునకుఁ బరమలక్ష్యమైనదని చెప్పుచున్నను తనివితీఱకున్నది. ఎట్లు తనివితీఱును? అమృతము గ్రోలువానికిఁ దనివితీఱునా?

దౌర్జన్యము రూపు మాపుచేయుట

సహాయ నిరాకరణోద్యమముచే మానవ జీవితమునకు సార్థక్యము కలిగించు త్యాగము, శాంతి, సత్యము, ధైర్యము, అహింస, మొదలగు గుణములను ప్రపంచ మానవాభ్యుదయము నభిలషించి మహాత్ముఁడు ప్రసాదించెను. పాంచాలమందుఁ బ్రవేశింపరాదని ప్రభుత్వముచే మహాత్ముఁడు నిరాకరింపఁబడి నప్పుడు భారతమందుఁ బలుతావుల దురాగ్రహము పొడచూపెను. అట్టి పరిస్థితిని మహాత్ముఁ డెఱిఁగి వెంటనే సహాయ

నిరాకరణోద్యమమూలముగా సమసింపఁ జేసిన దిట్టతనము నేమని పొగడఁగలము? మానవ జీవితాభ్యుదయమునకుఁ దగిన శక్తియుక్తులన్ను అసహాయయోగ పూర్వకముగా నియమ బద్ధము గావించి సత్యాగ్రహ ధర్మపథమునందు భారత దేశమును నిలుపఁ గలుగుట జగదాశ్చర్యకరము! సహజముగా దార్ఢ్యపూరితమగు హృదయముగల దేశీయులు సత్యాగ్రహమందు నభిమానము గలవారై అహమహమికతోఁ జెఱసాలలందుఁ బ్రవేశించుట లోకప్రసిద్ధము. అసహాయయోగ యుద్ధ ఫలితముగాఁ బ్రభుత్వమువారు మహాత్ముఁడు నిర్బంధింపఁబడి నప్పుడును, శ్రీకృష్ణ జన్మస్థాన మలంకరింపఁబోవునప్పుడును దేశమందు దార్ఢ్యము పొడచూపెనా? 'గాంధి మహాత్ముని ప్రభుత్వమువారు పట్టుకొనిరి' అను వార్త వ్రాఁకగానే కన్ను లెఱ్ఱజేసిన దేశము, 'గాంధి మహాత్ముని బట్టుకొనిరి. చెఱసాలయందుఁ బెట్టిరి' యను వార్త చెవి కెక్కినప్పుడు అల లణఁగిన మహాంబుధివలె గంభీర శాంతిముద్ర గలిగియుండుటకుఁ గారణ మేమి? 'గాంధిమహాత్ముఁడు శ్రీకృష్ణ జన్మస్థాన మలంకరించు చున్నాఁడ'ను వార్త వ్రాఁకినప్పుడును, తాను నిర్బంధింపఁబడి నప్పుడును, న్యాయస్థానమందు నిలువఁబడి యున్నప్పుడును, శ్రీకృష్ణ జన్మస్థాన మలంకరింపఁబోవునప్పుడును గాంధి మహాత్ముఁడు దేశీయులకు నుపదేశించిన యుపదేశములు సువర్ణ పత్రములందు మాణిక్యములచే వ్రాసి పూజింపఁదగినవి.

"ప్రభుత్వమువారి చేష్టలవలన నెత్తుటేఱులు ప్రవహించినను నేను భయమందుట లేదు. ఆ సంఘటన ప్రజలచే నా కోఱకు లేక నా పేరుతోఁ జేయఁబడినయెడల, అప్పు డది బాధపడఁదగిన విషయ మగును. నన్ను ఖైదుచేయుట గుఱించి

ప్రజలు తమ తమ నెలవులు తప్పుట యవమానకరము. నా మీఁద ప్రేమ చూపుటవలన దేశము పూర్ణోన్నత్యము పొందఁజాలదు. నేను జూపిన ధర్మమార్గ మెఱిఁగి ప్రవర్తించిన యెడల దేశము పూర్ణోన్నత్యము పొందఁగలదు. కావున, భారతీయులు శాంతమనస్కులై యుండవలెననియు నేను 'బందీ'యైన దినము సంతోషింపఁదగిన పెద్ద పండుగ దినముగా భావింపవలెననియును నా యభిలాష."

"నన్ను ఖైదు చేయుటలో ప్రభుత్వము వారి యుద్దేశ్య మేమి? ప్రభుత్వమువారు నాకే మాత్రము విరోధులుకారు. ప్రభుత్వమందు లవలేశమేని నాకుఁ గోపములేదు. ఈ యుద్యమమునకు నేను ముఖ్యుఁడ ననియు, ప్రజలనుండి నన్ను వేఱు చేసినయెడల పాలితులు పాలకులయెడ గౌరవభావముతో మెలఁగఁ గలరనియు, ప్రజలు గ్రుడ్డితనముగా నన్ననుసరించుచుండి రనియు, ప్రభుత్వము నమ్ముచున్నది. ప్రజల మనస్సును ప్రభుత్వ మెట్లు తెలిసికొనఁగలదు? నన్ను ఖైదుచేసి చూచుటకంటె వేఱు మార్గము లేదు. ..........ప్రభుత్వము తన తప్పులను దెలిసికొనదు. తెలిసికొనినను ఒప్పుకొనదు. అందుచే ప్రజల యైకమత్యము విచ్ఛిన్నముచేసి చూచు మార్గ మొక్కటియే ప్రభుత్వమువారికిఁ గలదు. అందులకుఁ దగిన మార్గము నన్ను ఖైదు చేయుటయే. ప్రజలు భయవిహ్వలులై హత్యా దురంతాది యకృత్యములకుఁ గడంగినచో పంజాబు హత్యా దురంతములు, ఖిలాఫతు అన్యాయము వంటివి కలుగఁ గలవు. ప్రజలు దౌర్జన్యమునకుఁ గడంగుటవలన ప్రభుత్వమునకు సాయము చేయుట యగును."

అని ప్రారంభించి, మర్యాదను గాపాడవలెననియు, హార్తాళ్—గుంపులుగాఁ జేయుట మొదలగునవి వలదనియు, సహాయ నిరాకరణోద్యమ నియమములు పాటించుచు, కాఁపెగిస పనులను జేయవలెననియు, మహాత్ముఁడు స్పష్టపఱచెను. వేఱొకసారి యీ విషయమును గూర్చి మహాత్ముఁడు వ్రాయుచు పై జెప్పిన విషయము నే స్పష్టపఱచుచు నీ క్రిందివిధముగా ముగించెను.

"మొదటిది:— నన్ను సంకల్పసిద్ధుఁడని నమ్మునట్టి మూఢ విశ్వాసములను బాఱద్రోలుఁడు.

రెండవది:— నా మాటలకు ప్రజలు సహాయనిరాకరణోద్యమందుఁ గృతనిశ్చయులై ఐక్యమత్యముతో నున్నారనియు, నేను లేకపోయినచో నుద్యమము ఐక్యమత్యమును వ్యర్థమగుననియుఁ గొందఱు నమ్ముట సత్యదూరమని నమ్ముఁడు.

మూఁడవది:— దిట్టయగు నాయకుఁడు లేకపోయినను, దిట్టగా నడుపఁగలశక్తి దేశీయులకుఁ గలదని తెలియఁజఱచుట మనముస్వరాజ్యమున కర్హులమనుటను నిశ్చయపఱచును

నాలుగవది:— ప్రభుత్వము నన్నేమి చేసినను చేయుఁగాక! మీరు మాత్రము శాంతముగా నుండుఁడు."

### శాసనము—న్యాయము

న్యాయస్థానమందు న్యాయాధిపతి "మీరు నేరస్థులా" యని యడిగినప్పుడు, మహాత్ముఁడు 'నేను నేరస్థుఁడను' అని యొప్పుకొని న్యాయాధిపతి కోరినతీఱున మహాత్ముఁ డచట ప్రకటించిన నివేదిక సారాంశము నిట్లు,—

"ఇదివఱకుండిన ప్రభుత్వముమీఁదఁ బ్రేమపూర్వకముగా సహకారిగానుండి, యిప్పుడు ఆ ప్రభుత్వముమీఁద ప్రేమ లేని యసహాయోగకారిగా మాఱుటకేమి కారణమో స్పష్టము చేయుట నా ధర్మము. నా రాజకీయ జీవితము 1893-లో దక్షిణ - ఆఫ్రికా యందు ప్రారంభమయ్యెను. భారతీయులు స్వాతంత్ర్యములేని స్థితిని మొట్టమొదట దక్షిణా-ఆఫ్రికాలోఁ దెలిసికొంటిని. అందుచే, మొదట ప్రభుత్వ విధానమును ఖండించుచు, రాజ్యాంగమునకు నావలనఁ గాఁదగిన సహాయమును జేయుచువచ్చితిని. బోయరుయుద్ధము-జులూయుద్ధము జరుగు సమయములందుఁ జేతనైనంతవఱకు సహాయము చేసితిని. 'కైజరుహింద్' పతకముగూడ నాకొసఁగఁబడెను. మానవ స్వాతంత్ర్యమును నాశముచేయునట్టి రౌలటుచట్టము, పంజాబు హత్యాదురంతములు, ఖిలాఫత్తునకు న్యాయము కలుగకుండుటయు, నా మనస్సును మార్చినవి. ఆయుధములులేని భారత దేశము తన బాధలనుండి తనను గాపాడుకొనలేని స్థితియందుండుటయు, పేదదియగు భారతదేశము తన ఆఁకలి బాధల నుండి తనను సంరక్షించుకొనలేని స్థితియు, సత్యాతిసత్యము. ఆంగ్ల పరిపాలన రాకపూర్వము భారతదేశము నేఁతయందును వ్యవసాయమునందును మిక్కిలి పెంపుగలిగి యుండెడిది. ఇప్పుడు భారతదేశమందుఁగల పేదప్రజలు ఎట్లు ఉపవాసములతో మలమలమాడి జీవితములను బోఁగొట్టుకొనుచుండిరో పట్టణవాసులకుఁ దెలియకున్నది. పట్టణవాసులు విదేశ వ్యాపారమునకు సహాయపడుటవలన పల్లెప్రజల రక్తము పిండఁబడుచుండెను. ఈ వ్యాపారమునకు ప్రభుత్వ విధానము అడ్డుపెట్టుట లేదు. భగవంతుఁడను వాఁడొకఁడుండిన యెడల నాంగ్లదేశము, భారతదేశమందలి పట్టణవాసులును జేయుచుండిన జీవకారు

ణ్యము లేని యీ చేతలకు శిక్షలు చెప్పియుండెడివాడు. చట్టములు విదేశవ్యాపారమునకు సహాయపడుచున్నవి. న్యాయమో నూటికి తొంబదిమందికి కలుగుట లేదు. నేను, ఈ చెప్పిన కుట్రకు అంతమును ఆంగ్ల-భారత ఉద్యోగస్థులు తెలిసికొనుట లేదు. నామీఁద మోపఁబడిన 124 ఎ చట్టము రాజ్యాంగమందలి చట్టములలో రాజువంటిది. ప్రేమయనునది చేతితోఁ జేయఁబడునది కాదు; చట్టముతోఁ బోషింపఁబడునది కాదు. ఒకని యొద్దనో, యొకచోటనో మఱియొకతీరునో వేఱొకనికి స్నేహము లేనప్పుడు, ఆతఁడు విరోధము, కోపము, మొదలగువాని కాహుతిగాని స్థితిలో నున్నంతవఱకు ఆతఁడు తన స్నేహసంపత్తిని సాధారణముగా బయటపెట్టు స్వాతంత్ర్యము పొందియుండవలెను. (రాజ్యాంగముమీఁద) స్నేహసంపత్తిని వెలువరించని కారణముగా నేను శ్రీ బ్యాంకరుగారును కుట్రమోపఁబడి యున్నాము. ఈ చట్టము ననుసరించి భారతదేశ భక్తులు కొందఱింకను దండింపఁబడుదురని నాకుఁ దెలియును. వ్యక్తిగతముగా నే యధికారిమీఁదగాని, రాజ్యాధిపతిమీఁదగాని నాకు ద్వేషము (విరోధము) లేదు. వెనుకటి రాజ్యాంగ విధానమునకంటె ఇప్పుడు భారతదేశమునకు నష్టము హెచ్చు అగుసట్టి యిప్పటి ప్రభుత్వ విధానముమీఁద ప్రేమలేకుండుటను జూపుట సన్మార్గమని నా యభిప్రాయము. ఆంగ్ల పరిపాలనవలన భారతదేశము యొక్క ఆత్మగౌరవము నశించిపోయినది. ఇతర కారణము లేవైనను ఈ ప్రభుత్వముమీఁదఁ బ్రేమచూపుట పాపమని తలఁచుచున్నాను. సహాయ నిరాకరణోద్యమము వలన భారతదేశమునకు – ఆంగ్లదేశమునకు సేవచేసిన వాఁడనగుచున్నాను. అవమానముతో బ్రతుకుటకంటె గౌరవముతో మరణించుట మేలని నా నిశ్చయము. పూర్వకాలములందు

హింసాపూర్వకముగా సహాయనిరాకరణ చేయఁబడుచుండెడిది. నేను, హింసామార్గపద్ధతితో సహాయనిరాకరణ చేయుటవలన ఎక్కువహాని కలుగునని, చెడుగుతో సహాయపడనట్టి యొక ప్రేమ ధర్మమును దెలిసికొంటిని. నా ధర్మమును నేను నిర్వర్తించితిని. చట్టములో, నేను చేసినపని నేరమని యుండినచో చట్టమునుబట్టి నాకుఁ గఠినశిక్ష విధింపవచ్చును. న్యాయాధిపతిగా తమరు ఇచట నిశ్చయించుకొనఁదగిన దొకటికలదు. నేను మన స్సాక్షిగా కర్తవ్యమును నిర్వర్తించింతినని తమకుఁ దోఁచిన యెడలఁ దమరు ఈ యుద్యోగమును విడచిపెట్టి కష్టమునుండి తప్పుకొనవలెను. ప్రభుత్వమునకు సహకరించు చట్టము మంచి దని తమకుఁదోఁచిన యెడల నన్ను దండింపవలెను. ఈ రెండింటి యందొకటి చేయుఁడు."

ఈ మాటలు వినిన న్యాయాధిపతి,

"చట్టము మానవునకుఁ దగిన మేలును గలిగించును. నాకు ఇంతకుముందుఁ, దమబోటివారు విచారణకు వచ్చినది లేదు; ఇఁకమీఁదఁగూడ వచ్చునదియు లేదు. దేశమందలి కోట్లకొలఁది ప్రజలు తమను గొప్ప దేశభక్తులునుగాను - మహానాయకులు గాను భావించుచుండుట మఱువరానిది. ప్రభుత్వధర్మమందు తమతో వ్యతిరేకించువారును దమను మహాశయ సంపన్ను లనియు, గొప్పవారనియు, మహాత్ములనియుఁ దలఁచుచుందురు. ఇచట నేనొక విషయముమీఁదనే అభిప్రాయమును బోనిచ్చు చున్నాను. అసఁగాఁ దమను శాసనబద్ధులనుగా భావించుట. చట్టమునకు వ్యతిరేకించి నడచికొనినట్లు తమరే యొప్పుకొం టిరి. ఒక్కొక్క నేరమునకు రెండు రెండు సంవత్సరములుగా ఆఱుసంవత్సరములు కఠినశిక్షను విధించుచున్నాను. పరిస్థితి

మాత్రి నేఁటి కాలావధులకుఁ 'దమగు విడుదలఁ బొందఁగలిగి నప్పుడు నాకంటె సంతోషించువా రితరులుండరు".

ఆ న్యాయాధిపతి, చట్టము ననుసరించి తీర్పు చెప్పి యుండెనే కాని గాంధిమహాత్ముని సేవాధర్మమును సుంతేనియు సందేహింపలేదు. మహాత్ముఁడు ఆ న్యాయాధిపతికిఁ జెప్పినట్లు శాసనలక్ష్యము తెలిసికొని తన యుద్యోగమును 'రాజీనామా' నీయకుండుటవలన నాతనికి సత్యాగ్రహ ధర్మమును బోధించుట నిష్ఫలమే కావచ్చును. అయినను, న్యాయాధిపతి ప్రసంగమును బట్టి సత్యాగ్రహ రహస్యధర్మమును దెలిసికొనెనని బోధపడఁ గలదు. న్యాయాధిపతి జీవిత మాదర్శమైనదని గాంధిమహాత్మ నివేదికవలనఁ దెలియుచున్నది.

## శాసన మార్గము

ప్రకృతి సహజమగు నాదర్శమగు మహాజీవితము గల మహాత్ముఁడు చట్టము మీఱుట ధర్మమా యని చులకనగాఁ గొందఱు పలుకువారును గలరు. శాసనధర్మమనఁగా మానవ జీవిత స్వాతంత్ర్య ధర్మము సంరక్షించు పద్ధతులలో నొకటి గదా! అట్టిచోఁ దొలుదొల్తగా ఆదర్శధర్మమేది? శాసన ధర్మమన నేమో నిర్ణయింపవలెను. న్యాయరక్షణము లేని శాసనములవలనఁ బ్రజాస్వాతంత్ర్యమునకు భంగము వాటిల్లును. అందువలనఁ గ్రమక్రమముగాఁ బ్రజలయందు, విరోధము, ద్వేషము, అసూయ, అసహనము మొదలగు దుర్గుణములు తలచూపును. అట్టియెడ సత్యాగ్రహ సమరము ప్రారంభింపక తప్పదని యింతకుముందుఁ జదువుకొంటిమి. గాంధిమహాత్ముఁడు దక్షిణాఫ్రికాయందును, ఇతరస్థలములందును సత్యాగ్రహ

యుద్ధము ప్రారంభించుటకు ముందు విన్నపము లెన్నియో ప్రభుత్వమునకుఁ గావింపఁబడెను. పలుపర్యాయము లాంగ్ల దేశమునకుఁ బోయి తమ కష్టములు విన్నవింపఁబడెను. మహాత్ముఁడు, 'మాంటేగుచేమ్సుఫర్డు' అను సంఘము నెదుట సాక్ష్యమిచ్చుటయు, బొంబాయి ఢిల్లీ నగరములందు ఐరోపా యుద్ధమును గూర్చి యవకాశముకోలఁది రాజ్యాంగ మహాసభలయందుఁ బాల్గొనుటయు, బోయరుయుద్ధమందు ఆంగ్లేయుయులకు సహాయపడుటయు, ఐరోపాయుద్ధమునకు కెయిరో జిల్లాలో సేనను గూర్చుటయు, అమృతసరునగరమందుఁ గలిగిన భారత జాతీయ మహాసభలో 'మాంటేగు' అను నాతనికి స్వాగత మీయవలయునని మహాత్ముఁడు చేసిన యుపన్యాసము మహాత్ముని జీవిత లీలా విలాసములను దెల్పునదియై వీనుల విందై యమృతపుసోనలు గురిసెననుట యత్యుక్తి కాదు మహాత్ముఁడు అసహాయ యోగమును ప్రారంభించుటకు ముందు 'లార్డుచేమ్సుఫర్డు'నకు విన్నపముచేయుటయు, ఆంగ్లేయులను 'ప్రియమిత్రులారా' యని సంబోధించుచు రెండు పర్యాయములు జాబులు వ్రాసియుండుటయు, సహాయముచేయు సమయములలో మదనమోహనమాళవ్యా పండితుని వేఁడికోలున కియ్యకొని 'లార్డురీడింగు'ను జూడఁగోరుటయు, పండితమాళవ్యాజీ మఱియొక పర్యాయము ప్రార్థించిన కారణముచే సర్ శంకర నాయర్ అధ్యక్షతను బొంబాయిలో జరిగిన మహాసభకుఁ బోయి యుపన్యసించుటయు, ఉన్న శాసనములకు లొంగి తనను నేరస్థుఁడనని చెప్పుకొనుటయు, మొదలగు సద్భుత సన్నివేశములు, వలన మన కేమి బోధపడుచుండెను? సత్యాగ్రహము అసహాయ యోగము మొదలగునవి, ప్రజాక్షేమము గోరుచు శాసనములకు విరుద్ధములుగాఁ గానిపించినను, యథా

ర్థమునకుఁ బ్రకృతి సహజమగు ధర్మశాసనమును బలపఱుచునట్టి ధర్మబద్ధములైనవని బోధపడుచున్నవిగదా! గాంధి దేవుని జీవితమే న్యాయ ధర్మముల కాలవాలమని మహాత్ముని జీవిత లక్ష్యము గ్రహింపఁగలవారికి బోధపడఁగలదు.

సత్యాగ్రహులగు న్యాయవాదుల విషయముగాఁ జెలరేఁగిన అహమ్మదాబాదు జిల్లా న్యాయాధిపతి యుత్తరమును 'యంగు ఇండియా'లోఁ బ్రకటించుటయు, ఆ యుత్తరమును గూర్చి మహాత్ముఁడు వ్రాసినది న్యాయస్థానమున కవమానకరమని నేరమును మహాత్మునిమీఁద నారోపింపఁ బడినప్పుడు పలువురు మిత్రులు క్షమాపణ నీయమహాత్మునిఁ బ్రార్థించిరి. ఆ వేఁడికోలునకు మహాత్ముఁడు సమ్మతింపలేదు. ఆ విషయమును గుఱించి మహాత్ముఁడు, "క్షమాపణ దెప్పుకొనరాదను పిడివాదము నాకు లేదు. మాయందొక ధర్మమున్నద"ని చెప్పి పత్రికా సంపాదకుల స్వాతంత్ర్యమునకు, శాసనమునకు భంగము కలుగని విధముగా నడుచుకొనవలెనను లక్ష్యముతో నొక ప్రకటన చేయుటయు నిట గణనీయమై మాననీయమై యొప్పుచున్నది.

## కారాగృహ భేదములు

మఱియు, సత్యాగ్రహమునకుఁ బ్రత్యామ్నాయమగు సహాయ నిరాకరణోద్యమమునందు చట్టముల్లంఘించి కారాగృహములు ప్రవేశించుటకును, మానవ జీవితమునకును సంబంధము కలదా యను విషయమును విచారింపవలెను. జీవితమను నది యెట్టి కట్టుఁబాటులేని సహజమైనది. జీవితమునకే దైనకట్టుబాటుండు నెడల, నద్దాన జీవిత స్వాతంత్ర్యమునకు భంగము

సంభవించును. స్వాతంత్ర్యము నరికట్టుటయే చెఱసాల. లోక జీవిత యాత్రయందొక రొకరినిఁ జెఱఁబెట్టు సాధనములు పెక్కులు గలవు. మన భారతీయులు, ఒక కాలమందు స్త్రీ విద్యను నాశముచేసి స్త్రీలను దక్కువ భావముతోఁ జూచుట యొక విధమగు చెఱసాల, అస్పృశ్యత మఱి యొక విధమగు చెఱసాల; కొన్ని స్వాతంత్ర్యములు కొన్ని వర్గముల వారికే తగినవనుట మఱి యొక విధమగు చెఱసాల. ఆ కాలమున నిట్టి భేదముల మూలమునఁ బలువిధములగు చెఱసాల లేర్పడినవి. శాసనముల వలనను జెఱసాల లేర్పడును. ఒక దేశమునకు మఱి యొక దేశము చెఱఁబడ టయి నేఁడు చూచుచుంటిమి. అజ్ఞానమునకే లోకము చెఱఁబడి యున్నది. ఆచార్యుఁడు విద్యార్థిని, తండ్రి కొడుకును, అత్త కోడలిని, వ్యాపారస్థుఁడు కూలివానినిఁ జెఱఁబెట్టు పద్ధతులు పెక్కులు గలవు. ఈ చెఱలనుండి విడుదల పొందుటకు వారెల్లరును బ్రయత్నింపవలెను. ఆ ప్రయత్నమందుఁ దోడ్పడనివారి జీవితము స్వాతంత్ర్య ప్రణయ జీవితము కాఁజాలదు. గ్రుచ్చుకొనిన ముల్లును ముల్లుచేతనే తీసివేయుచున్నట్లు చెఱలను జెఱలచేతనే తీసివేయుట యొక పద్ధతి. అనఁగాఁ బ్రేమ మార్గమున నిలువఁబడి యసహాయ యోగముతోఁ గష్టములు సహించుచు చెఱఁబడుట. ఈ చెఱఁబడుట యనఁగా శరీరమును శత్రువుల వశపఱచి ప్రాణమును (ఆత్మను) భగవంతునికి వశపఱచుట. ఇదియే యాత్మశక్తి యనఁ జెల్లును. ఈ యాత్మశక్తిని సంపాదించుకొనినవారు దేహమును ఆత్మగా భావించువారు కారు. కష్టము లనుభవించు శాంతి సమరమునకు దేహాత్మవాదులు స్వాతంత్ర్యము కలవారు కారు. అట్టివారు కష్టముల నివారణకై యితరులకుఁ గష్టములు కలిగించుచు లోకమందుఁ బలుకష్టముల సదనముగాఁ గల్పించువారగుదురు.

ఆత్మశక్తి సంపన్నులు తమకుఁగలుగు కష్టము లనుభవించుచు నితరుల కష్టములను గూడఁ దమవిగా భావించి తన్నివారణకు పరార్థ జీవనబుద్ధితో శక్తికొలఁది ప్రయత్నించుదురు. కావున, కష్టములు తొలఁగుటకుఁ గష్టము లనుభవింపక తప్పదనియు, మానవజీవితమునకుఁ గష్టపరంపరలు కలుగుట లోక యాత్ర యందు సహజమనియు నీ గ్రంథమందు ప్రారంభము నుండియుఁ జదువుకొను చుంటిమి.

సహాయ నిరాకరణోద్యమము; దేశ స్వాతంత్ర్యమునకుఁ బ్రారంభింపఁబడిన మహోద్యమము. దేశమందలి చెఱసాలల నెట్లు మూయుట? అసహాయోద్యమమందుఁ బాల్గొని ధన ప్రాణములను లెక్కచేయక శాసనోల్లంఘము కావించి చెఱ సాలలందుఁ బ్రవేశింపఁగాఁ బ్రవేశింపఁగా దేశమాత చెఱ తొలఁగిపోవును. భారతీయులెల్లరు కారాగృహములు ప్రవేశించి నచో దేశ స్వాతంత్ర్య మరికట్టు చెఱ, తనంతఁతానే తొలఁగి చనును. భారత దేశమే యిప్పటికి చెఱఁబడియుండెను. జాతీయ మును మఱచి విజాతీయ వ్యామోహము కలిగియుండుటయే మాతృదేశము చెఱఁబడియుండుటకుఁ గారణము. ఖద్దరు ధరిం చుట యొకింత చెఱదొలఁగుట; అస్పృశ్యత తొలఁగుట మఱియొక కారణము; శాసనసభలను బహిష్కరించుట మఱియొక కార ణము. ఇట్లు విధి నిషేధములతోఁ గాఁబడి పోఁబడుటతోఁ జెఱను వదలించి వచ్చుచు, సందువలనఁ గలుగు కష్టనష్టములకు లెక్క గొనక చెఱసాలలఁ బ్రవేశించుట వలన దేశ దాస్యబంధమును ద్రెంపఁగలుగుదుము. దేశభక్తుల చెఱసాలకు నేరస్థుల చెఱసాల కును భేదము గలదు. ఇరు తెగలవారును ఒకేతావు సందుండినను మొదటివారికి తపశ్శాల, రెండవవారికి దండనాలయము నగును.

## స్వాతంత్ర్యము—కారాగృహము

భారతీయ జీవితము కలుషిత మొనరించు శాసనములకుఁ దలయొగ్గి జీవించుట హేయము. సత్యదయా ధర్మముల కాటపట్టగు చట్టముల ననుసరింపఁగోరువారు; అమానుషములగు నట్టి చట్టములకుఁ దలయొగ్గరు. సత్యదయా ధర్మపరులగు దేశ భక్తులు చెఱసాలకు, తుపాకికి, ఉరికంబములకు నాహుతి యగుటకైనను సమ్మతింతురు. కాని, నీతిమాలిన పద్ధతికిఁ దలయొగ్గరు. అందుచే, ఆత్మశక్తి సంపన్నులు, తమ శరీర స్వాతంత్ర్యమున్నంత వట్టు న్యాయశూన్యములగు చట్టము ల్లుల్లంఘించుచుఁ గారాగృహములకే పోవుచుందురు. అట్టిపట్టున దేశ క్షేమము గోరువారికిఁ గారాగృహ ప్రవేశ మభిలషణీయమే యగును. "దేశ స్వాతంత్ర్యము నభిలషించు దేశభక్తుఁడు కారాగృహము ప్రవేశించునేని, ఆతని యాత్మశక్తి మెఱుపుఁ దీఁగెవలె మెఱసి నలుఁగడలు వ్యాపించి దాస్యాంధకారమున నున్నవారికి వెలుఁగుబాట చూపును" అని మహాత్ముఁడు చెప్పియుండెను. కారాగృహములనుగూర్చి మహాత్ముఁడు వెలిబుచ్చిన యభిప్రాయములు కొన్నింటినిట నుదాహరించుచుంటిని.

"సత్యాగ్రహులు కారాగృహమును అత్తవారి గృహముగా భావించి సిద్ధముగా నుండవలెను.

"దుష్పరిపాలనయందు బయట నుండుటవలన, ఆ ప్రభుత్వమును బలపఱచుచు బ్రదుకుట యగును."

"మన మందఱము కారాగృహములను బ్రవేశింతుమేని స్వరాజ్యము లభించితీఱును. లేక, ప్రభుత్వమును మన యిష్టము

చొప్పున పరిపాలన జరుగుటకుఁ బ్రయత్నింపఁ గలిగినను స్వరాజ్యము లభించును."

"మనకు గౌరవమిచ్చు గృహము కారాగృహమే."

"కారాగృహ ప్రవేశము మనకు లభించిన కొలఁది మన యాత్మశక్తి పెంపొందును."

"నేను పక్షివలె సంతోషముగా నుందును. నా కారాగృహ జీవిత లక్ష్యము లోకమునుండి వేఱుగానుండుట."

కారాగృహములను గూర్చియు, వాని యనుభవములను గూర్చియు మహాత్ముఁడు పలుశీర్షికలు వ్రాసెను. అవి పుస్తకములుగాఁగూడ నున్నవి. కారాగృహ జీవితమందును గాంధి మహాత్ముఁడు గౌరవమును గాపాడుకొనుచు, ఆదర్శజీవితము గలవాఁడగుచు నాచరించిన జీవితమునగల విషయములను విశేషములను దెలుపు గ్రంథములు పెక్కులు గలవు.

### అపజయ కారణము

గాంధి మహాత్ముని యుపదేశానుసారము అహింస యందు నిశ్చయబుద్ధిగలిగి యసహాయ యోగమునందుఁ బాల్గొని కారాగృహముల కేఁగుటకు దేశీయులెల్లరు బద్ధకంకణులై యుందురేని, మహాత్ముఁడు బోధించినట్లు ఒక సంవత్సరమునకే మనకు స్వరాజ్యము లభించెడిది. గాంధి మహాత్ముని యాత్మశక్తి ప్రభావముచే నించుమించుగా నిరువదివేల భారతీయులు కారాగృహములు ప్రవేశించిరి. అట్లు, కారాగృహ ప్రవేశము చేసినవారందఱు ఆత్మశక్తి సంపన్నులై యహింసావ్రత ధర్మపరాయణులై, దేశభక్తి సంభరితులై యుండిరేని, మఱి

మొందఱో భారతీయులు లెక్కకు మిక్కిలి చెఱసాలలకుఁ బఱు
గులెత్తియుండెడివారు. సత్యాగ్రహమాచరించి కారాగృహముల
కేఁగిన పలువురు మిత్రులు ప్రభుత్వముమీఁద నాయుధపాణులై
యుద్ధమునకు సంసిద్ధత చూపు సంకల్పముతో నుద్యుక్తులైరని
వారి వారి ప్రసంగముల మూలమునను, కార్యకలాపముల
మూలమునను దెలియనయ్యెను. ఆత్మశక్తియందు విశ్వాసము
లేనివారు గాంధి మహాత్ముని శాంతి యుద్ధమందు చేరుటయే
కూడనిపని. మనస్సునందు హింసనుబూని, బయటకు అహింస
అహింసయని ప్రలపించుచుఁ గారాగృహములను ప్రవేశించిన
యెడల మహాత్ముని యాశయమెట్లు ఫలించును? మనస్సునం
దొకటి, బయటకొకటి చెప్పుట మానవ జీవితమునకు గౌరవ
భాజనముకాదు. అయ్యది పయోముఖ విషకుంభములు చేయు
పని. అజ్ఞానముచే నాత్మశక్తి యెట్లు అభివృద్ధిగాంచును? అజ్ఞాన
విలసనమునఁ గలిగిన మూర్ఖతచే నా ధర్మయుద్ధమునకే, అహిం
సావ్రత ధర్మసమన్విత మహాసంగ్రామమునకే, భారతదేశ
స్వాతంత్ర్య సమరమునకే, మహావిఘాతము కలిగెను. అందులకు
మహాత్ముఁడేమి చేయఁగలఁడు? అట్టితఱి మహాత్ముఁడు ప్రారం
భించిన సత్యాగ్రహమేమి ఫలమీయఁగలదు? మహాత్ముఁ
డభిలషించినట్లు, అహింసావ్రత దీక్షాపరులై, త్యాగనిరతులై
దేశీయులెల్లరు ఆత్మసంయమన బుద్ధితో అసహాయోద్యమ
మును స్వచ్ఛంద చిత్తముతో నాచరించియుండరేని జాతీయ
భావము వెల్లువికి స్వరాజ్యము ప్రత్యక్షమగుననుటలో నాశ్చర్య
మేమి కలదు?

ఆదర్శప్రాయముగా సత్యాగ్రహ మాచరించినయెడల
స్వరాజ్యము లభించుట తథ్యము. అట్లు లభించుట ప్రకృతి

ధర్మము. స్వరాజ్యము లేని జీవితము సార్థక జీవితము కాఁజాల దని పైనఁ జదువుకొనియుంటిమి. స్వరాజ్యము సముపార్జింప సాధన సంపత్తి యగు సత్యాగ్రహ మహిమము సాధారణబుద్ధి కగోచరముగదా! సత్యాగ్రహము, ఆత్మకుఁ బరమాత్మకుఁగల సంబంధమును దెలుపునది యనియు, అదియే మానవజీవిత పరమార్థమును బ్రసాదించునట్టి మహిమాన్విత సాధనమనియుఁ జెప్పుచు, మనోవాక్కాయములచే సర్వవిధములను దన జీవిత సర్వస్వము తన్మయము గావించు గాంధిమహాత్ముఁడా విష యమై వెల్లడించిన సముద్రమువంటి పరమాశయ ధర్మమునకు ముగ్ధుఁడనై యా సముద్రమందలి బిందువులను నిట పొందుపఱచు చున్నాను.

"సత్యాగ్రహ మనునది యొక యుబలాటమువంటిది గాదు. అయ్యది జీవితాశయమున కొక సాధనము. సత్యము లేని ప్రతిదియుఁ బ్రాణము లేని జీవమువంటిదని చెప్పవచ్చును."

"సత్యాహింసలతోఁ గూడినది సత్యాగ్రహము."

"అహింసతోఁ గూడిన సత్యమునకు లోకము పాదా క్రాంత మగును."

"సత్యాగ్రహమను పేరు దక్షిణాఫ్రికాలో నాచే గ్రహింపఁబడినది. అది 'సత్' (నిజము) అను దాని నుండి పుట్టిన పదము. అది 'సత్యము' అను పదముగాఁగూడ నగును. ఆ పదమును నేను ప్రేమచిహ్నము లేక ఆత్మశక్తి యనియుఁ జెప్పుచుందును. సత్యము, హింసను ఒప్పుకొనదని యాదిలోనే గ్రహించితిని ... దానికి శాంతము – సహనము ముఖ్యము. శాంత సహనములకుఁ గష్టసహిష్ణుత యని యర్థము. సత్య

మును ఆగ్రహించుటగాని శత్రువులను బాధించుటగాదు. తనకుఁదానే కష్టము లనుభవించుట.

"సత్యమును మించిన పదార్థము వేఱొండు లేదనుట తిరుగులేనిమాట."

"ఓ భగవంతుఁడా! భారతదేశమును సత్యపథమున నడుపుదువుగాక!"

"ఎచ్చట ప్రేమయుండునో, అచ్చట జీవుఁ డుండును. ప్రేమలేని జీవుఁడు ఎనుముతోలు గప్పిన శరీరము."

"నా కౌమందలి యొక ప్రక్క ముద్ర ప్రేమ, రెండవ ప్రక్క ముద్ర సత్యము."

"బలముతో నెదిరించుట దేహశక్తి యగును. శాంతముతో నెదిరించుట యాత్మశక్తి యగును. ఏసుక్రీస్తు, దానియేలు, సోక్రటీసు మొదలగు మహనీయులు శాంతమును పవిత్రాత్మ శక్తి సంపన్నులు, ధర్మ పథగాములు. వారలు తమ యాత్మశక్తిముందు శరీరములను లెక్కచేయ లేదు.

" 'దౌర్జన్యము నెదిరింపకు' మనునది దౌర్జన్యమునకు దౌర్జన్యము చేయకుండుట, దౌర్జన్యమునకు మేలుచేయుటయని యర్థము. అనఁగా మఱియొకమాటలో దేహశక్తిని దేహశక్తితో నెదిరింపక, దానిని ఆత్మశక్తితో నెదిరింపవలెనని చెప్పవచ్చును."

"శాసన ధిక్కారమే సత్యాగ్రహమని భావించువాఁడు సత్యాగ్రహ మన నేమియో తెలియనివాఁడు కాఁగలఁడు. సత్యాగ్రహమందు శాసన ధిక్కార మనునది లేకపోలేదు.

చట్టమునకు లోబడి నడుచుకొనుటయందు వాడితేలిన వాడే చట్టమునకు విరుద్ధముగా నడుచుకొనుట కర్హుడగును."

"నా మనస్సాక్షికి నొప్పని చట్టమును నా తల్లిదండ్రు లాజ్ఞాపించినను 'అందులకు నేను దిగనని చెప్పి సహించుకొనదగినట్టి ఋజుపద్ధతితో నా ప్రేమను వారికి తెలియపఱచెదను.

"సత్యాగ్రహము రాజ్యాంగమునకు వ్యతిరేకమైనదని మాత్రము గ్రహింపరాదు. కుటుంబములోను సత్యాగ్రహమును ఆచరింపదగును. సంగ్రహించి చెప్పవలెననిన, భార్యా భర్త లందును, తండ్రి కొడుకు లందును, మిత్రులందును సత్యాగ్రహము చేయదగును. కష్టములను కొనుకొనుటకు సత్యాగ్రహమును, ఎవ్వరితోనైనను ఎచ్చటనైనను చేయవచ్చును."

"మన మేమాత్రము హింస కలుగని విధముగా ఈ సాధనమును (సత్యాగ్రహమును) ఉపయోగించుకొన లేనప్పుడు సత్యాగ్రహము చేయుటను మానుకొనవలెను. లేక, మఱింత పట్టుదలతో గట్టి పద్ధతిని సత్యాగ్రహము చేయవచ్చును. మఱియొక మెట్టు దాటవచ్చును. మఱికై నేను సత్యాగ్రహము చేయు సమయముకూడ రావచ్చును."

"నేను ప్రభుత్వ యంత్రాంగము నడుపువాడ నగుదునేని హింస లేకుండగనే, న్యాయదూరములగు చట్టములను రద్దుచేయ నిశ్చయించి, వ్యతిరేక పక్షమువారిని సంప్రదించి, చట్టము రద్దు పఱచుటకు ఒప్పించెదను. గవర్నరుగా నుండునేని, నన్ను వారు సత్ప్రవృత్తియందు నడుపగలరని భావించి, వ్యతిరేకపక్షము వారిని ప్రభుత్వ సలహాసంఘ సభ్యులనుగా జేయగలను."

"సత్యాగ్రహమందలి ముఖ్యములగు రెండు ధర్మసూత్రములు

లెక్కించినవాఁడు వివిధ విజయములను జేపట్టఁగలఁడు. భయ కారణమున సత్యాగ్రహి యేమియుఁ జేయఁడనుట యొకటి. ఆతఁడు భగవంతుని కొఱకునికే భయపడువాఁడను నది మఱి యొకటి. శత్రువును, విరోధముననో, ద్వేషముననో, దుర్మార్గముననో, ధౌర్త్యముననో సాధింపఁదలఁచుట సత్యాగ్రహి లక్షణముకాదు. సత్యాగ్రహి తనను శత్రువునిగా భావించువానిని మిత్రునిగా భావించును. ఆతఁడు, తనకు హానిచేయువానిని గూడ ద్వేషము లేకుండఁ బ్రేమతో నెదిరించును."

"మూర్ఖశక్తిని మూర్ఖశక్తితో నెదిరించుట సల్లక్షణముకాదు. మూర్ఖశక్తిని ఆత్మశక్తితో నెదిరించుటయే గొప్పతనము. అందులకు ధైర్యము ముఖ్యము. ప్రేమలేనప్పుడు ధైర్యము కలుగఁజాలదు. దురాలోచనలున్నంతవఱకు సత్యాగ్రహికి విజయము కలుగుట యరిది. తమను అసమర్థులుగాఁ దలఁచుకొనువారు ప్రేమగలవారుగా నుండుట కసమర్థులగుదురు. ప్రతిదినము ప్రాతఃకాలమందీ క్రింది నిశ్చయమును ప్రార్థించుకొందుముగాక!

> "నేనీ లోకమందెవరికిని భయపడను. భగవంతుని కొఱకునికే భయపడుదును. ఎవరియెడను విరోధము పూనను. ఎవరి కన్యాయము గలిగినను సహింపను. అసత్యమును సత్యముతో సాధింతును. అసత్యము నెదిరించుట కెన్ని కష్టములైన ననుభవించుదును."

"విరోధము వినాశమునకు హేతువు. ప్రేమ నాశములేనిది. ఈ రెంటింటి కెంతయో భేదముకలదు. ప్రేమవలన

శాశ్వతసుఖము కలుగును. విరోధమువలన వినాశము కలుగును. విరోధము విరోధమును పెంచును. అందుచే విరోధమును నశింపఁజేసి ప్రేమను పెంచుట ప్రాణుల ధర్మము."

"జనరల్ డయ్యరునకు హానిచేయుటయు, ఆతనితో నుండి యన్నెఱుఁగనివారిని హింసించుటయుఁ బాపము. ఆతఁడు వ్యాధిగ్రస్తుఁడై బాధపడునప్పుడు ఆతని కుపచారము చేయఁదలఁచుట నామీఁద మన్నింపునో ప్రేమనో పెంచుటకుఁ బ్రయత్నించుట యగును."

"నేను భారత దేశమంతయుఁ బర్యటించినప్పుడు వివిధ జాతిమత రాజకీయముల వారినిజూచి మాటాడువాఁడనని పేరు పొందితిని. వారిలో వేలకొలఁది స్త్రీలను, వందలకొలఁది విద్యార్థులును గలరు. దేశవిషయములను వారితోఁ గలసి మాటాడితిని. వారు, దేశపరిస్థితులు సంపూర్ణముగా నవగాహనము చేసికొను నాసక్తిగలవారు కారని తెలిసికొంటిని. వారికట్టి యాసక్తి కలిగించుటకు మనకు శక్తిలేదు. కావలసినట్టి సద్బుద్ధి, త్యాగము, సహనము, మనోనిశ్చయము, మొదలగు గుణములు గలుగుటకు సమర్థమగునవి యుపవాసము జపములనియు, మఱివేనికి నట్టిశక్తిసామర్థ్యములు లేవనియు, ఆ గుణములు కలుగనిదే సత్యమభివృద్ధి గాంచదనియుఁ జెప్పఁగలశక్తి మనకు లేదు. అందుచే భారత దేశమందలి కోట్లకొలఁది ప్రజలు, నమ్మి యుపవాసమును జేయుచు రేని సత్యాగ్రహవారమును జరుపఁగలరని యెదురుచూచుచున్నాను."

"నేను శ్రామికుఁడనుగా నుండిన యెడల... నేనుఅన్యాయముగాఁ బ్రవర్తించనప్పుడు, నేను ఏ యధికారి చెంతనైనను

బోఁగలను. నేను నా యజమానుని కడకేగి న్యాయము కలుగునట్లు అడుగఁగలను. ఆతఁడు న్యాయము కలుగఁజేయక పోయినచో, న్యాయము కలుగువఱకు అన్నముతినక, నీరుముట్టకయచటనే తిష్ఠవేయుదును. ఈ శాంతిసమరమువలన దృఢకఠినహృదయముగూడ కలుగునని నిశ్చయముగాఁ జెప్పఁగలను."

"సత్యాగ్రహము మతలోకమునకు మాత్రము తగినదని కొందఱందురు. నా పూర్వానుభవమందులకు వ్యతిరేకించుచున్నది. ఇతరములందును ఆ సత్యాగ్రహమును ప్రయోజనపఱచి యాత్మార్పణముచేసి, విజముపొంది, ఆభాస సత్యము నుండి సత్యమునకు మఱలింపవచ్చును. సత్యాగ్రహమందు సమస్త శక్తులుగలవు. అందుచే, అది మనజీవితమునకుఁ బ్రాణమువంటిది."

దేశమంతయు సత్యాగ్రహమును మొక్కవోవని మహాయుధముగా గ్రహించుదుమేని మన విశ్వాసములన్నియు నొకక్రొత్తరూపము దాల్చును. మిక్కిలి మహాపవిత్రమైన వారమది; కేకలువేయుట, అల్లరిచేయుట, మొదలగు పనులవలనఁ దీర్మానములను నెగ్గించుటకు మనము తప్పటడుగులు వేసినవారమగుదుము."

"హర్తాళ్ (పనులు మానుకొనుట) బలాత్కారముగా జరిగిన యెడల, అది సత్యాగ్రహ హర్తాళ్ కాదు. ఏ విషయమందైనను సత్యాగ్రహికి పవిత్ర సంకల్పము కార్యరూపముగా నుండవలెను."

అనాదినుండి యనుస్యూతముగా నాచరింపఁ బడుచు వచ్చుచుండిన సత్యాగ్రహము ప్రాచీన కాలమందు ప్రహ్లాదుఁడు,

ఏసుక్రీస్తు, సోక్రటీసు, భక్తగోపన్న మొదలగు మహనీయుల మూలమునఁ బ్రకాశించి కొన్ని శతాబ్దములుగా వర్ధిల్లుచు; ప్రస్తుతము, గాంధిమహాత్ముని దయార్ద్ర జీవితములో బరాకాష్ఠను బడయుచున్నది. స్వరాజ్యము కొఱకు, ప్రభుత్వముతో జరుపుచున్న సత్యాగ్రహ యుద్ధము ప్రారంభింపఁ బడినది మొదలు వివిధ ధర్మములకు ఆదర్శమై పవిత్రమై మహాత్మునిచే సమాచరింపఁ బడుచున్నది. ప్రజలను మారణహోమము గావించునట్టి తుపాకులు, ఫిరంగులు మొదలగుగాఁగల యుద్ధ సాధనములకంటెఁ బ్రజల యాత్మజ్ఞానమును, ఆత్మశక్తిని విజృంభింపఁజేయు సత్యాగ్రహము మహాపవిత్ర యుద్ధ సాధనమని చెప్పుట యతిశయోక్తి కాదు. నాగపూరు జండా యుద్ధమందును అకాలీల మత స్వాతంత్ర్య యుద్ధమందును, ఫ్రాన్సు దేశీయులు రాణువ బలముచే జర్మనుల 'రూర్' ప్రదేశమునకై పెనఁగులాడునప్పుడును, పన్నుల నీయకుండ జరిపిన బార్డోలీ సత్యాగ్రహమందును, పేదప్రజలయందు వెల్లివిరిసిన శక్తి యేది? ఆత్మశక్తి సంపన్నమగు సత్యాగ్రహము కాదా! మఱియు, సత్యాగ్రహము పేదల మనస్సును బల్లవింపఁజేసి లోకమందు సమరస సన్మార్గమును స్థాపించుటకు సామర్థ్యముగల యొక మతముగా నేర్పడుట సత్యాతి సత్యము. ప్రస్తుత కాలమందు సత్యాగ్రహమునకు ఏడుగడగా నవతరించిన గాంధిమహాత్ముఁడు జగదారాధ్యుఁడై చిరకాలము వర్ధిల్లుగాక! లోకమందు సత్యాగ్రహము శాశ్వతమై సందీపించుగాక !!!

# మత జీవితము

సత్యాగ్రహము మానవుని యందు నుద్దీపించు శక్తితోఁ గూడి యచ్చోటు. దైవశక్తిని గూడ నుద్దీపింపఁ జేసిన యెడల మానవుఁడు దైవ సంబంధముగలిగి జీవించు జీవితము మత జీవిత మగును. మత శబ్దమున కనేనార్థములు గలవు. ఇటమనము ప్రస్తుతార్థమునే గైకొందము.

మ త ము

మతమన నభిప్రాయము. మానవుఁడు, తాను 'సత్' అను పదార్థముతోఁ గలిసి యుండు సంబంధమును దెలిసికొనుట యను నభిప్రాయము గలిగియుండుటయే మతమని స్పష్టమగుచున్నది. మానవుఁడు 'సత్' పదార్థ జ్ఞాన సంబంధము తెలిసికొనక, యితర విషయములనుగూర్చి యాలోచించునట్టి యభిప్రాయములను మతమని స్పష్టీకరించి యెవరును జెప్పుట లేదు. మానవుఁడు 'సత్' అను పదార్థముతోఁ గల సంబంధమును గ్రహించిన యభిప్రాయమును, ఎట్టి యాక్షేపములు లేకుండఁగనే మతమని స్పష్టీకరించుట కెల్లరు సమ్మతించుచుండిరి. అనఁగా మానవుఁడు శాశ్వతముగా నొక యభిప్రాయము కలిగియుండుట మతమని బోధపడుచున్నది. మానవ

జన్మమునకు దైవ సంబంధము గలిగించుటకై యనాదిగా నేర్పడిన యభిప్రాయము మతమని రూఢికెక్కినది.

మతము, బాగుగాఁ జేయఁబడినదను ధాత్వర్థముగలది· మానవునకై బాగుగాఁ జేయఁబడినట్టి ధర్మమును స్పష్టముగాఁ బ్రకాశింపఁ జేయుట మానవునివిధి. మానవుఁ డెప్పటికైనను మతజీవితము పడసియే తీఱవలెను. అట్టిమత జీవితము లేనివాఁడు జన్మమెత్తని వాఁడగును.

యథార్థ మానవుఁడు

మానవుఁడెందులకు జన్మించెను? జన్మ లక్ష్యమేమి? మానవుఁడు జన్మించుట – జీవించుట – మరణించుటయననేమి? మఱల జన్మించుటయెట్లు? ఈ జనన జీవన మరణములే మానవుని జన్మమునకు లక్ష్యమా? కాదు; కాదు. మానవుఁ డెవఁడు? కర్మమా? ధర్మమా? మనస్సా? కరణమా? దేహమా? కాదు; కాదు. కాఁగా మానవుఁ డెవఁడు?

తే॥ ఆత్మనకు రెండు రూపంబులనఘ కలవు.
విషయ సంగతి నొక్కటి విస్తరిల్లు
దదుపభోగంబులేక మధ్యస్థభావ
మొందియొక్కఁడు వెలుఁగుచు నుండుఁజూవె."

భారత....శాం....పంచమాశ్వాసము.

యథార్థ మానవుఁడు జ్ఞానములేని జడపదార్థము కాదు.

కం॥ తను నెఱిఁగిన నవ్యక్తము
చనవునఁ బోఁడాత్ముఁ డజరశాశ్వత విగతాం
జనవిమలాచ్యుత పదముం
గని యక్షరుఁడగు నిజప్రకాశ స్థిరతన్.

భారత....శాం....షష్ఠాశ్వాసము.

తనను దానెఱిఁగిన యెడలఁ దనసత్యస్థితిని గాంచఁగలఁడు

మానవుఁడేలోక విషయమును బరిశోధింపఁ బ్రయత్నించు నప్పుడాతని కెన్నియో సందేహములు పొడమును. అయినను, ఆతఁడన్నీ విడువక యెడతెగని పరిశోధనలు కావించుచు, ఆలోచించుచు, విజ్ఞుల సలహాలను బడయుచుండిన యెడలఁ గ్రమ క్రమముగా నాతఁడా పరిశోధనయం దాఱితేఱినవాఁడు కాఁగలఁడు. మానవుఁడు మొదట, అజ్ఞానము కలవాఁడుగానుండి లోకానుభవ జ్ఞానపరిపాకమువలన జ్ఞానియగును. మానవునియందు జ్ఞానము ప్రకాశించినను, ప్రారంభమున నాతఁడు అజ్ఞానముచేనావరింపఁబడియుండును. అందుచే, తొలుత మానవునియందు అజ్ఞానము కలదనియు, నది క్రమక్రమముగా నశించి జ్ఞానము కలుగుననియు మనము గ్రహింపనగును. మానవుఁ డేవిషయమై పరిశోధనలు చేయుచుండునో ఆ విషయమునకు సంబంధించిన అజ్ఞానముతొలఁగి జ్ఞానము కలుగును. ఈ చిన్న యుదాహరణతో చిన్న కాంతి సహాయమున పెద్ద కాంతిని జూడఁగలమను నిశ్చయము కలుగుచున్నది. మానవుఁడు సృష్టి, జీవుఁడు దేవుఁడు—అను నీ మూఁడువిషయములను శోధించి సాధించనేని యాతని యజ్ఞానము సంపూర్ణముగా

వైదొలఁగి చనును. అజ్ఞానము నశించి పరిపూర్ణ జ్ఞానము కల్గినవాఁడే యథార్థ మానవుఁడు. అట్టి పరిపూర్ణ జ్ఞానమును సంపాదించుటకుఁ బ్రయత్నించుటయే మానవజన్మ మందలి లక్ష్యము.

## ఆదిమూల పదార్థములు

జ్ఞానులు సహితము మొదట అజ్ఞానులై యుందురు. వారు తమ యజ్ఞానమును బోఁగొట్టుకొని జ్ఞానులైరి. ఆ జ్ఞానులు, అజ్ఞానుల కుపదేశించి జ్ఞానులనుగాఁ జేయుదురు. అనగా జ్ఞానులు సహితము మొదట అజ్ఞానులుగా నుండి, యొకరిచేఁ దమ యజ్ఞానమును బోఁగొట్టుకొనినవారైరని తలఁపవలెను. అట్లే, జ్ఞానము పొందినవారు, జ్ఞానము పొందని వారికి జ్ఞానమును కల్గించుచుందురు. అందువలన, అజ్ఞానులు జ్ఞానులు కాఁగలుగుదురు. ఇది లోక సహజము. అట్లే, ఆలోచించి ఆలోచించి పరిశోధించుకొనుచు పోవుచుండినయెడల అజ్ఞానమే లేని పరిపూర్ణజ్ఞానముగల యాదిమూలపదార్థ మొకటి కలదని స్పష్టమగుచున్నది. ఆ జ్ఞానపదార్థమునకు సహజముగా నజ్ఞాన మావరించియుండదు. దానికి కాలము స్థలము మొదలగు కట్టుబాటులు లేవు. కట్టుబాటు లేనప్పు డది యెల్లెడల నిండి యుండునని గ్రహింపఁదగును. ఎట్టి కట్టుబాటు లేకుండగ నంతట నిండియుండు తత్త్వ మెచ్చట పుట్టును? ఎచ్చట నశించును? అనఁగా, ఆ తత్త్వ పదార్థము జనన మరణాది దుర్గుణములు లేనిదియై యెప్పటికి నుండునది యగును. ఎట్టి మార్పులు లేని యంతటను నిండియుండిన యొక పదార్థమును మన పూర్వులు 'సత్' అను గొప్ప పేరు పెట్టిరి. సత్ అను పదమునకే యెప్పటికి

నుండునదని యర్థము. అనఁగా శాశ్వత పదార్థమని యర్థము. ఆ సత్తను మహాపదార్థమునకు మాయను గల్పించుటవలన చిత్ - ఆనంద మమనవి నిరవధికముగా నుండును. అందుచే, సత్ అను మహాపదార్థమును గ్రహించునప్పుడా పదార్థము మీఁద చిత్తు ఆనందమును వేఱుగాని విధముగా నుండవలెను. సత్ - చిత్ - ఆనంద రూపములతోఁ బ్రకాశించు మహాపదార్థము పైనఁ జెప్పిన విధముగా నెల్లయెడల నిండియుండిన దైవ పదార్థమగును. అది లేని స్థలములేదు. సమస్తము ఆతని మయము.

## దైవమానవ సంబంధము

అట్లు సర్వవ్యాప్తమగు సత్తను పదార్థముతో సంబంధము లేకుండఁగ లోక మెట్లుండఁగలదు? మానవుఁ డెట్లు పుట్టి బ్రదుకఁ గలఁడు? సృష్టి స్థితిగతులనుగూర్చి సత్యమా అసత్యమా యని చర్చించుట యిచట యనావశ్యకము. సృష్టికి జీవునకు సత్తునకుఁ గల సంబంధ మేనాఁటికిని నాశము లేనిది. ఆ సంబంధము తెలిసికొని మానవుఁడు జీవించుచున్నాఁడా లేదా? అనున దొక్కటే యిచటఁ దెలిసికొనఁదగినది. మానవుఁ డొకొకప్పుడు దానిని దెలిసికొని జీవించుచుండును. ఒకొకప్పుడు దానిని దెలిసికొనక జీవించుచుండును. సంబంధమును దెలిసికొనుట, తెలియకపోవుటయను రెండు తత్త్వములు మానవునియందుఁ గలవు. మానవుఁ డెప్పుడా సంబంధమును దెలిసికొనును? ఎప్పుడు తెలిసికొనఁడు? మానవజన్మము కలుగుటకు దైవస్థితికి సంబంధము కలదని యీ గ్రంథమందుఁ బలుతావులఁ జెప్పఁబడి యుండెను. మానవుని జ్ఞానము ప్రకాశము స్వచ్ఛత కలుగునప్పుడు, ఆతఁడు కామక్రోధములకు

వశుఁడుగాక, ఆ దుర్గుణములు తన దరిజేరనీయక తనను సంరక్షించు సత్తను పదార్థమును నెఱుఁగక జీవించుచుండును. ఆ ప్రకాశ స్వచ్ఛతకు విద్య, ఆత్మ పరమాత్మ జీవుఁడు మొదలగు పలు పేరులతో లోకమందు వ్యవహరింపఁబడు చుండెను. ఆ ప్రకాశము స్వచ్ఛతనుండి విడుదల పొందుటకు నేర్చుట ఎఱుఁగుట, వినుట, కనుట, గ్రహించుట, వాగ్రూప ముగా, ఇతర సహజజ్ఞాన విషయములను వాగ్రూపముగాను ప్రయత్నపూర్వకముగాఁ బడసి మానవుఁడు జీవించు చుండిన యెడల, ఆతఁడు తనను వదలి యేనాఁటికి నాశములేని సత్తు యొక్క సంబంధమును గ్రహింపఁగలఁడు. ఈ తత్త్వ మారసి జీవించువాఁడే జన్మ పరంపర లేనివాఁ డగును.

కం॥ అటుగాక కర్మగతిలం
పటుఁడ వగుదువేని నల్ప ఫల భాగితమై
నట యిట దిరుగుచు మోక్షని
కట వృత్తికి బాహిరుండఁ గానె కుమారా!

మహాభారతము – శాంతిపర్వ – ప్రథమా – 59.

మత జీవిత మేది?

సత్తను సత్పదార్థ మెఱిఁగి జీవించుట యనఁగా ప్రాణి సంబంధము గలిగి జీవించుట యని యర్థము. ఆహా! సత్తను పదార్థము కలదనుట యథార్థము. సర్వవ్యాప్తమైన సత్పదా ర్థము తెలిసికొనిననాఁడే ప్రాణి కెట్టి సమయమందైనను మన స్సుతోఁ గీడు తలఁచునా? అట్లు తలఁచిన యెడల నట్టి తాపుస సత్తునకుఁ దనకుఁ గల సంబంధమును మఱచుట యగును.

అందువలన నాతఁడు అజ్ఞానుఁడు కాఁగలఁడు. అట్టి యజ్ఞానుఁ డెట్టి పాపకృత్యములైనను జేయఁగలఁడు. అందుచే నట్టి యజ్ఞానుఁడు మానవత్వమునుండి పతనమగును. సత్పదార్థ సంబంధ మానవుఁడు జీవించు చుండెనా లేదా యనుటకు నాతఁడు హింస చేయకుండుట ననుసరించియుండును. సత్తు పదార్థ సంబంధమును దెలిసికొనుట యనఁగా అహింసాధర్మము గలిగియుండుట తప్ప నింకేమి కలదు? అందుచే సత్పదార్థ సంబంధముతో మత జీవితముగలవాఁడు జీవరాశికి మేలుచేయుటవలన బ్రాహ్మణుఁ డగును.

లోకమందు జీవిత పద్ధతులను రెండు పద్ధతులుగా విభజింపవచ్చును.

ఒకటి:— అహింసా ధర్మ జీవితము;

రెండు:— హింసా జీవితము;

జీవిత పద్ధతులు రెండు విధములు

మొదటిది మతజీవితము, రెండవది వ్యర్థజీవితము. మత జీవిత మనునది అహింసా ధర్మజీవితము కాని వేఱు జీవితము కాదు. అహింసా ధర్మమందు సమస్త ధర్మములు గలవు. అందుచే 'అహింసా పరమోధర్మః' అని అహింసా ధర్మము బహుముఖములుగాఁ బ్రశంసింపఁబడుచుండెను. హింసా జీవిత మనిన సత్తు అను పదార్థముతోఁ గల సంబంధమును దెలిసికొనఁజాలక ప్రాకృత జీవితముతో జీవించుట యగును. అందుచే హింసాధర్మమగు జీవితము మానవునకుఁ దగినది కాదు.

హింసాధర్మమునుండి మానవ సంఘమును గాపాడుటకు మత జీవితము తగినదని పెద్దలు ప్రబోధించుచునే యుండిరి.

## అహింసయే మతము

లోకమందు జన్మించిన జ్ఞానులందఱు జీవరాశిని దమ వలె భావించి జీవించు మత జీవితమునే ప్రబోధించుచుండిరి. తన ప్రాణ మట్లు ఇతర ప్రాణులను భావింపరాద'ని యే మత మైనను బోధించుచుండెనా? లేదే! ఏ మతమునైనను గ్రహించి పరిశోధించినను మత పరమాశయము 'అహింసా పరమోధర్మః' అనుటయే పరాయణమని వాకొనుచున్నది. సర్వమతములు అహింసాధర్మమునే ప్రబోధించుచున్నవి. ఈ ధర్మమును గ్రహింపని మతము మతము కాదు. అట్టి మతమును మతమను పేరునం గూడం బిలువరాదు. సృష్టియందలి సర్వమతములు ఏక ముఖముగా అహింసాధర్మమును సమర్థించు చుండుట మిక్కిలి శ్లాఘనీయమాడదగును. పేరులను బట్టి మతములు భేదించుచున్నను అహింసాధర్మమందు సర్వమతములొక్కటే యగుట, యాశయ లక్ష్యము సృష్టి ధర్మమగును. ఈ లక్ష్యము గ్రహించునప్పుడు పలు మతముల యునికియే యనావశ్యక మని తోంచకపోదు. అందుచే సర్వమతములు అహింసా ధర్మమను నొకే మతమని బోధపడుచుండెను.

## మత యుద్ధములు

ఈ యొక్క విషయము గ్రహించి మతములలో పూజ లెందుకుం బయలుదేఱినవని కొందఱు ప్రశ్నింపవచ్చును. ఈ

హింసాపూర్వకఘాతుక కర్మమును మతముల పేరిటఁ బూజా సమయములందుఁ గావింపఁబడుటఁ బ్రజల యజ్ఞానమే కారణమగును కాని యే మతము మీఁదను నిందలు మోపరాదు. మతమును సత్తను నిత్య సత్య పదార్థముగా గ్రహించి జీవించుట యనియు, ఆ జీవితము అహింసా ధర్మ జీవితమనియుఁ బైనఁ జెప్పఁబడి యుండుటను జూడుఁడు. అహింస యనఁగా విరోధము, ద్వేషము, అసహనము మొదలగువానిని దరిఁ జేర నీయనిది. అట్టియెడ విరోధమేది? యుద్ధమేది? పవిత్రమేది?

సత్తునకు ఆత్మకుఁ గల సంబంధము తెలియనేరని కొందఱు మతమను పేరతోఁ బెద్దపెద్ద గ్రంథములనుండి ద్వేషము కోపము మొదలగు 'అసత్'పదార్థములను నర్థములుగా గ్రహించి "నీ దైవము, నాదైవము"ని గొప్ప గొప్ప మాటలతో వాదించుచున్నారు. అట్టివారు మేమే మతతత్త్వజ్ఞులమని విఱ్ఱవీగుచు నసూయాద్వేషరాగములతో సజ్ఞాన తత్త్వమునకు గుఱియై 'ప్రేమ - దయ - సత్' పదార్థములను గ్రహింపఁ జాలకుండిరి. అట్టివారు అసూయాద్వేషరాగాదిక దుర్గుణములనే గ్రహింపఁ గలుగుచుండిరి. అట్టివారిని అజ్ఞానజీవితముగలవారని చెప్పుట తప్పుకాదు.

మతము మత మని మత దురభిమానగ్రస్తులై మత వేషములను దాల్చినంత మాత్రమున మత జీవితములు గలవారు కాఁజాలరు. సత్ పదార్థ మెఱిఁగి, అది సర్వవ్యాపక పదార్థమని గ్రహించి, యే ప్రాణికిఁ గీడు మనస్సునందైనఁ దలఁపని వారే మత జీవితము గలవారని యొకటికిఁ బలుపర్యాయములు నొక్కి చెప్పుచున్నాను. 'సత్' ధర్మమాచరించువారు దేశమునకుఁ దగినట్టియు, ప్రజలు జీవింపఁ

దగినట్టియు భగవన్నామములు తమ పేరులుగాఁ బెట్టుకొను చుందురు. ఆ పేరులను శ్రద్ధగా నాలోచించి చూచిన యెడల భగవంతుఁడని చెప్పఁబడునది యెల్లెడల నిండియుండిన ప్రేమ పదార్థమే యనియు, తత్పదార్థమును బడయుటకు అహింసా ధర్మమను మహాధర్మమే ముఖ్యమనియుఁ దేఁట తెల్ల మగును.

## స మ ర స ము

శైవము, వైష్ణవము, బౌద్ధము, క్రైస్తవము, మహమ్మదీయము మొదలగు సమస్త మతములుగా వివిధనామములతోఁ జెల్లుచుండినను, ఆ మతములన్నియు నహింసను ప్రధాన ధర్మముగా నొప్పుకొనుట గానవగును. శంకరుఁడు, విష్ణువు, బుద్ధుఁడు, యేసుక్రీస్తు మహమ్మదు మొదలగు మహాజ్ఞానులు తమ తమ మత సంఘములవారికే గొప్పవారనియుఁ బూజ్యులనియుఁ దలఁచుట యవివేకము. ఆ మహాజ్ఞానులందఱును ఆధ్యాత్మిక జ్ఞాన సంపత్తికిఁ దగినట్లు భగవంతుని నొక్కనిని మనకుఁ జూపెట్టియుండిరి.

భగవంతుఁ డొక్కఁడే యనియు, నాతని దరిజేరుటకు జ్ఞానమార్గ మొక్కటే యనియు, ఆ జ్ఞానమును మహాజ్ఞానము, లేక యాధ్యాత్మిక జ్ఞానమనియుఁ దలఁచి చూచిన బోధపడఁ గలదు.

సత్యపదార్థమీ విధముగా లోకమందు వివిధ మతము లుగా నెందులకు వేర్పడినవని ప్రశ్నించువారు కలరు. 'నీరు' అను పదార్థము వివిధ నామములతో లోకమందు వ్యవహరింపఁబడుచుండెను. అట్లే; అహింసా ధర్మమను మత

విజ్ఞానము వివిధ నామములతో వ్యవహరింపఁబడుచు వచ్చుచుండెను. పేరులు పెక్కులైనను వస్తువొక్కటియకదా! వస్తుగౌరవమెఱుఁగక పరంపరగా వచ్చు ఆచారవ్యవహారములచేతనో, కొన్ని కొన్ని సంఘములవలననో వేఱు కారణములవలననో యీ మతము-ఈ మతమని చెప్పు భేదబుద్ధితో వ్యవహరించువారు మతజీవితములు గలవారు కారు. ఏ మతమందెవరుండినను, జీవకారుణ్యబుద్ధిగలవారై యుండుటయే మతవిశిష్టతకు మేలుబంతి యగును. 'ఆత్మవత్సర్వభూతాని' అను పరమాశయ సంపన్న బుద్ధి నలవఱచుకొనలేక, కొన్ని ప్రత్యేక చిహ్నములతో నేను ఈ 'మతమువాఁడను,' ఆ మతమువాఁడను' అని చెప్పుకొనుట మతజ్ఞానము కలిగి చెప్పుటగాదు. 'ఈ మతము-ఆ మతము'నని చెప్పఁబడు మతములన్నియు 'గణితబోధిని' వంటి మతములే యగును. గణితమందు భగవంతుని గుణించు మత మొక్కటే కలదు. అదియే దయాగుణము. ఆ దయాగుణమలవఱచుకొనక వివిధ పూజాపురస్కారాదికములు చేసినంత మాత్రమున లాభమేమి యొఱఁగఁబడును ? అట్టి చేష్టలు మతసంబంధమగునా?

మతజీవితమనునది సులభసాధ్యము కాదు. మానవుఁడు పలువిధములుగా జీవితమను మహాసముద్రమును నీఁదులాడి యీఁదులాడి సత్తనుసత్పదార్థజ్ఞానమును బడసి యీ జ్ఞాననావచేఁ దనతో సంబంధించుచుండిన మతమను తీరముచేరుట యెంతగనస్సాధమోయని వేఱుగాఁ జెప్పఁబని లేదు.

## దైవము

మానవుఁడు, తనయందుఁ బ్రకాశించు నేకత్వమును భావింపఁగల జీవితాశయముతో నుండవలయును. మానవత్వ

దేవత్వములు తనయెడఁ గలవు. ఈ ద్వైవిధ్యము నుండి పుట్టిన మానవుఁడు దైవసాన్నిధ్యము సంపాదించుటకుఁ బ్రయత్నింప వలయును. అట్టి ప్రయత్నము చేయునట్టి జ్ఞానికి భగవత్స హాయ మెప్పటికప్పుడు కాచుకొని యుండును. అనంతర మా దైవసహాయముచేఁ దరించుసాధన మెట్టిమాతంకము లేకయే పడయవచ్చును. ఇందులకు తపస్సు-క్రియ-యోగము మొదలగు మార్గములు గ్రంథములందుఁ జెప్పఁబడి యుండెను. వాని నిట వివరించుట గ్రంథము పెరుఁగుట యగును.

## నియమములు

జీవితమును సంయమము గావించుకొని సదాచార గుణములవఱచుకొని, తదాచారములను ఆచరణమందు ఫలించు నట్లు ప్రయత్నించు మానవుఁడు మతజీవితము పడయఁగలవాఁ డగును. ప్రథమముగా మానవుఁ డసత్యమునకు లొంగక, సత్యము నలవఱచుకొని యభ్యసించువాఁడుగా నుండవలెను. సత్రవర్తనగలిగి యుండవలెను; మూఁడవది యబద్ధమాడ కుండ నుండవలెను. నాలుగవది జీవరాసులను దయవలెఁ జూచు కొనవలెను. ఐదవది తాఁజేసిన తప్పును దెలిసికొని పశ్చాత్తాప పడవలెను.

చేసిన తప్పును దెలిసికొని పశ్చాత్తాపపడుట మత జీవితమునకు ముఖ్యాశయమని పెద్దల యభిప్రాయము. మానవుఁడు తప్పుచేయుట సహజము. తాఁజేసిన తప్పును తెలిసికొని పశ్చాత్తాపపడుట మహాత్ముల లక్షణమని విషయ జ్ఞులందురు. అట్లు, తనతప్పును తెలిసికొనఁజాలనివాఁడు, దైవమునకు దూరుఁడై, గుణరహితుఁడై లోకమునఁ జెడ్డవాఁడగును. మాన

వుఁడు తప్పులను దెలిసికొని పశ్చాత్తాపపడుటవలన నితరుల కాదర్శప్రాయుఁడు కాఁగలఁడు.

మతము పరమపవిత్రమైనదైనను, మతము జ్ఞానులకు మాత్రమే తగినదనియు, ఇతరులకా మతముతోఁ బనిలేకపోయి నను నష్టములేదని కొందఱు భావింతురు. ఇది మిక్కిలి తప్పు. మతము కొందఱి కావశ్యమై మఱికొందఱి కనావశ్య కమగునని తలంచుట యజ్ఞానము. మతము మానవుని లోక జీవితముతోఁబాటు అభివృద్ధి యగుచుండును. లోకము - లోక మందు - లోకముతోఁగూడి యాత్రచేయునట్టి జీవితము సర్వోపగతుఁడగు భగవంతునకు వేత్తయుండునా? భగవంతున కెట్టివృత్తియు నెట్టిపనియు లేదా? 'అంతయు నాచేత' అను నహంకృతి చూపక 'అంతయు భగవదధీనమ'ని భగవంతుని ననుసరించువారికి లోకజీవితము-మతజీవితమను భేదమెట్లు గలు గును? మహాజ్ఞానులగు ఆదర్శపురుషుల జీవితము మతజీవితము గలది యగును.

మతజీవితము గలవాఁడు సన్యాసిగా నుండవలెనను నియ మము లేదు. ఆతఁడేవృత్తి చేయుచున్నను, ఏవేషముగలిగి యున్నను, ఏ పరిస్థితియందున్నను మతజీవితము గలిగియుండుట కంతరాయము కలుగదు. ప్రేమ, దయ, నీతి మొదలగు సద్గు ణములుండవలెను. మతజీవితముగలవాని యాదర్శములను ఉదా హరణతో సంగ్రహించి చెప్పుట యుక్తమని భావించి కొన్నిటి నిట దెల్పుచుంటిని.

మతజీవితము గలవాఁడు "లోకములో నెట్లు జీవింప వలె"నని తన జీవితమును నిశ్చయించుకొని యాదర్శముగల

వాఁడై నడుచుకొనును; తన యాదర్శమునకై యితరులను బీడింపఁడు; ఇతరుల స్వాతంత్ర్యము నరికట్టఁడు; ఇతరులను మోస గించుటకై కల్లలాడఁడు; ఏ కారణము చేతనుగూడ నితరులకుఁ గీడొనరింపఁడు; ఇతరుల కష్టములను బాపుటకై ప్రేమతోఁ దాను గష్టములను సహించి యనుభవించును. ఇతరుల మోస మెఱిఁగి హితోపదేశము చేయును; తాఁ జేసిన తప్పునకై పరి తపించి, పరితపించి యిఁకముందెన్నఁడు తానట్టిపని చేయనని త్రికరణశుద్ధితోఁ బ్రతిజ్ఞ గావించి పరమేశ్వరుని ధ్యానించుచుఁ గటాక్షింపుమని వేఁడుకొనును; ఇతరుల తప్పులను మన్నించి కంటికి ఱెప్పవలె వారిని గాపాడును. పరకాంతలను తల్లివలె భావించును; అయ్యయ్యో యని తప్పుదారిఁ ద్రొక్కు లోకమును గూర్చి పరితపించును. లోకజీవయాత్ర చేయుచుఁ దనకని జీవిం పక యితరుల సేవకై జీవించును. తన కర్తవ్యవిధిని నిర్వ హింపుచు అనాసక్తయోగముతో నుండును. ఎవరికి నెప్పుడు దేనికిని వెఱవఁడు; భగవంతుని కొఱకే భయపడును; ఏ విషయమైన నెవరినైనను భగవంతుని యాజ్ఞగా భావించి సేవలు సల్పును. సూక్ష్మముగాఁ జెప్పవలయునన్న నాతఁడు అంత రాత్మ ప్రేరితుఁడై కర్తవ్యధర్మపరాయణుఁడై జీవయాత్ర సల్పుచుండునని తలఁపనగును.

వేషము దాల్చుట, దేవళమునకుఁ బోవుట పూజలు గావించుట మాత్రము మతము కాదు; మతజీవితము నుగాదు. దైనందినము వీని నొక ప్రొద్దుమాత్రము కొఱఁతలేకుండఁగఁ జేసి మిగిలిన ప్రొద్దంతయు నబద్ధములాడుట యందును, ఇతరుల ధనమును గైంకర్యము చేయుట యందును, ఇంకను ఇట్టి పాప ములు చేయుట యందును గను గలిగియుండుట మతజీవిత స్వల్ప

గును? ఇట్టి చెట్టలనుండి పట్టుఁదల గలిగి తొలఁగి జీవించుటయే మత జీవితమగు ననుట తథ్యము.

సత్ — మార్గము

'సత్' అను సత్పదార్థము నెఱిఁగియు మతము లోక మంతయు, వివిధ నామములతో విలసిల్లుచున్నది. ఈ పేళ్లు భేదించుటవలన మానవులు భేదించి యజ్ఞానులై యుద్ధములకుఁ గాలుదువ్వుచుండిరి. ఇట్టి పాటులు కలుగకుండ నామరూప భేదములను నశింపఁజేసిన వస్త్వైక్యము తెలుప సమర్థమగు నొక పేరు గలిగి యుండుటవలన మానవులకుఁ బరస్పర ప్రేమ యభివృద్ధి గాంచఁగలదు. సత్తుతో సంబంధము గలిగియుండుటయే సత్ మార్గము అని మన దేశమునకు మన ప్రాచీనులు బోధించి యుండిరి. సత్ మార్గము అను రెండు పదములు కలియఁగా సన్మార్గమను పదము సిద్ధించును. 'సత్'తో సంబంధము కలిగి యుండుటనుసన్మార్గము అని వస్త్వైక్యరూపముగల నామముతోఁ బిలుచు కొనుచుండిన యెడలఁ బ్రపంచమందు మతయుద్ధము లంతరించి పోఁగలవు.

సన్మార్గమను పదము నేఁడు క్రొత్తగాఁ గనిపెట్టఁబడినది కాదు. అది వాఙ్మయము పుట్టిన నాఁటినుండియుఁ గలదు. ఆ సన్మార్గమునే తపస్సంపన్నులు దైవముగా భావించి యారాధించి తరించినట్లు మన పురాణములు తెలుపుచున్నవి.

సత్తుతో ఆగ్రహించి నిలుచు మతజీవితము, మానవ జీవితమందుఁ బడయఁ దగిన పరిపూర్ణజీవితము గలది యనుట వలన, నేను • ఆదర్శముగా గ్రహించిన మానవ జీవితమునకు ఉదాహరణగాఁ జరితార్థము పరమ పూజ్యమునైన మహాత్మ

గాంధి జీవితమందు మతజీవితము మిళితమై యొప్పారుచుండిన యాదర్శ విధానముమీఁద మన బుద్ధిని బోనిచ్చుట మన విద్యుక్త ధర్మము.

### గాంధిమహాత్ముఁడు - మతము

మహాత్మాగాంధి పుట్టిన మతము గుజరాతీ వైష్ణవము. గుజరాతీ వైష్ణవ మతము అత్యంత నియమనిష్ఠలుగలదని మిక్కిలి వినికిడి. తల్లిదండ్రు లేమతముగలవారగుదురో బిడ్డలు గూడ నా మతముగల వారగుట సహజము. కొందఱు అమరణము తలిదండ్రుల మతమందే యుందురు. కొందఱు తమ బుద్ధికొలఁది మంచి మతమని భావించిన యన్యమతము స్వీకరించు చుందురు. తెలివి లేక పరంపరాగత మతాచారము ననుష్ఠించుటను విడనాడి తన మత మసత్యమని పెఱ మతములు స్వీకరించుటయుఁ బొగడఁదగిన మాటగాదు. ఒకఁడు తాను బుట్టిన మతమందే యుండుచు నేర్చుట - వినుట - తెలుచుట మొదలగునవి సులభములగుట వలన నా మతమే యన్ని మతములుగా నుండుటను గాంచనగును.

వైష్ణవ మతమందలి గొప్పతనముచే నొకఁడా మతమందుఁ బుట్టినమాత్రాన నాతఁడు వైష్ణవుఁడు కాఁడు. అతఁ డెల్లయెడల వ్యాపించియుండిన సత్తు అను విష్ణువుతో సంబంధము కలిగి, యా పదార్థము నంతటను నిండియుండినదని తలఁచి, ధ్యానించు నట్టివాఁడగునేని, అతఁడు సత్యమైన వైష్ణవుఁడు కాఁగలఁడు. లేనియెడల నాతఁడు పేరునకు మాత్రమే వైష్ణవుఁడగును. 'సత్తు' అను పదార్థమును విష్ణువని వైష్ణవులు సేవించుచుండునట్లే యితర మతములవారు నొక్కొక్క పేరుతో

దేవుని సేవించుచుందురు. నామరూపములేని పదార్థము (దేవుని) నేపేరునఁ బిలిచిన నేమి? ఏ రూపమున ధ్యానించిన నేమి? ఏ నామము కలిగిన నేమి? ఏ రూపమెత్తిన నేమి? మహాత్మా గాంధి తాను జన్మించిన వైష్ణవ మతమును సర్వమతములలోఁ గాంచునట్టి ప్రసిద్ధి తన లోకానుభవముమీఁదఁ బడయఁ గలిగెను. అట్టి మతసహనము కలుగుటకు మహాత్ముని తల్లిదండ్రుల సంస్కృతి, గాంధి మహాత్ముని బాల్యజీవితము – తరువాతి లోకానుభవ జీవితమందలి త్యాగము, పరిపూర్ణజ్ఞానము, సత్యము మొదలగునవి క్రమక్రమముగా మహాత్మునకు సహాయ పడెను.

గాంధి మహాత్ముని తల్లిదండ్రులు వైష్ణవభక్తిప్రపూర్ణులు. వారలు తమ వైష్ణవమునకు విరుద్ధముగాఁ జీకటి కోణమునఁ బెట్టి తాళముపైచి యా తావునుండి మఱియొక తావును జూడకుండ నుండలేదు. వారికి సమస్త మతములందును సమత్వము కలదు.

"మా తలిదండ్రులు రామాలయమునకును శివాలయము నకును వెళ్ళుచుండువారు. మమ్ములను తమతో తీసికొనిపోయెడి వారు; లేక మమ్ము పంపుచుండెడివారు. జైనధర్మాచార్యులు తఱచు మా నాయనగారి కడకు వచ్చుచుండువారు. మేము జైనులము కాకున్నను, నిషిద్ధమైనను, వారు మాయింట భుజించుచుండువారు. వారు మా తండ్రితో ధర్మచర్చయు, వ్యవహార చర్చయుఁగూడ చేయుచుండువారు.

ఇంతేకాక. మాతండ్రికి మహమ్మదీయులలోను, పారసీకులలోను మిత్రులు కలరు. వారు తమ తమ మతములఁగూర్చి

తెలుచు మాటలాడుచుండువాడు. మాతండ్రిగారు గౌరవము తోడను శ్రద్ధతోడను ఆలకించుచుండువాడు. నేను వారికి 'నర్సు'గా ఉండుటచే తెలుచు వారి సంభాషణము వినవీలయ్యెడిది. ఈ విషయములన్నియు కలిసి అన్ని సంప్రదాయములందును సమత్వమును కలిగించుటకు సాయపడెను."

(తెలుగు-ఆత్మకథ).

"గాంధి కుటుంబమువారు వైష్ణవ వ్రతములను మాత్రమే యాచరించెడువారు కాదు. వారు శైవవ్రతములను గూడ నాచరించెడివారు. వారు విష్ణ్వాలయములకును బోయెడివారు. ఆ కుటుంబమువారు శ్రావణ మాసమంతయు ప్రదోషవ్రతము ననుష్ఠించుచుండెడివారు. నేనును అట్లేచేయనిశ్చయించుకొంటిని.

అని గాంధి మహాత్ముఁడు తన యాత్మకథయందు మతసమత్వమును తెలియఁజెప్పుటను గమనింపుఁడు ఈ మాటలచే గాంధి మహాత్ముని జీవితము మతవాదములందుఁ బ్రవేశింపలేదనియు, సమత్వము గలిగియుండెననియు బోధపడుచున్నది.

గాంధి మహాత్ముఁడు వైష్ణవ మతమునందు జన్మించినవాఁడైనను, మతాభిమానముగలవారి కడుపున నోములపంటయై పుట్టినను, మహాత్ముని బాల్యజీవితమె కొన్నాళ్ళవఱకు కొలఁదిగా నన్యమతమున కాకర్షింపఁబడినది. ఆ లేఁతప్రాయము సత్తు అను పదార్థము నెఱుగనేరనిదై, తనిసిన ప్రాయముననేఁ బేరునకు మాత్రము మహాత్ముఁ డవలంబించిన బాల్యమునగును. అయినను మహాత్ముని మొదటి మతాభినివేశము మహాత్ముని నితర మతమునందుఁ బ్రవేశింపనీయలేదు. గాంధి మహాత్ముని

తఱువాతి జీవితమునకు బాల్యమందలి యబద్ధమునకు భయపడిన గొప్పతనమే సహాయపడెను. మితవాగ్మియైనవాఁడు పెద్దగాఁ బాపములు చేయఁజాలఁడు. మహాత్మునికి బాల్యజీవితమందు దల వడిన మితభాషణము తఱువాతి జీవితములో మహాత్మునకు భగవద్భక్తికి మార్గదర్శకమయ్యెను.

## దుర్గ్రహము

గాంధి మహాత్ముఁడు బాల్యమందు సాస్నేహావాస కారణముచే మాంసము భుజించుటయు, తల్లిదండ్రులకా దొంగ్ర్య మును జెప్పుకొని క్షమాపణ వేఁడుకొనుటకు ధైర్యముచాలక పోవుటయు 'తలిదండ్రులయందు భక్తి' యందు వివరించెను. గాంధి మహాత్ముని గొప్పతనము 'మాంస భక్షణము' సేవగించు కొనెను; మహాత్మునియందుఁగల దైవభక్తి 'సత్యమును గాపాడుము'ని ప్రబోధించెను. అట్టి సమయమున మహాత్ముఁ డేమి చేసెను? ఇచటనే మానవ స్వాతంత్ర్యమునకుఁ దగిన యాహారము గాదని గ్రహింపఁ గలిగెను. మహాత్ముఁడు దైవప్రబోధమునకే చెవియొగ్గెను. దైవప్రబోధమున కాసక్తి చూపు గొప్పతనమే జీవితమందు మానవుని దైవముగాఁ జేయునుగదా! దైవాజ్ఞను మీఱి నడుచుకొనిన యెడల అయ్యో! మానవుఁడు పతనమగును. అతని యందుఁగల దైవము మటుమాయమగును. అట్టిపాపి యెందుకుఁ బుట్టినట్లు? సత్యము, గాంధిమహాత్ముని సస్యమత జీవితమునుండి మఱలించి స్వాయమత జీవితమందే యుండుటనట్లు చేసెను, అయ్యది స్థిర బుద్ధిగలవారికే సమర్థమగును.

మహాత్ముఁడు సందేహాస్పద సమయములందెప్పుడును,

జెడుగులకుఁ జెవియొగ్గక, యాత్మ ప్రత్యక్షబుద్ధితో దైవము నకై తలయొగ్గి ధర్మ మనుసరించిన ఘట్టము లీ గ్రంథమందుఁ బెక్కుచోట్ల వివరింపఁబడి యుండెను. ఇచట విశిష్ట విషయ మొకటి తలఁపునకు వచ్చెను. గాంధిమహాత్ముఁడాంగ్ల దేశమందు జదువుకొనుటకు వెళ్ళినప్పుడొకామె మహాత్మునియొద్దకు మాటి మాటికి వచ్చుచుఁ బోవుచుండుట గలదు. ఆ యింటివారు తమ యాఁడుపడుచును మహాత్మునికిచ్చి పెండ్లి చేయవలెనను సంక ల్పముతో నా గేస్తురాలు మహాత్మునితో సాదరముగా సంభా షించుచుండెడిది. ఆ ప్రసంగమందలి గుట్టును మాటలమీఁదఁ దెలిసికొనిన గాంధిమహాత్మునకు దైవపరిశోధన యావశ్యక మయ్యెను. మహాత్ముఁడు నిశ్చలుఁడై భగవంతుని సమ్ముఖ యుండెను. తన యాలుబిడ్డలు తన మాతృదేశమందున్నార నియు, మఱియొక పెండ్లియాడుట ధర్మము కాదనియు, మహా త్ముఁడు జాబొకటివ్రాసి యా ముసలి యామెకుఁ బంపెను. అట్లు మహాత్ముఁడు దైవసంకల్ప బలముచే నట్టి పరిస్థితులందు నట్టి ఘట్టములందునుగూడఁ దన దైవశక్తికిఁ దలయొగ్గుచు సత్య సంధుఁడుగాఁ దన జీవితము నడుపుకొనుటవలననే మహాత్ముఁడు కాఁగలుగుట !

పాపమునకు వెఱచుటయేగాక, చేసిన పాపమునకుఁ బశ్చాత్తాపడి తన తప్పును లోకమునకు వెల్లడించుట చే జీవితము పరిశుద్ధమగును గదా! పాపమును వెల్లడించు ధైర్యము మహా త్మునికి బాల్యజీవితమందే కుదురుకొని యుండెను. మహాత్ముఁడు తన తండ్రిగారి యెద్ద వెల్లడించిన పాపకార్యము ను 'తలిదండ్రుల యందు భక్తి' యను ప్రకరణమందుఁ జెప్పుకొనెను. 'చెప్ప రాని పాపము మన్నింపఁ బడద'ని బైబిలు చెప్పుచున్నది.

పాపము దాఁచువాఁడు పాపమును బెంచువాఁడగును. మహాత్ముఁడు పదునాఱు సంవత్సరముల ప్రాయమందే పాపము వెల్లడించు నిశ్చయము ధైర్యము కలుగుట వలన గాంధి మత జీవితమందు మహాత్ముఁడు కాఁగలిగెను.

మహాత్ముఁడు దుష్ట సహవాస దోషము వలన మొట్టమొదటగా వెలయాండ్ర గృహమున కేఁగి సిగ్గుచే వశుఁడుగాక తిరిగి వచ్చెను. సిగ్గు అనునది యెల్లరకుండఁదగిన సద్గుణములలో నొకటి. అది తగిన సమయములం దక్కఱపడి సహాయపడుట నాకుఁ దెలియును. ఈ విషయమునుగూడ మహాత్ముఁడు తన యాత్మకథయందుఁ దెలిపి యుండెను.

మహాత్ముని బాల్యజీవితమందుఁ బ్రవేశించిన పాపకృత్యము లివి మాత్రమే. మహాత్ముని బాల్యమందలి మంచిపనులు రెండు మూఁడు తెలిసికొనుట లెస్సయని భావించి వానినిట వ్రాయుచుంటిని.

## వద్యోగము

గాంధిమహాత్ముఁడు బాల్యమందుఁ బాఠశాలయందలి పాఠ్యపుస్తకములుతప్ప నితర పుస్తకములు పెద్దగాఁ జదువలేదు. ఎట్లో అదృష్ట వశమున నొక పర్యాయము తన తండ్రి చదువుకొను 'శ్రవణపితృభక్తినాటకమ'ను గ్రంథములభించెను. ఆగ్రంథమందలి కథను దెల్పు బొమ్మనుగూడ మహాత్ముఁడు చూచుటరంభవించెను. అప్పుడు మహాత్ముఁడు 'ఓ మనస్సా! సత్ప్రవర్తనకిది యొకటియే లాక్షణ' యని తనుకుఁదానే మనస్సునందు నిర్ణయించుకొనెను. ఇనుము నయస్కాంత మాకర్షించునట్లు

పవిత్ర వస్తువు పవిత్ర వస్తువునే గోరునుగదా! 'రత్నం రత్నేన సంగచ్ఛతే!'

గాంధి మహాత్ముఁ డొకసారి హరిశ్చంద్ర నాటకము చూడఁబోయెను. ఆ నాటక ప్రదర్శనా దృశ్యములు మహాత్ముని హృదయఫలకమందు హత్తుకొని పోయెను. హరిశ్చంద్రునివలె నెల్లరు నెందుకు సత్యసంధులుగా నుండఁగూడదని రాత్రింబవళ్ళు ఎడతెఱపిలేని విధముగాఁ దనను దానే ప్రశ్నించుకొనెడివాఁడు.

మఱియొక పర్యాయ మొక గుజరాతి పాటకు ముగ్ధుఁడయిన సంగతి మా పాఠకులకు విదితమేగదా! 'ఆ గుజరాతి పాట — ఆపాట భావమును సత్యాగ్రహ ప్రతిజ్ఞామంత్రముగా జపించుకొనుఁడు.

మన పూర్వులు నాటకములను పాటలను ప్రదర్శించుటవలని లాభమును మహాత్ముని జీవితము తెలుపుచున్నది. ప్రస్తుతకాలమందు ప్రేమ మయములగు నవలలు, శృంగార నాటకములు ప్రబలుటవలన బాలబాలికల జీవితములు చెడుటకుఁ గారణమగుచున్నవి. అట్టి ప్రేమపూర్వక నవలానాటకములు పదులువందలుగాఁ బ్రకటితములగుచున్నవి. అహా! ఏమి నాగరికత! ఎంతటి సంస్కారము? ఆ విషయ మట్లుండనిండు. ప్రహ్లాద — హరిశ్చంద్ర నాటకములను రెండును గల్పాంతి మెంతయో ప్రయత్నించినను లభ్యములు కాకుండ్రి యా నాటకముల యందలి కథలను మహాత్ముల కుపదేశముగా నగుట గమనింపవలెను. ఆ గొప్పతనము ఆ నాటకములదా? ప్రయోజనము పొందిన గాంధి మహాత్ముని మనస్సునదా? మిత్రులారా! ఆలోచింపవలసిన విషయముగదా!

గాంధి మహాత్ముఁడు పదునాఱు సంవత్సరముల వఱకు మతజ్ఞానము లేకుండఁ బెరిగెననియు, ఆ మతజ్ఞాన మావయస్సునందుఁ దెలిసికొనుట కవకాశము కలుగలేదనియు; దన యాత్మకథయందుఁ దెలిపియుండెను. ఇచట మతమనఁగా మత దురభిమానము కాదు; దేవళములకుఁ బోవుటయుఁ గాదు. "మతమనునది ఆత్మసాక్షాత్కారమను నర్థమని తలఁచుచున్నా న"ని మహాత్ముఁడే తన యాత్మకథయందు వ్యాఖ్యానించి యుండెను. మహాత్ముఁడు తర్కాది శాస్త్రములను, వేదాంతాది విద్యలను బరిశోధించి పండితుఁడగుటకుఁ బ్రయత్నింపలేదు. అనుభవమే మహాత్మున కాదర్శమయ్యెను. ఆ యాదర్శముచేతనే గుడులకుఁబోయి పూజాదికములఁ నిర్వర్తించెడి వాఁడు కాఁడు. ఆ విషయమునుగూర్చి మహాత్ముఁడు.

"మాది వైష్ణవ సంప్రదాయము కావున నేను తఱుచు విష్ణ్వాలయమునకు వెళ్ళవలసియుండెడిది. కాని దానియెడ నాకు శ్రద్ధకలుగలేదు. దాని వైభవము నాకు అభిమతము కాలేదు. అచట కొంత దుర్నీతియు జరుగుననివిని దానియెడ ఉదాసీనుఁడనైతిని" కావున కోవెలవలన నాకు అబ్బినదేమియులేదు అని, తన యాత్మకథయందుఁ దెలిపెను. ప్రస్తుత కాలమందలి హిందూ దేవాలయములను గూర్చి యేవగించుకొని చెప్పిన మాటలు పెక్కుగలవు. 1927 వ సంవత్సరము మహాత్ముఁడు ఖద్దరునిధి ప్రోగుచేయుటకుఁ దమిళనాడు వెళ్ళినప్పుడు "'కారైక్కుడి'లో హిందూ దేవాలయములు వేశ్యాగృహములుగా నయ్యెన"ని దేవాలయములనుగూర్చి యథార్థ విషయమును నిర్భయముగా ఖండించెను. దేవాలయములయందు వేశ్యలు నాట్యముచేయుట, వ్యాపారముచేయుట మొదలగు లోపములు

మహాత్మునకు నచ్చలేదు. సత్తను మహాపదార్థము ఆశను గలిగించువారికి, ప్రస్తుత కాలమందలి దేవాలయములు విపణివీధులుగా, చోరగృహములుగా, వేశ్యాశాలలుగానే తోచును. అందుచే, గాంధిమహాత్ముడు దేవాలయమునకు బోవుటనే మానుకొనెను. దేవాలయ సమీపములందలి దారులందు మూత్రవిసర్జనాదికము లు తగవనెను. నూత్నముగా చెప్పిన మతము పేర, దేవుని పేర జరుగుచుండిన చెడుగులను జీయురాదనెను. మహాత్మునకు సత్తను పదార్థముమీదనే యెక్కువ కోర్కెగలదు.

అయితే, అనుభూతి స్థిరకూడలేను. అబద్ధముగా విషయమును అబద్ధముగా గ్రహించునట్టి మహాజ్ఞానము మహాత్మునకు గలదు. విశ్రాంతి సమయమునందు రామాయణ భాగవతములు మహాత్ముడు పఠించుచుండెడివాడు. ఒకపర్యాయము మహాత్ముని తండ్రిగారి గ్రంథాలయమందలి మనుస్మృతి మహాత్మునకు గానిపించెను. వెంటనే యా గ్రంథము నందుకొని చదివి చూచెను. ఆ గ్రంథమునుగూర్చి మహాత్ముని యభిప్రాయమును దన యాత్మకథ యందిట్లు తెలిపెను.

"మనుస్మృతిచూడపోసగెను. అందు సృష్టి మొదలగు విషయములు నాకు ఎక్కువగా శ్రద్ధకలిగింపక పోవుటయుండ, కొంచెము నాస్తికత కలిగించెను....మనుస్మృతి అహింసను బోధింపలేదు...మనుస్మృతి మాంసభోజనము పక్షమే అని తోచబడినది."

### మాతభక్తి

మహాత్ముడు తనబుద్ధికి ధర్మమనితోచిన వానిని

మాత్రమే స్వీకరించునుగాని యితరములను అనాలోచితముగా నెప్పుడు స్వీకరింపఁడు. 'మనవేదము-మనధర్మములు-మనభాష' యనుపట్టుల నాభాసములను మాత్రము విశ్వసించువాఁడు కాఁడు. మహాత్మునకుఁ దులసీదాసు రామాయణమందుఁ బ్రత్యేకమగు భక్తిశ్రద్ధలు గలవు. ఆ గ్రంథములమీఁదఁ దనకుఁ గల ప్రేమను బలుపర్యాయములు ముచ్చటించియుండెను. ఆ గ్రంథమందొకచోట "పంచములు, శూద్రులు, తదితర కులములు, స్త్రీలు హీనజన్మ మెత్తినవారు" అను నర్థముగల పద్య మొకటి కలదు. తులసిదాసుని రామాయణముమీఁదఁగల ప్రేమచేతఁ బై విషయములనుగూర్చి మహాత్ముని మనస్సు సమ్మతింపలేదు. అట్లు సమ్మతించు బుద్ధితోనుండుట మూఢభక్తి కాఁగలదు. ఆ విషయమై గాంధిమహాత్ముఁడు,

"ఈ పద్యమును బ్రమాణముగాఁ దీసికొని యొకఁడు తన భార్యను జులకనగాఁ జూచినయెడల నాతఁడు నిరయము పొందఁగలఁడు. శ్రీరాముఁడు తన భార్యను జులకన బుద్ధిసిఁ జూఁడలేదు; భార్య మనస్సు చివుక్కు మనునట్లు పల్లెత్తు మాటయు ననలేదు. తులసిదాసు తన జీవిత దినములందుఁగల విషయమును జెప్పెను. అంతియుగాని యదియే ప్రమాణముగాఁ గైకొని స్త్రీలను హీనజన్మముగలవారినిగాఁ జూడవలెనని యాతని భావము కాదు. ఒకవేళ, నా కాలమందలి యాచారమునుబట్టి తన భార్యను దానట్లు చూచినవాఁడే యనుకొనినను, ఆతని యా పద్ధతి తప్పు అనియే చెప్పవలెను. నాయకుఁడు తన నాయికను జులకనగాఁ జూచుట, నిందించుట, కొట్టుటలు న్యాయ్యమని చెప్పుటకా? రామాయణము రచిం

చుట! అయుక్తములగు ధర్మములను బోధించు శ్లోకములు, పద్యములు నుండినయెడల వానిని దొలఁగింపవలెను."

అని చెప్పియుండెను. ఇంకొకతావున నీ విషయమును గూర్చియే "నేను తులసీదాసు స్నేహితుఁడను. కాని గ్రుడ్డితనముగా ననుసరించువాఁడను గాను" అని నొక్కి చెప్పెను. "భగవద్గీతయందలి రెండవ యధ్యాయమునందలి చివరి పదునెనిమిది శ్లోకములకును, బదునెనిమిదవ యధ్యాయపు సంగతులకును భిన్నాశయములును, ఇతరాధ్యాయములందు నట్టి భిన్నాశయము లుండినయెడల వానిని దీసివేయుదు ననే" దృఢ నిశ్చితాభిప్రాయము గలవాఁడు శ్రీ గాంధిమహాత్ముఁడు. మహాత్ముఁడు మూఢవిశ్వాసములతో" నేవిషయమును విశ్వసించుటగాని, త్రోసివేయుటగాని గల స్వభావము గలవాఁడు కాదని మహాత్ముని జీవితమే స్పష్టపఱచుచుండెను. స్వాభిమానము గలవాఁడు మత జీవితము గలవాఁడు కాఁడు. అంధ విశ్వాసములను ఖండించునట్టి గాంధిమహాత్ముఁడు సత్యమగు మత జీవితము గలవాఁడనియు, అన్ని ప్రమాణములచేతను ఘంటాపథముగాఁ జెప్పవచ్చును. మహాత్ముఁడు మూఢాచారములను, మూఢ విశ్వాసములను మతాభిమానముతో" విశ్వసించువాఁడు కాఁడనుటను,

"మతము మతమని చెప్పఁబడు నన్నిటిని నేను గ్రహించుదును. మతమను పేరుతోఁ జేయఁబడు చెడుగులను మాత్రము నేను నమ్మను. ప్రాచీన గ్రంథములు దేవ సంబంధములగును. అయినను, అంతమాత్రముచేత నా గ్రంథములందలి యర్థములు నా మనోజ్ఞానమునకు సమ్మతములు

కావలెను. లేనిచో గ్రంథములందుఁ గల దేవత్వమును నేను వ్యతిరేకింతును.”

“సంస్కృత భాషయందుగల వన్నియు వేద వాక్యములుగా మూఢ విశ్వాసములతో నమ్ముచుంటిమి. ఆ మూఢ విశ్వాసములను నమ్మిక స్త్రీలను, అన్యజాతులవారిని అస్పృశ్యులని తలఁచు తప్పు తలంపును బోఁగొట్టు కొందురుగాక” అని యుపదేశించిన యుపదేశామృతమును భారతీయులు గ్రోలి ధన్యు లగుదురుగాక !

తనకు మతజీవితమందును ఆధ్యాత్మిక బుద్ధిని గలిగించిన గ్రంథములలో మహాగ్రంథముగాఁ బవిత్ర గ్రంథముగా మహాత్ముఁడు మాటిమాటికిఁ బ్రశంసించు గ్రంథము భగవద్గీతగదా! ఆ మహాగ్రంథము భారతీయులు పెక్కురిచేఁ బ్రశంసింపఁబడు గ్రంథములలో మొదటిది. విదేశీయ పండితులు సైతము భగవద్గీతను మెచ్చుకొందురు. ‘గీతా రహస్యము’ను ప్రకరణమందు గ్రంథప్రాశస్త్యమును దెల్పియుంటిని.

## భగవద్గీత

పరిశోధకులు భగవద్గీతను పెక్కు తెఱఁగుల వ్యాఖ్యానించుచున్నారు. ఆ గ్రంథము ఉన్న తెఱఁగున జీవితమును జెప్పు గ్రంథము కాదనియు, పరమ సత్య మెఱిఁగిన జ్ఞానియను వానిచేఁ జెప్పఁబడి యుండెననియుఁ గొందఱందురు. మహాభారత యుద్ధము జరిగినది సత్యమనియు, అర్జునుఁడు కర్తవ్యశూన్యుఁడై యున్నతఱి అతనికిఁ గర్తవ్యజ్ఞానము కలిగింపవలసి కొన్ని వేదాంత ధర్మములను శ్రీకృష్ణుడు బోధించిన గ్రంథమనియు,

ఆ యాశయమునే తరువాతివా రెవరో అనే కాధ్యాయములుగాఁ బెంచి వ్రాసిన యొక గ్రంథమనియుఁ గొందఱ అందురు. భగవద్గీత, మొదట కొలఁది శ్లోకములతో నుండి యుండెడిదనియుఁ, బిమ్మటఁ గాలక్రమమున మధ్య మధ్య కాలములందుఁ బెక్కు శ్లోకములు ప్రక్షిప్తము లయ్యెననియు, నద్దాని యీ కారణము వలన భగవద్గీతయందుఁ బరస్పర విరుద్ధాభిప్రాయ లేర్పడెననియు గొంద ఱందురు. అర్జునుని విపరీతాశయము మఱలించుటకై రాజ్యతంత్ర న్యాయానుకూలముగా గీత చెప్పఁబడెననియు, నొకా నొక కారణము నుపలక్షించి యుపదేశింపఁబడిన దగుటవలన గీతా గ్రంథము నాదర్శ గ్రంథముగా, జ్ఞానప్రదగ్రంథముగా స్వీకరించుట యనాదరణీయ మనియుఁ గొంద ఱందురు. భగవద్గీతను హత్యను బ్రోత్సహించు గ్రంథమనియు, గీతను వినినపిమ్మట నర్జునుఁడు జ్ఞానము పొందలేక, హత్యకుఁ గడంగుటవలన నా గ్రంథము హింసాబోధక గ్రంథమే యగుననియు, మఱికొంద ఱందురు. భగవద్గీతను, ఉపనిషత్సారమైన జ్ఞాన గ్రంథమనియు, అనాసక్తయోగ గ్రంథమనియు, లోకజీవిత మనుభవించుచునే, పారమార్థికజ్ఞాన మలవఱచునట్టి మార్గ ముపదేశించు నుపదేశ గ్రంథమనియు మఱి యింకొక కొంద ఱందురు. ఆయావారి జ్ఞానము, పరిశోధన మొదలగు సంస్కారములకుఁ దగినట్లు భగవద్గీత గాన్పించు చున్నది.

భగవద్గీత, ప్రపంచ భాషలలో ననువదింపఁబడిన గ్రంథము. ఆ మహాగ్రంథమునకుఁ బలువురు వ్యాఖ్యానములు రచించిరి. శంకరుఁడు, రామానుజుఁడు మొదలగు మహాచార్యులు పెక్కురు గీతకు వ్యాఖ్యానములు చేసియుండిరి.

ప్రస్తుతము గీతకు వ్యాఖ్యానించిన వారలలోఁ బ్రసిద్ధుఁడు దేశసేవా ధురంధరుఁడు పూనా నగరవాసి పుణ్యమూర్తి మన లోకమాన్య బాలగంగాధరతిలకు మహాశయుఁడు ముఖ్యుఁడు.

మన మహాత్ముఁడు బాల్యమందుఁ బరంపరాగతాచారముగా గీతను అప్పుడప్పుడు విననయ్యెను. ఆ గ్రంథము మీఁద మక్కువమీఱి పరిశోధనాబుద్ధితో నాంగ్లదేశమందుఁ జనువుట తటస్థించెను. అచట మహాత్మునకు గీతార్థము బోధపడెను. మహాత్ముఁ డా విషయమును 'యంగుఇండియా' పత్రికయందు (12-11-1925) వ్రాసిన భాగమందుఁ గొంఁదిభాగము మహాత్ముని యాత్మకథయం దిట్లు గలదు.

"సీమలో నాయున్న రెండవయేఁడు చివరి దివ్యజ్ఞానసామాజికులు ఇరువురు నాకు పరిచితులయిరి. వారు సోదరులు, అవివాహితులును. వారు నన్ను గీత చదువ ప్రేరేపించిరి. వారు సర్ ఎడ్విన్ ఆర్నాల్డుగారి గీతానువాదము చదువుచుండిరి. తమతో కలసి సంస్కృత గీత చదువుటకు నన్ను పిలిచిరి. నేను సిగ్గిలితిని. ఏలన, నేను దానిని చదివియుండలేదు. గుజరాతీ అనువాదమునుగూడ చదివియుండలేదు. నా విషయమును వారికి కొంకుతో ఎఱిఁగించితిని. నాకు సంస్కృతమునప్రవేశము అల్పమయ్యును అనువాదము మూలమునకు ఎచట భేదించెనో అది తెలిసికొనుట శక్తి కలదని తలఁచి, ఆ విషయమును తెలిపి, వారితో గీత చదువ దొరకొంటిని. ద్వితీయాధ్యాయమునందలి

'ధ్యాయతో విషయాన్ పుంసస్సంగస్తేషూపజాయతే,
సంగాత్ సంజాయతేకామః కామాత్ క్రోధోఽభిజాయతే॥

క్రోధాద్భవతి సంమోహా స్సమ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి.

ఈ శ్లోకములు, నా మనస్సున నాటుకొన్నవి. అనేకని వాని ధ్వని నా చెవులలో మార్మ్రోగుచున్నది. భగవద్గీత అమూల్య గ్రంథమను విశ్వాసము దినదినము ప్రబలుచున్నది. తత్త్వజ్ఞానమున దానితో సాటియగు గ్రంథము మఱొకండు లేదని నిక్కముగా నా నమ్మిక. నాకు మనసు చెదిరినప్పుడు గీత అమూల్యమగు సాయము చేసెను. ఇంచుమించు ఆంగ్ల గీతానువాదము లన్నియు నే జదివితిని. ... అటు పిమ్మట కొన్ని సంవత్సరముల యనంతరమున నే అది నిత్యపారాయణములో పడినది." అని చెప్పియుండెను.

గాంధి మహాత్మునకు స్వానుభవమంతు నిశ్చయమును దేవాలయ పద్ధతి కలిగింపకపోయెను. ఆ యాధ్యాత్మిక బుద్ధిని మహాత్మునకు ఇంగ్లాండునందు గలిగించినది సర్ ఎడ్విన్ ఆర్నాల్డుగారి యనూదిత గీత — గొప్పగా, ఆ గ్రంథమందలి రెండవ యధ్యాయమందలి పందొమ్మిది శ్లోకములు మహాత్మునకు జ్ఞాన ప్రబోధమును గలిగించిన యా శ్లోకములను మా పాఠక మిత్రులుకూడ జదువుకొందురుగాక! యని వేడికోలు. గాంధి మహాత్మునకు నాడు ఆర్నాల్డుగారి యనువాదము మనస్సు నలరించెను.

గాంధిమహాత్మునకు ఆధ్యాత్మిక జ్ఞానమును ప్రబోధించిన గీతనుగూర్చి మహాత్ముని యభిప్రాయమును పైనవ్రాసిన (యంగు ఇండియా) విషయము తుది నిట్లుగలదు.

"తనను దానెరుఁగుటకు, అందులకుఁ గావలసిన పరిజ్ఞానమును బోధించుట గీతా పరమార్థము. ఇరుసేనలు కలయఁబడి యుద్ధముచేసికొనెను. వ్యాసుఁడు యుద్ధము లేకుండఁగనో హత్యలు జరుగకుండఁగనో జయముగలుగ నేరదని యూహించి యందులకుఁదగి యుద్ధమును గల్పించెనని యోయూహింపుఁడు. కాని నేను మహాభారతమును విమర్శించి చూచునప్పుడు నాకొక విషయము తట్టెను.

వ్యాసుఁడు తన మహాభారతమందు యుద్ధవైశద్యమును వివరించెను.. కౌరవులోడిన నేమి? పాండవులు జయించిన నేమి? జయించిన వారేమి సుఖపడిరి? మరణించినవారి గతి యేమి? బ్రదికినవారి పాటేమి? కుంతీదేవి మరణింప లేదా? యాదవులేమైరి? అని వ్యాసుఁడు తలఁచెనేమో? యుద్ధవర్ణనయు, యుద్ధమునఁబ్రాణములు కోల్పోటయు మహాభారతాశయముగాదు. వానినిగూర్చి పరితపించుటయుఁదగదు.

అహింసాధర్మమునకు విరుద్ధమగు కొన్ని శ్లోకములతో గీతాగ్రంథముకూడ హింసాగ్రంథమని వాకొనుట గ్రంథాశయము నెఱుఁగని యజ్ఞానము. గీతోద్దేశ్యము హింసకాదు; అహింస. ఈయాశయముగీతయందలి రెండవయధ్యాయమునందుస్పష్టముగా జెప్పఁబడియున్నది; పదునెనిమదవ యధ్యాయమునందును సూక్ష్మముగా నీయాశయమే బోధింపఁబడెను. మిగిలిన యధ్యాయము లీ విషయమునే బలపఱచుచున్నవి. ఈర్ష్యా, కోపములు, స్పర్ధవిరోధములు లేకుండఁగ హింసగలుగదు. గీత, కోపము మొదలగు వానిని నశింపఁజేసి సత్వరజస్తమోగుణాతీతమగునొకయున్న తాశయమును మనకు బోధించుచున్నది. అర్జునుఁడు వీరావేశముతోఁగన్నులెఱ్ఱెక్కిన దృశ్యము నేఁటికి

నా మనోనేత్రమునకుఁ గానిపించుచునేయున్నది. అహింసా సిద్ధాంతముతో నర్జునుఁడు యుద్ధముచేయ నొల్లనన లేదు. ఇంతకుముందిట్టి యుద్ధము లెన్నియో యాతఁడు చేసి యుండెను. ఈసారిమాత్ర మాతని కొకవిధమగుసంకోచముకలిగి యుండనోపు. చుట్టపక్కములను జంపుటకాతని మనస్సొప్పలేదు. అర్జునుఁడహింసనుగూర్చి మాటాడనే లేదు. ఎవరినిఁగూడఁ జంపఁజాలననియాతఁడన లేదు. శ్రీకృష్ణుఁ డెల్ల విషయములెఱిఁ గినవాఁడు అర్జునుని కప్పటికిఁగలిగిన యావేశమును దెలిసికొని శ్రీకృష్ణుఁడాతనినిఁజూచి, "ఓ అర్జునా! నీ వింతకుముందు హింసాకాండను జరిపియుంటివిగదా! ఇప్పుడాకస్మికముగా నహింసావాదివగుట తగదు. ప్రారంభించిన కార్యమును బూర్తి గావింపుమ"ని చెప్పెను.

స్కాస్ ఎక్స్‌ప్రెస్ రైలుబండియందుఁ బ్రయాణించు నాతఁడు తటాలున తన ప్రయాణమధ్యలో దొంగతనముచేసి పట్టువడకుండుటకై యా రైలుబండినుండి దుమికెనేని, ఆతఁడు, ఆత్మహత్యానేరమునకు గుఱికాఁగలఁడు. అందువలన ఆతఁడు రైలుప్రయాణ మనసేమో యెఱుఁగనివాఁడగును. అర్జునుని స్థితియునట్టిదే!

అహింసాధర్మమును శ్రీకృష్ణుఁడింతకంటె వేఱొక చోట నుపదేశించుట కవకాశము లేదు. ఒకస్థితిలో హింసచేయుమని చెప్పిన విషయమును దీసికొని గీత సర్వత్ర అట్టి హింసను లేక యుద్ధమును బురికొల్పుచున్నదని చెప్పుటతప్పు. నిత్యజీవితమందా కప్పుడు హింస యావశ్యకముగా భావించి నంతమాత్రమున మఱియొకతఱిహింసయే మానవజీవితమునకు నియతియగునని చెప్పఁగలమా? గీతారహస్యము తెలియఁగోరునతఁడుఅదిఅహింసా

రహస్యమును, మాయా దేహబుద్ధితోఁ దనను దెలిసికొనుటను రహస్యమును బోధించుటను జూపెట్టుచున్నదని తెలియవలెను.

ధృతరాష్ట్రుఁడు, యుధిష్ఠిరుఁడు, అర్జునుఁడు, కృష్ణుఁడు వీరందఱెవరు? వీరందఱు చరిత్రకు సంబంధించినవారా? గీత, వారినట్లు చెప్పుచున్నదా? అర్జునుఁడాకస్మికముగా దేవత్వము గలిగి శ్రీకృష్ణు నడుగుటయు, ఆ యర్జునునియెదుట శ్రీకృష్ణుఁడు గీతనంతను నట్లే యొప్పగించుటయు సత్యమా? అర్జునుడు, 'మైకము తొలఁగెన'ని యుప్పొంగుచు నిలువఁబడి 'గీతను మఱచిపోతిని. మఱలఁ జెప్పుమ'ని శ్రీకృష్ణునినిఁ బ్రార్థింపఁగాఁ గృష్ణుఁ డాశువుగాఁ దిరిగి గీతను జదివెనా?

దుర్యోధనుఁడు మానవ స్వభావముగలవాఁడనియు, అర్జునుఁడు దైవస్వభావము గలవాఁడనియు నా భావన. మన శరీరమే యుద్ధభూమి. ఇరుపక్షములవారికి దైనందినము యుద్ధము జరుగుచునే యుండును. వ్యాసుఁ డా యుద్ధమును వివరించి వర్ణించెను. మనస్సు అను పెద్దదేవాలయమందుఁ గృష్ణుఁ డధిష్ఠించెను. అందుండి యాతఁడు గీతను గ్రహించి పరిపూర్ణత్వము గలవాఁడాయెను. గడియారమునకు లోలకము వలె మనస్సునకుఁ బవిత్రత ముఖ్యము. పవిత్రత లేనప్పుడు గీతను వినరాదు.

లోకమందు మూర్ఖయుద్ధము నశింపదు. అహింస యిట్టిదని తెలియనివారికి గీత, జ్ఞాన ముపదేశించునదిగాదు. భయముగలవాఁడు. తన దేహమును గాపాడుకొనువాఁడు, కామ క్రోధములకు లొంగనివాఁడు మహాభయ్యుద్ధము చేసియే తీఱవలెను. కాని అది యాతని జ్ఞానము కాదు. జ్ఞాన మొక్కటే

అహింస మోక్షమును. మోక్షమనఁగా 'సత్'ను దెలిసికొనుట. అజ్ఞానమునకిచట తావు లేదు. ఈ వినోదప్రపంచమగు లోకమంతయు హింసయుండుచునే యుండును. ఉండకతప్పదు. అజ్ఞానము నశించుటకు గీత యుపదేశించును. అజ్ఞానము కంటె యుద్ధమందు హింసఁ జచ్చుటయుఁ, జంపఁబడుటయు మేలు."

## గీత పవిత్రగ్రంథము

ఇతరులకు హింసాగ్రంథముగాఁ గాన్పించు గీత మహాత్మునకు అహింసను బోధించు మహాపవిత్ర గ్రంథముగాఁ గాన్పించుచుండెను. వారి వారి సంస్కారములను బట్టి భగవద్గీత గాన్పించుచుండును. ధర్మయుద్ధ గ్రంథముగాఁ జెప్పుకొను మహాభారత గ్రంథము మహాత్మునకు యుద్ధమందలి అవినీతిని బోధించు గ్రంథముగాఁ గాన్పించుచున్నది.

గీతయందలి యంతరార్థమునుగూర్చి విస్తారముగ నొక్కఁడు విజ్ఞాన సముద్రములు నగు లోకమాన్య బాలగంగాధర తిలకు మహాశయునకును మహాత్మునకు నొకపర్యాయము వివాదము కలిగెను. మహాత్ముఁడు తన యాశయము విరుద్ధముగా నేమియు వాదింపలేదు. గుణాతీతమును శాంతమును బోధించు గీత యెట్లు అహింసను బోధించును? దుర్గుణములచే సద్గుణములను మఱచునట్టి మోహితులకు యుద్ధము, హింసయు లేకపోలేదు. కథలయందుఁ గల యర్జునుఁడు కృష్ణుఁడు మొదలగువారిని మహాత్ముఁడు గణుతింపఁడు. అహింసాధర్మమునకుఁ దార్కాణగా నున్న శ్రీకృష్ణుడే మహాత్ముఁడు గ్రహించును.

## మత జీవితము — ఆధ్యాత్మిక జీవితము

గాంధిమహాత్మునకు మత జీవితము అనఁగా ఆధ్యాత్మిక జీవితము దక్షిణాఫ్రికాలోఁ బ్రారంభమయ్యె ననుట లోక మెఱిఁగిన సత్యము. అంతకుముందే యన్యమతములతోఁ బరిచయము గలిగి యుండుటను మహాత్ముని యాత్మకథ వెల్లడించుచున్నది. గాంధిమహాత్ముఁడు ముప్పదియేండ్లు సత్యను మహాపదార్థజిజ్ఞాసతో నాధ్యాత్మిక జీవితమును గడపుచుండెను. దక్షిణాఫ్రికాలో శాంతిసమరము ప్రారంభించినదినము మొదలు జీవితాంతముదనుక మహాత్ముఁడు చేయుచుండిన సేవలు, ప్రభుత్వముతోఁ దలపెట్టిన యుద్ధములును జీవితమును, ఆధ్యాత్మిక సేవాశక్తి కలవియే యగుచున్నవి. మహాత్ముఁ డాచరించు సమస్తకార్యములు మానవకళ్యాణమునకు దోహద మగుట మనమెల్లర మెఱుఁగుదుము. గాంధిమహాత్ముఁడు దక్షిణాఫ్రికాలోఁ బ్రారంభించిన యుద్ధపద్ధతిని గమనించినయెడల నయ్యది దైవశక్తి యా యని ప్రపంచ మాశ్చర్యము పొందక మానదు. దానిని,

"ప్రభుత్వము మనకోర్కెలు నీడేర్పకపోయిన కారణమున ఈ తీర్మానము నేఁటి యుదయము మీ యెదుటకుఁ దీసికొని రాఁ దలంచితిని. నేడు యుగాది పండుగ. పర్వదినమునందు యుద్ధమున బాధపడుటకు, చెఱసాలలఁ బడుటకు, తరువాత విడుదల పొందుటకు సిద్ధముగా నుండవలెను. ఈ పద్ధతియే ఆత్మశక్తి పవిత్రతకుఁ దగినది; భగవంతునికి న్యాయమైనదియు."

"ప్రాణము ఉద్యోగము వ్యాపారము కుటుంబము శరీరము — వీని వేనిగూర్చియును మమకార మించుకొనరాదు.

ఇది మానవస్వాతంత్ర్యమును సాధించు యుద్ధము. అందుచే నిది మత యుద్ధ మగును. మనస్సాక్షిగా స్వాతంత్ర్యమును లక్షించి పోరాడుట మతయుద్ధముగానే యుండవలెను."

సృష్టికి సహజమైన విశేష మొండుగలదు. అద్వాని దేశకాలపాత్రముల కతీతమై యెల్ల యెడలనుండునది సత్యము. సత్యమును స్వయముగాఁ జూడవలయునను కోరిక గలవాఁడు సృష్టియందలి ప్రతిపదార్థమును దన యట్లు ప్రేమింపవలెను. అట్లు ప్రేమించువాని జీవిత మేనాఁటికిని బతివము కాదు ... నాకు సత్యమందంతు లేని ప్రేమగలదు. ఆ ప్రేమ నన్ను రాజకీయములందుఁ బ్రవేశింపఁజేసెను. ప్రభుత్వమునకు, మతమునకుఁగల సంబంధము నాకు గోచరమగుచుండెను.. ఈ రెంటికి సంబంధము లేదనువాఁడు మతమననేమో బొత్తిగాఁ దెలియనివాఁడని నేను స్పష్టముగాఁ జెప్పఁగలను."

"నేను ఆత్మస్వరాజ్యమునకుఁ బ్రయత్నించుచుంటిని. అందులకు దేశమునకు – ప్రాణులకు సేవచేయుట మార్గమగును...మతము లేని ప్రభుత్వము లేదు. మతమునకుఁ బ్రభుత్వ మొక తోడ్పాటు. మతము లేని ప్రభుత్వము ప్రాణము లేని శరీరము వంటిది."

"నేను ప్రభుత్వవాదినా? మతవాదినాయని ప్రశ్నించిన యెడల ప్రభుత్వమను నాటకమున నటించు నొక మతవాదినని చెప్పగలను."

"మత మొక ప్రమాను; దేశభక్తి యొకకొమ్మ, మతమునకు దేశభక్తి సరిపోలదు."

"కష్టములందు మీకు భగవంతుఁడు తోడగుఁగాక! భగవంతుని సహాయము పొందఁదగినస్థితిలో మీ సేవ యొప్పుఁగాక!" అని యాశీర్వదించిన మహాత్ముని వాక్యమహిమను గుర్తెఱుఁగుదురుగాక!

### భగవంతుని యెడ స్థిరత్వము

ప్రాక్తన పుణ్యముచేతను, బాల్యమందే దుర్గుణములను త్యజించిన త్యాగబుద్ధిచేతను, దక్షిణాఫ్రికాలోఁ బరిణతిచెందిన యాధ్యాత్మిక శక్తిసంపదచేతను, మొదలుగాఁగల యిట్టి యితర ప్రవృత్తులచేతను మహాత్ముఁడు భగవత్సత్యమందు స్థిరత్వబుద్ధి గలవాఁడాయెను.

"ఎల్లయెడల వ్యాపించి యుండెడి శక్తియొకటి కలదు. దానికి అవధులు లేవు... నేను ఆ శక్తిని గాంచఁజాలనైతిని. అయితే; దాని నిజతత్త్వమును గ్రహించుచుంటిని...ఆ పదార్థ మిట్టిదని పరిశోధించి చెప్పనలవిగానిది."

"మనలను రక్షించువాఁడెవఁడు? ఎందులకు రక్షించును? ఎట్లు రక్షించును? అని ప్రశ్నించినచో నుత్తరింప లేము. సాధారణవ్యక్తులు ప్రత్యుత్తర మీయఁజాలరు. అయినను, ఏదియో యొకశక్తి తమను గాపాడుచున్నదను జ్ఞానము వారికిఁ బొడ కట్టుచుండును. గతసంవత్సరము నేను మైసూరు పోయితిని. అచటి పల్లెకపుజనముతో మాటాడితిని. మైసూరును పాలించు వారెవరో వారికిఁ దెలియకుండెను. ఏదో యొకశక్తి యని మాత్రము వారు చెప్పిరి. తమను పాలించువాఁడితఁడని వారికిఁ దెలియకుండెను. వారి జ్ఞాన మంతవఱకు పరిమితమై యుండెను.

ఇది యిట్లుండ, పాలకులకు సాక్షాత్తుగానున్న దేవుని - అనంత మగువానిని-ఎట్లు గాంచఁగలము ?

"గ్రుడ్డునందొక జీవపదార్థముకలదు. అట్లే, సృష్టిగూడ చట్టము అనఁగా నియతికల్గినదై యుండును. ఆ చట్టము-నియతి-ఒక్కొక్క-దానిని, ఒక్కొక్క-నిసి తన యిష్టము చొప్పున సృష్టించుచుండును. అనఁగా సృష్టినిర్మాణము జరుగుచుండునని యర్థము."

"ఆ నియతి భగవంతుఁడు. నియతియు, ఆ నియతిగల సృష్టియు నొక్కటే."

"భగవంతుని యందును, ఆతని శక్తియందును, ఆతని ప్రేమయందును నాకుఁగల నిశ్చయము ఊహింపరానిది. కుమ్మరి చేతియందున్న బంకమన్నువంటివాఁడను."

అనియును,

"భగవంతుని సత్యమందును, ఆత్మసత్యమందును నా దేశీయులకు నిశ్చితవిశ్వాస ముండినయెడల, వారు తమ శరీరము చెఱసాలకనియును, దేశసేవకనియును ప్రభుత్వము వారు భయపెట్టినను వెఱవక మనస్సును, ఆత్మను, ప్రాణమును ఆకాశపక్షివలెఁ గట్టుపాటులేకుండ నిలుపుదురుగాక!"

అనియును,

"భగవంతుఁడు దారిచూపఁగలఁడని నా నమ్మకము."

"నా స్వభావము నా స్థితిని ఒప్పుకొనదని నేను చెప్పఁగలను. అది భగవంతుని సత్యమును దాఁచలేదు."

అనియును మహాత్ముఁడు ప్రసాదించిన యీ వాక్యములను బరిశీలించిన యెడల భగవంతునియెడ మహాత్మునికిఁగల భక్తిభావము మేరమీఱినదని స్పష్టము కాఁగలదు. ఆ నిశ్చయముగలవారు తమ ప్రతికార్యమును భగవంతుఁడు చూచుచుండునని భావించి భగవంతునకు భయపడి యిహాపరములకుఁ దగు మనస్సాక్షిగా నడుచుకొందురు గాక!

"భగవంతుని లెక్కలలో మనవను లెక్కను."

"లోకమందెవరికిని భయపడను; భగవంతుని కొఱకే భయపడుదును."

"భగవంతునకు భయపడి నడుచుకొందుముగాక! మనుష్యునకు భయపడి నడుచుకొనుటను మానుకొందుము గాక! మన మనస్సునందు భగవంతుఁడుండుటను, మనము ధ్యానించుటచే భగవంతుని దర్శింపఁగలమను విషయము దెలిసికొనఁగలమేని మనము భగవంతున కొఱకునికిఁదప్ప లోకమందు దేనికిని భయపడుటను విడనాడఁగలము."

ఈ మహావాక్యములను ప్రసాదించిన మహాత్ముఁడీ లోకమందు భగవంతునిఁ గాక వేఱొకనిని జూడఁగలఁడా? మహాత్ముని మనస్సే భగవంతుని మనస్సు; మహాత్ముని మాటలే భగవంతుని మాటలు; మహాత్ముఁడు చేయు పనులన్నియు భగవంతుని కార్యములు. భగవంతుఁడు నిండియున్న యాధ్యాత్మిక జీవితము మహాత్ముని జీవితమగుటవలనఁ దన బుద్ధిచేతనో, తన యందుఁగల భగవంతుని బుద్ధిచేతనో చెడుతలంపు కలిగిన యెడల "భగవంతుఁడు హెచ్చరిక చేయుచున్నాఁడ"ని నిరశన వ్రతము మొదలగు యజ్ఞములు చేయుటకు మహాత్ముఁడు

సంసిద్ధుఁ డగుచుండును. ఈశ్వరుని దర్శింపవలయుననిన మనస్సునందలి భగవన్మహిమ చేతనేగదా ? మహాత్ముఁడు భగవత్ప్రేమతో జీవితమును నడుపుకొనఁ బ్రయత్నించుచుండును. చౌరీచౌరా హత్యాదురంతములు వంటి మహాఘోరక్రూరకార్యములఁ గాంచుట కెన్ని పర్యాయములు మహాత్ముఁడు "భగవంతుఁడు హెచ్చరిక చేయుచున్నాఁడ"ని సత్యాగ్రహ యుద్ధము లాపలేదు? ఎన్నిపర్యాయములు నిరశనవ్రతములు పూనలేదు? గోహత్యాకారణముగా నిరువదియొక్క దినములు నిరశనవ్రతమాచరించినప్పుడు, మన పూజ్యగాంధీజీ "భగవంతుఁడు భగవంతుఁడని యశ్రుకణములు రాల్చుచు గాఢపడుచుండుట భారత భాగ్యోదయమున కేగదా ! (25-9-1924) 'యంగు ఇండియా' పత్రికాముఖముగా మహాత్ముఁ డనుగ్రహించిన యుపదేశ మిట్లుగలదు.

"హృదయఫలకమునందు భగవంతుఁడు తొంగిచూచుట తోఁచుచున్నది. హృదయఫలకమందు భగవంతుని భద్రపఱచు కొందుముగాక!

"గోహత్యావార్త నా హృదయమును వ్రయ్యలు చేయుచున్నది. ఇందులకుఁ బ్రతీకార మన్వేషింపవలయునని నిశ్చయించుకొంటిని. శాంతిలేక బాధతో రెండురాత్రులు జాగరించితిని. బుధవారమునాఁడు చికిత్సను గనుగొంటిని. అందుకు నేను బరిశుద్ధిని (ప్రాయశ్చిత్తము) అన్వేషింపవలెను. సత్యాగ్రహ-ఆశ్రమమందు ప్రాతఃకాల ప్రార్థనమందు, తెలిసియో, తెలియకయో మా చేసిన పాపములను మన్నించుటకై మేము దయామయుఁడగు పరమేశ్వరుని గుఱించి ప్రార్థనలు చేయు

గుము. తెలియక చేసిన పాపములకుఁ బరిహారము నా హృదయమునందుఁ గలిగిన జపమే ప్రాయశ్చిత్తమగును.

"నన్నుఁ బ్రేమించుచున్న హైందవులకు ముస్లిములకు నా దొక హెచ్చరిక. నన్ను వారు యథార్థముగాఁ బ్రేమించుదురేని, నే నందులకుఁ దగుదునేని తమతమ హృదయములందున్న భగవంతుని మఱచి చేసిన పాపమునకు నాతోఁగలసి ప్రాయశ్చిత్తవ్రత మనుష్ఠించుదురుగాక! అన్యమతములను నిందించుట, దూషించుట, హేళనచేయుట, అన్నెముపున్నెము నెఱుఁగని యమాయికప్రజలను హింసించుట, దేవాలయములను, మసీదులను ధ్వంసముచేయుట భగవంతుని మఱచుట యగును.

"నేను జేయువ్రతము భగవంతుని గూర్చియు, నన్ను గూర్చియు."

ఇట్లు ప్రారంభించి 'యంగు ఇండియా' పత్రికయందుపదేశించిన ప్రతివాక్యము శిరోధార్యమగును.

"స్వాతంత్ర్యమును గోరువారు పరస్పర ప్రేమగలవారై యుండవలెను. ఒకరిమీఁద నొకరికి నచంచల విశ్వాసము కలుగవలెను. విశ్వాసము భగవంతుని యందలి విశ్వాసముగా భావింపవలెను."

"నేను చేతగాని వాఁడనని నాకుఁ దెలియును, సర్వము చక్కదిద్దవలసినవాఁడు సర్వేశ్వరుఁడు. 'ఈశ్వరా! ఈ దాసుని నుపయోగించుకొనుము. తమ దయామృతముచే నీదాసుని దరిజేర్పుము. మానవుఁ డెవఁడు? సర్వము శూన్యము; తుచ్ఛము. నెపోలియన్ అంతటివాఁడు మనోరాజ్యమెట్లు పాలింపఁ గలి

గెను! తుదకు సెంటుహాలీనా కు 'బందీ' యయ్యెను. మహా పురుషుండైన సీజరు తన యంత్యకాలమందు సాధారణ మానవుని యట్లయ్యెను. సర్వము తమ లీలావిలాసము! ఇట్లు నిన్ను ధ్యానించు భాగ్యము పొందుదుముగాక !!!

భగవంతునియందు మహాత్ముని కెంగల భక్తి తత్పరతను దెల్పుట కనేక దృష్టాంతములు కలవు. వానినన్నిట నిట నుదాహరించుట గ్రంథవిస్తర భీతిచే మానుకొనవలసి వచ్చినందులకు మా పాఠకమహాశయులు మన్నించుదురుగాక !!

మహాత్ముండు 'భగవంతుండు, భగవంతుండు' నని చెప్పుచుండుట నే దేవునిగూర్చి? ఆ దేవుని స్వభావమేమి? ఆతని పేరేమి? ఊరేమి?' యని యాలోచింపవలసిన యావశ్యకత లేదు. హృదయమును భగవంతునికి నాలయముగాంజేసి 'భగవంతుండు సర్వాంతర్యామియై సర్వముగాంచుచు, మనము గావించు పనులను దిలకించుచుండు'నను సత్యము గోచరించు వానికి బెక్కు దేవుళ్ళను సేవింపనేల ?

దీనిని,

"భగవంతుం డొకండున్నాండనుట సత్యము. పెక్కు దేవుళ్లు లేరు. భగవంతు నెఱుంగకుండ నుండుటకు సాధ్యము గాదు; ఎఱుగ సాధ్యమును గాదు. ఆతండు కన్నులు లేకయు సర్వము గాంచంగలవాండు; చెవులు లేకయు వినంగలవాండు; ఆతనికి రూపము లేదు. ఆతనిని భేదింపలేము. ఆతం డెవరిచేతను సృష్టింపంబడినవాండు కాండు. ఆతనికిం దల్లిదండ్రులు, ఆలు బిడ్డలు లేరు. అయినను, ఆతండు తండ్రిగాం, దల్లిగా, బిడ్డలుగా భావింపంబడుచు భక్తులచేం బూజింపంబడుచుండును.

ఆతఁడు, చెట్టు, పుట్ట, ఱాయిగా లేకపోయినను, వానియందును గలవానినిగా భావింపబడుచుఁ బూజింపఁబడుచుండును. ఆతని వ్యాప్తి నెఱుఁగనివానికిని నాతఁడు రక్షకుఁ డగును."

"వేదములందుఁ బెక్కురు దేవతలు గలరు. ఇతర మతముల వారు దేవుని దూతయని యందురు. అయితే వేదములోకే దేవునిని గీర్తించుచున్నవి."

అను మహాత్ముని సత్యవాక్యములను గ్రహింపుఁడు.

## మహాత్ముని స్థితి

గాంధి మహాత్ముఁడు; భగవంతుని నొక్కని నమ్మి, దేవుని ధర్మము నాచరించుచు జీవించుచున్నచో నాతఁడు బ్రహ్మజ్ఞానము గలిగింపఁ గలవాఁడనియు, "దేవునిని జూడఁగలసనియు, ఇప్పుడు జాగ్రదవస్థలోని యనుభవములు, మనస్సును దన యధీనమై యున్నవనియు, స్వప్నావస్థయందు అనఁగా సజ్ఞానావస్థయందవి యొకప్పుడు తమను దోలఁగిపోవుచున్నవనియు, అందుకొఱకు రామనామ జపము చేయుట యనియుఁ, దన యనుభవస్థితిని నొక పర్యాయము 'నవజీవన్' పత్రికయందు తెలియఁ జెప్పెను. తఱువాత వ్రాసిన యథార్థమగు సత్యభూయిష్ఠమైన జీవితమును 'ఆత్మకథ' యందు వ్రాసిన మహాత్ముని ప్రసంగమువలన మహాత్మునికి భగవంతునియందుఁ గల భక్తి భావము లోకము గ్రహింపఁగలదు. అందుఁ గొన్నిటి నిటుఁ దెల్పుచున్నాఁడను.

"ఆత్మార్థ లోకమందు నేను జేసిన పరిశోధనలను సూక్ష్మముగాఁ దెలుప నుబలాటపడుచున్నాను. అవిమాత్రము

నాకుఁ దెలిసినవి. వాని మూలముననె ప్రభుత్వమునకుఁ బ్రజలకున్ను, లోకమునకు సేవ చేయుటకును సమర్థమైన శక్తిని గలిగి యున్నాను."

"ఈ ముప్పదియేండ్లనుండి యేది తలఁచినను, దేనికిఁ బోరాడుచున్నానో, దేనికొఱకుఁ దహతహలాడుచున్నానో యని యనఁగాఁ దనను నెఱుఁగుటకు అనఁగా భగవంతుని సాక్షాత్కరించుకొనుటకు అనఁగా పొందుటకని స్పష్టపడును. ఇది యొక్కటి పొందుట కొఱకే నేను ప్రాణముతో జీవించుచున్నాను. మాటాడుట, తలఁచుట, స్వరాజ్యమునకై సేవ చేయుట ఆదిగాఁగల సమస్తము నందు కొఱకే."

"తనకును దన సృష్టించినవానికిని మాత్రము తెలియఁదగిన ఘటనలు కొన్ని గలవు. అవి చెప్పకొనరానివి."

"భగవంతుని రూపభేదములు పెక్కులు. నేను భగవంతుని 'సత్తు' అను పదార్థముగానే భావించుచున్నాను. ధ్యానించుచున్నాను. సత్పదార్థముగా నుండున దొక్క భగవంతుఁడు మాత్రమే. తక్కిన సృష్టిజాల మంతయు నసత్పదార్థమే. నిత్యుఁడును, సత్యుఁడునైనట్టి యాతనిని నే నింకను గాంచలేక పోవుచున్నాను. అతనిని గాంచుటకు బ్రయత్నించుచున్నాను. అందులకై నాకిష్టమైన సమస్తమును త్యాగము చేయ సంసిద్ధుఁడనై యున్నాను. ఆ త్యాగము నా ప్రాణమును గోరిన నిచ్చుటకు సంబరపడుచున్నాను. ఆ 'సత్తు' పదార్థమును నేను జూచువఱకు మాత్రము నే నందుకుఁ దగిన సత్యమార్గమును దృఢమగు తలంపు నవలబింపవలెను.

"ఈ సత్య పదార్థమును బరిశోధించుచున్నప్పుడు కొన్ని సమయములందు ఈ సత్పదార్థము మెఱుపుఁదీఁగవలెఁ గన్పించుచున్నది. భగవంతుఁ డొక్కఁడే సత్యు. మిగిలిన సమస్తము నసత్తను నిశ్చయము నాకు నానాఁటికిఁ బ్రబలుచున్నది."

"సత్యపరిశోధనయందు అలభ్యము లభ్యమునను రెండును గలవు. ఆపరిశోధన ధర్మమార్గము వీడినవానికి లభ్యమగుటాకలుగను. ఏమిఁను నెఱుఁగనివాని కది సులభము. సత్యమార్గమున నడుచుకొనువాఁడు మహా శాంతగుణము కలిగియుండవలెను. లోకమం దెల్లరు శాంత గుణమును దమ కాళ్ళక్రిందఁ బెట్టి త్రొక్కుచున్నారు. సత్యము పలుకువాఁడు శాంతగుణ ప్రధానుఁడై తపస్సు చేయుచుండు వాఁడుగా నుండవలెను. ఆద్యంతము లేని – సత్యమును ఆతఁడు గాంచఁగలఁడు."

"సత్యాగ్రహ తత్త్వమును శోధించుట నా లక్ష్యము. నే నెంతయో మంచివాఁడనని చెప్పుకొనుట నా చేతఁగానిపని. నాలో నేనే సంతోషించుకొను చుండినచో సూరదాసుకవి చెప్పిన విధముగా నావంటి పాపి వేఱొక్కఁడేఁడి? నన్ను సృష్టించిన భగవంతుని మఱచితిని. అంతమాత్రమైన జ్ఞానము లేని మూర్ఖుఁడ నైతిన"ని యెంచవలెను."

"భగవంతుఁడు నా జీవితమును సదుపుటయు, నేను ఆతనియొద్దనుండి జన్మపరంపరగా వచ్చినదియు నెఱిఁగి యింకను ఆ భగవంతుని దరికిఁ జేరువాఁడను గాలేక నొప్పుచున్నాను. అది నాకుఁ జెప్పరాని యావేదనను గలిగించుచున్నది."

"నేను మతప్రవక్తను కాను. ప్రవక్త లక్షణములు నాకు

లేవు. తెలిసియో తెలియకయో యున్నట్టి నాలోపములు తొలఁగుగాక. నాకు సత్యమందు నిశ్చల భక్తికలను."

"మానవుఁడు దైవ ప్రతినిధిగానుండి, సహనముతో సేవ చేయుచు భగవత్ప్రేమకుఁ బాత్రుఁడగు గాక."

"నేను మహాత్ముఁడనుకాను. నాకై మీరేమియు చేయ వలదు. నేనుమౌనవ్రతమును చేయునప్పుడు నాదర్శనమభిలషించు దురు. దర్శనమిచ్చుటకు నేను అసమర్థుఁడను. నేను మీవంటి వాఁడను. ; ఆశాపాశవశుఁడను. కాఁగా, నేను దర్శనమిచ్చుట కెట్లు తగుదును ? సత్పదార్థ దర్శనమావశ్యకము. అది నామరూప భేదరహితమైనది. ఆమహాపదార్థమును పేదల యిండ్లయందును, రాజప్రాసాదములందును, కొండగుహలందును, దేవాలయము లందును దర్శింపుఁడు. నన్ను మీరు దర్శింపవలెనని కోర్క తగదు. నాదర్శనముచే మీకెట్టిఫలము కలుగఁజాలదు.

## మహాత్ముని సత్పథము—సన్మార్గము

అట్లు సత్తుఅను పదార్థమునెడ నిశ్చయముగలిగి యాపదార్థ సంబంధ మెఱుఁగి జీవించుమతి మేలని గ్రహింపవలెను. ఆమతము సత్యమతము లేక సన్మార్గము అని చెప్పవచ్చును. గాంధిమహాత్ముఁడా ఆసన్మార్గమును సత్యాగ్రహమని చెప్పుచుండెను. లోకమందలి మతములన్నియు నీసన్మార్గమునే ప్రబోధించుచున్నవి. మతమును దీనిని గ్రంథములందు, చిహ్నములందు, తమకు వేఱుగానున్న యితర మతములందు బంధించి తమ మనస్సునందు విరోధము ద్వేషము మొదలగు దుర్గుణములు గలిగియుండు మతముల మాటనో యిటచెప్పఁబోవ వలసినపనిలేదు. ఆమతములు సత్తును బోధించు మతములుకావు.

అవియుద్ధములను ప్రేరేపించు మతములని చెప్పఁదగినది. గాంధి మహాత్ముని ప్రేమను, అహింసను-క్రమ క్రమముగాఁ గలిగిన సత్-ఆగ్రహముగల సన్మతమగును. అనఁగా సన్మార్గమగును. దానినేపేరున నెట్లు పిలిచిననేమి ?

"మతమనఁగా నేమి ? ప్రపంచమందలి మత వేదములు అన్నిటినిఁ జదువుట మతము కాఁజాలదు. మతమనునది యొకమూలఁ భద్రపఱచు వస్తువుకాదు. అది హృదయమందు నిండియున్నది. అది మనసుండి వేఱుగా నుండునదికాదు. అది యెప్పుడును మనతో గలిసియుండును."

"మతమనఁగా నభిప్రాయము. ఆయభిప్రాయమును వదలుకొనుట మత ధర్మమునుండి చ్యుతిపొందుట యగును."

"మతముయొక్క సారము జ్ఞానము."

"మతము లేని జీవితము ఆదర్శధర్మము లేనిది. ఆ యాదర్శ ధర్మము లేని జీవితము చుక్కాని లేని పడవవంటిది."

"మన మతము అహింసా ధర్మము గలది. అది ప్రేమ తప్ప వేఱేమియుఁగాదు. ప్రేమయనఁగాఁ జుట్టములను నెయ్యురను ప్రేమించుటమాత్రము కాదు. శత్రువులను సహానముతో నాదరించుటయే ప్రేమ."

"తనను దానెఱుఁగటయే మతము."

గాంధిమహాత్ముఁడు జన్మించిన మతము వైష్ణవ మతమగుటవలన మహాత్ముఁడు వైష్ణవుఁడసియు, మహాత్ముఁడు ప్రాతఃకాలముననే పాపములను బోఁగొట్టుమని పరమేశ్వరునిఁ బ్రార్థించు చుండుటవలన మహాత్ముఁడు శైవ మతాభిమానుఁ

డనియు, మహాత్ముఁడు పుట్టుకచే వైష్ణవుఁడయినను మహాత్ముని నిత్యనైమిత్తికాది కర్మములన్నియు తత్సంబంధములు లేకుండుట చేతను సర్వమత సమత్వబుద్ధి గలిగినవాఁడైనను, అహింసా ధర్మములు మితిమీఱి ప్రేమించుచున్నను, రాత్రులందు భోజనము చేయక, సాయంకాలమునకు ముందే భుజించుటచేతను, ఫాలతలమునఁ దిలకము దిద్ది తీర్చికొనువాఁడు కాకపోయినను, హిందూ దేవాలయములకుఁ బోవనివాఁడైనను మహాత్ముఁడు జైనుఁడనియు, బుద్ధుఁడనియు, ఏసుప్రభువు వ్రాతను మీఁదఁ జెప్పిన బోధనను జరుపుచుండఁగాఁ దనకు సత్యాగ్రహము ధర్మమును గనుఁగొంటినని చెప్పియుండుటచేతను, మాటిమాటికి ఏసునాథుని పేరును, బైబిలును గ్రహించుచుండుటచేతను, మహాత్ముఁడు క్రీస్తు అనియును, ఖిలాఫతు ఉద్యమము నడుపుటవలనను, మహమ్మదు నబీని ప్రశంసించుచుండుటచేతను, ఖొరాను గ్రంథమునందు భక్తిగలిగి యుండుట చేతను మహాత్ముఁడు ఇస్లాము మతము వాఁడనియు, సింకను వేలువేలు విధములుగాఁ బలువురు పలుతీరులఁ జెప్పుకొనుచుందురు. గాంధిమహాత్ముని సర్వమత సాత్త్వికుఁడని పెద్దలందఱు ప్రశంసించుచుండుట గర్వింపఁదగిన విషయము.

## వైష్ణవము

గాంధిమహాత్ముఁడు పుట్టిన మతము వైష్ణవమైనను, తుది వఱకు ఆమతమును నంటిపెట్టుకొని యుండలేదు. మహాత్ముని వైష్ణవము సర్వమతముల సమరసముగా నుండెను. నుదుటఁ దిరునామాలో, గోపీచందనమో మతచిహ్నమో ధరించి యుండు మతమువారిని జూచినచోఁ గన్నులు మూసికొనునంతటి ముదిరిన

వైష్ణవము కాదు. కాఁగా, వైష్ణవమన నేమి? విష్ణు సంబంధము గల వైష్ణవమతము. విష్ణువను పదమునకు సర్వము వ్యాపించుట యని యర్థము. సర్వవ్యాపకుఁడయిన భగవంతుఁడు విష్ణు మూర్తి యితరమతములవారి మనస్సులం దుండఁడా? సర్వ వ్యాపియయిన సర్వాంతర్యామిని నొక దేవాలయమందో, యొక సంఘమందో నిర్బంధించి యితరులను చేరరాకుండ వెలివేయుట సర్వవ్యాపకుఁడగు భగవంతుని విష్ణువుని నిట్లుదాఁచుట భగ వంతునియెడ నపచారము చేయుట కాదా? ఇట్టి సంకుచిత తత్త్వముగలవారు వైష్ణవులా?

సత్యమయిన వైష్ణవమేది? ఎల్లయెడల నెల్లజీవులందును విష్ణుతత్త్వమును భావించి యేప్రాణికి హింస గావింపని యొక మహాధర్మమే సత్యమయిన వైష్ణవము. ఈవైష్ణవము గాంధి మహాత్ముని వైష్ణవము. ఈ వైష్ణవము లోకమందుఁగల యెల్ల రికిఁ దగినది. అట్టి మత మొక సంఘమువారికి మాత్ర మొప్పునది కాదు. గుజరాతీ భాషలో "వైష్ణవుఁ డెవఁడు? అను మకుటము గల యొక కీర్తన గలదు. దానిని మహాత్ముఁడు బహుభక్తితోఁ బాడుకొనుచుండును. ఆపాట వైష్ణవమందలి సత్యమును బోధ పఱచును.

అది యిట్లు:—

వైష్ణవజనతో తేనే కహీయేఁ, జోపీడ పరాయీజాణరే;
పారు కేఁ ఉపకారకరే తోయే మన అభిమానన రే;
సకలలోక మా చలనే వందే నిత్యానకరే కేళారే,
జిస్వా త్తకీ అసత్యనబోలే పరధన నవజాలే హాథరే.

సమదృష్టినే తృష్ణా త్యాగీ పరస్త్రీ జేనే మాతరే
వాసకాచ్ఛ మన నిశ్చలరాఖీత సతిస జననీ తేరే,
మోహమాయా వ్యాపేన హీ జేనే దృఢ వైరాగ్య
జేనామన మారే,
రామనాము సూంగ్‌దాలీ సకలర్థ దేనాతనాగ్రరే.
వణలో పీణే కపట రహితచ్ఛే కామక్రోధ నివార్యాగే,
పణే నర్సైయోజ్ తేనుణ్ తరాస కర్నాణ్ కుల్ ఎకో
దేర తారన యారే —

గాంధిమహాత్ముడు శివప్రార్థనను సత్యాగ్రహ – ఆశ్రమమందు పాప పరిహారార్థము ప్రతిదినము ప్రభాతకాలమున ప్రార్థించు నాచారము కలదు. ఆ ప్రార్థన:—

హర హర శంభో శంకర మహాదేవ్
శంభో శంకర మహాదేవ్ —

## శైవము

అట్లు ప్రార్థించుటవలన మహాత్మునకు శైవుడని చెప్పుటలో సత్యోక్తి లేదు. అయితే, ఇతర మతములవా[illegible] కన్నులెట్టి చేసికొను శైవము మహాత్మునిది శైవము కాదు. "ఏ ప్రాణి నైనను నీవలెనే చూచుము నెల్ల ప్రాణుల ప్రాణము శివుడనియు – ఎల్ల ప్రాణులను ప్రేమించుమని" శైవ మతము చెప్పుచున్నది. ఎల్లప్రాణులందును ప్రేమ గలిగి యుండుటయే శైవము. ఆ కారణముచే శివుడు('Shiva God of Mercy') దయగల దేవుడ'ని గాంధిమహాత్ముడు ప్రార్థించుచుండును. "సత్యాగ్రహ – ఆశ్రమమందు ప్రాతః కాల ప్రార్థనయందు

దెలిసియో తెలియకయో చేసిన పాపములను క్షమింపఁగోరుచు దయా స్వరూపుఁడగు శివుని గూర్చి మేము ప్రార్థించుకొను చుందుము" ని మహాత్ముని తిరువాక్కులు. పైనఁ జెప్పిన వైష్ణవమునకును, ఇచటఁ జెప్పిన శైవమునకు భేద మేమి గలదు? శైవవైష్ణవుల కర్థము లేని జగడము లేలకో?

## జైనము

గాంధిమహాత్ముఁడు ఆచార వ్యవహారాదికములు కొన్ని జైనమతమునకుఁ దగినవై యుండుననుటలో సందేహము కానరాదు. గాంధిమహాత్ముఁడు జన్మించిన గుజరాతీ దేశమం దెక్కువ భాగము జైన మతము గలదు. ఆ దేశమందు దాదాపు వివిధమతములవారును జైనమతస్థులను ప్రేమించు చుందురు. గాంధిమహాత్ముఁడు ఆంగ్లదేశమునకుఁ జదువునకై పోవుటకుఁ దల్లి ననుమతి గోరినప్పుడు, తల్లి పుత్లీబాయి యొక జైనమత గురువు నాజ్ఞప్రకారము మూఁడు శపథములను మహాత్మునిచేఁ జేయించిరి. ఆ మూఁడు శపథముల నింతకుముందుఁ జదువుకొని యుంటిమి. జైనమతము ప్రత్యేకమతము గాదు. 'అహింసా పరమోధర్మః' అను మహాధర్మమే మహాలక్ష్యముగాఁ గలది యీ జైనమతము. ఈ మహా ధర్మమును జెప్పని మత మొకటి యీ లోకమందున్నట్లు చరిత్రలు దెలుపుటలేదు. ఆ ధర్మము మనస్సంబంధమైనది. గాంధిమహాత్ముఁడు 1916 - అక్టోబరులో 'మోడరన్ రివ్యూ' అను పత్రికా సంచికయందు వ్రాసిన యొక చిన్న వ్యాసములో,

"నేను పుట్టుకయందు వైష్ణవుఁడను. చిన్నతనముననే నాకు అహింస బోధింపఁబడినది. ప్రపంచమందలి యితర మత

గ్రంథములందుండి నాకు సత్యము బోధపడినట్లే, జైనమత గ్రంథములనుండియుఁ బెక్కు సత్యములను గ్రహించితిని. జైనతత్త్వ శాస్త్రియగు రాజచంద్రకవికి నేను మిక్కిలి ఋణపడితిని." అని చెప్పియుండుటను గ్రహింపుఁడు.

## బౌద్ధము

జైనమతముతో సంబంధముగల బౌద్ధ ధర్మమును ప్రబోధించిన బుద్ధభగవానునిమీఁద గాంధిమహాత్మునకుఁ జెప్ప నలవికాని ప్రేమగలదు. బుద్ధ భగవానుని బోధనములఁ జెవి యొగ్గి కొనని మానవుఁడు మానవుఁడా? మానవుఁడుగా జన్మించి జీవిత సత్య మెఱిఁగిన మహానుభావుఁడు బుద్ధభగవానుని పుణ్య ధర్మ మెట్లు త్రోసి పుచ్చఁగలఁడు? 1924-వ సంవత్సరము మే మాసము పదునాఱవ తేదీ 'జాహుూ' లో గాంధిమహాత్ముఁడు బుద్ధుని జన్మదినోత్సవ సమయమున జరిగిన బుద్ధజయంతి మహా సభ కధ్యక్షత వహించి మహాత్ముఁడు కావించిన యుపన్యాస మును జదివినచో బౌద్ధమతము నెడల మహాత్ముని యభి ప్రాయము సుస్పష్టముకాఁగలదు. ఆ యుపన్యాస సారాంశము:—

"బుద్ధ భగవానుఁ డేధర్మమును లోకమునకు బోధించెనో, యా ధర్మమును వ్యాపింపఁజేయుటకు నేను ప్రయత్నించు చుండుటయే నన్ని మహాసభకధ్యక్షునిగా నెన్నుకొనుటకుఁ గారణము. బుద్ధుడు క్రొత్తమతమును సృష్టింపలేదు. హిందూమతము నకే ప్రాణము పోసెను. ఇతర ప్రాణులను బలియిచ్చుట యజ్ఞము కాదు. తనను త్యాగము చేయుటయే సత్యమగు యజ్ఞము. ఈ యర్థము వేదములను నిందించినట్లుగా బుద్ధునిపై వారిచే నిందలు మోపఁబడుచున్నవి. సనాతనాచారములపట్ల యాతఁడు

తులు దీర్ఘసత్యసమును బోగొట్టుకొనిరి. బ్రాహ్మణులు వేదాక్షరములను ప్రమాణముగా భావించి వేదార్థమును మఱచి పోయిరి. ప్రేమయు దయయుఁ గూడను జయమును పొందునని బుద్ధభగవానుని బోధన."

## క్రైస్తవము

క్రైస్తవమతము మీఁదను మహాత్మునకుఁగల ప్రేమ యపారము. గాంధిమహాత్ముఁడు తన సత్యాగ్రహ ధర్మమునకు గిరిప్రవచనము కారణమని చెప్పియుండుటయు చాలును. గాంధిమహాత్ముని జీవితమునకును ఏసుప్రభుని జీవితమునకు గొప్ప పోలికగలదు. ఏసుక్రీస్తే గాంధి మహాత్ముఁడుగా నవతరించెనని కొందఱు నమ్ముచున్నారు. శాంతము, ఇతరులకుఁ గీడు చేయకుండుట; కష్టసహిష్ణుత, పాపపరిహారమునకై భగవంతునిఁ బ్రార్థించుట, తనకు కీడుచేయు దుర్మార్గుని భయపడకుండుట మొదలగు ఏసుక్రీస్తు బోధనలందున్న సారము. ఇవి గాంధిమహాత్ముని జీవితమందును మనఃకమలమందును వికసించి యుండుట లోకమెఱిఁగిన సత్యములలో నొకటి. అట్టిదైన గాంధిమహాత్మునిఁ ఏసుక్రీస్తుగా భావించుటలో నబ్బురమేమి కలదు? "రేపటికని భయపడకుము" అను ఏసుక్రీస్తు తియ్యని వాక్యమును మిక్కిలి మఱుగుపఱచి మాసము మాసము వేలకొలఁది జీతము పుచ్చుకొనుచుఁ బ్రచారము చేయు ఫాదిరి మతమనిన మహాత్మునకు గిట్టదు. ఈవిషయమును మహాత్ముఁడు పలుచోట్లఁ జెప్పియుండెను. ఫాదిరి మతముఁగా క్రైస్తవ సంఖ్యా పెరుఁగుటకుఁ బ్రయత్నించుట. దేశమున్నంతలో మతము మార్చుకొనుట వలన లాభమేమి? ఈ విషయమై గాంధిమహాత్ముఁడు.

"లౌకికమగు మంచికై యొకమతమును విడిచి మఱి యొక మతమందుఁ బ్రవేశించుట న్యాయమగు నెడల నేనును గొంచెమైనను వెనుకాడక యాపద్ధర్మ మాచరించెదను. అయితే మతమనునది మనస్సు ననుసరించి యున్నది. శరీర సౌఖ్యము నకై మతమును మార్చుకొనరాదు" అని చెప్పిన మాటల సత్యమును గ్రహింపుఁడు.

## ఇస్లాము

ఇస్లాము మతమందు గాంధిమహాత్మునికిఁగల ప్రేమ ఐరోపా సంగ్రామానంతరము ఖిలాఫతునకు న్యాయము కలుగ నప్పుడు సర్వ ప్రపంచమునకు స్పష్టముగా యెల్లరెఱిగిన సత్యము గదా! ఖిలాఫతునకై గాంధిమహాత్ముఁడు చేసిన సేవ మత జగత్తునకు వెన్నెల బాటవంటిది. 'ఖిలాఫతుకై' "కామధేనువ'ని మన మహాత్ముఁ డనుగ్రహించి యుండెను. నబీ నాయకుని గూర్చియు, ఖొరానును గూర్చియు, మహాత్ముఁడు పలుప్రసంగ ములు చేసియుండుట వలన మహాత్మునకు ఇస్లాము మతము నెడ నధిక గౌరవము కలదని ద్యోతకమగుచుండెను.

## సమరస సన్మార్గము

ఇట్లు చెప్పఁబడని యితర మతములను గాంధి మహాత్ముని మతమే యగును. మతముల పేరులకు మహాత్ముఁడు విలువ నీయఁడు. ఏ పేరునఁ బిలిచినను మతము మతమే. సమస్త మతముల యంతరార్థము, ఆశయము నొక్కటియే యని యుంటి దనుక మనము మహాత్ముని జీవితమందొకట్టి రెండు విషయ ములు కలియక పోయినను మహాత్మునకు సర్వ మతములును

'సత్' మతముగాఁ గానిపించు చుండెను. సత్యముతో నాగ్ర హించుటను సత్యాగ్రహమని మహాత్ముఁడు గ్రహించుట జగత్ప్రసిద్ధ సత్యములలో నొకటి. అనఁగా గాంధిమహాత్ముని మతము సత్యాగ్రహ మతమని స్పష్టమగుచున్నది. మహాత్ముని మతము, విరోధము, అసహనము మొదలగు వానిని దూరీకృతముచేయు నహింసా ధర్మమని సిద్ధాంతీకరింపఁ దగును. అహింసా ధర్మము సామరస్య మందొప్పు చుండుట సర్వవిదితము. కాఁగా మహాత్ముని మతమును సమరస సన్మార్గమని చెప్ప నొప్పును. "దయఁగలవా రెల్లరును సమరస సన్మార్గమునకుఁ జేరినవారే" యనియు, కరుణయే సమరసన్మార్గమునకు ముఖ్యమ"నియు శాస్త్రివేత్త లంగీకరించిరి. మతమును గుఱించి మహాత్ముఁడు వెలువరించిన యాశయములలోఁ గొన్నిటినిఁ జదువు కొనుఁడని పాఠకమిత్రులకు వేఁడికోలు :—

"లోకమందలి గొప్పమతములలో దేనిని గొఱఁతగాఁ జెప్పినను నేను ఒప్పుకొనను."

ఖొరాను, బైబిలు, గీత మొదలగు గ్రంథముల పూర్వకముగా భగవత్సాక్షాత్కారమునకై యొకరితో నొకరు పోట్లాడు కొనుచు దైవదూషణకు దిగనేల? ఒకే సూర్యుఁడు మంచుకొండ మీఁదను, భూమిమీఁదను బ్రకాశించుచుండును. సూర్య తేజస్సు ప్రకాశించుటయందుఁ గలభేద మనుసరించి పర్వత ప్రాంతీయులు, నితర ప్రాంతీయులు పోట్లాడుకొందురా?"

"హిందూమతము మొదలగు సమస్త మతములు తఱచినయెడల, సమస్త మతములందలి సత్యమొక్కటియే పరమాశయమని బోధపడును. దేవుఁడొక్కఁడే! భేదించిన

యాచారవ్యవహారాదికములననుసరించి భేదభావము భావింపక, సత్యమను పరమార్థమును గ్రహించి తత్పథగాములమగుదుముగాక!!"

"భగవంతుని యెడను, అతని యనుగ్రహమునను నిశ్చయముగలవాఁగు, ఎట్టి మానవుని యందైనను ద్వేషభావము కలిగియుండరాదు. కాని మానవులు దాస్యము విడనాడవలెను."

"నా మతము చెఱసాల వంటిదికాదు. భగవత్సృష్టి యగు సమస్తమునకు దాని యాదర్శముండును."

"మతముల జీవనాడి యొక్కటే."

"ఒక్క భగవంతుని యెడను, ఆ భగవంతుని ననుసరించు నభిమానులయెడను అని దృఢపడని నిశ్చయము గలిగియుండుట మాత్రము ఇస్లాము మతమునకు యుక్తమగునేని మనమందఱము ముసల్మానులమే. ముసల్మానులుగా నుండుట వలన హిందువులము కాఁగలము, క్రైస్తవులము కాఁగలము"

"సత్యము ఒక మతవేదమునకు మాత్రము తగిన యనుభవమైనదికాదు."

"ఖొరాను స్వీకరించుటలో నాకుఁ గొంచెమైనను జంకు లేదు. బైబిలు, జెండ్ అవెస్తా గ్రంథసాహెబ్ మొదలగు సమస్త మతవేదగ్రంథములను నేను జదివితిని. ఇవి యేక వాక్యములు. ఒక మతమును, ఒక దేశమును, ఒక సంఘమును, ప్రేమించుట తగినదికాదు."

"ఏమతమైనను, ఏదేశమైనను అనీతికి, అసత్యమునకు

హింసకుఁ దావిచ్చనేని, ఆ మతము భూమిమీఁదఁ నిలువక నశించితీఱును. భగవంతుఁడు ప్రకాశించుచుండును. చీఁకటి లేదు. భగవంతుఁడు ప్రేమమయుఁడు. ద్వేషరహితుఁడు. భగవంతుఁడు సత్‌పదార్థము; అసత్తుకాదు. భగవంతుఁ డొక్కఁడే రక్షకుఁడు."

"భగవంతుఁడనఁగా సత్యము. సత్యము నాకుఁజూపు వెలుఁగు అహింస. ఆ సత్యమందలి యంతర్భాగము నేనాశించు నట్టి స్వరాజ్యము. సత్యాగ్రహము నెన్నఁటికి విడువరాదనియు సత్యము గాపాడుటకు సరియగు సత్యాగ్రహి యొక్కఁడు చాలు ననియు, నేను పదేపదే చెప్పుచున్నాను. అందుచే మనమందఱ మును బరిపూర్ణ సత్యాగ్రహులగుటకుఁ బ్రయత్నించుదము గాక!"

"మతజీవితము ప్రపంచ క్షేమమున కంతరాయముగా నుండుననియు, భారతదేశము మితిమీఱిన యాత్మజ్ఞానము కలదియగుటచేతనే స్వాతంత్ర్యము గోల్పోవుటకుఁ గారణమయ్యె ననియుఁ గొందఱు నేఁటికిఁ దలఁచుటకలదు" అని యొక పండితుఁడు మహాత్మునిఁ బ్రశ్నించెను. అందులకు మనమహాత్ముఁడు;

"నేనట్లు తలఁచుచుండుట లేదు. ఆత్మజ్ఞానాభిరతి తఱుగుట చేత హిందువులు పెంపులేనివారగుచుండిరి. గసపుత్రులు చిన్న చిన్న విషయములకై పెద్దపెద్ద యుద్ధములంచేసి భారతదేశ మును నాశము గావించిరి. ఆ కాలమందు గసపుత్రులకుఁ జెప్ప నలవికాని ధైర్యముండెడిది; కాని సత్యము, ఆత్మశక్తి మిక్కిలి తక్కువ. రావణుని భుజబలమునకుఁ జాలని శ్రీరాముఁడు జయము పొందుటకుఁ గారణమేమి? చిన్నయయినను శ్రీరాముని

యందుఁగల యాత్మజ్ఞానమే కారణము. పరిపూర్ణమగు ఆత్మజ్ఞానముచేత నేగదా పాండవులు జయము పడయఁగలిగిరి! మనము మాటిమాటికి గ్రంథముల జ్ఞానమును ఆత్మజ్ఞానమును నొక్కటిగా భావించి మోసపోవుచుంటిమి. ఆత్మజ్ఞానము మత గ్రంథములను జదువుటవలన లభ్యమగునది కాదు. ఆ యాత్మజ్ఞానము మనస్సునందావిర్భవించు ననంత శక్తిమంతమగు నొక విధమగు భగవచ్ఛక్తి. ఆత్మజ్ఞానమను పదమునకు ధైర్యమని యర్థము. భీరువులెన్నటికిని ఆత్మజ్ఞానమును సంపాదింపలేరు."

## ధైర్యము

గాంధిమహాత్ముఁడు సత్యమును దెలిసికొనుటకుఁ బ్రేమ మావశ్యకమని గ్రహించెను. మహాత్ము డెవరికి దేనికిని భయ పడువాఁడు కాఁడు. భుజబలశక్తి సైనికశక్తిగల ప్రభుత్వమును మహాత్ముఁ డెన్నిపర్యాయము లెదిరింపలేదు? ఈ విషయము గార్హస్థ్య జీవితప్రకరణమందు వివరింపఁబడి యుండెను. సత్యముతో సంబంధముగలది ధైర్యము.

మానవుఁడను వృక్షమునకు మతమనునది పూవు. గాంధి మహాత్ముఁడు సత్యాగ్రహమను నొక మహావృక్షము మీఁదఁ బ్రసరించు ప్రకాశమువంటివాఁడు. మహాత్మునుండి ప్రకాశము ప్రసరించునట్లు ప్రకృతిసహజ జీవితము నవలంబించుచుండెను. మహాత్మునివలె నితరులుగూడ సత్యాగ్రహమను జీవితపద్ధతి నాచరింతురుగాక! ఇఁక మీఁదట రాఁబోవు ప్రపంచమునకు అహింసా ధర్మము పరమావశ్యకమై యుండఁగలదు! ఆ ప్రపంచమున మూర్ఖశక్తికి ఆత్మశక్తికి మహాసంగ్రామము జరుగుచున్నది. ఆ యుద్ధాగ్రమున సత్యాగ్రహము అనఁగా

మతజీవితము అనఁగా ఆధ్యాత్మికజీవితమును గీతను గాంధి మహాత్ముఁడు ఉపదేశించుచుండెను. ఆ యుపదేశము చెవుల జుమ్మనుచునే యున్నది. ప్రపంచమందు నామమాత్రావశిష్టమైన మతజీవితము అనఁగా ఆధ్యాత్మిక జీవితము లేక యాదర్శ జీవితము నూతనోత్తేజముతో విరాజిల్లుచుండుచో మహాత్ముని జీవిత మాదర్శముగా నెల్లరు తమ జీవితములను జరితార్థము చేసికొందురుగాక! ఎల్లెడల నెల్లకాలముల నెల్లరి యందఱును మహాత్ముని జీవిత మాదర్శమై వెలయుఁగాక !!!

# సాధు స్థితి - యోగ సిద్ధి

పరిపూర్ణమగు ఆదర్శజీవితమువలన సాధుయోగములభించును. బాల్యమునుండి యౌవనావస్థను బడయుట సాధుస్థితిని బడయుట యగును. సాధుస్వభావము గ్రంథమున సమగ్రముగా వివరింపఁబడియుండెను. గాంధిమహాత్ముఁడు ఉత్తమమహాసాధువని యెల్లరి నమ్మకము. మహాత్ముఁడు ప్రజలతో మెలఁగును, మాటాడును; వ్రాయును; సేవ సేయుచుండును. మహాత్మునకు నాలుబిడ్డలు కలరు. మహాత్ముఁడు కాషాయ వస్త్రములను ధరింపఁడు, గడ్డము పెంచఁడు; ముండనము చేయించుకొనఁడు. కాని మహాత్ముఁడు కోపమును జయించెను; కామమును బాఱద్రోలెను. మహాత్ముని హృదయము ప్రశాంతమగు సముద్రము వలె నిశ్చలత్వము కలిగియుండుటను మహాత్ముని తేజస్సు వ్యక్తము చేయుచుండును. గాంధిమహాత్ముఁడు మనోవాక్కాయములతో మానవ కళ్యాణమునకుఁ బాటుపడుచుండెను. ఇదియే సాధుస్థితి.

## లోకము - సన్యాసము

మహాత్ముని బోధనలు ప్రపంచమునకుఁ దగినవియు, సాధువులకు దగినవియునై యుండుటవలన గాంధిమహాత్ముఁడు

సర్వము సన్యసించి యడవులకుఁ బోవుట యుక్తమని కొందఱు తలఁపవచ్చును. అట్లే యొక పండితుఁడు మహాత్మునకు లేఖ యొకటి వ్రాసెను. ఆ లేఖ సారాంశము:—

(3—4—1924 "యంగు' ఇండియా")

"నేను బ్రాహ్మణుఁడను; డాక్టరును; తమవలె నేనును వయస్సు మీఱినవాఁడను. తమరు లోకక్షేమముగోరి సేవ చేయుచుండిరి. అందుచేఁ దమకు గొప్ప యనుభవము కలిగినది. మాయామేయమైన ఈ లోకమందు తమవలె జీవితమును వినియోగించుచుండినట్లు పూర్వకాలమందెవరును వినియోగించి యుండలేదు. బుద్ధుఁడు తన మహా ధర్మమును బ్రచారము చేసినను భారతదేశమంతయు బౌద్ధమతమును స్వీకరింపలేక పోయెను. శంకరుఁడు మహాజ్ఞాన సంపన్నుఁడయ్యు, భారత దేశమును వేదాంత తత్త్వము గలదిగాఁ జేయలేకపోయెను. ఏసునాథుఁడు పవిత్రమగు ఆత్మార్థజ్ఞానము గలవాఁడయ్యు, యూదుల నందఱినుఁ దన మతమును స్వీకరించునట్లు చేయ లేకపోయెను. లోకము మిథ్య. ఎవఁడీ ఈ లోకములోఁ దపస్సు చేయుఁగలఁడో; అతఁడు ఆత్మార్థ శాంతిని, నిశ్చలత్వ మును బోఁగొట్టుకొనుచుండెను. కారాగృహవాసమును, అనారోగ్యమును, తమ దేహమును గృశింపఁజేయుచున్నవి. అందుచేఁ దమరు, ఏదేని యొక పర్వతగుహకుఁజేరి యందు భగవంతుని ధ్యానించుచుఁ, దనను దానెఱిఁగి శాంతిని గలిగి యాత్మ సాక్షాత్కారమునకై జీవితమును, కాలమును గడుపు దురుగాక! ఈ భూమిలో ఋషులు, మహర్షులు మొదలగు మహాయోగులు చేసిన తపస్సును దమరుగూడఁ జేసి భార

తీయులకుఁ బారమార్థిక చింతనను గలిగించుచునుగాక! అందువలన ఈలోక స్వారాజ్యమునకు బదులుగా పరలోక రాజ్యము పడయుదురు."

అందులకు మన మహాత్ముఁ డిచ్చిన సమాధాన సంగ్రహమిట్లు:—

"బుద్ధుఁడు నిర్వాణము పొందకపోలేదు. క్రీస్తు, సిలువయందు తన యోగమును బోధింపక పోలేదు. వారు తమ యుపదేశము నితరులు గ్రహింపని కారణమున వారిని బాధింపలేదు. వారితోఁ దుల్యమగు యోగ్యత నాకు లేదు. వారితోఁ దుల్యుఁడగుటకు నే నసమర్థుఁడను. పరలోక రాజ్యముకొఱకే నేను సేవచేయుచున్నాను. నా లక్ష్యమును సంపాదించుకొనుటకై కొండగుహలకుఁ బఱుగులెత్తవలసిన యావశ్యకత లేదు. గుహలందు జీవించువాఁడెల్లప్పుడును ఆకాశ సౌధములను నిర్మించుచుండును. రాజప్రాసాదమందుండి జనకునివలె జీవించువాఁడు ఆకాశసౌధమును నిర్మింప దలపోయఁడు. ఒక్క జనకుఁడు లోక జీవితమునెడ సభినుచి కలిగియుండియు మనశ్శాంతి పొందఁగలిగెను. మోక్షమార్గము దేశసేవయందును, ప్రజాసేవయందును గలదు. లోకవాసనలం దభిరుచి కలవాఁడనుగా నుండుట కభిలషించుచున్నాను. గీత యుపదేశించినట్లు మిత్రులయెడ శత్రువులయెడ సమబుద్ధితో మెలఁగఁ గోరుచున్నాను. నా భార్యయో, కుమారుఁడో నన్ను నిరసించినను నేను వారిని బ్రేమించుచుండినట్లే, హిందువుఁడో, ముస్లిమో, క్రైస్తవుఁడో మఱి యెవ్వరైనను నన్ను నర్థము చేసికొనలేక నిందించినను, నాతనిని బ్రేమించుచు నాతనికి సేవ

చేయుదును. నాశములేని స్వాతంత్ర్యము శాంతియుఁగల లోక సేవయే నా దేశభక్తికిఁ బునాది. కావుననే, మతసంబంధము లేని ప్రభుత్వ ముండుట పొసఁగదు. మతజ్ఞానములేని ప్రభుత్వము పతనమగును. ఎందుకనఁగా నది యాత్మను నాశము చేయును."

ఈ మాటలచే మహాత్ముని మహిమ స్పష్టమగుచున్నది. సాధువు లనఁబడువారొంటరిగా నడవులందుండఁ దగినవారనితలఁచుట లోకమును సరిగా నర్థము చేసికొనకపోవుటయే. తన క్షేమమును సిఖాచముసకు లోంగక యెచ్చట నెట్లుండిన నేమి ? లోకనాశక లెట్టి రూపముదాల్చి యావహించినను వానికి లొంగక యెవరియెడను విరోధము, ద్వేషము వహింపక శాంతము గలిగి స్వార్థమపేక్షింపక సేవసేయుట సాధువుల విధ్యుక్త ధర్మముగదా ! దౌర్బల్య కారణముననో వేఱుకారణముననో సేవసేయుట విడనాడి యొంటరితనము గడుపఁగోరుట సాధువుల ధర్మముకాదని గ్రహింపుఁడు. గాంధిమహాత్ముఁడు వైద్యులు తనకు శస్త్రచికిత్స చేయుసమయమందును సేవాను రక్తిని వీడలేదు. శరీరము మహారోగ్యముగానుండినను మనస్సు చేతనైనను సాధువులు సేవసేయుట మహాధర్మము.

తిలకు - గాంధిమహాత్ముఁడు

అహింసా ధర్మమును గురించి లోకమాన్య బాలగంగాధరతిలకు మహాశయునకు గాంధిమహాత్మునకొక పర్యాయము పత్రికాముఖమున స్నేహపూర్వక వాదోపవాదములు కలిగెను. అప్పుడు లోకమాన్యుఁడు "ప్రభుత్వములోనటనగలవారికొక కాలక్షేపము. అది సాధువులకు మాత్రము కాద"ని యనెను.

అందులకుఁగాదని చెప్పుట తగదనియు, సర్వ మతములను సరించుట పురుషార్థములను సాధించుటనే తెల్పుచుండెననియు, పురుషార్థమనఁగా సాధువుగాఁ బ్రయత్నించుట యనియు సాధువనఁగా జ్ఞానపూర్ణుఁడగు మానవుఁడగుట యనియు" సమాధానమిచ్చెను.

మఱియొక సమయమందు మహాత్ముఁడు భారతదేశమందుఁ బదునైదు లక్షలమంది సాధువులు గలరనియు, వారందఱు తమ విధ్యుక్తధర్మములను గొఱతలేకుండఁగ నిర్వర్తించిన యెడల భారతదేశము మహోన్నతిని బడయఁ గలదనియుఁ జెప్పెను. సాధువు సోమరిగా నుండరాదనియు, అతఁడు లోక నటనకావశ్యకమగు సామర్థ్యముగలిగి యుండవలయుననియు, గాంధిమహాత్ముని అభిప్రాయము. గాంధిమహాత్ముని జీవితమును, ఆ జీవితమందలి శాంత త్యాగములను ప్రతిఫలాపేక్షరహితముగా అనాసక్త యోగముతో చేయుసేవ, ప్రేమ మొదలగు వానిని బాగుగాఁ బరామర్శించి చూచిన యెడల గాంధి మహాత్ముఁడొక మహాయోగియనుట యతిస్పష్టము.

గాంధిమహాత్మునివంటి దయాసముద్రుఁడే మహా యోగి యనియు, కర్మయోగియనియు మేమును భావించుచు పూజించుచుందుము. మా పాఠకమిత్రులు గూడ నట్లే గాంధిమహాత్ముని భావించి పూజించుచుందురు గాక యని మా వేఁడుకోలు. ఈ మహాయోగి గాంధిమహాత్మునిచేఁ బ్రపంచ మౌన్నత్యము బడయఁగలుగుట తథ్యము. ఇట్టి మహాయోగులు ప్రపంచమందుఁ జిరకాలము వర్థిల్లుదురుగాక ! గాంధిమహాత్ముఁడను మహా యోగి వలన, ప్రపంచమెంతయో యుత్తేజితమగుట మనము చూచుచున్నాముగదా ! మహాత్మునివంటి మహా

# స్వారాజ్యము

మహాత్ముని మహాత్యాగబుద్ధిచే, తపశ్శక్తిచే సమస్త ప్రపంచము 'భళిరే' యని ప్రశంసించుచుండ, భారతదేశము 1947 ఆగస్టు 15 వ తేదీ స్వాతంత్ర్యము సంపాదించుకొనెను.

ఆహా! ఏమి యాశ్చర్యము! మహాత్ముని మహిమాతిశయముచే మనము స్వారాజ్యము సంపాదించుకొంటిమి.

విశ్వమందు, తపస్సిద్ధిని సాధించినవాఁడు మహాత్ముఁడు మాత్రమే యని మానవచరిత్ర, జగజ్జేయముగా ఘంటనెత్తి మ్రోగింపఁగలదు.

## హత్య

మహాత్ముని తపశ్శక్తిచే సత్యాహింసలు నేఁడు ప్రపంచమునకొక దీప్తికలిగెను. ఇట్టి మహాపరిణామము ప్రపంచమందింతవఱకు నెవ్వరును గలుగలేదనుట తథ్యము. అట్టి మహనీయుఁడు: పురుషోత్తముఁడు, అవిస్మరణీయుఁడు గాంధిమహాత్ముఁడు 30-1-1948 బిర్లాభవనమునుండి సాయంత్రం ప్రార్థనా సవనమునకుఁ బోవుచుండ, 5 గం. 15 నిముషములకు తుపాకిచే

హత్యగావింపఁబడెను. కట్టా! లోకమెంత పాపిష్ఠిదోగదా! జగత్కల్యాణ ప్రియుని గాంధి మహాత్ముని జంపుకొనిన భారతదేశచరిత్ర కలుషితమయ్యెను.

పాఠకమహాశయా! మతదురభిమానము మంచిచెడ్డల నెఱుఁగఁ జాలదనుట తెల్లమగుచున్నదిగదా! మతపిశాచావశమై యున్నంతవఱకు నీ ప్రపంచ జీవితమున శాంతిభద్రతలు సుఖశాంతులు కలుగఁజాలవుసుమా!

ఓయిమానవా! ఇఁకనైన మానవా; హింసాక్రతువును నీ మతదురభిమాన వైపరీత్య కృత్యములను మాననినాఁడు నీవెట్లు మానవుఁడవు కాఁగలవు? సోక్రటీసు, ఏసుప్రభువు నిట్లే హత్యగావింపఁబడుట చూడ, మహాపురుషులకిట్టి హత్యలు అనుల్లంఘనీయము లేమో యని తలఁపించుచున్నది.

ఇంతికను మా మహాత్ముని మనమిఁక చూడఁజాలము. అయినను, సృష్టిని వారెల్లరు నేదియో యొక నెపమున గిట్టక తప్పదుగదా! అయినను మహాత్ములకు చావేది? మిన్నువిఱిగినను, మన్నుగాలినను మహాత్ముని కీర్తి మూర్తి మానవ లోకము కంతవఱకుఁ బ్రకాశించుచుండునుసుమా? చావు నోవులు చచ్చునొచ్చులవారి కగును, కాని సర్వాంతర్యామి యగు మన మహాత్మునకుఁ జావనెద్ది?

నవఖాలీ దురంత దుష్కృత్యముల మూలమున ఢిల్లీ యందు రేఁగిన మతకలహముల నణఁచుటకై మహాత్ముఁ డచ్చటకుఁ జేరెను. ఆ నగరవీధులలో మతవైషమ్యమువలనఁ జెలరేఁగిన బీభత్సభయానక దృశ్యములు గాంచి మహాత్ముఁడు కడు దుఃఖపరవశుఁడై "హిందువులు-మహమ్మదీయులు సహో

# ఉపసంహారము

## పుట్టుకకు తగిన జీవితము

భగవంతుఁడు మానవునికి లోకమెందులకుఁ బ్రసాదించెను? మానవులెల్లరు పురుషార్థ పరులై యరిషడ్వర్గమును జయించి నిర్మలచిత్తులై నిష్కామయోగయుక్తులై లోక జీవితమును సేవ ప్రధానముగఁ జేయుచు నిర్గర్వమానస నుండవలెనని భగవంతుని యాశయము. అయ్యదియే భగవంతుని సంకల్పము. భగవత్సంకల్పమును నిర్వికల్పముగా సార్థకము చేయుటకై సహాయపడుటకు మానవునికి లోకజీవితము ప్రధానము. అనఁగా సత్పురుషుడు మానవ లోకమందెచ్చట నెట్లు జీవింపవలెను? భగవంతునివలె జీవింపవలెనని సమాధానము. మానవులెచ్చట నెట్లు జీవింపఁగలరు? భగవంతుఁడు పరిపూర్ణ జ్ఞానమునకు సర్వవ్యాపకమునకుఁ దగినటులు ప్రతిఫలాపేక్షారహిత బుద్ధితోఁ సృష్టించినట్లు మానవులును దమ జ్ఞానసంపత్తితోఁ దగినంతలో నిష్కామబుద్ధితోఁ దమ ధర్మమును నిర్వర్తింప వలయును. అనాసక్తబుద్ధితోఁ దమ ధర్మమును మానవులు నిర్వహింప వలయును. అనాసక్తబుద్ధితోఁ దమ ధర్మమును మానవులు నిర్వర్తించు నెడల భగవంతునియట్లు సర్వవ్యాపకత్వమును బడయఁగలుగుట సులభము. ప్రతిఫల మపేక్షింపక యనుభవించు జీవుఁడును గలవాఁడు భగవంతుఁడగుట నిక్కము.

## మహాత్ముని యవతారము

అట్టి నిష్కామబుద్ధి చిత్తశుద్ధిగల మానవునకు సులభముగా నలవడఁగలదు. అట్టి అభ్యాసమునకు మధ్య మధ్య వివిధ కారణములచే విఘ్నములు కలుగు చుండును. ఆ యంతరాయములకు వశుఁడగుచు ననుగమించుచు మానవుఁడు జీవితరంగమందుఁ బ్రవేశించి స్వార్థపరుఁడగుచుఁ దన క్షేమమునకై యితరులకుఁ గీడు చేయుచుండును. అట్టి స్వార్థచింతగల మానవుల నుద్ధరించుటకై యప్పుడప్పు డీ భూమిపై మహాత్ము లవతరించు చుందురు. ఆ మహాత్ముల జ్ఞానోపదేశములచే మానవులు సత్క్రియా కలాపులగుదురు. అట్టి మహాత్ము లవతరించుటకు పెక్కువందల సంవత్సరములు గడచెను. భగవంతు డట్లవతరింపక పోవుటవలనఁ బ్రపంచములో ఆత్మజ్ఞానమునందును, భగవంతుఁడు సత్యమను విషయమందును విశ్వాసము తఱుగఁ జొచ్చెను. ధర్మసంరక్షణార్థ మేర్పడిన ప్రభుత్వములు అధర్మముల నాశ్రయించు చుండెను. వ్యాపార లక్షణముతో వివాదములు గలిగించుచు ద్వేషము విరోధము యుద్ధము మొదలగు దుర్గుణము లభివృద్ధిచేయుట ప్రభుత్వ లక్షణము లయ్యెను. ఆకారణమువలన మానవుఁడు ఆశాపిశాచముచేఁ బీడింపఁబడుచు యంత్రయుగమను నరకమునఁబడి, తన స్వాభావసిద్ధమగు దయాగుణమును విడనాడు చుండెను. అందుచే లోకము అసహాసము తాల్చి మానవత్వమును గోల్పోవు చుండెను. ప్రస్తుత కాలమందట్టి నరక బాధలనుండి భారతదేశమును - ప్రపంచమును దప్పించి రక్షించి మోక్షమును బ్రసాదించుటకై ఈకర్మభూమియందు - భారతదేశమందు - ప్రపంచమందు గాంధిమహాత్ముఁ

డవతరించెను. అట్లు అవతరించిన మహాపురుషుఁడే మన గాంధి మహాత్ముఁడు.

## గాంధి మహాత్ముఁడు

గాంధిమహాత్ముఁ డెవరు ? అతఁడేమి చేయుచుండును ? ఏమి చెప్పుచుండును ? ఆతనికి మానవ జీవితమునకుఁగల సంబంధమేమి ? ఈవిషయములను వివరించి చెప్పునది యీ గ్రంథము. మానవ జీవితలక్ష్యము, మానవుఁ డెవఁడను నదియు మానవుఁడగుట కెట్టి జీవితముకావలయు ననుటయు, మానవ జీవితలక్ష్యముగా ప్రస్తుతకాలమందు ఆదర్శ జీవితముగల మహాపురుషుఁడు గాంధి మహాత్ముఁడనియు గాంధి మహాత్ముని స్వభావ గుణము లిట్టివనియు - ఈగ్రంథమందలి భాగములు. ఆత్మ తేజస్సుతో నవతరించు మానవుఁడెట్టి జీవితము గలవాఁడైన యెడల శాంతి నిలయమగు సాధుయోగమును బడయఁ గలఁడనుట గాంధిమహాత్ముని జీవితమూలముగా నీ గ్రంథము తెలియఁ జేయుచున్నది.

మానవజీవితమునకుఁ బరమ లక్ష్యముగా ప్రకాశించు గాంధిమహాత్ముఁడు అహింసాధర్మ మవలంబించి, భగవన్మార్గ మందు నిలువఁబడి, యాదర్శజీవితము గడుపుకొనుచుండెను. ఆదర్శజీవితమును భంగపఱచునట్టి విధానములనరికట్టుటకు సాధనము సత్యాగ్రహము. అహింసకు వ్యతిరేకశక్తులను అహింస చేతనే నశింపఁజేయవలెనని గాంధిదేవునిసంకల్పము. ప్రభుత్వము పోరాటము ప్రారంభించినప్పుడు అహింసాధర్మము ప్రవేశపెట్టిన ఆదిపురుషుఁడు మన గాంధిమహాత్ముఁడు. ప్రభుత్వ పరిపాలన యందు ఆత్మజ్ఞానము ప్రసరింపఁజేసిన తేజస్సు మన గాంధి

భగవానుని తేజస్సు. గాంధిమహాత్ముఁ డిట్టి యపూర్వయోగములను సిద్ధులను ప్రపంచమునకు లభింపఁజేసెను. మహాత్ముని బోధనలు అతి సహజముగా నాచరణ సాధ్యమైనవి. చెప్పినది చేయుటలో మహాత్ముని మనస్సు వజ్రసదృశము. తా నాచరింపలేని దానిని లోకమునకు బోధించి యుండలేదు. మహాత్ముని మాహాత్మ్యము లోకోత్తరమైనది.

"ఏ ప్రాణికి హింస చేయకుము; అపకారమునకు నపకారము చేయకుము. కష్టము సహింపుము, శత్రువుయెడ ప్రేమతో నుండుము; దుష్కృత్యములయెడ నేవగింపు చూపుము; దుష్కృత్యములు చేయువానియెడ నేవగింపు మానుము; ప్రకృతితోఁ గూడి జీవించుము." – ఇట్టి బోధనలు మహాత్ముఁడు కావించినవి. ఈ బోధనల ప్రకారము తన జీవితమును నడుపుకొనుచు, ఈ ధర్మములను త్రికరణశుద్ధిగా నాచరించుచు విశ్వసౌదర్యమును ప్రబోధించిన యవతారపురుషుఁడు మన గాంధి మహాత్ముఁడు.

గాంధితత్త్వమునకుఁ గాలదోషము కలుగఁజాలదు. మానవునకు మనోబుద్ధులుండు నంతవఱకు, గాంధి కావించిన బోధన లమృత తుల్యములై మానవాళికి శిరోధార్యములు కాఁగలవు. మహాత్ముఁడు కాయము చాలించినను లోకోత్తరములగు మహాత్ముని బోధనలు అమృత తుల్యములై భూమిపై నా చంద్రతారార్కము వెలయుఁ గాక! మహాత్ముఁడే గీత; మహాత్ముఁడే వేదములు.

ఒకఁడు చేసిన పనియందు వచ్చిన దోషఫలము మఱి యొకఁడు చేసిన పనియం దెందుకు రాదు? మహాత్ముఁడు ప్రబో

ధించిన ప్రబోధము ప్రాచీనకాలమందు భారతదేశమం దింటింటి యందును ప్రకాశించుచుండెడిది. అట్టి యౌన్నత్యము ప్రస్తుత కాలమం దెచ్చటను గానిపింపకుండుట భారతదేశ దౌర్భాగ్య మని చెప్పకతప్పదు.

పాఠకమహాశయులారా! మన గాంధి మహాత్ముఁడు 2 వ తేదీన జన్మించెను. 15 వ తేదీన స్వాతంత్ర్యము సంపాదించెను. 30 వ తేదీ మరణించెను. 2—15—30 తేదీలు యథాక్రమముగా జన్మించుట, స్వాతంత్ర్యము సంపాదించుట, మరణించుట ఇట్లు తేదీ దినములు సరిపోవుట లోకచరిత్రయందే మహాపురుషున కింతవఱకుఁ గానరాకుండుటచూడ; మహాత్ముని జీవిత విశేష మాశ్చర్యముల కాస్పదమై, యపూర్వమై యొప్పుటను గ్రహింపఁగలరని ప్రార్థన.

మధ్యకాలమందుఁ బ్రవేశించిన నాగరికతా జీవితము విజ్ఞానప్రదమగు మానవుని ప్రాఁత నాగరికతను మొదలంట నశింపఁజేసెను. ఆ-అజ్ఞాన నాగరికతా తిమిరమును బటాపంచలు చేయుటకు సాక్షాత్తు జ్ఞానభాస్కరుఁడు మన గాంధి మహాత్ముఁడు. ఆ దివ్య తేజోమూర్తి గాంధిమహాత్ముఁడు; దయ-ధైర్యము-త్యాగము-శాంతము-వ్రతము-నిష్కామము-ప్రాయశ్చిత్తము అను సప్తకాంతులను బ్రసరింపఁ జేయుచుండెను. ఆ కాంతి ప్రవాహమం దోలలాడుటకు లోకము సిద్ధమగుఁ గాక!! సిద్ధమగుఁ గాక!!

శ్రీ శ్రీ శ్రీ

మంగళమ్ మహత్.

ఇది శ్రీ మహాత్మాగాంధి వరప్రసాదలబ్ధ దేశభక్తి ప్రపూర్ణ హృదయ, మాతృదేశ సేవార్థ కారాగార ప్రవేశ లబ్ధ ధన్య హృదయ, రావెళ్ళవంశ వారాశిరాకాసుధాకర, శ్రీ వేంకట రత్నమాంబా గన్నయాఖ్య పుణ్యాదంపతీ సత్పుత్ర, మద్ర విశ్వకళాపరిష ద్విద్వ ద్బిరుదాంకిత, వేదాంత తత్త్వ విచార గ్రంథరచనాభి శోభిత, శ్రీ గాన్ధి సుప్రభాత రచనాభి మాన ధన్య, శ్రీ సువ్వారి వంశరత్నాకర కళానిధి శ్రీ వేఙ్కట రమణశాస్త్రి గురుదేవసంప్రాప్త విజ్ఞానధారేయ, విద్వజ్జనవిధేయ, గుంటూరుమండల మోతడక గ్రామస్థ శ్రీ రామోన్నత పాఠశాలా ప్రధానాంధ్రోపాధ్యాయ, రామయ నామధేయ ప్రణీతంబయి, భారత ప్రభుత్వ రక్షణ పరికరోత్పత్తి శాఖా మాత్యవర్య శ్రీ కొత్త వంశ పారావార కువలయమిత్ర శ్రీ రఘురామయార్యాంకితంబయి యలరారు "మానవ జీవితము—గాంధిమహాత్ముఁడు"ను పేరంబఱఁగు గ్రంథము సర్వంబు సంపూర్ణంబు.